# హాలికులు కుశలమా!





మధురాంతకం రాజారాం





విజయవాడ బుక్ ట్రస్ట్
కె. వి. ఆర్. బిల్డింగ్స్, కారల్ మార్క్స్ రోడ్డు,
విజయవాడ - 520 010.

# నివాళి

లోతుగా పాతిన రాతి కూసాలపైన దూలాలు మోపి, ఎత్తు రావడం కోసం వాటిపైన నిలువుల మరించి, వెన్నుగాటి వాసం నుంచి ఏటవాలుగా పేర్చిన సన్నటి వెదుళ్ళపైన గుట్టల్లో దొరికే బోదను కోసి తెచ్చి మట్టసంగా కప్పితే అది పూరి కొట్టం. దానికి గోడలుపెట్టి, ద్వారబంధంతో బాటు తలుపులు బిగిస్తే అదే పూరిల్లు. పూరిల్లు అన్నాక ఎన్ని అంకణాలు అనేది ప్రశ్న. అంకణమంటే ఒక బార. ఆరడుగులన్నమాట. అలాంటి అయిదంకణాల పూరింట్లో దక్షిణపు వైపు అంకణం వంటకు, ఉత్తరపువైపు అంకణం దొంతులకు గాదెలకు సరిపోగా మిగిలిన జాగాలో క్రిక్కిరిసి కూర్చున్న పల్లెటూరి శ్రోతల ముందర కొయ్యతో చేసిన దీపపు సెమ్మెమీద పెట్టిన మట్టి ప్రమిదలో ఆముదపు దీపం వెలుగుతుండేది. ఆ దీపాని కెదురుగా చిక్కు పలకలో తెరిచి పెట్టుకున్న పాత పుస్తకంలో నుంచి ఒక పెద్దాయన పద్యాలు చదివి, అర్థ వివరణ చేసేవాడు. అలాంటప్పుడు చంటి పిల్లలు గానీ, ఎద పిల్లలుగానీ అల్లరి చేయరాదు గదా! అందుకని వాళ్ళని దీపం వెలుగులోని దృశ్యాలన్నీ కనిపించేటట్టుగా, మెత్తగా చల్లగా వుండడంకోసం దొంతిలో ఖాళీ బానలోనుంచి వెలికి తీసిన తల్లి పెళ్ళినాటి ముహూర్తం చీర మడతపైన పడుకోబెట్టేవారు. చూస్తున్నదేమిటో తెలియక మునుపే, వింటున్నదేమిటో అర్థంగాక మునుపే బహుశా ఆ విధంగా నాకు సాహిత్యంతో తొలి పరిచయం— మూగ అనుభవమే ననుకోండి— కలిగి వుంటొచ్చునని అనుకుంటున్నాను.

ప్రతియేడూ వానకారు రావడానికి ముందుగా రైతులకు పనిపాట్లు లేని రోజుల్లో ప్రతి గ్రామ కేంద్రంలోను జరుగుతూ వచ్చిన గొప్ప వినోదం మహాభారత యజ్ఞం. మధ్యాహ్నం రెండుగంటల నుంచీ అయిదింటి దాకా పగటికథ. అక్కడొకటిగా, ఇక్కడొకటిగా పద్య పఠనం. సంగీతం సకృత్తు కథనమే ముఖ్యం.

భీముడు హిడింబుడు తలపడితే వాళ్ళ పోరాటం శ్రోతల కళ్ళయెదుటే జరిగి నట్టుండాలి. మయ సభను వర్ణిస్తుంటే అద్భుతరసం జాలు వారాలి. పాంచాలీ పరిదేవనం రోజున కన్నీళ్ళు ధారలు గట్టాలి. ఉత్తరుడి కథ చెప్పిన రోజున నవ్వులతో కడుపులుబ్బిపోవాలి... ధర్మరాజుల గుడి గారకట్టడం కావచ్చు. బండమిద్దె గావచ్చు. పూరిల్లయినా కావచ్చు. శ్రీకృష్ణుడితో బాటుగా సతీ సమేతంగా పంచ పాండవుల దారు విగ్రహాలుండేవి. గుడి యెదుట పచ్చి కొబ్బరి మట్టలతో వేసిన పందిరి క్రింద పోసిన ఇసుకలో కూచుంటే ఎండలో నడిచి వచ్చిన వారి ప్రాణాలకు ఏ మలయ కూటంలోకో, గంధమాదనంలోకో వెళ్ళి పడిపోయినంత హాయిగా వుండేది. పగటి కత జరిగే పందిరి కెదురుగా కొంత దూరంలో నిర్మించిన వేదికపైన రాత్రి వేళ వీధి నాటకాలు మరింత జోరుగా, హోరుగా కొనసాగేవి. రెయ్యాట అనేవాళ్ళు. రెయ్యాట ఆడడంలో కంగుంది కుప్పం వాళ్ళది పెట్టింది పేరు. వేములపల్లె అనే ఊళ్ళో నివసించిన మహానుభావు డెవరో దరువులతో, పద్యాలలో, వచనంతో ఆ వూరి వేలుపైన వేంకటేశ్వరుడికి అంకితంగా మహాభారత నాటకాలు రచించి పోయారు. చుంగులు జీరాడే పంచకట్టుపైన నిలువంగీలు తొడిగి, మెడకు రుమాళ్లు చుట్టి, ముఖాలకు దళంగా అద్దళం అద్ది, తళుకులీనే జిగిని గాజు పూసల నగలతో ఆటగాళ్ళ వేషాలు ప్రేక్షకులను భలే మురిపించేవి. 'ఎందుకొమ్మ చిగురించునా, నీ మెమ్మెలు నాకడ నిల్చునా' అంటూ దుశ్శాసనుడు రంగస్థలం పైన దుమ్ము రేగ్గొట్టే వాడు. 'అదిగో వచ్చెను రాజు, ఇదిగో వచ్చెను రాజు. హెచ్చరికతో నుండండీ, సభికులార, హెచ్చరికతో నుండండీ' అంటూ చోపుదారి ఇంక లేనట్టుగా జబర్దస్తీ చేసేవాడు. 'అందరిలో పెద్దవాడే అత్తమ్మా, నన్ను కన్నుగీటినాడే అత్తమ్మా' అంటూ ద్రౌపది గాంధారితో హృదయ విదారకంగా మొరపెట్టుకునేది. లాక్షా గృహదహనమంటే లక్కయిల్లు. మాయాద్యూత నుండే పాచికలు. వస్త్రాపహరణ మంటే చీరల్ని ఒలచడం. యక్ష ప్రశ్నలంటే విషనీళ్ళు. కిరాతార్జునీయమంటే తపను మాను. గోగ్రహణమంటే ఆవుల్ని తోలడం. ఇలా దేశీయమైన పర్యాయ నామాలు చెప్పుకుంటూ పెద్దా చిన్నా ఆసామిగా రాత్రి భోజనానంతరం గుంపులు గుంపులుగా భారతం మట్టకు చేరుకునే వాళ్ళు. రంగస్థలంలో వెలిగే పెట్రోమాక్సు

లైట్లూ, జనాని కవతల తినుబండారాల అంగళ్ళలో అర్ధచంద్రాకారంలో వెలిగే బుడ్డీ దీపాలూ సాంద్రమైన చీకట్లను పారదోల లేక వెలవెలపోతుంటే, చింతచెట్ల క్రిందలి భారతం మిట్ట ఒక మాయాలోకంలా పొడగట్టేది. తల్లులు చంకల్లోనో, తండ్రుల భుజాల పైనో అధివసించి అక్కడికి చేరుకునే పసిపిల్లలు చూచినంత సేపు నాటకం చూచి, తరువాత అట్లాగే గోతంపట్ట పైకి ఒరిగిపోయి ఒళ్లెరుగకుండా నిద్ర పోయేవారు. 'ధరణి వేములపల్లె ధామున సాక్షిగా' చెబుతున్నాను. మహా భారత కథను నూరిపోసిన ఆ పగటి కతలూ, ఈ రెయ్యాటలే ఆ పిల్లలకు ఆది గురువులు!

వీధి నాటకాల నుంచి విద్యా ప్రస్థానం వీధి పలుకూటాలకు మారుతుండేది. పలుకు కూటానికి నామాంతరం పలుకూటం. పెద్దబాల శిక్ష, బాల రామాయణం, అమరం, ఆంధ్రనామ సంగ్రహం, ఆదిపర్వం— అనేది సోపానక్రమం. అమావాస్య, పాడ్యమి; పౌర్ణమి, పాడ్యమి- నెలలో ఈ నాలుగే సెలవు రోజులు. సెలవులకు ముందురోజున పలకను తీసుకెళ్ళి అయ్యవారి చేతికిస్తే ఆయన కుర్రవాడి విద్యాస్థాయికి అనుగుణ్యంగా ఓ పద్యం రాసిపెట్టేవాడు. బద్దెన, వేమన, గువ్వల చెన్నుడు, పెమ్మయ సింగధీమణి, భర్తృహరి మొదలయిన నీతికోవిదులతో పరిచయం కలిగిందప్పుడే! ఐరావతము తెల్పు, ఆదిశేషుడు తెల్పు—కైలాసగిరి తెల్పు, కంచు తెల్పు, కానని భూమిలో కస్తూరి కోనలో మంథరగిరిపైన మర్రిచెట్టు, రాము డెవ్వానితో రావణు మర్దించె, పరవాసుదేవుని పట్నమేది - మొదలైన చమత్కార పద్యాల్ని కంఠోపాఠం చేసిందిగూడా ఆ ఆట విడుపు రోజుల్లోనే! సకాలంలో వానలు రాకపోతే ఎండిపోయిన చెరువు బీడులో పందిరివేసి అందులో సాంగోపాంగంగా కావిస్తూ వచ్చిన విరాట పర్వ పఠనం, ఎవరికైనా ఈతి బాధలు మిక్కుటమైతే కలిపురుషుడి అనుగ్రహం కోసం రాత్రివేళల్లో వారం పదిరోజుల పొడుగునా నిర్వహిస్తూ వచ్చిన నలచరిత్ర పారాయణం, పండుగలు, పబ్బాలు, స్మారక దినాలు వస్తే హరికథలు, పుష్య మాసంలో ఒక రోజు ప్రొద్దుపోయేసరికి ఊళ్ళోదిగి 'అనుదినమూ రామూ రాము భద్రేశ్వరా, ఏడాదికి ఒక్కదినమూ భద్రే

శ్వరా, వేడుకైన సంకురాత్రి భద్రేశ్వరా' అంటూ జంగం దేవరలు ఇంటింటనో పలకరించిపోయే సన్నివేశం, తంగేడు పూలమధ్య గొబ్బెమ్మను తట్టలో పెట్టు కొచ్చి పల్లె పడతులు మధుర మనోహరంగా ఆలాపిస్తూ వచ్చిన గొబ్బిపాటలు, పొలాల్లోకి వెళ్తే ప్రశాంత ప్రపంచంలోని గాలి అలలమీద తేలియాడుతూ వచ్చిన మనసును పరవశింపజేసిన గ్రామిక స్త్రీల కలుపు పాటలు, పసుపు దుస్తులతో ఎర్ర జండాలతో కాలిగజ్జలతో రామమందిరం ఎదుట 'కరిరాజును గాచి, ఆ శిలను నాతిగజేసి, మారీచుని తెగవేసి ఆ మగువతో మాట్లాడిన బిరుదు నీకే తగురా, రంగ నీకే తగురా' అంటూ భక్తులు సలిపే పందరి భజనలూ—అదంతా ఆనాడు చుట్టూరా ఆవహించుకున్న బహుశాంధ్రోక్తిమయ ప్రపంచమైతే, ఈనాడు భావంలో మాత్రమే మిగిలిన జ్ఞాపకాలు.

హైస్కూల్లో తెలుగు పాఠాలు చెప్పిన అయ్యవార్లు గూడా ఆ 'స్కూలు' నుంచి వచ్చినవాళ్ళే. కొందరు స్వయంగా కవులుగూడా. అయినా సరే, పద్య విద్య పట్ల మక్కువ పెంచుకోడం తలకు మించిన బరువే ననిపించింది. పద్యాన్ని నడిపించడానికి సాహిత్యంలో అభిరుచి మాత్రం వుంటే చాలదు. అభినివేశంగూడా వుండాలి. వెయ్యేండ్లుగా వాసికెక్కి, వెయ్యి విన్యాసాలు పోయిన తెలుగు పద్యానికి యింక ఎవరు పడితే వారు మెరుగులు దిద్దవలసిన అవసరం ఏముంది? పద్యం పట్ల గల గౌరవమే దాని జోలికి వెళ్ళకుండా ఆపగలిగిందని అనుకుంటున్నాను. ఈలోగా అందుబాటులోకి వచ్చిన పత్రికా సాహిత్యం రోడ్ల కూడలిలోని రెక్కమానులా 'యిలా వెళ్ళి చూడరాదా' అంటూ మార్గ నిర్దేశం చేసింది. అదే కథా మార్గం కొత్తదేమీ కాదు. మానవ నాగరికత ఎంత పాతదో కథా అంతా పాతది. బహుశా కవితకన్నా గూడా ముందటిదై వుంటాలి. నైమిశారణ్యంలో శౌనకాదులకు విష్ణు కథలు చెప్పింది, హస్తిపురంలో జనమేజయుడికి భారత కథలు చెప్పింది కథ కుడే! భారతేతిహాసాన్ని కావ్యంగా రాయదలచుకున్న నన్నయ్యగారికి గూడా ప్రసన్న కథా కలితార్థయుక్తి కావలసి వచ్చింది. శిల్పం కొత్తదైతే కావచ్చుగానీ కథా కథన నైపుణ్యం మాత్రం ఆదినుంచీ వున్నదే! ప్రవరుడు మనసు మార్చుకుని

వరూధినిని పెండ్లాడినట్టు ఊహిస్తే అది అడివి బాపిరాజుగారి ద్వేషం కథను తల పిస్తుంది. శ్రీపాదవారి అన్నపూర్ణ పురుషునితో సమానంగా శౌర్యం వెలార్చిన సత్యభామతో దీటు వస్తుంది. కల్యాణసుందరిగారి 'అలరాసపుట్టిళ్ళు'లో బల్లకట్టు దాటుతుండగా తోబుట్టువును గోనెలేరులో తోసేసిన కుటుంబ పెద్ద భాగవతంలో కంసునికి తీసిపోదు. ఆ మాటకొస్తే క్షుద్బాధను తట్టుకోలేక విశ్వామిత్రుడు కుక్క మాంసం (అదీ దొంగలించి) తిన్న ఉదంతానికి మించిన కరువు కథ ఎక్కడుంటుంది? అధికార మదంవల్ల అధోగతి తప్పదనడానికి నహుషుడి బ్రహ్మరథం కన్నా ప్రబల సాక్ష్యం ఏముంటుంది? ఇలా ఆలోచిస్తూ వెళ్తే రుక్మిణీ కల్యాణం ప్రేమగాథలన్నింటికీ మూలం కాదా? ఆధునిక సమాజంలో సైతం నిగమశర్మలు లేరా? సుఖదుఃఖాలతో, రాగద్వేషాలతో, సాఫల్య వైఫల్యాలతో, ఈతిబాధలతో నిండిన ఒక మారుమూల సమాజానికి మౌత్ పీసుగా ఉపకరించడం 'ఉదతాభక్తి' పాటి సేవ గాకపోతుందా? ఈ చిరు భరోసాతోనే కథా మార్గంలో పయనం మొదలయింది. పాఠకుడి గుండె గుడిలో గంట మ్రోగించేదే కథ. మరి మరీ మ్రోగితే మంచి కథ. మరైతే గుడిలో గంట మ్రోగాలంటే అక్కడ దైవమేదో వుండాలిగదా! సత్యం, శివం, సుందరం అంటూ భగవత్స్వరూపాన్ని నిర్వచిస్తారు. నేనా భగవత్స్వరూపానికి ప్రతిరూపంగా, మానవతను ప్రతిష్టించుకుని, దాన్ని నే నెన్నుకున్న కథా కుసుమాలతో పూజిస్తున్నాను.

విద్యారంగం పట్నానికి మారడంతో అదివరకు వంచితంకాని సాహిత్యం ఎంతో వుందని తెలిసొచ్చింది. చిత్రగుప్త, ఢంకా, కథాంజలి, ఆనందవాణి, వినోదినిలాంటి పత్రికల మీదుగా, కొవ్వలి, జంపన, కృత్తివెంటి, మానాపురం, వంటెత్తుల పావలా నవలలమీదుగా, చోర శిఖామణి, కంకణ రహస్యం, 264, భూత గృహంలాంటి డిటెక్టివు నవలలమీదుగా సాగిన పఠనా వ్యాసంగం ఆంధ్ర సచిత్ర వారపత్రిక, భారతి మాసపత్రిక, ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక అనే త్రివేణీ సంగమంలో గ్రుంకులిడి పునీతమైంది. చెళ్ళపిళ్ళనుంచీ శ్రీశ్రీ వరకు కవులపేర్లు, గురజాడనుంచి జమదగ్ని వరకు కథకులపేర్లు, ఉన్నవనుంచి శారదవరకు నవలా రచయితలపేర్లు నా సాహిత్య కోశంలో నమోదయిందప్పుడే I వేంకట పార్వతీశ్వర కవుల ఏకాంత సేవ, విశ్వనాథ ఋతు సంహారం, షట్టపర్తి శివ తాండవం, విశ్వం పెన్నేటి పాట, ఆరుద్ర సినీవాలి నా అభిరుచిని నిర్ణయించే

ఆధునిక పంచ కావ్యాలై వుండిపోయాయి. గోదావరి గలం గలలులా శ్రీపాద, పినాకిని ప్రేమ వెల్లువలా కరుణకుమార, అరకులోయ అందాల సెలయేరులా బుచ్చిబాబు, గుండ్లకమ్మ కలకలంలా మునిపల్లె రాజు, వంశధార వైభవంలా ఖలివాడ నా సాహిత్య కుటీర ప్రాంగణందాకా తరలివచ్చి, ఆప్యాయంగా పలకరించారు. టాల్‌స్టాయి నీతిగాథలు, ఓ హెన్రీ కొస మెరుపు కథలు, కావ్య ఖండికల వంటి రవీంద్రుడి కథానికలు దారి పొడుగునా వెలిగే దీపాలై వెలుగులోకి నడిపించాయి. ఏ రచయిత అయినా సరే తనంతట తానుగా ఆకాశంనుంచి ఊడిపడడు. పరిస్థితుల ప్రభావం అతణ్ణి ఆవిధంగా రూపొందిస్తుంది. అందువల్ల మలిదశలో నా మనో ప్రపంచంపైన ప్రభుత్వం నెరపిన సాహిత్య స్రష్టలకు చెల్లించినట్టే తొలి దశలో కథా కథన విన్యాసాలు నూరిపోసిన మా భారతం మిట్ట పౌరాణికులకు, సంజవేళల్లో తిన్నె పైన కూచోబెట్టుకొని అత్యంత ఆసక్తిదాయకంగా స్వానుభవాలను వివరిస్తూ వచ్చిన మా పెద నాయనగారికి, అతి మామూలు సన్నివేశంలోనుంచి సైతం అరుదైన ఆరోగ్యకరమైన హాస్యాన్ని వెలికితీసి నవ్వుల పువ్వుల్ని పరవళ్ళు తొక్కించగల మా సీనుకు, అడపా దడపా ఊళ్ళో మజిలీవేసి నడివీధిలో తంబురా గుమ్మెతలు మ్రోగిస్తూ పేరంటాళ్ళ కథలు, వీరగాథలు త్రవ్విపోసిన బుర్రకథల వృత్తి కళాకారులకు, వేరుశనగ తీగల్లోనుంచి కాయలు వొలిచే చలికాలపు పగటి వేళల్లో కాంభోజరాజు కథ, బాలనాగమ్మ కథ, ముగ్గురు మరాఠీల కథలవంటివి వల్లించి కల్పనాలోకాలలోకి నడిపించిన మా ఒంటికాలి ఖదే సాయిబుకు కృతజ్ఞతలు చెప్పుకోడం నా విద్యుక్త కర్తవ్యంగా భావిస్తున్నాను. సుప్రసిద్ధ సాహితీ కారుల్ని సంస్మరించుకోడానికి ఎన్నో అవసరాలు, అవకాశాలు వుండనే వుంటాయి. వ్యక్తిగతంగా తనపైన ప్రభావం నెరపిన వారిని గురించిన సంస్మరణ ఏ రచయితకైనా జన్మకల్లా ఒక శివరాత్రిలా ఎప్పుడోగానీ దొరకని అవకాశం. అందువల్ల నలభైయేళ్ళ పైచిలుకు సాహితీ వ్యాసంగానికి గంభీరమైన నేపథ్యాన్ని సమకూర్చిన రాయలసీమ జానపదుల ప్రాచీన సంస్కృతికి నివాళిగా 'హారికలు కుశలమా!' అన్నారు. కథా సంపుటాన్ని తమ కర కమలాలలోనికి సమర్పించుకుంటున్నాను. చిత్తగించవలెను.

భవదీయుడు

మధురాంతకం రాజారాం

దామల్ చెరువు
29-8-1998

# హాలికులు కుశలమా!

అసలు సిసలైన 'ఉన్మాదం మాట కేమిగానీ, దాని నీడల్ని మాత్రం పరి కిస్తే పిచ్చి వెయ్యి రకాలు. ఒకటి రెండు గంటలపాటు 'పుస్తక' మంటూ పేర్కొనదగిన వస్తువు కంటికి కనిపించకపోతే మతిపోయి నట్టుండడం అలాంటి ఉన్మాదచ్ఛాయల్లో ఒకటి గాకపోదు. ఆ ఊరిలో, ఆ చలికాలపు సాయంకాలం వేళ నా కెదురైన పరిస్థితిగూడా అదే!

నే నా వూరికి వెళ్ళింది రాయదుర్గం నరసప్పగారిని కలుసుకోవడానికి కాదు: అసలాయన ఆ వూరిలో వున్నాడని నాకు తెలియదు. ఏదో స్వకార్యం మీద ఆ వూరు వెళ్ళడం జరిగింది. వెళ్ళడమే తడవుగా పని ముగిసింది. కానీ వెను వెంటనే తిరిగి రావడానికి మాత్రం వీల్లేక పోయింది. అది చాలా చిన్న కుగ్రామం. దానికీ ప్రపంచానికీ వున్న లంకె ఒక్కటే బస్సు. అది మధ్యాహ్నం పన్నెండు గంటల కక్కడికి వచ్చి, వెంటనే తిరుగు దారి పడుతుంది. మూడువైపులా కొండలు: ఓ వైపున రోడ్డు. రోడ్డు కొక ఫర్లాంగు దూరంలో వూరు. మామిడి తోటల గుబుర్ల వెనుక నక్కి కూర్చోవడం వల్ల అక్కడొక వూరుందన్న సంగతి ఆ వూరిలోకి వెళ్ళిన తర్వాతగానీ తెలియదు. వెలుగు ముఖం చూడకుండా, భూ గర్భంలో ఎంతకాలం మనవచ్చునన్న విషయం పైన యిటీవల కొందరు శాస్త్ర జ్ఞులు పరిశోధనలు కల్పించినట్టు వినికిడి. వార్తాపత్రిక, రేడియో, సినీమా మొద లైన వ్యాపకాలేవీ లేకుండా మానవులు అచ్చమైన ప్రకృతిమాత బిడ్డల్లా బ్రతక వచ్చునని నిరూపించడానికి ఆ వూరి నొక ప్రయోగశాలగా రూపొందించారేమో తెలియదు. ఏ దూరపు బంధువుతో నైతే పనిబడి ఆ వూరికి వెళ్ళానో, ఆ దూరపు బంధువు బహు కార్యవ్యగ్రుడు. అతిథి సత్కారం ముడిపట్ల ఎంతగా గౌరవాభిమానా లున్నప్పటికీ, పాప మతనికి పది నిమిషాలపాటు నింపాదిగా మాట్లాడటానికి తీరిక చిక్కడం లేదు. అది బొత్తిగా రైతుల ఇల్లు. కిటికీలు తక్కువ. ఉన్న కిటికీలు కూడా మూయబడి వున్నాయి. ఏనాటి పాలగారో గానీ అది మాసిపోయి నల్లటి రచ్చులా తయారైంది. పెద్దల వాడుకలో అలాంటి యిళ్ళ పేరు 'చుట్టు భవం

తులు', నవ నాగరిక ప్రపంచంలో మారిన, మారుతున్న యిళ్ళతో దానికి పోలిక లేదు. పేటకూ, పట్టణానికీ మధ్య త్రిశంకు స్వర్గంలాంటి పరిణామ దశలో ఉక్కిరి బిక్కిరౌతున్న స్వస్థలంలో సరిగ్గా ఇలాంటి యిల్లే నాకుంటే యిందులో ఏయే తావుల్లో పుస్తకాలు పేర్చి పెట్టడానికి వీలుంటుందో అలాంటి తావు లన్నింటి లోనూ నా చూపులు పుస్తకాల కోసం గాలించాయి. అలమరాలో గుమ్మడి పళ్ళు, జాజికాయల పెట్టెలో త్రాళ్ళు, తాళికలు ; దేవరింటిలో తలుపు చెక్కలపైన గోడ కానించి పెట్టిన బెల్లం ముద్దలు ; ఇంకా ఎర్ర గడ్డల గుత్తులు, మర్రాకుల తోర ణాలు....

ఇంతలో ఏ పారకోసమో, పలుగు కోసమో గృహస్థుడు లోపలికి వచ్చాడు. వస్తూ 'ఏమిటో పరకాయించి చూస్తున్నట్టున్నారు.' అన్నాడు.

"మరేం లేదు. కాలక్షేపం కోసం ఏదైనా పుస్తకం దొరుకుతుందేమోనని..."

"పుస్తకాలా ! ఆ పంట మా పొలాల్లో పండడం లేదండీ బావగారూ ? అంతగా మీకు కావలసివస్తే రాయదుర్గం నరసప్పగారి దగ్గరకు మనిషిని పంపాలి..."

రాయదుర్గం నరసప్పగారు!

లోకమంతా గొడ్డుపోయినట్టు ఆయన ఈ వూరిలో వున్నాడా?

పగ్గాలు తెంచుకుని ఆవులు పొలాల్లోకి జొరబడినట్టుగా నా ఆలోచనలు గతంలోకి పరుగు తీశాయి.

మూడు దశాబ్దాల కిందటి మాట. ఒకానొక ఉన్నత పాఠశాల ఆవరణలో ఆయనను మొదటి సారిగా చూశాను. చూచినప్పుడు ఆయన అక్కడి తెలుగు పండితుడని తెలియదు. కోర మీసాలు, పద్ధతి లేకుండా కట్టుకున్న తల పాగా, పొడుగాటి కోటు, మెడకు రెండు చుట్లు తిరిగి యిరువైపులా క్రిందికి వ్రేలాడుతున్న అంగవస్త్రము, పాదాలకు కిర్రు చెప్పులు. పండితుడైతే అయ్యాడు గానీ, ఆయన అందుకు తగ్గ వేషాన్ని మాత్రం సంతరించుకున్నట్టు మాత్రం లేదు. వేషం కన్నా వాచికమూ, ఆంగికమూ ముఖ్యమైనవే! కాదనలేము. కానీ మొట్టమొదట కంటికి కొట్టవచ్చినట్టు కనిపించేది వేషమే! నరసప్పగారు పాఠం ఎలా చెప్పగలరో ఆ పనికి ఆయన ఎంతగా తగుదురో లోకులకు తెలియదు. వారి దృష్టిలో ఆయన

వరసలో ఎద్దుల బేరగాడిలా వుండేవాడు. బటవా సంచీ భుజానికి తగిలించుకుని సంతకు వెళ్తున్న పెదకాపులా వుండేవాడు.

అది జిల్లా కేంద్రంలోని ఏకైక ఉన్నత పాఠశాల. జిల్లాలో పది పన్నెండు మిడిలిస్కూళ్ళుండేవి. మిడిలి స్కూల్ నుంచి హైస్కూలుకు వెళ్ళడమంటే, ఆనాడు యింజనీరింగులో సీటు దొరికినంత సంబరంగా వుండేది. ఫోర్తుఫారంలో చేరిన నెలనాళ్ళకే నరసప్పగారు నన్ను తన అభిమాన శిష్యుల జాబితాలో చేర్చుకున్నారు. వేపమాను వీధిలో దర్గా వెనుకవైపున వున్న యింట్లో నరసప్పగారి కాపురం. మళ్ళీ నాలుగైదు వీధులు దాటి వెళ్ళవలసి వున్నందున, నేను ఆయన పుస్తకాలను తీసుకెళ్ళడానికి ఉపకరించే వాణ్ణి. ఆ కించిత్తు పనిని నాపైన మోపడానికి గూడా ఆయనకు మనస్కరించేది గాదు. 'ఒరే అబ్బీ! నువ్వు వ్రేలెడంత లేవు. నా పుస్తకాల బరువు క్రింద నువ్వు నలిగిపోవడం నాకిష్టం లేదు' అనేవాడాయన.

నరసప్పగారి వెంట నడవడానికి అలవాటు పడిన క్రొత్తలో నా కొక విషయం తెలిసింది. ముందువైపున మాత్రమే దీపాలు వెలుగుతున్న కారులాంటివాడు నరసప్పగారు. కన్నెదుట కనిపించేది కాంతి. వెన్నంటి వ్యాపించేది చీకటి. నరసప్పగా రెదురు రాగానే భయభక్తులు ముఖంలోకి తెచ్చుకుని నమస్కారాలు వల్లించే వాళ్ళందరూ. ఆయన తమను దాటుకోగానే వెకిలి నవ్వులు నవ్వుకునేవారు. ఆ వెకిలి నవ్వుకు అంతరార్థ మేమిటో నా కాదిలో తెలిసింది గాదు. క్రమక్రమముగా కారణాలు బోధపడుతూ వచ్చాయి. నరసప్పగారు నిఖార్సయిన పండితుడు కాదన్నది మొదటి కారణం. నేతిబీరకాయలా, కాకిబంగారులా ఆయన నకిలీ పండితుడని తాత్పర్యం. నరసప్పగారు జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారిని దర్శించి ఆయనగారిపైన పంచ రత్నాలు చదివారు. ఆయన తెగ మురిసిపోయిన వాడై నూటపదహార్లు సమర్పించుకోబోయాడు. "అబ్బే నాకు డబ్బెందుకండీ! పండిత పదవి నిప్పించండి" అన్నాడు నరసప్పగారు. అలాగే పొమ్మని ప్రెసిడెంటుగారు వరప్రదానం చేశారు. రెండో కారణం: ఆయన పాఠాన్ని పాఠంలా చెప్పడు. పురాణంలా చెబుతాడు. మూడో కారణం : ఏ పాతకాలం నాటి పరీక్షలోనో కడతేరి పండితుడు కావడానికి కనీసపు టర్హతను సంపాదించుకున్నా డంతే గానీ, ఆయన సాంగోపాంగంగా బడిలో చదువుకున్న పాపాన పోలేదు. అందువల్ల

ఆయనకు విద్యార్థులను పరీక్షలకు తయారు చెయ్యడం తెలియదు. నాలుగో కారణం: ఆయనకు యింగ్లీషులో సంతకం పెట్టడమైనా చేతగాదు.

నరసప్పగారి పట్ల బడిలో ఎంతగా తేలిక భావాలు వ్యాపించి వున్నప్పటికీ స్వభాషాభిమానుల పాలిటికి ఆయన యిల్లొక తీర్థవాటికలా కనిపించేది. పండుగలకు, పబ్బాలకు అక్కడ కావ్యగానాలు కొనసాగేవి. ఎంతో కొంత సాహిత్యాభిమాన మున్న పురజనులు గూడా కొందరు వాటిల్లో పాల్గొనేవారు. వారిలో ఎవరైనా "అబ్బో, తెలుగు బలగం చాలా పెద్దదే!" అంటే, "బలగం కాదండీ! ఇది తెలుగు పేదోలగం" అంటూ నరసప్పగారు సరిదిద్దేవారు. చెప్పడానికి కావలసిన పాఠం చెప్పడం కన్నా, సాధన సంపత్తిని సమకూర్చుకోవడం కన్నా, ఆత్మస్తుతికీ పర నిందకే కాలాన్ని ఎక్కువగా సద్వినియోగం చేసుకునే పద్ధతి నరసప్పగారికి అలవడింది గాదు. తీరిక దొరికినపుడల్లా ఆయన బుద్ధి పద్యాల అల్లిక పయిన పరిశ్రమిస్తుండేది. కవితా సరస్వతికి రోజు కొక్క పద్యమైనా ఉపాయనంగా సమర్పిస్తేగానీ ఆయనకు నిద్ర పట్టేది కాదు. లౌకిక విపణి వీధిలో పద్యరత్నాలకున్న గిరాకీ చాలా తక్కువ. బొత్తిగా లేదన్నా తప్పులేదు. మరయితే అంతటి దీక్షతో పెంపొందించుకుంటున్న ఈ పద్య సంచయాన్ని ఆయన ఏం చేసుకోబోతున్నాడన్నదే నా కర్థంగాని విషయం.

బడి విడిచి పెట్టి ప్రపంచంలోకి రావడంతో భౌతికంగా నరసప్పగారికి దూరం గావడం జరిగింది. అయినా ఆయన జీవిత విశేషాలు అప్పటికప్పుడు గాకపోతే మానే, కొంత ఆలస్యంగానైనా తెలిసి వస్తుండేవి. అయిదారేళ్ళ వ్యవధిలో ఆయన స్వంత డబ్బు వెచ్చించి నాలుగైదు కావ్యాలను ముద్రించారు. వాటిలో ఆయన అమ్ముకోగలిగినవి స్వల్పం. ఉచితంగా పంచి పెట్టిన వాటి సంఖ్య అసల్పం. అలా ఉచితంగా పంచి పెట్టడానికైనా మనుషులు దొరక్క ఎన్నో పుస్తకాలు బీరువాల్లో మ్రగ్గిపోతూండేవి. ఈ మొదలు చెడ్డ బేరం నిశ్చల కాసారం లాంటి ఆయన చిత్త వృత్తిపైన మానని గాయంలా దెబ్బ దీసింది. ఇతిహాసాలకూ, ప్రబంధాలకే దిక్కులేదు. ఇక కావ్యా లెవరు చదువుతారు లెమ్మన్న నిరాశా నిస్పృహలు ఆయనను చుట్టుముట్టాయి. సందు చూచుకుని పుస్తకాల వ్యాపారులు కొందరు ఆయనను దగా చెయ్యడంలో కృతకృత్యులయ్యారు. సాహిత్యాభిమానిగా పేర్గాంచిన పెద్ద మనిషి ఒకతను ముద్రణాభారం వహించగలనని నమ్మబలికి కొని వ్రాత పుస్తకాలను పట్టుకెళ్ళి, దినం మంచిదని పగలే దొంగ

తనానికి దిగినట్టుగా వాటిని తన పేరుతోనే అచ్చు వేయించుకున్నాడు. పులిమీద పుట్రలాగా ఎన్నడూ లేనిది నరసప్పగారు కొంత అనారోగ్యానికి గూడా గుర య్యారు. మూడు మాసాల దీర్ఘకాలం సిక్‌లీవు పెట్టి యింటిదగ్గరే గడప వలసి వచ్చింది. ఆ సందర్భంలో ఒకసారి ఆయనను చూడ్డానికి వెళ్ళాను. అప్పు డప్పుడే ఆయనలో బట్టతల లక్షణాలు పొడసూపుతున్నాయి. గడ్డం దట్టంగా పెరిగింది. ఆ సంవత్సరం ఆరునెలల పొడుగునా జడివానలు కురిసి ఆయన కాపురమున్న యింటిలో పెరటివైపున రెండు గదులు కూలిపోయాయి. తీసుకెళ్ళిన చీనీపళ్ళు ఒలిచి పెడుతూ, యిల్లు మార్చడం మంచి దేమోనని సూచించాను. ఆయన నీరసంగా నవ్వారు. "ఒరేయ్ రాజూ! ఇల్లేకాదు. ఊరే మార్చవలసి వచ్చే టట్టుంది," అన్నాడు.

"ఎందుకండీ?" విస్మయంతో ప్రశ్నించాను.

"ఎందుకంటె- ముందొచ్చిన చెవులకంటే వెనకకొచ్చిన కొమ్ములు వాడి గనుక ! నీకు తెలియదేమో. యిప్పుడు స్కూలు కొక క్రొత్త తెలుగుపండితుడు వచ్చాడు. మడిమలదాకా తొడుక్కున్న పొడుగాటి షరాయివాడు. చొక్కా నందు లోనే దోపుకున్నవాడు. వుంగరాల జుట్టువాడు, తూనీగ మీసాలవాడు. మీ యింగ్లీషు మాష్టార్లందరూ అతగాడి ముందు బలాదూరు..."

"కానివ్వండి, మన కేం నష్టం!"

"లాభ నష్టాల ప్రసక్తిగాదు. ఆత్మాభిమానం కృంగి కుంచించుకపోతుంటే ఎలా భరించడం ? క్రొత్త పండితుడు వచ్చాడన్నానుగదూ! అయ్యవార్లకందరికీ అతడి వాలకం నచ్చింది. వెంటనే నామాలుపెట్టి, వైష్ణవం యిప్పించి తమ మతంలో కలిపేసుకున్నారు. ఎటొచ్చీ వెలివేయబడ్డవాణ్ణి నే నొక్కణ్ణే."

"ఇదిగూడా మీకు క్రొత్తగా ఎదురైన యిబ్బంది కాదే!"

'నీకు తెలియదట్రా రాజూ! మూరెడెచ్చా తక్కువా అయితే నేను లెక్క పెట్టేవాణ్ణిగాను. ట్రాక్టరులా దున్నుక పోయేవాణ్ణే! కానీ తా మేమో గిరిశృంగాల పైన నిల్చునట్లు ఎదుటివ్యక్తి అగాధంలో పడివున్నట్లు భావించి, ఆ భావనకు తగ్గ ట్లుగానే ప్రవర్తించేవాళ్ళతో ఎంతకాలం బ్రతకగలం? పితూరీలు చెప్పడం నాకు చేతగాదని నీకు తెలుసు. కానీ ఒక చిన్న దృష్టాంతం చెబుతాను. స్కూలుకి

మధ్యనే రేడియో ఒకటి కొన్నారు. అందులో ఓ పాట వినవస్తోంది. నే నూరు కోలేక అది గీతగోవిందంలోని దన్నాను. "కాదండి! అది ఫలానా సినిమానిది" అన్నాడు కొత్త తెలుగు పండితుడు. "ఆ విషయం నాకు తెలియదు. ఆ పాట మాత్రం గీతగోవిందం లోనిదే! నేను చూచాను" అన్నాను. 'అలాగా? ఆ సినిమా నేను చూడలేదు" అన్నాడు క్రొత్త తెలుగు పండితుడు. అని, అంతటితో ఎక్కడూరుకున్నాడు ? కలలోనుంచి తటాలున మేలుకున్నట్టుగా "అబ్బే, మీరు పొరబాటు పడుతున్నారండీ! ఆ పేరుతో సినిమా రానేలేదు" అన్నాడు. ఎదుటి వ్యక్తిని చిత్తుచిత్తుగా ఓడించేశాడు గదూ! బల్లల్ని చిదకబాదేస్తూ సహోపాధ్యాయుల దొకటే చిరునవ్వు.

రాజహంసను చూచి కొంగలు నవ్విన కథ జ్ఞప్తికి వచ్చింది. నరసప్పగారు చెప్పుక పోతున్నారు.

"విన్నన్న చెప్పిందే వేదం. నువ్వూ నేనూ చెబితే అది వేదం ఎలాగౌతుంది? వచ్చినవాడు సీనియరు తెనుగు పండితుడు. ఆ మాట నువ్వూ నేనూ చెప్పిందిగాదు: పై అధికారులే చెప్పారు: నమ్మకపోవడం ఎవడితరం? నేను కనీసం జూనియర్ తెనుగు పండితుణ్ణయినా కాను. అన్ట్రెయిన్డ్ జూనియర్ పండితుణ్ణి-యింగ్లీషు రాకపోవడం వల్ల: యోగ్యతా పత్రాలు లేకపోవడం వల్ల! నా జీతమెంది చూచావూ. అది మాచకమ్మ! దానికి ఎదుగూ, బొదుగూ లేదు. పోగా పాత హెడ్మాష్టరుగారి హయాంలో అదొక రకంగా వుండేది. ఆయన వయోవృద్ధుడు. ఆయన అన్నా, నేను విన్నా అంత బాధగా వుండేదికాదు. ఆయన స్థానంలో ఓ కుర్ర హెడ్మాష్టరు వచ్చాడు. ఈయనకు అయ్యవార్లు సక్రమంగా పాఠాలు చెప్పడంకన్నా, తనకు లొంగి వుండడం ముఖ్యం. నీ శరీరం నీదే నని నువ్వనుకుంటావు. అది వట్టి భ్రమ. అది హెడ్మాష్టరుగారి కదలికలకు అనుగుణ్యంగా తనను తాను మలచుకునే ఒక సజీవ యంత్రం. హెడ్మాష్టరుగారు కనిపించాడుబో, అది తల కిందికి వంచి, కుడిచేతిని పైకెత్తాలి. హెడ్మాష్టరుగారు రౌండ్సు వచ్చాడుబో, అది షాకు తిన్నట్టుగా లేచి నిల్చోవాలి. హెడ్మాష్టరు నోరు తెరిచాడుబో, అతడి మాటలలో లేని ఛలోక్తిని గూడా గుర్తించి, ఇది గూడా నోరు తెరచి చిరునవ్వులు ఒలకబోయాలి. ఆ మాత్రానికే తృప్తి పడక ఈ శరీరాలను మరింతగా తన అదుపులోకి తెచ్చుకోడానికి వీలుగా, వాటికి తగిలించవలసిన

దుస్తులను గూడా నిర్దేశిస్తూ ఈ హెడ్మాస్టరుగా రొక చట్టాన్ని జారీ చేశాడు. నిజానికి అలాంటి దుస్తులు ధరించుకోడం చాలామంది కిష్టంలేదు. కానీ వాళ్ళందరూ కలిసి ఓ చిట్కా కనిపెట్టారు. "మొట్టమొదట నరసప్పగారు గనుక ఈ నియమాన్ని ఆచరణలోకి తెస్తే, వెనువెంటనే మే మందుకు తయార్" అంటూ వాళ్ళు హెడ్మాస్టరుగారికి విన్నవించుకున్నారు. ఇక చూచుకోరా రాజూ! మెమోలకు పైగా మెమోలు నాకు ! ఏం చెప్పమంటావురా బాబూ! ఆలు చచ్చినవాడే అందరికీ లోకువ..."

"అన్నారూ! అంతమాట కూడా అన్నారూ!" అంటూ తులసమ్మ గదిలో ప్రవేశించింది. అమంగళం శాంతించాలని నేను మనసులోనే అనుకున్నాను.

"ఐనా నాకీ దండన రావలసిందేరా రాజూ! మొదట తెలుగు పండితుణ్ణి అయినందుకు. అంతకంటె ముందుగా పెద్దలు వెళ్ళిన దారంట వెళ్ళనందుకు, బెస్తవీధిలో పువ్వుల దుకాణం పెట్టినందుకు నాకీశిక్ష కావలసిందే! కుర్రవాళ్ళకు సాహిత్యం నూరిపోయాలనీ, కావ్యాలు వ్రాద్దామనీ, తద్వారా శారదోసన చేద్దామనీ నే నెన్నో కలలు గన్నాను. ఆ కలలన్నీ కల్లలైపోయాయి. ఇదిగో, ఈ యిల్లు కూలినట్లుగానే నా ఆశలుకూడా కూలిపోయాయి. ఇక నే నీ యిల్లు ఖాళీ చేశానంటే ఈ ఉద్యోగం వదలి పెట్టినట్లే!"

అది పన్నెండేళ్ళ క్రిందటిమాట. నరసప్పగారు అనడమేకాదు. అన్నంత పనిగూడా చేశారు. ఉద్యోగానికి రాజీనామా యిచ్చిన తరువాత ఆయన ఏమైందీ, ఎక్కడికి వెళ్ళిందీ తెలియదు.

కాలప్రవాహంలోపడి, ఏదో ఒక పాయవెంట వెళ్ళిపోతూ, ఆనాడూ కనుమరుగైపోయిన ఆ పడవ మళ్ళీ ఈనాడు ఇక్కడ తేలిందని తెలియగానే నా మనసు వేగిరపడిపోసాగింది. నా కాళ్ళు నన్ను అప్రయత్నంగా నరసప్పగారి సన్నిధికి తీసుకెళ్ళసాగాయి.

* * *

తీరా వెళ్ళేసరికి నరసప్పగారు ఇంట్లోలేరు. భార్య మూలంగా ఆయన ఆచూకీ తెలిసింది.

పల్లెకు వెనుకవైపున ఓ అరమైలు దూరంలో గుట్ట ఒకటి కనిపిస్తుంది. గుట్ట చుట్టూ వందల సంఖ్యలో వూడలు దిగిన మర్రిచెట్లున్నాయి. ఆ వటవృక్ష సము

దాయానికి పెట్టని కోటలా మద్దులూ, నేరేళ్ళూ బారులు తీర్చివున్నాయి. ఈ వృక్షపంక్తికి ఆనుకుని సన్నని ఏరొకటి ప్రవహిస్తుంది. ఆ ఏటి కిద్దరిని కొన్ని మామిడిచెట్లు: ఆ మామిడిచెట్ల దగ్గిరినుంచే ప్రారంభమౌతుందట నరసప్పగారి తోట...

ఆ మామిడిచెట్ల సంఖ్య కొద్దిపాటిది. ఐతేనేమి, ఏపుగా పెరిగి శతసహస్రానేక శాఖలతో దశదిశలకూ వ్యాపించి, మొదళ్ళదగ్గర ఇద్దరు మనుషులు బారలు సాచినా మిగిలిపోయేంతటి బలుపుతో, ఎలాంటి ఝంఝూమారుతానికైనా తలవంచని తీవిని మోరుస్తూ అవి గంభీరంగా నిల్చివున్నాయి. ఆ మామిడిచెట్లనుగూడా పొదివి పట్టుకున్నట్టుగా వ్యాపించివున్న దట్టమైన కంచె కక్కడ వేయబడివున్న వెదురు తడికల తలుపును తీసుకుని మెల్లిగా లోపలకు వెళ్ళాను. ఎండిపోయిన మామిడాకు పరుపులకు మధ్య సన్నగా వంకరలు తిరిగిపోతున్న కాలిదారివెంట దాదాపుగా నూరంగలు వేసినంతదూరం నడిచాను. అక్కడికి మామిడిచెట్లనీడ ఆఖరైపోయింది. ఎట్టఎదుట ఎత్తుగా పోసివున్నది ఓ మట్టిగనుమ. గనుమ పైకెక్కి నిల్చున్నాను. కనుచూపు అనినంతమేరకు భూదేవి పచ్చనిచీర కట్టుకున్నట్టున్న పంటపొలాలు. ఆ పొలాలమధ్య నరసప్పగారి కోసం నా చూపులు ఆతురతగా వెదకుతున్నాయ.

గొంతు వినిపించింది.

"ఎవరక్కడ? ఇదిగో ఇక్కనున్నాడురా అబ్బీ!" తిరిగి చూచాను.

అవేక్కిర్రుచెప్పులతో, అదే ముక్కాలుచేతుల చొక్కాతో, కప్పుకున్న శాలువతో, నెరసిపోయిన బొద్దు మీసాలతో, దుడ్డుకొయ్యలాంటి చేతికర్రతో అరటి చెట్ల నడుమ నిల్చున్న నరసప్పగారు కనిపించారు.

"నమస్కారమండీ మేష్టరుగారూ! మీ రీ వూరిలో వున్నారని ఓ గంట క్రిందట తెలిసింది. ఇక్కడున్నారని పదినిమిషాలక్రితం తెలిసింది. హాలికులకు కుశలమేనటండీ మేష్టరుగారూ?"

"నువ్వట్రా రాజూ! భద్రంగా రావాలి మరి. క్రిందకి చూడకుండా నడిస్తే గనుమపైన కాలుజారుతుంది...

క్రిందికి దిగి, చిన్నకాలువ నొకదాన్ని దాటుకుని సన్నటి గనుమపై కొచ్చేశాను. స్వాగత మిస్తున్నట్లుగా నాలుగడుగులు ముందుకువచ్చి, భుజంపైన చేయి వేసి నన్ను దగ్గరికి తీసుకుంటూ "అబ్బ! ఎంతకాలానికిరా రాజూ!" అన్నారు

నరసప్పగారు. ఒకటి రెండుక్షణాల తర్వాత "నిన్ను కలుసుకోడంకోసం మాత్రమే గాదు. "హాలికులకు కుశలమా' ప్రశ్నించావుగదూ; అలాంటి ప్రశ్నకోసం గూడా ఎంతోకాలంనుంచీ వేచివున్నాను..." అన్నారు.

"అలాగటండీ మేష్టరుగారూ! ఐతే అడగవలసిన ప్రశ్నే అడిగానన్న మాట !"

"కాని ఇందుకు నువ్వు నన్ను జవాబు చెప్పనివ్వాలి మరి..."

"అంతకంటేనా ? మిగిలిన వివరాలు కావాలిస్తే తీరిగ్గా అడిగి తెలుసు కుంటాను. మొదట నేను తెలుసుకోదలిచిన విషయం ఇదే!"

"అందుకే చెబుతున్నాను: వ్యక్తి స్వాతంత్ర్యం వున్న దేశంలో ఎవరికిష్ట మైన వృత్తిని వారు స్వీకరించవచ్చు. హాలికుడు కవి అయినా, కవి హాలికుడైనా అందులో విడ్డూర మనిపించే దేమీ కనిపించదు. కానీ హాలికులకు కుశలమా అన్న ప్రశ్నలో నిగూఢంగా దాగివున్నది వట్టి పరామర్శగాదు- ఎత్తిపొడుపు. "కవిగా ఉదరపోషణ జరగకపోవడంవల్ల. తప్పనిసరిగా మేడి పట్టుకోవలసి వచ్చిన ఓ మాజీకవీ! ఈ వృత్తిలోనైనా నీకు రోజులు సుఖంగా వెళ్ళమారిపోతున్నాయా?" అంటూ సూటిగా అడగలేక, ఇలా ప్రశ్నిస్తున్నావు నువ్వు. కాదనగలవట్రా రాజూ?"

"ఏమిటోనండీ మేష్టరుగారూ ? నేనంతదూరం ఆలోచించలేదు," అన్నాను.

"మరులు చాలా చెడ్డదిరా బాబూ! దూడ చనిపోయిందనుకో, చేతపెయ్యను చేసిపెడితేగానీ ఆవు పాలు చేపదు...ధర్మపత్నిని అరణ్యాలకు పంపించేశాడుటో, శ్రీరాముడు సరిగ్గా సీతమ్మలాంటి పుత్తడిబొమ్మను చేసిపెట్టుకోక తప్పిందిగాదు. పూర్వాశ్రమంలో నేను కవిగా, పండితుణ్ణిగా అధ్యాపకుణ్ణిగా బ్రతకడానికి ప్రయత్నించాను. అక్కడ తిండికి తిరకాసే, సుఖశాంతులకూ నిప్పచ్చరమే ! ఆ బ్రతుకును కాదనుకొని ఇలా ఈ అజ్ఞాత ప్రపంచంలోకి వచ్చేశాను. ఇక్కడ చేతి నిండుకూ పనీ, కడుపునిండుకూ బువ్వా దొరుకుతున్నాయి నాకు ! కానీ మనసు కేదో కొరత, బుద్ధికేదో మాంద్యం, అంతరంగాని కేదో క్షోభ ఎదురు కాసాగాయి. మనిషి స్వభావానికీ, వాడు చేస్తున్న పనికీ సామరస్యం లేకపోతే, బ్రతుకు బ్రతు

కంతా ఒక తీవ్ర సంఘర్షణగా పరిణమిస్తుందేమో! సరిగ్గా అలాంటి పరిస్థితే ఎదురైంది నాకు! ఒక విధంగా అదొక ఉన్మాదంలాంటి స్థితి. అందులోనుంచి కోలుకోడానికి చాలాకాలం పట్టింది..."

"ఎలా కోలుకున్నారు?" అప్రయత్నంగా ప్రశ్నించాను.

"అదే చెబుతున్నాను. ఇరుసుకూ, చక్రానికీ ఏనాటికీ ఘర్షణ తప్పదు. కాదంటే ఇరుసుకు కందెనవేసి ఘర్షణను మనం అదుపులోకి తెచ్చుకోవచ్చు. నే నదేపని చేశాను. దేనినుంచి దూరమై పోవడంవల్ల పెన్నిధిని పోగొట్టుకున్నట్టుగా బాధపడ్డానో, ఆ కావ్యజగత్తు నంతటినీ తీసుకొచ్చి, ఈ పొలాల్లోనే నెలకొల్పుకున్నాను..."

చుట్టూరా కలయజూస్తున్నాను. ఏవైపు చూసినా చెట్లు, తోటలు, పైర్లు, కూరగాయలపాదులే కనిపిస్తున్నాయి.

"ఇదిగో. ఇక్కడున్నాయే – ఈ చెట్లు ఎలా కనిపిస్తున్నాయి నీకు?"

"అవి కొబ్బరిచెట్లు – ఎలా కనిపిస్తాయి? కొబ్బరి చెట్లలాగానే కనిపిస్తున్నాయి. వరుస కారుచొప్పున మూడు వరుసల్లో మూడార్ల పద్దెనిమిది కొబ్బరిచెట్లు..."

ఒక్కొక్కచెట్టు ఒక్కొక్కపర్వం చొప్పున ఇదే నా పొలాల్లో నేను ప్రతిష్ఠించుకున్న మహాభారతం. రాతిలో భగవంతుణ్ణి చూడగా లేనిది, స్థావర జగత్తులో సాహిత్య జగత్తును చూడడం అబ్బురమట్రా రాజూ!"

ఆయన కది అబ్బురం కాకపోవచ్చు. కానీ నా మట్టుకు నేను మాత్రం నా నివ్వెరపాటును కప్పిపుచ్చుకోలేకపోయాను.

"వివరించి చెప్పకపోతే నాకు నిజంగానే పిచ్చిపట్టిందని నువ్వనుకోవచ్చు. నా కారణాలేవో నా కున్నాయి. నాకు తెలిసిన సాహిత్య ప్రపంచంలో భారతం కన్నా ఉన్నత సృష్టి కానరాదు అలాగే మహోత్తాలమైనవి. ఈ కొబ్బరిచెట్లు. ధర్మాధర్మాల మధ్య జరిగే పోరాటానికి ఈ జగన్నాటకరంగం ఒక నిరంతర క్రీడావేదిక. అందులో ఎన్నటికైనా ధర్మానికే విజయమని నిరూపిస్తున్నట్లుగా ఆ ధర్మరాజు, ఆ భీముడు ఆ అర్జునుడు మొదలైన పాత్రలు కొండకొమ్మలా కనిపిస్తాయి. జాతిలోని నీతికి బలానికీ ఊపిరిపోసే నమ్మకం యిది. తలపైకెత్తు

కుని నిల్చున్న ఈ కొబ్బరిచెట్లు అరమైలు దూరంనుంచీ ఎక్కడనిల్చుని చూచినా కనిపిస్తాయి. బ్రతుకు సాఫీగా గడచిపోవడానికి తిండీ గుడ్డాలాంటి కనీసపు జీవితావసరాలు కొన్ని కావాలిక్కగదా! వాటివరకూ నీకేం భయంలేదని పూచీ యివ్వగలిగే నీ భూసంపద ఇదిగో ఇక్కడే వుంది అన్నట్లుగా ఈ చెట్లు నాకు నమ్మకం చెబుతుంటాయి."

"అర్థమైందండీ మేష్టరుగారూ!" ఈ మాటలు ప్రకాశంగానే అన్నానో, లేక స్వగతంగానే గొణుక్కున్నానో తెలియదు.

"ఈ అరటిచెట్లవైపు చూచావా రాజూ!"

చూస్తున్నాను. స్థానికంగా ఈ జాతిపేరు ఏడాకుల అరటి. ఏడెనిమిది మూరల ఎత్తువరకు పెరిగి, బాగా వెడల్పయిన పొడుగాటి ఆకులతో, నిండిపండిన పంబాలతో చల్లగా కడుపు పండించుకున్న ఆ కదళీతరువులు అందాలనూ, చల్లదనాలనూ వెదజల్లుతూ క్షేత్రేందిర కొక పవిత్రశోభను సంతరిస్తున్నాయి. ఎందుకైనా మంచిదని వాటినిగూడా లెక్కించుకున్నాను. కాలచక్రంలోని ఆకులకు మల్లే వాటి సంఖ్య సరిగ్గా పన్నెండు...

"ఊహించే ఉంటావురా రాజూ! ఇదే నా దృష్టిలో భాగవతం. రోజు కొక అరటిపండు తింటుంటే వైద్యుడితో అవసరం వుండదని సామెత. రకరకాల వ్యాసంగాలతో బేజారెత్తిపోయిన మనసుకు భాగవత పారాయణమే దివ్యౌషధం. కళ్యాణాత్మకమైనవి విష్ణుకథలు. పళ్ళుగా, ఆకులుగా పందిళ్లకు అలంకృతిగా తమ సర్వస్వాన్నీ భగవత్ కైంకర్యానికి వినియోగించుకునే అరటిచెట్లుమాత్రం కళ్యాణాత్మకమైనవి గావా?"

"మరైతే రామాయణం మాట ఏంచేశారండీ మేష్టరుగారూ?"

"తొట్టతొలుతనే రామాయణాన్ని గురించి చెప్పి ఉండవలసింది- ఆది కావ్యం గనుక! ఐనా ఇప్పుడు చెబుతున్నానుగా! పెట్టని చలువపందిరిలాంటి ఈ మామిడితోటే నాకు రామాయణం. రామకథను కొందరు అమృతమని సేవించారు. మరికొందరు రత్నాకరమని గ్రుంకులిడి దొరికిన రత్నాలు ఏరుకున్నారు. ఇంకా కొందరు కల్పవృక్షమని కామితార్థాలను యీడేర్చుకున్నారు ఎందరెందరు ఎన్నెన్ని విధాలుగా కొనియాడినా తనివి తీరనిది. రాఘవుని సచ్చారిత్రం కష్ట

నష్టాల ఎదురుతాకిళ్ళలో అసురుసురై పోయిన మానవులపాలిటికి అంతకంటే చల్లటి విశ్రాంతి కేంద్రం మరి ఎక్కడుంటుంది చెప్పు—"

మాట్లాడుతూ నరసప్పగారు ముందుకు నడువసాగారు. అక్కడ ఫలవృక్ష ప్రకరానికి మధ్యగా ఒక మారేడు చెట్టూ. దానిచుట్టూ ముచ్చటగా కట్టుకున్న ఒక రచ్చదిన్నె దిన్నె, పైన కూర్చుంటూ కొనసాగించారు నరసప్పగారు.

"ఈ బిల్వవృక్ష మేమిటో తెలుసా రాజూ! ముక్కంటికి ప్రీతిపాత్రం గనుక దీనిపేరు హరవిలాసం..."

"ఆ లెక్కన మీ తోటలో ప్రబంధాలన్నీ కూడా ఉన్నట్లేనటండి మేష్టరు గారూ!"

"ఒకనాటి ఉబలాటం కాదురా రాజూ! ఇది పది పన్నెండేళ్ల శ్రమ. దక్షిణ దేశాలకు తీర్థయాత్ర వెళ్ళినప్పుడు శ్రీరంగంనుంచి ఓ పనస మొలకను తీసుకొచ్చాను. అది ఇంతై అంతై ఇలా ఒక పెద్ద చెట్టయింది కావ్యాల్లో ప్రౌఢ కావ్యం ఎలాంటిదో, చెట్లల్లో పనసచెట్టు అలాంటిది. అందుకే దీనిపేరు ఆముక్త మాల్యద. దాని కటువైపున ఉన్న దిల్ఖుముంతమామిడిచెట్టు. మొదలేదో చివరేదో తెలియకుండా అల్లిబిల్లిగా ఓ పొదరిల్లులా గుబురుగా అల్లుకున్న కారణంచేత అది కళాపూర్ణోదయం మరి. ఇటువైపున ఉన్న నిమ్మచెట్ల సమూహమే మనుచరిత్ర. ఎందుకంటే నీరెత్తిననిమ్మ సుస్థిరత్వానికి ప్రతీకంలాంటిది గనుక! నిమ్మవూరుగాయ పైత్యప్రకోపానికి మంచిమందు గూడా! ఉచితానుచితాలను గమనించకుండా దారంట వెళ్తున్న వాడిపైన మోహవికాలను వెదజల్లడం గూడా ఒక భావప్రకోపమే గదా! ప్రవరుని వైఖరి అందుకు విరుగుడు. పోగా ఆ వైపునవున్న బొప్పాయి చెట్ల వరుసే పారిజాతాపహరణం. అందుకు కూడా కారణం లేకపోలేదు. పాదాలు రెండింటిలోనూ వామపాదమే అయివుండాలన్నా పట్టింపులేదు. కుడిపాదంతో తన్నినాసరే, దోరపక్వం దాటిన బొప్పాయిపళ్ళు తటాలున తొటిమనుండి జారి క్రిందపడిపోయి"

"మీరు చెబుతున్న మేరకు సాగుబడి వివరాలింకా పూర్తికాలేదు. మీ కేదారంలో పంటలింకా దండిగా ఉన్నట్టున్నాయి" అన్నాను.

"నిజం. నిజం! ఇంకా శతకాలున్నాయి. వాటిల్లో రెండుతెగలు. భక్తిని పూలమొక్కలకూ, నీతిని కూరగాయల పాదులకూ ప్రత్యేకించాను. ఆ మల్లెపంది

రుంది చూచావా! అది దాశరథి! ప్రతిదానికీ కారణాలు కారణాలంటూ దేవురించ టానికి అలవాటు పడిపోయిన ఈ లోకానికి సంజాయిషీ చెప్పవలసిన అవసరం నాకేముందిరా రాజూ! నేను లోకానికికే మీ బాకీపడి లేను. నా కిది కావాలని లోకాన్ని అడగను. ఐనా కొన్ని కారణాలు హృదయానికి మాత్రమే అందుతాయి. బుద్ధి కందవు. కానీ నీకు మాత్రం గుండెలోతుల్లోని ఆంతర్యాన్ని గూడా విప్పి చెప్పే యాలనే అనిపిస్తోంది. నల్లటి దేవుడికి తెల్లటి పూలైతే బాగుంటా యనుకున్నా ననుకో! అవి నందివర్ధనాలు. నందీశ్వరుడికి మల్లే నందివర్ధనాలు గూడా ధూర్జటికి ప్రియంకరాలు గనుక ఆ పూల మొక్కలపేరు శ్రీకాళహస్తీశ్వరం; గన్నేరుపూలు నరసింహుడి మిడిగుడ్లలా భయంకరంగా వుంటాయి గనుక ఈ గన్నేరు చెట్లపేరు నారసింహం..."

నరసప్పగారు పైకి లేచారు. చెట్లకివలగా వచ్చి కంచెకు దాపునే వున్న గనుమవెంట నడవసాగారు.

"ఇక్కడ కంచె కల్లుకున్న కాకర పాదుంది చూచావా, దీన్ని వేణుగోపాల శతక మనుకున్నాను. "పెట్టనేరని రండ పెక్కునీతుల పెద్ద – మధ్యవైష్ణవునికి నామాలు పెద్ద" అంటూ వరుసగా నిజాలు చెప్పడం ప్రారంభిస్తే నిష్ఠూరంగానే వుంటుంది. నిజం నిష్ఠూరమైనా ఒంటికి మంచిది. కాకరకాయలుగూడా అంతే! అక్కడ కంచెపైనుంచి కానుగచెట్లలోకి అల్లుకున్న చిక్కుళ్ళలో మూడురకాల తీగలు ముప్పేటగా కలిసివున్నాయి – దబ్బ చిక్కుడు, పొడుగు చిక్కుడు, ఎర్ర చిక్కుడు అంటారు వాటిని ! సదుపదేశాల్లో భర్తృహరిసుభాషితాల కున్న స్థానం ఎలాంటిదో, బలవర్ధక ఆహార పదార్థాల్లో చిక్కుళ్ళ కున్న స్థానం అలాంటిది. ఇదిగో, వంగతోట దగ్గరికి వచ్చేశాము. వంకాయలాంటి కూర లేదన్నది నేను చెప్పినమాట కాదు. అనుదినాహారానికి యింతకంటే ఉపయుక్తమైన కూరగాయ మరొకటి లేదు. అందుకే ఈ వంగతోట పేరు సుమతి, అలా చూడు రాజూ, అవే వేమన పద్యాలు."

నరసప్పగారు వేమనపద్యాలంటూ నిర్దేశించి చూపినచోట మిరపచెట్ల పాదు లున్నాయి. జనుల వాడుకలో వాటిపేరు గోలకొండ మిరపకాయలు. చూడ్డాని కవి దమ్మిడీకాసంతవి. నేరకపోయి, ఒక కాయ నోట్లో వేసుకుంటే కారం నసాళాని కంటి, నాలుగు చెంబుల మంచినీళ్ళు గుక్కపట్టి త్రాగేయవలసి వుంటుంది.

ఆపాటికి మేము పంటపొలాలకు దగ్గరగా వచ్చేశాము. కంచెకు లోబడి అర్ధచంద్రాకారం వున్న ఆ పల్లపునేల నాలు గెకరాల విస్తీర్ణ మ్ముంటుంది. రెండంత స్థులుగా ఏర్పాటు చేసివున్న ఆ మాగాణి దిగువభాగంలో వున్నది. చెరుకు తోట: పై భాగమంతా వరిపైరు.

"నా కున్న భూస్థితి యిదేరా రాజూ! కండ గలిగిన నేల కావడంవల్ల శ్రమ పడినకొద్దీ ఫలితం దక్కుతుంది. ఏ పంటయినా బాగా పండుతుంది."

"కృషితో నాస్తి దుర్భిక్షమ్" అన్నారు గదండీ మేష్టరుగారూ! మీ భూమి మీకు బువ్వ పెట్టడాన్ని గురించి నాకు సందేహం లేదు. కానీ ఎటొచ్చీ మీరు నాకు మాత్రం యింతదూరం వెదుక్కుంటూ వచ్చానన్న నెనరయినా లేకుండా అరకొరగానే భోజనం పెట్టారు."

"ఏమిట్రా రాజూ!" తెల్లబోతూ అడిగారు నరసప్పగారు.

"కాకపోతే ఏమిటండీ మేష్టరుగారూ! విస్తరిమాత్రం పెద్దదిగానే వేశారు. కొబ్బరి దగ్గరినుంచీ ప్రారంభించి అరటి, మామిడి, నిమ్మ అంటూ కొన్ని పళ్లు వడ్డించి, కాకర, వంకాయ, మిరప వగైరా కూరగాయలతోనే సరిపెడుతూ, అదే భోజనమంటే ఎలా కుదురుతుంది!"

"భలేవాడివిరా రాజూ! మిగిలిన సాదృశ్యాలు నీ వూహకే వదిలిపెడదా మను కున్నాను. ఈ పొలంలో చెరకుతోట లేకపోలేదు! ద్విపదల దగ్గరినుంచీ ప్రారంభించి గేయవాఙ్మయమంతా చెరకుతోటే ననుకోరాదా? వరిపైరు కళ్ళకు కొట్టవచ్చి నట్టుగా కనిపిస్తూనే వుందిగదా! ఎవరి ఆకలికి తగినట్టుగా వారి రోజుల్లో సేవిస్తున్న కథలు, నవలలు మొదలైనవన్నీ ఈ వరిపంట క్రిందనే జమకట్టుకోగూడదా?"

"ఇప్పుడైనా మీరు పెట్టింది సంపూర్ణాహారమనిపించుకోదు. ఎలాగంటారా మేష్టరుగారూ! ఏదీ చూపించండి చూద్దాం; డిటెక్టివ్ సాహిత్యం ఎక్కడ?"

ప్రయత్నించని దోషం నాది కాదురా రాజూ! ఈ పొలాల్లో ఆ పంట మాత్రం పండింది గాదు, జీవితంలో నాకు నెరవేరని కోరికలు రెండే! మొదటిది: తీరామారా ఒక డిటెక్టివ్ నవలను లేదా బూతు నవలను చదివి ముగించడం, రెండోది: ఈ పొలంలో పొగాకు పండించడం..."

ఆ దెబ్బనుంచి నేనింకా కోలుకోనే లేదు. నరసప్పగారు చురకపైన మళ్ళీ ఒక చురక అంటించారు.

"ఐనా నాకు తెలియక అడుగుతానురా రాజూ! మీ ఆధునికులు పొగాకును గూడా ఆహారపదార్థం క్రింద లెక్క గట్టేశారా ఏమిటి?"

నరసప్పగారు నవ్వసాగారు. ఆ బోసినోటి నవ్వులు ఓ వెలుగు వెలిగి ఆరి పోయేసరికి చుట్టూరా చిమ్మచీకటే మిగిలింది.

"క్షణాల్లో చీకటి పడిపోయింది. నువ్వు ముందుకొచ్చి నాకు కాస్త దారి చూపించాలిరా రాజూ!"

చీకటిలో సన్నటి గనుమలపైన నడవడం సర్కస్ ఫీట్ లాంటిపని. కంచె దాటుకుని డొంకదారిలోకి వచ్చేసరికి పదినిమిషాలు పట్టింది. ఉండి వుండీ నరసప్ప గారొకమాట అన్నారు.

"ఏదో మాటవరుసకు కర్తృత్వాన్నంతా నా పైన వేసుకున్నా నంతేగా నీ పొలాలు సాగుచేయడానికి ఈ శరీరంలో జవసత్వా లెక్కడున్నాయిరా రాజూ! జీవశక్తిలో ఎక్కువ భాగాన్ని నే నం సాహిత్యానికే ధారపోశానో, ఈ పొలాలకే ధారపోశానో ఆ భగవంతుడికే ఎరుక !"

ఏ పూర్వస్మృతుల్లో మునిగిపోయారో గానీ ఆయన మళ్ళీ మౌనం వహించారు.

తూట్లుపడిన నల్లటి డేరాలాంటి ఆకాశం క్రింద ఈవలా ఆవలా దట్టంగా అల్లుకున్న పొదలమధ్య సన్నటి దారిగుండా నడుస్తున్నాము. దగ్గరలో ఎక్కడో కీచురాళ్ళు గీ పెడుతున్న సవ్వడి, పొదల్లో ఏదో సర్రున జారిపోతున్న అలికిడి. అంతకు మినహాగా స్తబ్ధమైపోయినట్లున్న ఆ నీరవప్రకృతిసీమలో మా అడుగుల సవ్వడిగూడా మాకు స్పష్టంగా వినిపిస్తోంది.

ఉన్నట్టుండి నరసప్పగారు "ఇష్షబ్బా!" అంటూ నిట్టూర్చినట్టుగా తోచి వెనుదిరిగి చూచాను.

అడ్డుతగిలిన రాతికి తాకడంతో బొటనవ్రేలికి బాగా దెబ్బ తగిలినట్టుంది. మడిమలదగ్గర కాలిన నొక్కి పట్టుకుని ఆయన బాధను దిగమ్రింగుకుంటున్నారు.

"బలంగా తగల్లేదు కదండీ?" వంగి చూస్తూ అడిగాను.

"ఫరవాలేదు. చిన్నదెబ్బే. గోరు కాస్తా ఎగిరిపోయినట్టుంది. ఐనా ఈ మాత్రం దెబ్బకే తట్టుకోలేకపోతే ఇక జీవితంలో తల బొప్పెలుకట్టే ఎదురుదెబ్బల మాట ఏమిటి? ఈ మధ్య చూపు తిన్నగా ఆనడంలేదు. ప్రొద్దుండగానే గూడు చేరుకునేవాణ్ణి. ఆలస్యమైతే నరిసింహులంటే మా పాలేరు. భూతపతికి బృంగిరిటిలా నాకు నరసింహులు దొరికాడు. గంపెడు బిడ్డల సంసారం వాడిది. 'బిడ్డ లెందరురా నరసింహులూ,' అంటే లెక్కమని చెప్పలేడుగానీ, నిమ్మచెట్లో ఒక కాయ తగ్గితే చప్పున పసిగట్టగలడు...."

ఊరు దగ్గరపడింది.

సందు మొగదలలోనే భర్త రాకకోసం వేచి చూస్తోంది తులశమ్మ.

"ఎంతగా అబ్బాయితో మాటల్లో పడితేమాత్రం ప్రొద్దు పోయేదీ వచ్చేదీ తెలియదటండీ?"

"నిజంగానే తెలిసింది గాదు ఒకవేళ తెలిసినా తోడుగా అబ్బాయి ఉన్నాడు గనుక మరేం భయం లేదనుకున్నానేమో?"

"మంచిపని చేశారు గానీ పొంతపైన వేడినీళ్ళున్నాయి. కాళ్లు చేతులు కడుక్కుని మీ పనులన్నీ ముగించండి. భోజనాలు వడ్డిస్తాను..."

అవతల బంధువు నా కోసం వేచివుంటాడు గనుక భోజనానంతరం కలుసుకుంటానని చెప్పి సెలవు తీసికోడానికి ప్రయత్నించాను.

నరసప్పగారు ససేమిరా వీల్లేదు అన్నారు. "బాగుందిలే వరస. పొలాల్లో వుత్తుత్తి భోజనం పెట్టి, నిజం భోజనం మాట వచ్చేసరికి నిన్ను వదిలించుకోమంటావుట్రా రాజూ! అదేం వీలు కాదు. ఈ ఊరిలో మాకు ఏడేళ్ళకుగాని ఒక అతిథి... దొరకడు. ఈ పూట నువ్విక్కడే భోజనం చేయాలి..."

పెరట్లోకి వెళ్ళి ముఖ ప్రక్షాళనం గావించుకుని తిరిగి వచ్చారు నరసప్పగారు. అది అయిదంకణాల పూరిల్లు. అందులో రెండొంకణాల మేరకు అవొకగదిగా ప్రత్యేకింపబడింది. తలుపు త్రోసి "అడుగుపెడుతూ వస్తావుట్రా రాజూ!" అన్నారు.

లోపలికి ప్రవేశించకమునుపే అది దేవరిల్లులాంటిదని అర్థమైంది. కానీ దాని నంత నిండుగా సంతరించుకోడానికి వెనుకనున్న ప్రయత్నం ఏ పాటిదన్న విషయం లోపలికి వెళ్ళిన తర్వాతగానీ తెలిసింది గాదు. ద్వారానికెదురుగా ఉన్న గోడ కానుకుని గోడ పొడుగునా ఒక సన్నటి అరుగు. ఆ అరుగుపైన ఈ చివర పరమశివుని పాలరాతి విగ్రహం; ఆ చివర కరుణారసం రూపుదాల్చినట్లున్న బుద్ధభగవానుడి సుందరమూర్తి: మధ్యలో సీతాలక్ష్మణ సహితుడైన కోదండ రాముడు. ఆ రాముని పాద సన్నిధిలో మోకరించి కూర్చున్నట్లున్న హనుమద్విగ్రహం. ఇవిగాక మహత్తర పౌరాణిక సంఘటనలను జ్ఞప్తికి తెస్తూ గంగావతరణం, గోవర్ధనోద్ధరణా, శివధనుర్భంగం, గీతా ప్రబోధంలాంటి పటాలు గోడలకు వ్రేలాడుతున్నాయి.

కానీ నా చూపు లెంతోసేపు ఆ దేవతామూర్తులపైన నిలిచి వుండలేదు. గదిలో ఒక గోడను పూర్తిగా దృక్పథం నుంచి తప్పించివేస్తూ నిల్చున్న బీరువాల్లో అందంగా అట్టలు తొడుక్కుని, ముచ్చటగా నామాక్షరాలు లిఖింపబడి, ఇతిహాసాలనుండి శతకాలవరకూ విస్తరించివున్న పుస్తకాల ప్రపంచం-అదొక సరస్వతీ సామ్రాజ్యంలా కనిపిస్తోంది.

నరసప్పగారు దీపాలు వెలిగించారు. అగరువత్తులు ముట్టించారు. ఒకటి రెండు నిమిషాలపాటు అర్ధనిమీలిత నేత్రాలతో నిశ్చలంగా ఉండిపోయి, తర్వాత హఠాత్తుగా తలపైకెత్తి నావైపు చూచారు.

ఆ చూచిన చూపుల్లో ఏదో చెప్పదలచుకున్నారన్న ఇంగితం స్ఫురించింది.

"ఏమిటండీ మేష్టరుగారూ!" అనబోయాను. కానీ అనలేదు.

"జీవితంలో ఏ సమస్యకైతే పరిష్కారాన్ని ఊహించలేకపోయానో, దానికీనాడు పరిష్కారం కుదిరింది."

అర్థం కావడం లేదు.

"చూస్తున్నావుగా! నా వయసుడిగిపోయింది. నన్ను నమ్ముకున్న వాళ్ళకందరికీ నేను వేరొక ఆశ్రయాన్ని చూపించవలసిన సమయం సమాసన్నమైంది. ముదిమిలో తల్లిదండ్రులకు బిడ్డలే దిక్కు. నాకా బిడ్డలు లేరు. మా ఆవిడకు

పొలాన్ని చూపించి వెళ్తున్నాను. ఆపొలాలకు నరసింహుల్ని చూపించి వెళ్తున్నాను. ఎటొచ్చీ ఈ పుస్తకాల విషయమే నా కొక సమస్యగా వుండిపోయింది."

అర్థంగాక అయోమయంగానే ఆయనవంక చూస్తున్నాను.

"నా దొక అజ్ఞాత ప్రపంచం. నా చిరునామా అయినా నీకు తెలియదు. భగవంతుడిలా నిన్నిక్కడికి లాక్కొచ్చాడంటే యిది నిష్కారణంగా జరిగి వుంటుందనుకోను."

దగ్గరగా వచ్చి నా చేతులు రెండింటినీ తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నారు—

"వీటిని నీ కప్పగిస్తున్నాను. నా పుస్తకాలను ప్రాణప్రదంగా చూచుకుంటావా రాజూ?"

నరసప్పగారి కంఠం గాద్గదికం అయిపోయింది.

—"యువ" మాసపత్రిక – 1968

—o—

# బెరాపీటరు

"రెస్పెక్టెడ్ సార్.

తన చివరిరోజులో ఒక మంత్రి సత్తముడు "ఈ రాచరికానికి సేవ చేసినంత చిత్తశుద్ధితో భగవంతుణ్ని గనుక సేవించివుంటే నా కి దుస్థితి వాటిల్లి వుండ" దని దురపిల్లినట్టు చరిత్రలో ఓ కథ వుంది. హోదాలోగానీ, అనుభవంలో గాని ఆ మంత్రివర్యునికీ నాకూ వున్న పోలిక చాలా తక్కువ. కానీ అతడు జీవితాంతమూ పరిశ్రమించి తెలుసుకున్న పరమసత్యాన్ని నా అయిదేండ్ల ఉద్యోగానుభవంలోనే తెలుసుకో గలిగినందుకు నాకెంతో సంతోషంగా వుంది. ఉరకలు వేసే జీవనోత్సాహం ఉద్యోగ మన్న మరుభూమిలో యింకిపోతుండగా, నాలుగు కాళ్ళ కొయ్య కుర్చీకి బ్రతుకును అంకితం చేసినందుకు నా కీ రోజున సరైన ప్రతిఫలం లభించింది. వింతలూ, వినోదాలు, సినిమాలు, నాటకాలు, మిత్రులతో షికార్లు, కళ్ళల్లో దీపాలు వెలిగించుకుని గడప దగ్గర నిల్చుని ఎదురు తెన్నులు చూచే పడుచు భార్యతో సల్లాపాలు-యిలాంటి ఆకర్షణలెన్నో బయటి ప్రపంచంలో చేతులెత్తి పిలుస్తుండగా, రాతిగోడల మధ్య, గుడ్డిలాంతరు వెలుగులో లెక్క లేనన్ని రాత్రులు శివరాత్రి జాగరణ చేసిన నేను ఈ రోజున ప్రభుత్వ ద్రవ్యాన్ని తేరకు తింటూ కూచునే సోమరి పోతుల్లో ఒకణ్ణిగా లెక్కింపబడ్డాను. సరిగా పనిచేయక పోయినా చేసినట్టు నటిస్తూ, ఒళ్ళువంచి పని చేసేవాడిని ఈసడించే సహోద్యోగులు మీ తిట్లూ, చీదరింపులూ నాపైన విరుచుక పడుతుండగా ముసిముసి నవ్వులు నవ్వుకున్న ఘట్టం నా కెన్నటికీ మరపురాదు. ఇంటికి వచ్చిన కూలివాడు గూడా మనం హీనంగా మాట్లాడినప్పుడు కూలీ డబ్బులు ముఖాన విసిరికొట్టి తిరిగి చూడకుండా వెళ్ళిపోతాడు. గుమాస్తా అన్నవాడిలో అభిమానం బొత్తిగా మృగ్యమని భావించడం మీ తీవ్రమైన పొరబాటు. ఇది నా రాజీనామా, స్వీకరించండి. సెలవు.

ఇట్లు,

విధేయుడు, సుందరం."

రాజీనామాకు నకలుగా వ్రాసివుంచుకున్న ఆ కాగితాన్ని లైటు స్తంభానికి ఆనుకునిసుందరం మరొకసారి కసిగా చదువుకున్నాడు. ఈపాటికది ఆ ఆఫీసరుగారి కళ్ళపడి వుంటుంది. అతడి అహంభావం, ఆగ్రహం, అజ్ఞత్వం — వీటిపైన కాళీయుని పడగలమీద బాల కృష్ణుడిలా నాట్యమాడుతూ తను అతడి మనోవీధిలో తాండవిస్తుంటాడు!

ఆ ఆవేశంలో చెదిరిపోయి కళ్ళపైన బడుతున్న వెంట్రుకలను వెనక్కు విదిలించుకుని సుందరం ముందుకు సాగాడు. ఉదయం పదిగంటల కెప్పుడో పట్టెడన్నం తిన్న తర్వాత పచ్చి మంచినీళ్లు గూడా గొంతుక వెంట దిగని కార ణాన శోషిల్లి, సొమ్మసిల్లిపోతున్న అతడి శరీరాన్ని ఆ ఆవేశమే ముందుకు నెట్టుకుపోతోంది. కార్యాలయంలో ఆఫీసరు గారితో ఘర్షణ జరిగింది సరిగ్గా పన్నెండు గంటలప్పుడు. రాజీనామా వ్రాసి ముగించింది ఒంటిగంటకు. ఆ కాగితాన్ని పాడ్‌లో బిగించి, ఆ పాడ్‌ను ఆఫీసరుగారి సముఖానికి తీసుకెళ్ళమని చెప్పి అతడు ఒకటీ అయిదుకల్లా వీధిలోకి వచ్చేశాడు. అప్పటి నుంచీ అతడు వీధుల్లోనే వున్నాడు!

సుందరం ఆ మండుటెండలో ఆఫీసునుంచి రైల్వేస్టేషను దాకా నడిచాడు. మూడవక్లాసు ప్రయాణీకుల వెయిటింగు రూములో కాసేపు పచార్లు చేశాడు. ప్లాటు ఫారంపైన గానుగ చెట్టుక్రింద కూచుని వేమన యోగిలా నిస్సారమైన జీవితాన్ని గురించి తలపోశాడు. ఊహు, ఎంతగా నిగ్రహించుకోబోయినా మనసొక చోట నిలచేటట్టులేదు. మళ్ళీలేచాడు. బస్సుస్టాండు వరకూ నడిచాడు. అక్కడి నుంచి కాళ్ళు బజారులోకి లాక్కొచ్చాయి. గంట అయిదు కావస్తోంది. సుందరం నడు స్తూనే వున్నాడు.

ఉన్నట్టుండి ఓ మంగలిషాపు దగ్గర నిలబడిపోయాడు సుందరం. నిలువు టద్దంలో ప్రతిబింబం ద్యోతకమైంది. వారంరోజులుగా గీక్కోని గడ్డంలోనుంచి ముఖం వికృతంగా కనిపిస్తోంది. ఈ వికృత పరిణామానికి పెరిగిన గడ్డ మొక్కటే కారణం గాదు! వీధుల్లో లేచిన బూడిద దుమ్మంతా తన ముఖంలోనే వుంది. పొడిపొడిగా వీచిన వేడిగాడ్పులకు తన ముఖమే రంగస్థలమైంది...ఒక్క మధ్యాహ్నంలోనే ఎంత మార్పు! అవును మరి. తనిప్పుడు ఉద్యోగంలేని సుంద రం. ఉద్యోగం లేని సుందరం యిలా తయారుగాక మరేమౌతాడు ?

సుందరంలోని ఆవేశం క్షణంలో అణగారిపోయింది. అతడు నిలువునాక్రుంగి పోయాడు. నాలుక పిడచగట్టుకపోతోంది. ఒక కప్పు కాఫీ దొరికితే బాగుండును! సుందరం జేబులో చేయి వేశాడు. జేబు శూన్యంగా వుంది. ఇంటి దగ్గరనుంచి బయల్దేరుతూ, ఆ తొందరలో పర్సు తీసుకోడం మరచిపోయాడు.. ఇంటికివెళ్తే పంకజం కాఫీ యివ్వలేకపోదు. ఒక వేళ యింట్లో పాలు లేకపోయినా ఏ యిరుగింటి పొరుగింటి వాళ్ళనో ప్రాధేయపడి అయిదు నిమిషాల్లో కాఫీ సిద్ధం చేయడం ఆమె చేతనౌను. కానీ తను యింటికి వెళ్ళలేడు!

సుందరం యింటికి వెళ్ళలేకపోతున్నందుకు కారణం అతడు ఉద్యోగాన్ని పోగొట్టుకోడం మాత్రంగాదు. అందుకు కారణం మరొకటి—

ఆ దురవస్థను, ఆ యాతననూ, ఆ దృశ్యాన్ని చూస్తూ యింట్లో కూచోలేడు, నిల్చోలేడు, వుండలేడు సుందరం!

హృదయాన్ని రాచిరంపానబెట్టే ఆ దృశ్యాన్ని చూస్తూ "భగవంతుడా! ఈ నోరులేని పసివాడికీశిక్ష విధించావెందుకు బాబూ? అని బిగ్గరగా ప్రశ్నిస్తూ గోడకు తలబాదుకోవాలనుకున్నాడు సుందరం,

డాక్టర్లు చూచారు. ఇదింతే నన్నారు. మంత్రగాళ్ళు మంత్రించారు. అంత్రాలు, 'తీర్చడాలు' మున్నగు తాంత్రిక క్రియలు యధావిధిగా జరిగిపోయాయి. అమ్మలక్కలు మనం చేయగలిగిం దింతే నంటారు.

ఈపాటి కెలావుందో? సుందరం తహతహలాడిపోయాడు. కానీ తను వెళ్ళి చేయగలిందేమీ లేదు. లేదంటే ఏడవొచ్చు. తల బాదుకోవచ్చు.

సుందరానికి తను పార్కులో కెలా వచ్చాడో తెలియదు. చేతిని తలగడగా వుంచుకుని ఓ మారుమూల బెంచీపైకి ఎలా వాలిపోయాడో తెలియదు. అతడి మనోవీధిలో గడచిపోయిన సంఘటనలు ఒకదాని వెంబడి ఒకటిగా ప్రతిఫలించి అంతలో మాసిపోసాగాయి.

* * *

రెపరెపలాడుతున్న సిల్కు చీరలో, సిగ్గుతో ఒదుగుళ్లుపోతూ పచ్చి పసుపు కొమ్ముని చిదిమి చేసిన బొమ్మలా పెళ్ళిపీటపైన తన ప్రక్కన కూచున్న పదహారేళ్ళ అమ్మాయి—ఆవిడే పంకజం!

మంగళకరమైన సన్నాయిమేళం అగరువత్తుల ధూపంలా హాయి హాయిగా పచ్చని పందిరిక్రింద వలయాలు తిరుగుతుండగా, బంధువుల నవ్వుల కలకలల మధ్య, చేమంతిపూల సువాసనలమధ్య తననూ, పంకజాన్ని అగ్నిసాక్షిగా రాగ బంధంతో జతచేసిన ఆ వివాహం, రెండేళ్ళక్రితం జరిగిన సంఘటన.

"తరులు చివురించి, పూవులు పరిమళించు, నవ వసంతమ్ముతోబాటు నడచి వచ్చె—నీదు గృహలక్ష్మి" అంటూ తననూ, పంకజాన్నీ ఆశీర్వదించాడు ఓ కవి కుమారుడు. నిజమే! ఏకాంతంలో పంకజం కళ్లలోకి చూస్తే, ఆ కళ్లు తనతో నీ జీవితాన్ని ఆకుల్‌రాలని పూలువాడని వసంతారామం చేయగలమని బాసలు పలికేవి!

ఆఫీసునుంచి తను యింటికి రావడం కాస్తాలస్యమైతే పెదవులు బిగించుకుని పంకజం కాసేపు మాట్లాడకుండా హఠం చేసేది. ప్రమోషనులన్న ఊర్ధ్వలోకాల పైన్నే దృష్టి నిలిపినవాడు. తోడుకోడళ్ళలాంటి సహోద్యోగులమధ్య, అత్తగారి లాంటి ఆఫీసరుగారి పర్యవేక్షణ క్రింద మెలగుతున్నవాడు, గుట్టలుగా పేరిపో తున్న ఫైళ్ళకాంతారంలో దిక్కులు తోచనివాడూ అయిన ఒక యల్.డి.గుమాస్తా అయిదుకే ఆఫీసునుంచి బయటపడడం ఎంత కష్టసాధ్యమైన పనో పంకజానికి తెలియదు!

ఎంతో ప్రాధేయపడిన తర్వాత, ఆలస్యానికి కారణాలు విశదీకరించుకున్న తర్వాత పంకజం పెదవి కదిపేది. ఆమె మాట్లాడుతుంటే, తన హృదయవీణ పైన మధుర మధురంగా ఓ దివ్యగీతిక రవళించినట్లుండేది. ఆమె నవ్వితే వెన్నెల వెలుగులు కెరళ్ళు కెరళ్ళుగా వచ్చి తనను అభిషేకించినట్లు, లక్ష మల్లెపువ్వులు జల్లుజల్లుమని పైన రాలినట్టు తను పరవశించిపోయేవాడు.

ఐతే అలా ఆనందాత్మకంగా గడచిపోయినవి కొద్ది రోజులు మాత్రమే! మెల్లమెల్లగా కోడంటికం ప్రారంభమైంది.

ప్రారంభంలో మందకొడిగా వున్నప్పటికి అది యువతలివాళ్ళ మెత్తదనాన్ని పసిగట్టడంతో క్షణక్షణానికీ విజృంభించి పోయింది.

సాయంత్రం కాగానే అమ్మ దేవాలయానికి వెళ్ళిపోతుంది. నాన్నగారు ఎదు రింటి అరుగుపైన చదరంగానికి కూర్చుంటారు. వదిన లేడీసు క్లబ్బులో యాక్టివు మెంబరు. అందుచేత ఆమె ప్రతిరోజూ క్లబ్బుకు వెళ్లక తప్పదు. ఇక అన్నయ్య

సంగతి సరేసరి! మిత్రులూ, షికార్లు ఆయన్ను వూళ్లోనుంచీ ఎంతదూరమైనా లాక్కెళ్ళవచ్చు. వీళ్ళందరూ ఏ పది పదకొండుకో యిల్లు చేరుకుంటాడు. అందాకా పంకజానికి పని తీరదు!

ఆ తరువాత చెప్పుకోవలసింది భోజనాల దగ్గర జరిగే హంగామా. జూన్ నెలలో పెళ్ళికాబోతున్నదన్న పంకజం మార్చి నెలదాకా చదువుకున్న మాట నిజమే. కానీ ఆమె చదువుకున్నది పాకశాస్త్రం మాత్రం కాదు. అందువల్ల అప్పుడప్పుడూ వంటలో పొరబాట్లు దొర్లిపోయేవి. ఒక రోజు కూరలో ఉప్పు ఎక్కువయ్యేది. ఆ కూరను తలా కొంచెం వడ్డించి, వాళ్ళు తినలేక మూతి చిట్లించుకుంటూవుంటే అమ్మ కోడలి విద్యాపాటవాన్ని అవహేళన చేసేది. ఒక రోజు అన్నం చిమిడిపోయేది. చిమిడిపోయిన అన్నం భర్తకు దిగదని వదిన కారియర్ యిచ్చి పొరుగింటి కుర్రాణ్ణి హోటలుకు పంపేది.

పొగనిండిన వంటగదిలో పొయిలో తలబెట్టి బుగ్గలు పూరించి పంకజం ఉఫ్‌వుఫ్ అంటూ ఒకానొక యోగాసనం లాంటి దురవస్థలో సతమతమౌతూవుంటే, తను గదిలో కూచుని ఆలోచనలో పడిపోయేవాడు. పత్రికలు చదువుకుంటూ, పాటలు పాడుకుంటూ, పావడాపైన దావిణీ వేసుకుని పూలకొమ్మలా తిరుగుతూ వుండిన ఓ పదహారేళ్ళ అమ్మాయిని పట్టి తెచ్చి వంటగదిలో నిర్బంధించి, రాత్రి పదిగంటల దాకా వూపిరి సలుపని నిర్విరామ కార్యక్రమాలను ఆమె తలపైన రుద్ది యిలా పీడించడం చాలా అన్యాయం అనిపించేది. ఇంత తలకు మించిన పనైతే, దాసీ మనిషి గూడా చెప్పకుండా పారిపోతుంది. ఐతే కట్టుకున్న భార్య పనిమనిషికన్నా హీనమా!....పంకజం కాపురానికి వచ్చిన తర్వాత వారాలు, నెలలు గడిచిపోయాయి. ఇంతవరకూ తనామెను ఒక్క సినిమాకు తీసుకెళ్లలేదు. 'పోనీ మీరు వెళ్ళిరాకూడదా' అంటుంది పంకజం. ఎందుకు? వెనక్కు తిరిగి ఫస్టు క్లాసులో జంటలు జంటలుగా బారులు తీరే ఆలూమగళ్లని చూడ్డానికా తను సినిమాకు వెళ్ళడం? ఇంట్లో కూచుని యిలస్ట్రేటెడ్ వీక్లీ తిప్పితే చాలు, ఆ సరదా తీరిపోతుంది. సైకిళ్లలో, కార్లలో, రైళ్ళలో వెళ్ళింది చాలదని ఒక్కొక్క సినిమాలో ఒక్కొక్క రకంగా పడవషికారు సాగించే నాయకీ నాయకుల్ని చూడ్డానికా తను సినిమాకు వెళ్ళడం ? ఈ పుస్తకాలు, సినిమాలు, నాటకాలు—ఇవన్నీ యిసుకలో పడుకున్న మానవులకు పసిడి మేడలు చూపిస్తున్నాయి.

ఆఫీసునుంచీ యింటికి రాగానే తను పంకజం ముఖంలోకి చూచేవాడు. గృహ వాతావరణం ఎంత భీభత్సంగా వుందో ఆ ముఖాన్ని చూడగానే అవగతమై పోయేది.

సుడిగాలిలాంటి రాద్ధాంత సిద్ధాంతాలు, యిసుక తుఫానులాంటి దురుసు మాటలు మితిమీరిన కొద్దీ పంకజం ముఖంలో దుఃఖమే గూడుకట్టుకుంది.

ఈ సమస్యను గడచి గట్టెక్కడానికి వున్నదొక్క తరణోపాయమే? అదేమిటో తనకు తెలుసు. దాన్ని ఆచరణలో పెట్టడంలో గూడా తను కొంత నాజూకు పద్ధతిని అవలంబించాడు. పంకజం ప్రసవానికి పుట్టింటికి వెళ్ళిన తర్వాత తనకు ట్రాన్స్ఫరు వచ్చింది. తనీ వూరికి వచ్చి ఆలుమగళ్ళిద్దరికి సరిపోయేటట్లుగా ముచ్చటగా చిన్నయిల్లొకటి అద్దెకు కుదుర్చుకున్నాడు. బాబుకు మూడోనెల జరుగుతుండగా పంకజం సరాసరి సరిక్రొత్త కాపురానికే వచ్చేసింది !

నాలుగైదు నెలలపాటు మున్నెన్నడూ అనుభవానికి రాని ప్రశాంత పరిస్థితుల మధ్య రోజులు నిశ్చింతగా దొర్లిపోయాయి.

గడచిన పదిరోజులుగా యింటికి వెళ్ళగానే బాబు ముఖాన్ని చూస్తున్నాడు సుందరం. ఆశ్చర్యకరంగా గృహవాతావరణాన్ని సూచించే బెరామీటరు తన స్థానాన్ని పంకజం ముఖంలోనుంచీ బాబు ముఖంలోకి మార్చుకుంది. వాడు బోసి నోటితో నవ్వితే పూలతోటపైనుంచి మలయమారుతం వీచినట్టుంటుంది. ఇతరుల కర్థంగాని బాధతో వాడు దీనంగా ఏడుస్తుంటే గూబలో గిపెడుతూ ఈదర గాలి బుసకొట్టినట్టుంటుంది.

బాబుకు ఆరోగ్యం పాడైనప్పటినుంచీ తనకూ పంకజానికీ మనసు వికలమైపోయింది. ఆలోచనలు పరిపరి విధాల పరుగెడుతున్నాయి... కలిగినంతలో సంతృప్తిగా జీవించడంకన్నా మానవుడికి కావలసిందేమీ లేదు. కానీ ఈ కనీసపు కోరిక ఫలించడానికి అడుగడుగునా ఆటంకాలు సంభవిస్తాయి. మగవాడికైనా, ఆడదానికైనా వివాహం కాకపోవడం ఒక పెద్దలోటే! కానీ కుమారుడి పెళ్ళయి, కొత్త కోడలు యింటికి రాగానే అతడు శత్రు గుడారంలో చేరిపోయినట్టు తల్లిదండ్రులకు ఒక చిత్రమైన భావన కలుగుతోంది. ఆ భావన అంతరాంతరాల్లో దాగివుండి; కోడల్ని ఆరడి పెట్టే మనః ప్రవృత్తిని వాళ్ళలో రగులుకొల్పుతోంది. తన తల్లిదండ్రుల్ని వదిలిపెట్టి, తనను నమ్ముకుని, తనకే జీవిత సర్వస్వాన్ని

సమర్పించిన అర్ధాంగి సుఖాన్ని భర్త వాంఛించడం అసహజమేమీ కాదు. ఇందు వల్లనే కాపురాలు వేరవుతున్నాయి. కానీ వేరుకాపురం పెట్టడంతో సమస్యలు తీరి పోయేటట్టు లేదు. అసలు మానవ జీవితన్ని ఎదుర్కొంటున్న సాంసారిక, సామా జిక సమస్యలు ఒక స్థలానికీ, ఒక సమయానికి పరిమితమైనవిగా కనిపించడం లేదు. ఇవెప్పుడూ వున్నాయి. ఎక్కడా వున్నాయి. లేకుంటే ఈ పసివాడికి వున్నట్టుండి ఆరోగ్యం చెడిపోవడమేమిటి? పది రోజులుగా రోజుకొక్క వైద్య సహాయాన్ని అర్థిస్తున్నా యింకా నయం కాకపోవడమేమిటి? అదే నయమవు తుందని మనసును కుదుటపరచుకోలేక ఈవిడ కుమిలిపోతూ నీళ్ళూ ముట్టుకోక సత్యాగ్రహం చేయడమేమిటి? ఇవన్నీ చాలనట్టు గోరుచుట్టుపైన రోకలిపోటులా ఈ రోజు ఆఫీసరుగారు అకారణంగా అగ్గిరాముడు గావడ మేమిటి? ఏమిటి పరిశోధన?...

* * *

"లేవండి బాబూ! గేటు వేసేయాలి" అన్న తోటమాలి ఎలుగు విని వులికి పడి లేచి కూచున్నాడు సుందరం.

"కచేరీలో తొమ్మిదికూడా కొట్టేశారు బాబూ! గేటు వేసేయాలి" అన్నాడు తోట కాపరి.

సుందరానికి గుండె గుభేలుమంది. తొమ్మిది గంటలకు కూడా యింటి ముఖం తిరిగి చూడనందుకు పంకజానికి ఏం సంజాయిషీ చెప్పుకోవాలి ?

సుందరం పార్కులోనుంచి గాలిలా రోడ్డు పైకి వచ్చాడు. ఇల్లు సమీప మవుతున్నకొద్దీ అతడి గమనవేగం హెచ్చింది. ఇప్పుడతనికి ఉద్యోగం పోయిం దన్న దిగులులేదు! బాబుకు ఆరోగ్యం చక్కబడితే చాలు.

ద్వారం దగ్గరే నిల్చుని తనకోసం ఎదురు చూస్తోంది పంకజం.

"బాబు కెలావుంది పంకజం?" సుందరం గొంతుకలో తడబాటు, నిస్స హాయత, ఏమైందోనన్న భయమూ ముప్పేటగా ధ్వనించాయి.

"అంత మాత్రం అక్కరుందని నాకు తెలుసు లెండి! అదికాదు, ఎందు కింత ఆలస్యం ?" ముద్దాయిని విచారిస్తున్న న్యాయమూర్తిలా ప్రశ్నించింది పంకజం.

"మరి...మరి..."

"మరీ లేదు, గిరీ లేదు. మధ్యాహ్నం బండికి వూరినుంచి అత్తయ్య వచ్చింది."

"మా అమ్మే ! ఎలా వచ్చింది పంకజం ? నేను జాబైనా వ్రాయలేదే!"

"బిడ్డకు జబ్బుగా వుందని ఎవరో చెప్పారట."

సుందరం అడుగు ముందుకు వేయడానికి సాహసించలేకపోయాడు. లోపలికివెళ్తే తల్లి ఎదురౌతుంది. ఎంతయినా ఆమె తల్లి ! వేరు కాపురం పెట్టే శాము గదా అని ఏరు దాటిన తర్వాత తెప్ప తగలేసినట్టు జాబుగూడా వ్రాయనందుకు ఆమె ఎంత బాధపడి వుంటుంది? తను ఒక్క భార్య ఎదుట మాత్రమే గాదు— తల్లి ఎదుటగూడా ముద్దాయే!

ఆఖరుకు సుందరం తెగువచేసి లోపలికి వెళ్ళాడు. "అదేమిటమ్మా? ఇన్ని నాళ్ళకు నువ్వొక్క దానివి మాత్రమే వచ్చావు; నాన్నగారు రాలేకపోయారా?" అన్నాడు.

"ఇప్పుడైనా నువ్వేమన్నా రమ్మన్నావుట్రా బాబూ! నాకు నేనయ్యేగదా వచ్చాను!" అంది పార్వతమ్మ.

సుందరానికి తల కొట్టేసినంత పనయింది.

"రమ్మంటే కానీ రానని పంతం పట్టడానికి యిదేమైనా నాకు పరాయి వాళ్ళ యిల్లేమిటి? అది గాదురా సుందరం ! ఓ గుప్పెడు నీరు సాంబ్రాణి ఆకు దెచ్చి, కాస్త కటకరేణి కలిపిపోస్తే పోయేదానికి యింతగా జబ్బు ముదర బెట్టేవాళ్లెక్కడైనా వుంటారా? మధ్యాహ్నం రాగానే పాల్లో రంగరించి పోశానోలేదో, బిడ్డ ఎంత నెమ్మదిగా నిద్రపోతున్నాడనీ..."

ఇదికూడా నిజమే ? సుందరం వూయల దగ్గరికివెళ్ళి చూచాడు గదా, బాబిగాడు వటపత్రశాయిలా హాయిగా నిద్రపోతున్నాడు.

* * *

భోజనం కాగానే సుందరం కిళ్ళీకోసం అంగడికి బయల్దేరాడు.

"అలాగే చక్కెరగూడా తీసుకురండి. తెల్లవారితే కాఫీకి గూడాలేదు. ఆ పాటికి అంగళ్ళుగూడా తెరవరు" అని పురమాయించింది పంకజం.

సుందరం వీధిలో నడుస్తూ పర్సుతీసి చూచుకున్నాడు. అట్టడుగున అయిదారు చిల్లర డబ్బులున్నాయి. పై సొరుగులో ఒక అయిదు రూపాయల నోటు, రెండు రూపాయనోట్లు వున్నాయి. మొత్తం ఎనిమిది రూపాయలకంటే మించదన్నమాట! ఈ డబ్బుతో కాపురం ఎంతకాలం కొనసాగుతుంది? ఆ తరువాత తన గతేం కావాలి? ఉద్యోగం పోయిందని తెలిస్తే నాన్నగారేమనుకుంటారు? అన్నయ్య ఏమంటాడు? దీనికి కారణం తన అసమర్ధతే ననుకోరూ? గత్యం తరంలేక తను కాపురాన్ని మళ్ళీ వూరికే తరలించవలసి వస్తుందేమో! ఈ వూహ తాకిడికి సుందరం కంపించిపోయాడు. ఉద్యోగం పోగొట్టుకుని సమిష్టి కాపురంలో భార్యాబిడ్డలతోబాటు మరొకరి సంపాదన క్రింద బ్రతకడంకంటే ఈ ప్రపంచంలో ప్రత్యక్ష నరకం మరొకటి వుండబోదు!

"బాబుగారూ!"

పిలుపు వినిపించగానే ఆగిపోయాడు సుందరం. ఆఫీసు బంట్రోతు రాఘవయ్య చిరునవ్వు నవ్వుతూ దగ్గిరికి వచ్చాడు.

"ఏం రాఘవయ్యా! ఇలా వచ్చావు?" ఆశ్చర్యంగా అడిగాడు సుందరం.

"మీకోసం సాయంత్రమే ఓసారి వచ్చాను. ఇంట్లోలేరు" అన్నాడు రాఘవయ్య.

"నా కోసమా! ఏం పనిమీదొచ్చావు?" అన్నాడు సుందరం.

రాఘవయ్య జేబులోనుంచి ఓ కాగితం తీసి సుందరం చేతిలో వుంచాడు.

మడత విప్పుతూ ఆ కాగితాన్ని వీధి దీపం వెలుగులోకి తీసుకెళ్ళాడు సుందరం. కానీ దాన్ని పూర్తిగా చదువవలసిన అవసరం లేక పోయింది. అది తను మధ్యాహ్నం వ్రాసి, ఆఫీసరుగారికి పంపిన రాజీనామా!

"ఇదేమిటి రాఘవయ్య! దీన్ని నువ్వెందుకు తీసుకొచ్చావు?" విస్తుపోతూ అడిగాడు సుందరం.

"దాంతో పని తీరిపోయింది గదండి మరి! మీకు కావలిసిందల్లా ఏమిటి? ఇది ఆఫీసరుగారి కళ్ళబడటం, పడింది. ఆయన చదువుకున్నారు. సరేనా బాబూ?"

రాఘవయ్య మాటలు ఒకదానికొకటి పొసగక పోవడంచేత కాస్త తికమక పడుతూ "అసలేం జరిగింది రాఘవయ్యా! వివరంగా చెప్పు" అన్నాడు సుందరం.

"జరగడానికేముంది బాబూ: ఉదయం తొమ్మిది గంటలప్పుడు ఆఫీసరు గారికీ అమ్మగారికీ జటాబొటీగా జగడం జరిగింది. కారణం చిన్నదే. ఆమె అమ్మాయిని చదివించాలంటుంది. ఈయన పెళ్ళి చేసేయాలంటారు. కానీ జరిగిన గలాటా మాత్రం చాలా పెద్దది. ఆ కోపంతో ఆయన తినీ తినకుండా ఆఫీసు కొచ్చారా, మీరు సమయమూ, సందర్భమూ చూచుకోకుండా అప్పుడే వెళ్ళి ఆయనతో భేటీ అయ్యారు!"

"ఇది మరీ బాగుంది రాఘవయ్యా! ఆయన యింట్లో సతీమణిగారితో పోట్లాడి వచ్చారని నేను కలగన్నా నేమిటి?"

"ఇంత మాత్రానికి కలగనాలటండి! ప్రొద్దెంతయిందో గడియారం చూస్తే తెలియదూ ? మీటరు నోట్లో పెడ్తే జ్వరమెలా కాస్తున్నదో తెలియదూ ? ధుమ ధుమ లాడుతున్న ముఖాన్ని జూడగానే అయ్యగారు కోపంగా వున్నారనీ, ఇప్పుడు కారణం లేకపోయినా అగ్గిమీద గుగ్గిలంలా మండి పడగలరని తెలుసుకో గూడదూ?"

"ఐతే తప్పంతా నాదేనంటావా రాఘవయ్యా?" దీనంగా అన్నాడు సుందరం.

"ఆ మాటనగల్నా బాబూ! మీది తప్పయితే ఈ కాగితాన్ని చదువుతుండగా ఆయన ముఖ మెందుకలా నల్లబడిపోతుంది? రాతి బొమ్మకు మల్లే అలాగే కుర్చీలో కూచుండిపోయారు ఐదు నిమిషాలకు నోరు తెరిచి "ఇదేమిటి రాఘవయ్యా! ఈ అబ్బాయి యిలాటి పనిచేసేశాడు" అంటూ నన్ను బిక్కరించి చూశారు. 'పోనివ్వండి బాబూ, నేను సర్ది చెబుతాను' అంటూ కాగితాన్ని నా చేతికి తీసుకున్నాను."

ఆఫీసరుగారికీ తనకూ మధ్య అయాచితంగా మధ్యవర్తిత్వం నెరపుతున్న రాఘవయ్యకు ఎలా కృతజ్ఞత తెలుపుకోవాలో సుందరానికి తోచింది గాదు. ఆ మాట కొస్తే ఈ తనకు మాలిన ధర్మాన్ని తలపైన వేసుకోదలచినందుకు అటు ఆఫీసరు గారితోబాటు, ఇటు తనుగూడా రాఘవయ్యమీద కోప్పడి వుండవలసింది. ఆఫీసరుగారంతటి వారే చల్లగా దిగజారి సమాధానానికి యిచ్చగిస్తుండగా తను బెట్టుచేయడం సుందరానికి అవివేకమనిపించింది. ఎలాగూ బాబుకు జబ్బు నయమై పోతోంది. ఉద్యోగంలో తనకు తానుగా తెచ్చిపెట్టుకున్న ఈ చిక్కు గూడా

ఏదో ఒక విధంగా పరిష్కారమైతే బాగుండునన్న ఆలోచన కూడా ఇప్పుడిప్పుడే ప్రారంభమైంది...

సుందరం ఆకాశంవైపు చూస్తూ మౌనంగా రాఘవయ్య ఎదుట నిల్చున్నాడు. అతడి చేతిలోని కాగితం వ్రేళ్ళ మధ్య నలిగి రోడ్డు పైకి జారిపోయింది.

"ఇక సెలవు తీసుకుంటాను" బాబూ! రాత్రి మీరిపోతోంది. రేపు తెల్లారి ఆఫీసులో కలుసుకుంటాను" అంటూ రాఘవయ్య వెళ్ళిపోయాడు.

* * *

దగ్గరగా వేసివున్న తలుపును తెరచుకుని సుందరం ఇంట్లోకి ప్రవేశించాడు. గదిలో మంచంపైన క్షీరసాగరంలాంటి తెల్లటి పరుపు అతడికోసం యెదురు చూస్తోంది పంకజం క్రింద చాపపైన పడుకుంది. సుందరం బాబుకోసం వూయల్లో చూచాడు. తల్లి ప్రక్కన చూచాడు. అక్కడా, యిక్కడా కూడా కనబడక పోయేసరికి అతడు ఆశ్చర్యంతో ద్వారం దగ్గిరికి వెళ్ళి నడవలోకి చూచాడు. 'ఇక్కడ నాకు చాలా బాగుం'దన్నట్లు ఆ పసికుంక మామ్మ దగ్గరగా పడుకుని గురక పెడుతున్నాడు.

పడుకోబోతూ సుందరం భార్య ముఖంలోకి చూచాడు. బయట కొబ్బరి మట్టలపైన తళతళలాడి, అక్కడనుంచీ కిటికీగుండా లోపలికి వస్తున్న వెన్నెల పంకజం ముఖంపైనపడి గాలికి కదలుతున్న ముంగురులతో ఆడుకుంటోంది. 'అబ్బ పంకజం యింత హాయిగా నిద్రించి ఎంత కాలమైంది!' అనుకున్నాడు సుందరం.

ఆ రోజు రాత్రి సుందరం ఓ కల గన్నాడు. ఆ కలలో అతడు అఖిల భారత యన్. జి. వో. సంఘ సర్వసభ్య సమావేశంలో మాట్లాడుతూ "సోదరులారా! 'మన చేతిలో ఏముంది' అంటుంటారు పెద్దలు, ఆ మాటలో నిజం లేక పోలేదు. మనకు మనంగా మనం సంతోషాన్నీ, సంతృప్తినీ సాధించలే మనిపిస్తుంది. వాటిని మనకు మొదట గృహిణి ప్రసాదించాలి, ఆ తరువాత చిరంజీవి ప్రసాదించాలి. ఇక ఆఫీసులోనైతే ఆఫీసరుగారి ముఖాన్ని చూచి 'శీతోష్ణ స్థితుల్ని' పసిగట్టగలగాలి. ఎంతో మెలకువతో, పరిస్థితులకూ, పరిసరాలకూ అనుగుణ్యమైన పట్టు విడుపులతో ముందుకు సాగిపోవాలి. ఇంతకంటే నేనేం చెప్పగలను! మీ మీబెరామీటర్లు మీకు నిరంతరానంద సంధాయకము లౌనుగాక! లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు, ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అన్నాడు.

—ఆంధ్ర వారపత్రిక, స్వర్ణోత్సవ సంచిక, 1959.

# చలి చెలమ

హమేషా ఊళ్ళు తిరగడమంటే కొందరికి ఇష్టం. నాకూ ఇష్టమే ! కానీ ఇష్టమున్నంతమాత్రాన సరిపోయిందా ఏమిటి ? వీలుండద్దూ? నాకు లేనిదే అది! కానీ ఈ వీలు సంగతి లోకానికేం పట్టింది? ఏ కార్డు ముక్కో, ఏ ఆహ్వాన పత్రమో తాఖీదులా ఇంటికి వస్తుంది. చేత డబ్బుండదు. కాజువల్ లీవు ఉండదు. ఇంటిలో ఏవరికో ఒకరికి ఆరోగ్యం బాగుండదు. ఇవన్నీ అవతలివారి దృష్టిలో కుంటిసాకులు. నూరు ఆరయ్యేది, ఆరు నూరయ్యేది బస్సో, రైలో ఎక్క వలిసిందే!

ఈ మధ్య అలాగే నాకొక ప్రయాణం ఒనగూడింది!

అవసరం బంధుకార్యం.

వెళితే జరిగే మర్యాదలను గురించి మీరు అడగనూ గూడదు, నేను చెప్పనూ గూడదు! కానీ వెళ్ళడం మాత్రం తప్పనిసరి !

భళ్ళున తెల్లవారేసరికి సెంట్రల్ స్టేషను చేరుకోవలసిన రైలు ఆరోజు రెండు గంటలు లేటు ! గంట ఎనిమిది కాబోతూండగా రైలు దిగాను. మదరాసు నగరం సూర్యోదయాన్నిగానీ, సూర్యాస్తమయాన్నిగానీ కళ్ళచూచి నాలుగైదు రోజు లయిందన్న విషయం నాకు సెంట్రల్లో రైలు దిగిన తరవాతగానీ తెలియదు. మూసి ముల్లుకొట్టుకపోయినట్టుంది ఆకాశం. పడుతున్న తుంపర చినుకులు ఆగ నిమ్మని కాస్సేపు స్టేషనులోనే జాగు చేశానేమో, అంతలోనే కుంభవర్షమే ప్రారంభమయింది. అది గాత్రసంగీతమైతే, డబ్బారేగులది మృదంగంమోత. రోడ్డుపైన బస్సులు పరుగెత్తకపోవడం లేదు. కాని బస్సులని ఎలా అనుకోవడం? అవి సబ్‌మెరీన్లను తలపిస్తున్నాయి. బస్ స్టాపింగు దగ్గిరికి వెళ్ళి నిల్చోవాలన్నా వాన తగ్గాలి. తగ్గే సూచనలు లేవు. ఓ టాక్సిలో జొరబడి రాయపురం అన్నాను. టాక్సి కదిలింది.

మదరాసు నగరంలో వాన ఎన్నెన్ని రకాలుగా కురుస్తుందనీ! మేడలపైన

అందంగా, గుడిసెలపైన భయంకరంగా, వర్క్‌షాపులపైన బీభత్సంగా, వీధుల్లో ఒయ్యారంగా కురుస్తూంది వాన. ఆ ఒడుపులు, ఆ విరుపులు, ఆ నడకలు మద రాసువానకే చెల్లుననిపిస్తుంది! మార్గమధ్యంలో ఒకసారి టాక్సీ డ్రయివరు నోరు తెరిచి, "సరియా సొల్లుంగో సార్ ! రాయపెట్టా, రాయపురమా?" అన్నాడు. జ్ఞాపకానికి వ్రాసిపెట్టుకున్న కాగితానికి పాటావేసి మదరాసు మహాటవిలో చూచుకుని రాయపురమే నన్నాను. గమ్యస్థానాన్ని పసిగట్టడంలో వేట క్కలవంటివి గదా టాక్సీలు ! కానీ ఆ టాక్సీ కైనా కాస్త తికమక తప్పింది కాదు. ఈశాన్య తీర్థ ధర్మతోట్టమంటే అక్కడెవరికీ తెలియదు. దాన్ని కర్మాంతరాల తోట అనాలట ! తీరా అక్కడికి వెళితే అక్క డున్న కాపలావాడు "కర్మక్రియలకోసం మాత్రమే ఇక్కడికి వస్తారు, బాబూ! భోజనాలు అవీ సత్రంలో ఏర్పాటు చేసుకుంటారు" అంటూ నాలుగు వీధుల కవతల ఉన్న సత్రానికి రీడైరక్టు చేశాడు. మళ్ళీ టాక్సీలోనే ఆ సత్రానికి తిరుగు టపా ! తమ ఇండ్లలో వచ్చిన బంధువుల కందరికీ జాగా వుండదని ఇలా ఒక సత్రాన్ని కుదుర్చుకున్నారట! "భోజనాలు సిద్ధమవుతున్నాయి. ఆలోగా కర్మ క్రియలు పూర్తిగావించుకుని వచ్చేద్దాం" అంటూ జట్లుజట్లుగా కర్మాంతరాలతోటకే బయలుదేరారు. పేరుపేరునా పితృదేవతల నందరినీ పలకరించి, ఆ కర్మకాండ అంతా నెరవేర్చేసరికి గంట రెండు కావచ్చింది. సత్రానికి తిరిగి, అక్కడ వరు సగా నాలుగైదు బంతులు భోజనం చేసి లేచేసరికి గంట మూడున్నర. సత్రంలో చెవులు చిల్లులు పడిపోయే సందడి! ఆ సందడికి తట్టుకోలేక అలా బయటికివెళ్ళి కాస్త కాలహరణం చెయ్యడమే నా నేరం! తిరిగివచ్చేసరికి సత్రం ఖాళీ! సత్రాన్ని కనిపెట్టుకుని ఉన్న పనిమనిషి ఒక్కడుమాత్రం కనిపించాడు. "బాబూ ! బంధువు లందరు వెళ్ళిపోయారు. ఇక్కడొక సంచీమాత్రమే మిగిలిపోయింది. మీదేమో చూడండి" అన్నాడు.

మా బంధువుల అతిథి సత్కార దీక్షా పరాయణత్వం నా కెంతగానో నచ్చింది. వాళ్ళ గుడుగుడు కుంచాలకు మధ్య, మెరమెచ్చుమాటలకు నడుమ ఒదుగుళ్లు పోవలసిన ఇబ్బంది తప్పింది. ఇక నేనున్నాను. మదరాసు నగరం వుంది. జన్మకల్లా శివరాత్రిలా ఎప్పుడోగానీ ఇలా నగరానికి రావడం కుదరదు. బంధువుల ఆదరణ సరిగ్గా లేదన్న కినుకతో అప్పటికప్పుడే తిరుగు ప్రయాణం పెట్టుకోవాలని ఎక్కడుంది? ఉండి రేపే వెళతాను. పేవ్‌మెంట్లు లేవా? పార్కు

బెంచీలు దొరకవా? సినిమా థియేటర్లు కనిపించవా? ఒకవేళ అర్ధరాత్రి తరువాత సినిమాలుకూడా కట్టేశారుపో, రైల్వేస్టేషన్లయినా మేలుకుని వుండవా ?

నా సంచీ, నా ఆలోచనలు మాత్రం నన్ను వెన్నంటి వున్నాయి. పొడి ఎండతోకూడిన తడివాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా వుంది. నాలుగైదు రోజుల తరువాత ఎండను కళ్లచూచిన మదరాసుపౌరులు. ద్విగుణీకృతోత్సాహంతో రోడ్లను, వాహనాలను, అంగళ్లను సద్వినియోగం చేసుకుంటున్నారు. గమ్యమంటూ లేని బాటసారిగా ఎంతదూరం నడిచానో తెలియదు. పొద్దుపోయింది. చీకటిపడడానికింక కొంతసేపే వ్యవధి. కాళ్ళు నెప్పిపెడుతున్నాయి. ఎక్కడైనా కూర్చోవాలని ఉంది. నాలుగురోడ్ల కూడలిలో పేవ్‌మెంటుపైన పరిచిన పాతపుస్తకాలవైపు చూస్తూ ఒక హోటలు దాపున నిల్చుండిపోయాను.

సరిగ్గా అప్పుడే ఎదురుచూడని సంఘటన ఒకటి జరిగింది.

"ఇదిగో! మిస్టర్, నిన్నే!"

నన్నా! నిజంగా నన్నేనా ? అందులోను అలాంటి పెద్ద మనిషి! సన్నగా మెలికలు తిరిగి గిరజాలుగా వంగిన తలకట్టుతో, ఆజానుపర్యంతం వేలాడుతున్న పొడుగాటి కోటుతో ఫ్రెంచి గవర్నరు డూప్లే లాంటివాడు, పెదవులకంటుకపోయిన నల్లటి పైపునించి పొగపీల్చి, వదులుతున్నావాడు, పుష్పకవిమానంలాంటి తెల్లటి కారు కానుకొని గంభీరంగా నిల్చున్నవాడు! అంతటివాడు నన్ను పిలుస్తున్నాడని ఎలానమ్మగలను ? కళ్ళకు కనిపిస్తుంటే, చెవులకు వినిపిస్తుంటే నమ్మకుండా ఎలావుండగలను ?

మానవులందరు సమానులే నంటారు ! ఒక్క గాలిని పీల్చుకోవడంలో తప్పితే మరెందులో సమానులో నా కర్థంగాదు. నన్ను పిలుస్తున్న వ్యక్తిగూడా మనిషే! కానీ చెవులదాకా గుబురుగా దిగివచ్చిన క్రాసింగులో, దట్టంగా కమ్ముకున్న కనుబొమ్మల్లో, పండిన టొమాటోలాంటి దేహచ్ఛాయలో అతడు మృగరాజంలా ఉన్నాడు. బహుశా నేనొక జింకపిల్లలా అతణ్ణి సమీపించి ఉంటాను.

దగ్గరికి వెళ్ళగానే ఆయన ప్రశ్నించాడు.

"తెలుగువాడివే గదూ?"

అవునన్నట్టుగా తల పంకించానేమో ! పెదవి కదిపి వుండను.

"ఏ జిల్లా ?"

చెప్పుకున్నాను.

"మీది చింతపల్లి, అవునా?"

భూగర్భగృహానికి అడ్డుగా ఉన్న చెక్కల కూర్పులా నా పాదాలకింద పేవ్‌మెంటు కదిలిపోతున్నట్టుంది!

"మీ నాన్నగారి పేరు శేషాద్రి, నిజమే కదూ?"

చెక్కల కూర్పు విడిపోయింది, నేను దభేలున ఆశ్చర్యకూపంలో కూలిపోయాను.

కోలుకునేలోపల ఆయన నా భుజంపైన చెయ్యివేశాడు. "అబ్బాయ్! పెద్ద పెట్టున ఆశ్చర్యపడిపోకు. ఆశ్చర్యం కలగడానికి కారణమేమిటో చెప్పనా? తెలియ పోవడం! నిజం తెలిస్తే, లేదా కారణం తెలిస్తే ఆశ్చర్యం కలగనే కలుగదు. అప్పుడన్ని సహేతుకంగానే కనిపిస్తాయి. నేను మీ ఊరి పేరు, మీ తండ్రి పేరు ఎలా చెప్పగలిగానని నీ కాశ్చర్యం! ఎలా చెప్పగలిగానో తెలిస్తే నువ్వు ఆశ్చర్య పడవు..."

"చెప్పండి, సార్! నాకూ తెలుసుకోవాలనే ఉంది" అన్నాను.

"భలే గడుసువాడివే!" అంత సులభంగా చెప్పేస్తానేమిటి?" ఆయన చిలిపిగా నవ్వుతున్నాడు.

సులభంగా చెప్పక అందుకోసం ఆయన ఆశించే ప్రతిఫలం ఏమిటో నా కర్థమయింది కాదు!

"నిన్ను గురించి నే నెలా తెలుసుకోగలిగానన్న విషయాన్ని నువ్వు తెల్సుకోదలిస్తే అందుకొకటే మార్గం ఉంది. ముందుగా నువ్వు నా ప్రశ్నలకు సమాధానం చెప్పాలి."

'అలాగేనండి! చెబుతాను' అన్న సమాధానం నాలుక చివరిదాకా వచ్చింది· కానీ అంతలోనే నాయొక్క, ఆ ఎదుటి వ్యక్తి యొక్క విజ్ఞతలను పోల్చుకోవడంతో నేను బెంబేలుపడిపోయాను. ఆయన అడగబోతున్న ప్రశ్నలెలాంటివో నాకు తెలియదు. వాటికి సదుత్తరా లిచ్చుకోగల విజ్ఞత నాకెక్కడిది? కొంపదీసి ఈయన మెస్మరిజం, హిప్నాటిజంలాంటి వేపైనా చేసి నా నోటి గుండా ఏవైనా

రహస్యాలను వెళ్ళగక్కించడు గదా ! పెద్ద చిక్కులోనే తగులుకున్నట్టయింది నాకు !

ఆయనగూడా నా కలవరాన్ని గుర్తించినట్టే కనిపించాడు. "అబ్బాయ్! నీ పేరేమిటో తెలియదు నాకు. తెలుసుకోవాలని కూడా లేదు. నీ పేరుతో పిలవడం కన్నా నిన్ను జూనియర్ శేషాద్రీ అని పిలవడమే నా కిష్టం. అలాగే పిలుస్తాను. మై డియర్ ఫ్రెండ్ ! జూనియర్ శేషాద్రీ! నాపైనా అనుమానాలు పెట్టుకోకు. నా మూలంగా నీకెలాంటి అపకారము జరగదు. పాతికేళ్ళనుంచి నీలాంటి వాడికోసం వేచి చూస్తున్నాను నేను. ఈనాటికి నువ్వు దొరికావు. కానీ సత్సంకల్పాలకు లోకంలో ఎన్నో విఘ్నాలుంటూనే వుంటాయి. ఇప్పుడు గంట ఆరున్నర కావస్తూంది. ఏడు గంటలకు నాకో ఎంగేజిమెంటు వుంది. ఎనిమిదికి పూర్తి అవుతుంది. అప్పుడు నువ్వు నన్ను కలుసుకోవాలి...."

తన ధోరణిలోనే తనకు నచ్చినదేదో స్ఫురించినట్టుగా చేతివేళ్ళతో కణతల్ని పరామర్శించుకుంటూ కొనసాగించాడాయన. "అదిగో, ప్రపంచంలో ఎవడి గొడవలు వాడివి. ఎవడికి వాడే స్వార్థపరుడు. కాకపోతే నాపిలేదో నేను చూచుకుంటున్నానంతేగానీ, నువ్వెందు కోసం ఇక్కడికి వచ్చావో, ఎక్కడికి వెళుతున్నావో, నన్ను కలుసుకునే వీలు నీకుంటుందో ఉండదో ఆలోచించానా?"

"అబ్బే, ఫరవాలేదండీ! నాకేం పనుల్లేవు..." అన్నాను. అన్నానేగానీ ఆయనను నా అంతట నేనెందుకు కలుసుకోవాలో నాకు బోధపడడంలేదు. ఇంతకు ఆయన నన్ను ఆజ్ఞాపిస్తున్నాడా ? ప్రాధేయపడుతున్నాడా ?

"అయితే నువ్వొక పని చెయ్యాలి. ఎనిమిదివరకు నువ్వెక్కడైనా తిరుగు. ఎనిమిది కాగానే ఒక టాక్సీని పిలువు ఇదిగో, ఈ చీటీ చూపిస్తే పదిహేను నిమిషాల్లో నువ్వు మా ఇంటిముందర ఉంటావు. ఆశాభంగం కలిగించవు కదూ! తప్పకుండా రావాలి. నేను నీకోసం వేచి ఉంటాను."

కాదు కూడదని ఆయన కోరికను నిరాకరించే పాటి తెగువ నాకు లేకపోయింది!

అంతలో ఏవో పుస్తకాలూ, ప్యాకెట్లూ పుచ్చుకుని డ్రయివరు కారు సమీపించాడు.

ఆయన కారులో కూర్చున్నాడు. కదిలిపోతున్న కారులోనించే మాటలు

వెనక్కి చూసుకువచ్చాయి—"మై డియర్ యంగ్ ఫెలో! మరిచిపోవద్దు వేచి వుంటాను."

మదరాసు వీథులు. ఆ వీథుల్లో జరిగే అంతర్నాటకాలు బాగా రంజుగానే ఉన్నట్టు తోచింది. ఎవరైనా పల్లెటూరివారు కనిపిస్తే, ఇక్కడివాళ్ళు వాళ్ళని కికురించడంలో బాగా తరిబీతు పొందినట్టున్నారు. నా ఆలోచన పరిపరి విధాలుగా ననలు సాచుకుంటూంది. ఆ క్షణాల్లో నాకు కుట్రలతో, ఖూనీలతో, ఎలిబీలతో అల్లిన డిటెక్టివ్ కథలెన్నో జ్ఞప్తికి వచ్చాయి. లేకపోతే ఈయన పాతికేళ్లుగా నాలాంటివాడికోసం వేచి చూస్తున్నాడా? అరేబియన్ నైట్స్ కథల్లోని మాంత్రికుడికి అల్లా ఉద్దీను దొరికినట్టుగా ఈనాటికి నేనీయనకి దొరికానా?

బాగానే ఉంది. కథకు కాళ్ళు వచ్చేశాయి. ఇక నడిపించినా నడిపించవచ్చు. విరగగొట్టినా విరగగొట్ట వచ్చు. వెళ్ళడమా, మానడమా ?

కుతూహలం చెడ్డది. (మంచిది కాదా!) అది మానవుడిచేత ఎలాంటి పని అయినా చేయిస్తుంది. (సాహసకార్యాలు కూడా!) వెళ్ళకపోతే ఇదొక చిదంబర రహస్యంలా నన్ను జీవితాంతము వెంటాడకమానదు. ఈ ఉదంతాన్ని విన్న వాళ్ళందరూ "అయ్యో, వెళ్ళలేక పోయావా! అయినా ఇంతటి పిరికితనమా!" అంటూ ఎద్దేవా చెయ్యకపోరు.

వెళ్ళాలన్న నిర్ణయానికి వచ్చిన తరువాత వున్నట్టుండి కాలచక్రం ఆగిపోయినట్టు తోచింది. ఒకవేళ కదలుతున్న బండరోకలి, బండరోకలికన్నా వేగంగా పాకడం లేదనిపించింది. ఆ గంట గంటన్నర వ్యవధిలో ఆయన నా చేతికి ఇచ్చిపోయిన చీటీని నాలుగైదుసార్లు చూచుకున్నాను. అందులో ముచ్చటగా మూడే మాటలున్నాయి. "ఏ. జె, దేవంబధు, విస్డమ్ విల్లా. మైలాపూరు..." అక్షరక్షరాన్ని పరిశీలించి చూచాను. అందులోనించి క్లూలవంటివేవీ దొరికే సూచనలు లేవు.

గుడి ఆవరణకి ఈవలగానే ఆగిపోయే పాదరక్షలకు మల్లే టాక్సీ రోడ్డుపైనే ఆగిపోయింది. గేటు కొకవైపున గోడకు తాపడం చేసి వున్న చలవరాతి పలకపైన చీటీముక్కలో ఉన్న మాటలే కనిపించాయి. ఆ చీటీకేసి ఒకసారి, నా ముఖంకేసి రెండుమూడుసార్లు చూచిన గూర్ఖావాడు ఎంతో కొంత అయిష్టంగానే నేను లోపలికి వెళ్ళడానికి సమ్మతించాడు.

గేటు దాటుకోగానే పొడుగాటి సన్నటి చెట్లతో, ఏవో పూలమొక్కలతో, పొదరిళ్ళతో చిట్టడివిలాంటి తోట కనిపించింది. ఆ తోట నడుమ వంకరులు తిరుగుతూ వెళుతున్న బాట ఒకటి. వెలుతురుకన్నా చీకటే ఎక్కువగా, అలజడికన్నా ప్రశాంతతే ఎక్కువగా నెలకొని ఉన్న ప్రదేశం అది. చెట్ల సందుల్లోనించీ తెల్లటి, గోడలు, దీపాల కాంతి కనిపించకపోతే, పొదల మాటునించీ రేడియో సంగీతము నవ్వుల సవ్వడి వినిపించకపోతే అక్కడ జనసంచార మున్నదన్న నమ్మకమే కలిగేది కాదు.

హఠాత్తుగా రోడ్డు ఆఖరై పోయింది. నేను భవనం ఎదుట నిలబడి ఉన్నాను:

పై కప్పును మొయ్యడం కోసమనిగాక, అందంగా ఉండాలన్న ఉద్దేశంతో రెండింటిని మూడింటినీ ఒకటిగా ఆనించి కట్టిన స్తంభాలకు కింద, విశాలమైన వరండా దగ్గరనించి ప్రారంభమై, దూకుతున్న కడలి అలల్లాక్రిందికి దిగివస్తున్న సోపానపంక్తికి ఎట్ట యెదుట, ఓ జలయంత్రానికి అల్లంత దూరంలో నేను నిలబడి వున్నాను.

ఆ జలయంత్రానికి, భవనానికి మధ్యనున్న పచ్చిక తిన్నెలపైన ఆడామగా, చిన్నా పెద్దా కలిసి ఓ ఏడెనిమిది మంది పేముకుర్చీల్లో కూర్చుని కులాసాగా కాలక్షేపం చేస్తున్నారు.

వారిలో మొట్టమొదట నావైపు చూచిన వ్యక్తి నడివయస్కురాలైన పాశ్చాత్య వనిత. మిగిలినవారిలో పాతికేళ్ళ యువకు డొకడు, పదహారేళ్ళ పడుచు వాడొకడు, పెళ్ళి కెదిగిన అమ్మాయి లిద్దరు. మిగిలిన వారు పది పన్నెండేళ్ళకు లోబడిన చిన్న పిల్లలు. వారిలో దేశవాళీ వాలకంకన్నా విదేశీ లక్షణాలే ఎక్కువగా కనిపిస్తున్నాయి. హారంలో నాయకమణిలా మధ్యగా కూర్చున్న ఆ పాశ్చాత్య వనిత నేను కనిపించగానే "జాకబ్, జాకబ్ !" అంటూ గొంతెత్తి పిలిచింది. నల్లటి కుర్రవాడొకడు సోపాన పంక్తి పైన కనిపించి అంతలోనే అంతర్హితు డయ్యాడు. అతడు లోపలికి వెళ్ళినకొద్ది నిమిషాలకే మేడపై భాగాన ఉన్న పెద్ద విద్యుద్దీపం ఒకటి వెలిగింది. చప్పుడు లేకుండా మేడపైన కిటికీ ఒకటి తెరుచు కుంది చువ్వల్లోనుంచీ పరిచితమైన ముఖం కనిపించింది. "వచ్చావా. అబ్బాయ్! పైకిరా" అంటున్నాడాయన.

జాకబ్ దారి చూపిస్తూండగా కొయ్యమెట్లెక్కి పైకి వెళ్ళాను. గది తలుపులే కాకుండా ఆయన చేతులు గూడా నాకోసం తెరుచుకుని వున్నాయి. ఆయన సాదరంగా నన్ను ఆహ్వానించాడు. అలాగే తీసుకువెళ్ళి ఓ కుర్చీలో కూర్చోపెట్టాడు. ఆపిల్ పళ్ళముక్కలు, బిస్కట్లు ఉన్న ప్లేటును నా ముందరికి జరిపాడు. ఆ గృహస్థుడి ఆదరణలో ఉక్కిరి బిక్కిరై పోతున్న నాకు ఆ గది ఒకసారి కలయపరికించడానికైనా వీలు లేక పోయింది. కుర్చీలో కూర్చున్న తరువాత గోడ కొక వారగా ఉన్న పుస్తకాల బీరువాలు కనిపించాయి. పెద్ద సైజు పెయింటింగ్ చిత్రాలు కొన్ని గోడలకు వేలాడుతున్నాయి. గది నడుమ ఉన్న టేబిలుపైన ఏసుక్రీస్తును సిలువ వేసిన విగ్రహం వుంది. మెల్లగా కాలుతున్న అగరువత్తులు కమ్మటి పరిమళాన్ని గది అంతటా నింపుతున్నాయి. తన విచిత్ర ప్రవర్తనతో నా పాలిటికి కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టోలా కనిపిస్తున్న ఏ. జె. దేవబంధు బల్ల కటువైపున వాలు కుర్చీలో కూర్చున్నాడు. ఆ వినూత్న వాతావరణం నన్ను స్తబ్ధుణ్ణి చేయడంలో ఆశ్చర్యంలేదు కానీ ఏదో మాట్లాడాలని నన్నక్కడికి రమ్మన్న పెద్దమనిషి కూడా చేతులను వాలుకుర్చీ పైనించీ వెనిక్కి వేలాడవేసుకుని, అరమోడ్పు కన్నులతో పైకప్పుకేసి చూస్తూ నాలుగైదు నిమిషాలపాటు మౌనంగానే వుండిపోయాడు.

ఆ వ్యవధిలో నేను ప్లేటు ఖాళీ చేశాను, ఆయన పైకి లేచి సీసాలోని పళ్ల రసాన్ని గ్లాసులోకి వంచాడు. తిరిగి కుర్చీలో కూర్చుంటూ ఉపక్రమించాడు.

"రావేమోననుకున్నాను. ఎలాగైతేనేం, వచ్చేశావు. నాకు చాలా ఆనందంగా ఉందోయీ, జూనియర్ శేషాద్రీ!"

"నన్ను రాజశేఖరం అంటారు" అన్నాను.

"అయితే అలాగే పిలుస్తాను. చూడు, మిస్టర్ శేఖరం! నా ప్రశ్నలకు సూటిగా సమాధానాలు కావాలి. ఈ వివరాలన్నీ నాకెందుకు కావలిసివచ్చాయన్న కుతూహలాన్నిగూడా నువ్వు చివరిదాకా ఆపుకోవాలి."

"అలాగేనండి! అడగండి" అన్నాను.

"మొదటి ప్రశ్న. ముఖ్యమైనదికూడా! మీ చింతలపల్లి ఎలా ఉంది?"

ఎదుటివ్యక్తిని ఆశ్చర్యాంబుధిలో మునకలు వేయించడమే ఆయన ఉద్దేశ్యమైన పక్షంలో, నేనాయన చేతిలో ఒక ఆటవస్తువుగా పరిణమించ దలచుకోలేదు. తేడాలుంటే ఉండవచ్చును గాక. ఎవడికి తగ్గ వ్యక్తిత్వం వాడి కుంటుంది. ఈ

భావనవల్లనే కావచ్చు నా జవాబులో గూడా కాస్త తిరగబడిన తత్త్వం ప్రకటిత మైంది.

"చింతల పల్లికేమండీ! బాగానే వుంది కాదంటే ఏ చెట్లవల్లనైతే ఆ ఊరికి చింతలపల్లి అని పేరు వచ్చిందో ఆ చింతచెట్లను మాత్రం సమూలంగా కుళ్ళగించి పారేశారు. కొందరు వాటిని బొగ్గులుగా మార్చి అమ్ముకోగా, మరికొందరు వాటితో ఇటుకశాలలు కాల్పించుకున్నారు. పాకలున్నచోట మేడలు లేచాయి. ముందరవచ్చిన చెవులకన్నా, తరవాతి కొమ్ములే వాడి! కొత్త కట్టడాల్లో కరెంటు దీపాలు వెలుగుతున్నాయి. పాతమేడలు కొన్నింటిలో చమురుఖర్చుకైనా వెరవు లేని లేమిడి సంసారాలు జరుగుతున్నాయి. నిన్న మొన్నటివరకు ఊరికంతటికీ పెద్దదళవాయి రామన్న. ఈ మధ్య జరిగిన పంచాయతీ బోర్డు ఎన్నికల్లో అతడికి స్వంతవార్డులో అక్షరాలా తొమ్మిదే ఓట్లు పడ్డాయి. ఒక మనిషి ఇంకొక మనిషి ఎదుట మొదటివాడు ఎంత కొమ్ములు తిరిగినవాడైనాసరే. ఒదుగుళ్లు పోయే కాలం వెనకపట్టింది. 'నీ అంతటివాడివి నువ్వయితే, నా అంతటివాడిని 'నే నన్న ఆత్మ ప్రత్యయం బలిసింది. విలవనల్లో తేడాలు రావడంతో రోజులు మారి పోతున్నాయనుకోడం రివాజు అయింది. ఈ మార్పు కొందరికి ఇష్టంగానూ ఉంది. మరికొందరికి అయిష్టంగానూ వుంది. ఒకరి ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా కాలం గడచిపోతూంది. చదువుకుంటున్న పిల్లలున్న తండ్రిని కదిపి చూడండి, ఎలిమెంటరీ స్కూళ్ళనుండి విశ్వవిద్యాలయాలవరకు వున్న అవకాశాలను గురించి లేని సదుపాయాలను గురించి వినగలము. వ్యవసాయ విద్యలో పట్టాపుచ్చు కున్న విజ్ఞానవంతుణ్ణి చిక్కు ప్రశ్నలతో తికమకపెట్టడాని కొక మామూలు రైతే చాలు. ఇదంతా ఎలా వుందంటే గ్రామీణ జీవితమన్న పెద్ద బాణలిలో ఏవేవో ఘన ద్రవపదార్థాలు కళపెళలాడిపోతున్నాయి. పొంగులు వస్తున్నాయి. బుడగలు లేస్తున్నాయి. మంట చల్లారాలి. మిశ్రమం గట్టిపడాలి. అప్పుడుగానీ ఈ బాణలిలో తయారయ్యే పదార్థం ఎలాంటిదో మనకు తెలియదు."

దేవబంధుగారి ముఖంలో ఉత్సుకత కనిపించింది. ఉద్వేగం కనిపించింది.

"బాగా చెప్పావోయ్, రాజశేఖరం! నీ మాటలు వింటుంటే కాలాన్ని చొచ్చుకొని నలభైఏళ్ళు వెనక్కి వెళ్ళినట్టయింది. ముమ్మూర్తులా శేషాద్రి ఇలాగే ఉండేవాడు. సరిగ్గా ఇలాగే మాట్లాడేవాడు. ఇద్దరము కలిసి చెరువులో ఈదు

కుంటూ వెళ్ళి తామరపువ్వులు తెచ్చుకునేవాళ్ళం. చిటారుకొమ్మదాకా పాకి కాయలు కోసుకునేవాళ్ళం. ఏ తిరణాలకు వెళ్ళినా కలిసేవెళ్ళే వాళ్ళం. ఇంట్లో పండుగలు పబ్బాలు చేసుకుంటే నన్ను వదిలిపెట్టి భోజనానికి కూర్చునేవాడుగాడు శేషాద్రి. నేను పది దేశాలు తిరిగాను. పదిపదుల వందమందిమిత్రులనైనా సంపాదించాను. కానీ మనసు లోపలి అట్టడుగు పొరల్లో స్థిరంగా, చెరిగిపోని ముద్ర వేసుకుని కూర్చున్నవాడు శేషాద్రి ఒక్కడే! చెప్పు, శేఖరం! శేషాద్రి కులాసాగా వున్నాడు కదూ?"

"లేరండీ! నాన్నగారు పోయారు..." అన్నాను.

నాకు కనిపించనివ్వకుండా ఆయన ముఖాన్ని గోడవైపుకు తిప్పుకున్నాడు.

"ఇంటికి నేనే పెద్దవాణ్ణి. నాపైన ఎన్నో ఆశలుండేవి ఆయనకు! హైస్కూల్లో చదువుకుంటూ వుండగానే ఆయన చనిపోయారు. నేను కాలేజి మెట్లెక్కలేకపోయాను—"

ఒకటి రెండు నిమిషాలు మౌనంగా గడిచిపోయాయి.

"రాజశేఖరం!" అంటూ ఆయన నావైపు తిరిగాడు. ఆ కళ్ళలోని చెమ్మ నేను పసిగట్టకపోలేదు. "హరిరావుగారంటూ ఒకాయన ఉండేవారు. ప్రభుత్వం జీతం ఇవ్వకపోయినా పిల్లలకు బడిచెప్పేవాడాయన. ఆ బడి బడికాదు. రావిచెట్టు నీడ. ఆ చదువు చదువుగాదు. ఆయన చెబుతూండగా శిష్యులు వినడం మాత్రమే! ఇదిగో, ఇక్కడున్న పుస్తకాల్లో కొన్నింటిని నేను పేప్‌రికార్డరులా ఒప్పజెప్ప గలను కానీ హరిరావుగారి చదువులా నా కేది ఒంటబట్టలేదు. కోపం వస్తే ఆయన అగ్గిరాముడు! ఒళ్ళంతా వాతలు తేలిపోయిన రోజున పంతులుగారి ఇంట్లోనే భోజనం. కొట్టినా ఆయన కొట్టవలసిందే! పెట్టినా ఆయన పెట్టవలిసిందే!"

"అవునట! నాన్నగారు చెప్పగా చాలాసార్లు విన్నాను. నాకు బుద్ధి తెలిసే సరికే అయన గతించాడు."

"ఆయన కిద్దరు కొడుకులుండాలి..."

"పెద్దవాడు దామోదరం. వైద్యం పిచ్చిలో ఏవో మూలికలకోసం శ్రీశైలం కొండల్లోకి వెళ్ళినవాడు తిరిగిరాలేదు. చిన్నవాడు శ్రీహరి ఎక్కడో ద్రోణాచలం పరిసరాల్లోని రోడ్ల కూడలిలో చిన్న నాష్టా అంగడి నడుపుతున్నాడని వినికిడి."

దేవబంధుగారు వేడిగా నిట్టూర్చారు.

"ఊరి చివరగుడిసెలో వుండేవాడు మడివేలు మునెన్న. నారపీసుగ. ప్రాయంలో నేపాల్ వెళ్ళి అక్కడి గనుల్లో, తోటల్లో పనిచేసివచ్చాడు. వాడి జ్ఞాపకాల భోషాణంలో లెక్కలేనన్ని గాథలుండేవి. ఆకుల్లాదని వేసవికాలపు సాయం కాలాల్లో పిల్లలనందరిని చుట్టూరా కూర్చోబెట్టుకుని తన అనుభవాలను ఏకరువు పెట్టేవాడు."

"పాపం, ఆ ముసలివాడికికూడా చివరిరోజుల్లో ఇడుములే ఎదురయ్యాయి. కొడుకులూ, కూతుళ్లూ వాళ్ళ వయస్సు వాళ్ళకు రాగానే రెక్కలు వచ్చిన పక్షుల్లా లేచిపోయారు పెళ్ళాం అంతకుముందెప్పుడో కళ్ళు మూసింది. తానొకడే ఊరి బట్టలు పిండుకుంటూ, పొట్టపోసుకునేవాడు. బాగా ముసలితనం పైబడిందేమో, శరీరంలో ఓపిక తగ్గింది. లేని ఓపికను తెచ్చుకోడంకోసం జీర్ణకోశాన్ని సారాతో దట్టించసాగాడు. జీర్ణశక్తి తగ్గింది. దగ్గు ప్రారంభమైంది. ఆ దగ్గు ఎంతగా విజృంభించిందంటే దాని తాకిడికి ఊళ్లో కొందరికి నిద్రే కరువైపోయింది. అందరు కలిసి పదిరూపాయలు పోగుచేసి ఇచ్చి వింటిబద్దలా వంగిపోయిన ఆ ముసలివాణ్ణి పల్లెనించి సాగనంపేశారు."

దేవబంధుగారు ఎడమచేతితో ఫాలతలాన్ని అదిమి పట్టుకుంటూ పైకి లేచారు. వెళ్ళి కిటికీవైపు తిరిగి నిల్చున్నారు.

"రాజశేఖరం! ఇక ఎంతోసేపు నిన్ను విసిగించను. కానీ ఈ ఒక్క విషయం మాత్రం నాకు కావాలి. చింతలపల్లి నడివీథిలో రెండు మిద్దెలుండేవి. ఒకటి పాపయ్యగారిది, రెండోది పీరాసామిది. ఆ రెండుమిద్దెలు ఒకటే కాపురంగా కలిసిపోవడం నాలుగు దశాబ్దాలనాటి మాట. ఆ తరువాతి వివరాలే నాకు కావలినవి."

దేవబంధుగారు ఏ ఇద్దరువ్యక్తులను గురించైతే ప్రస్తావిస్తున్నారో ఆ ఇద్దరిలో ఒక్క పాపయ్యగారిని మాత్రం నేనెరుగుదును. ఆయనగూడా చాలా కాలం కిందట చనిపోయాడు. ఆ పాపయ్యగారికి ఒకే కూతురు తులసమ్మ. పక్కింటి పీరాసామికి ఒక్కడే కొడుకు రంగనాయకులు. ఆ తులసమ్మ రంగ నాయకులికిచ్చి వివాహం చేయడంతో ఆ రెండు సంసారాలు ఒకటయ్యాయన్నది

గూడా నాకు వినికిడి ద్వారా తెలిసిన వృత్తాంతమే ! ఎందుకంటే ఆ తులసమ్మకు, రంగనాయకులకు వయసులో నాకంటే పెద్దవాడైన కుమారుడున్నాడు!

"తులసమ్మ బాగుందా, రాజశేఖరం?"

ఆ ప్రశ్నించిన ధోరణినిబట్టి చూస్తే, ఎన్నివంకరలు తిరిగినా రైలు చివరికి స్టేషనులోనే వచ్చి ఆగినట్టుంది. అయినా ఊరిలో ఎన్నో కాపురాలుండగా ఆ రెండింటిని గురించి, అందునా తులసమ్మ గురించి ఈయన ప్రత్యేకంగా అడగ డానికి కారణం?

ఇంతకూ ఈ దేవబంధుగా రెవ్వరు? ఈయనకు చింతలపల్లి గతచరిత్రతో గల సంబంధ మేమై వుంటుంది? ఆశ్చర్యంతో తల దిమ్మెక్కిపోతూందే గానీ, ఊహ ముందుకు సాగడం లేదు.

ఆగిన ట్టాగిన రైలు అంతలోనే కదిలింది.

"ఆ తులసమ్మ కొక మేనత్త కొడుకుండేవాడు. వాడి పేరు ఆంజి. తులసమ్మ పుట్టగానే ఆంజికి పెళ్ళాం పుట్టిందని చెప్పుకున్నారు లోకులు. అను కున్నవన్ని అనుకున్నట్టే జరగవు. ఆ ఆంజిగాడిది ఒక వక్ర జాతకం. వాడు చిన్నప్పుడే తల్లిదండ్రులను కోల్పోయాడు ! మేనమామ పాపయ్యగారే వాడి పెంపకం బరువు మొయ్యవలసి వచ్చింది. ఆ కుర్రవాడు తన కర్మ ఇలా కాలిం దన్న ధ్యాసే లేక లేనిపోని గొంతెమ్మ కోరికల్ని పెంచుకున్నాడు. పాపయ్యగారు తనను తీసుకువెళ్ళి రంగన్నపేట హైస్కూల్లో చేర్పించేసరికి, బాగా చదివించి ఆయన తన కూతురునిచ్చి పెళ్ళిచేస్తారని కొండంత ఆశ పెట్టుకున్నాడు. అత గాడి హైస్కూలు చదువు తీరా మారా పూర్తికాకమునుపే, అప్పటికింకా పెళ్ళి ఈడైనా రాని తులసమ్మకు వివాహం నిశ్చయమైంది. పీరాసామి కొడుకు రంగ నాయకులే వరుడు ! పీరాసామి డబ్బులో, డాబులో, దర్పంలో అన్నివిధాలా తనకు సాటివాడు. తన కొక్కత్తే కుమార్తెగా పుట్టడం వల్లనే తులసమ్మ అదృష్ట వంతురాలు. ఆ అదృష్టాన్ని రెండుతో గుణించాలనుకున్నా రంతేగానీ, పాపయ్య గారందువల్ల ఓ లేతగుండెకు తగిలే దెబ్బ ఏపాటిదో గ్రహించలేకపోయారు. స్వార్థం అలాంటిదే! అది తన ఇంటిముందర పందిరి వేసుకోడానికి కల్పతరువును

ఖండించడానికైనా వెనుదియ్యడు. పాపయ్యగారి దృష్టిలో ఆంజి ఏపాటివాడు ? వాడు దిక్కూ మొక్కూ లేని దురదృష్టవంతుడు ఆయన తన మోచేతి గంజి తాగేవాడికి దురభిమానా లుండగూడదన్నాడు. కానీ ఆ గంజి తాగడంకన్నా, ఆ నికృష్టపు బ్రతుకు బ్రతకడం కన్నా ఆంజికి నాలుగిళ్ళు అడుక్కుతిన్నా నయమే ననిపించింది. వాడు దేశాలపాలైపోయాడు! చింతలపల్లిలో ఎవరైనా ఆ నిర్భాగ్యుణ్ణి గురించి తలపెడుతుండగా విన్నావా, రాజశేఖరం?"

"వినకేమండీ! రంగన్నపేట హైస్కూల్లో చదువుకుంటున్న రోజుల్లో అతడు, మా నాన్నగారు కలిసి తీయించుకున్న ఫోటో ఒకటి ఇంకా మా ఇంట్లో వుంది మా నాన్నగారు అతణ్ణి గురించి తలచుకోని రోజు వుండేది గాదు. పల్లెటూరి పెద్దల ప్రసంగాల్లో గూడా అతడి పేరు తరుచుగా దొర్లుతూండేది. వెళ్ళిపోయిన తరవాత అతడి ఆచూకీ మాత్రం తెలిసింది గాదు. బైరాగుల్లో కలిసిపోయాడని కొందరనుకునేవారు. లేదు లేదు, అక్కడెక్కడే రైల్వేస్టేషన్లో ఇడ్డెన్లు అమ్ముకుంటున్నాడని కొందరు చెప్పుకునేవారు."

"కానీ ఒక వ్యక్తి లోకుల ఊహల కనుగుణంగా బైరాగుల్లోనే కలిసిపోవాలనిగానీ, ఇడ్డెన్లే అమ్ముకోవాలనిగానీ విధి నిర్దేశించదు. వాస్తవం వాళ్ళ ఊహలకు విరుద్ధంగా పరిణమించకూడదని సృష్టికర్త శాసనం వ్రాసిపెట్టలేదు. ఎలాగంటావా, రాజశేఖరం ?" ఆయన గిరుక్కున వెనుదిరిగి నన్ను సమీపించాడు. సత్యం పేలైనంత స్థూలస్వరూపం ధరించినట్టుగా ఆ నిలువెత్తు మనిషి నిటారుగా నా ఎదుట నిల్చున్నాడు— "ఆ ఆంజినే నేను!"

"మీరా ?"

"అవును. పాపయ్యగారి మేనలుణ్ణి, మీ నాన్నగారు శేషాద్రికి మిత్రుణ్ణి, తులసమ్మకు కాలేకపోయిన మొగుణ్ణి, ఆంజిని నేనే! చేత పైసలేక ఈ మదరాసు నగరానికి ఎలా వచ్చానో, ఈ నగర వీథుల్లో ఎన్ని అవస్థలు పడ్డానో అవన్నీ నేనిప్పుడు చెప్పను. ఒక చెట్టు పైకి చేరుకోవాలన్నది నా సంకల్పం. తాటిని పట్టుకుని పై కెగబాకుతున్నాను. సగంలో వుండగా నా కింది భాగాన తాటిని కత్తిరించి పారేశారు ! ఇక నేల నాది కాదు. జారి కిందపడితే ఎముకలు విరిగి, ఒళ్లు నుగ్గు నూచమైపోవడం ఖాయం! ఎలాగైనా కింది కొమ్మదాకా పాకడ మొకటే గత్యంతరం !

"ఆ పరిస్థితుల్లో నా మనస్సు మతం మార్పిడీ పైకి మళ్ళింది. ఈ మతం మార్పు చాలా చిత్రమైంది. ఇందువల్ల శరీరం మారడం లేదు మనస్సు మారదు. ఒకరకమైన మానవ సమాజంలో సన్నిహిత సంబంధాలు తెంచుకుని, ఇంకొక రకమైన సమాజంతో కలిసిమెలిసి వుండవలిసి వస్తుంది. శారీరక లక్షణాల్లోనూ, మనోవికారాల్లోనూ వారికి, వీరికి అట్టే తేడా కనిపించదు. ఎటొచ్చీ బాహ్యాచారాల్లో మాత్రమే భిన్నమైన పోకడలు, కొత్త ఆచారాలు అలవరుచుకోడంవల్ల నాకు నష్టమయ్యేదేముంది? అందుకు నేను సిద్ధపడ్డాను. కొత్తసమాజం నేను చదువుకునే వెరపు కల్పించింది. పట్టుగా చదివి అయిదారేళ్ళలో పట్టా పుచ్చుకున్నాను. అప్పటికీ నాకు తృప్తి కలగలేదు. చిన్నతనంలో హరిరావుగారు మాకో పద్యం చెప్పారు. సుజనుడు కందుకంలాంటివాడు. కిందికివేసి కొట్టినా బంతిపై కెగురుతుంది. మందుడు మట్టిముద్దలాంటివాడు. ఒకసారి కిందికి కొడితే ఇక నేలకంటుకపోవడమే! నేను కందుకాన్నా మృత్పిండాన్నా ? ఈ పరీక్షలో పరిపూర్ణ విజయాన్ని సాధించేదాకా నాకు సంతృప్తి కలిగేటట్టు లేదు. ఒక ధార్మికుల సంస్థ విద్యార్థులకోసం ఏర్పాటుచేసిన స్కాలర్‌షిప్పు సంపాదించాను. సీమకు వెళ్ళాను. అక్కడ చదువుకుంటూ, చదువు ముగిసిన తరవాత ఉద్యోగం చేస్తూ గడిపిన ఏడెనిమిదేళ్ళలోనే నాకు వివాహమైంది. భార్య మార్గరేట్ అనుకూలవతి. బిడ్డలు కలిగారు. వాళ్ళూ బుద్ధిమంతులు. అప్పటికింకా దేశంలో బ్రిటిష్‌వారి హయాం కొనసాగుతూంది. తిరిగి వచ్చేసరికి ఒక ఉన్నతోద్యోగం కాచుకుని వుంది. ఆ ఉద్యోగం చేస్తూ నిండుగా రెండు దశాబ్దాలపాటు ఉత్తరదేశంలో ఉండిపోయాను. ఉద్యోగ విరమణ చేయవలిసిన వయస్సు వచ్చింది. చివరిరోజులు ప్రశాంతంగా గడపడానికి, నా అభివృద్ధి వెలుగుబాటలు చూపిన ఈ నగరాన్నే ఎన్నుకున్నాను. ఇదే నా ఇల్లు! ఇంతకు మునుపు చూశావుగా, అదే నా కుటుంబం! చెప్పి ముగిస్తున్నానే, ఇదే నా జీవితకథ!"

అపూర్వమైన విచిత్రానుభవం ఒకటి ఆవహించినట్టుగా నా మనసు చైతన్యాన్ని కోల్పోయింది. నేను కూర్చున్న గది అప్పుడు నా పాలిటి కొక అంతరిక్ష నౌకలా భాసిస్తూంది. ఆ నౌక నన్ను గతంలోకి తీసుకువెళ్ళింది. కొద్ది నిమిషాల్లో అనేక సంవత్సరాల గత వృత్తాంతాలను వెండితెరలా నా మనోనేత్రం ఎదుట సాక్షాత్కరింపజేసింది !

"బాయ్, బాయ్" అంటూ జాకబ్‌ను పిలిచారు దేవబంధుగారు. గుక్క పట్టి రెండుగ్లాసుల మంచినీళ్ళు తాగేశారు. ముఖంపైన కమ్ముకున్న స్వేదబిందువులను తుడుచుకుంటూ మళ్ళీ వాలుకుర్చీలో కూర్చున్నారు.

"కానీ నువ్వు నన్ను అపార్థం చేసుకోగూడదు, రాజశేఖరం! నిన్నిక్కడికి పిలిపించింది నా జీవితగాథను వర్ణించి, ఆశ్చర్య చకితుణ్ణి చెయ్యడానికి కాదు."

ప్రశ్నార్థకంగా ఆయనవైపు చూస్తున్నాను.

"బడబాగ్నిలా నా హృదయంలో దాగిఉన్న ఆవేదన వెళ్ళబోసుకోవాలని..."

"మీ కావేదనా? ఎందుకూ?" తెల్లబోతూ అడిగాను.

"చెబుతున్నాను. రాత్రుళ్ళలో నిద్రపడుతుంది. తెల్లవారుజామున మేల్కొంటాను. ఆ మేల్కొన్న మొదటి క్షణంలో నాకు నేను దేవబంధుననిఅనిపించదు. చదువుల్ని సాధించాననీ, విదేశాలకు వెళ్ళి వచ్చాననీ, మార్గరేట్‌కి మొగుణ్ణనీ జ్ఞప్తికి రాదు. చింతలపల్లిలో ఆరు బయట వేసుకున్న నులకమంచం మీద లేచి కూర్చున్నట్టే తోస్తుంది. ఆ చింతలపల్లివారి ఊహల్లో నేను బైరాగిని. ఇడ్డెన్లు అమ్ముకునేవాణ్ణి. ఇంకా మాట్లాడితే బస్‌స్టాండులో కూలీని, కానీ ఈ శరీరంలోని జీవాత్మ నేను ఆదమరిచినప్పుడల్లా ఆ చింతలపల్లి పరిసరాల్లో సంచరించడానికి వెళ్ళిపోతుంది విరూపాక్షమ్మగుడి ఎదుట రాతిస్తంభాల మధ్యన ఉన్న ఉయ్యాల, దళవాయి నరసన్నగారి తోటలో జామపళ్లు, వీరారెడ్డిగారి పొలాల్లో చెరుకుగడలు, అనంతరాయని చెరువులో తామరపువ్వులు అవన్నీ జ్ఞప్తికొస్తాయి. అక్కడి మనుషులు కళ్లలో మెదిలినట్టే వుంటారు. ఎందులో ప్రయాణం చేస్తున్నా, ఎక్కడికి వెళ్ళినా నా చూపులు ఎవరికోసమో గాలిస్తున్నట్టుంటాయి. అంతెందుకు, రాజశేఖరం, ఈ రోజు సాయంకాలం రోడ్డు పైన నువ్వు కనిపించేసరికి శేషాద్రి ఛాయలు నీలో కనిపించడంతో, నిజంగా ఆ శేషాద్రే వచ్చి నా ఎదుట నిల్చున్నాడేమోనన్న భ్రమ కలిగింది. నేను చదువుకున్నాను. ఉన్నతోద్యోగం చేశాను. డబ్బు సంపాదించాను, దేశాలు తిరిగాను. ఒక్కమాటలో చెప్పాలంటే లోకం మానవుడి కందివ్వగలిగిన సుఖాలన్నింటినీ చూరలాడాను. కానీ నా అంతరాంతరాల్లో దాగి ఉన్న ఒకే ఒక గాఢమైన ఆకాంక్ష వ్యక్తం చేయనా, రాజశేఖరం! కళ్లు మూసేలోగా... ఒకసారి చింతలపల్లికి వచ్చి మన చింతలేటిలో

ఒక చిన్న చెలమ తీసి, అందులోని తియ్యటి నీటిని కడుపునిండుకు తాగేయాలని వుంది, ఆ కోరిక నెరవేరుతుందో, నెరవేరదో..."

చింతలపల్లికి కరెంటు వచ్చింది. ముందు కరెంటు వచ్చి వెనువెంటనే పంపుసెట్లు దిగాయి. కొత్తబావులు తవ్వారు. పాత బావుల్ని లోతుచేశారు. భూమితల్లి కడుపులోని అట్టడుగు ఊట దారుల్నిగూడా శోధించి పారేశారు! ఇప్పుడు చింతయేటిలో చెలమదీస్తే, అందులో ఇసకేగానీ నీళ్లూరవని అలనాటి ఆంజికి తెలియదు, ఈనాటి దేవబంధుగారికీ తెలియదు!

— ఆంధ్రప్రభ వారపత్రిక, 1967

# యాత్రానందం

యాభై యేళ్ళ క్రిందటి సంగతి. ఉన్నట్టుండి ఒక గ్రామస్తుడు శుభ్రంగా బోడి చేయించుకున్న తలతో ప్రత్యక్షమైపోతే "ఏందిరా చిన్నబ్బా! ఏం సంగతి?" అన్న పరామర్శ వెలువడడమూ, "మొన్ననే కొండకు పోయొస్తిసామీ !" అని బదులు రావడమూ పరిపాటి, "స్వామి ఎట్లా ఉండాడురా చిన్నబ్బా ?" అనేది రెండో ప్రశ్న. దీనికిక జవాబు విని తీరవలసిందే ! "ఆ సంగతేముందు సామీ ! పట్టు పీతాంబరాలు, నిలువెత్తు తోమాలలు, కళ్ళు జిగేల్ జిగేల్ మనేటట్టుగా రాళ్ళు పొదిగిన నగలు – ఆ వైభోగం చెప్పతరమా ! ఎందరెందరు జనం, ఎన్నిరకాల మాటలు, ఎన్నెన్ని వేషాలు – పోయిన వాళ్ళు పోతా వుంటే వచ్చే వాళ్ళు వస్తానే వుంటారనుకోండి ! మహన్న భావుడికి కొదవేముంది? నిత్యకళ్యాణం, పచ్చ తోరణం !"

ఆ వైభవాన్ని మనం కళ్ళారా చూచేదెప్పుడు – అనుకునే వాణ్ణి.

అప్పుడు నాకు తొమ్మిదేళ్ళు. రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది గానీ, దాని ప్రభావం మన ప్రాంతం పైకి అట్టే ప్రసరించలేదు. దేశం నిమ్మకు నీరెత్తినట్టు సుభిక్షంగా ఉండేది. ఓ రోజు రాత్రి, పుచ్చపువ్వులా వెన్నెల కాస్తున్న వేళ. రెండు పెంకుటిళ్ళకూ మధ్య ఆరుబయల్లో మంచం వాల్చుకున్నారు నాన్న గారు, ఆయన ప్రక్కనే నా తావు. ఎప్పుడైనా తన ప్లాన్లూ, పథకాలూ నాతో చెప్పడం మా నాన్నగారికో సరదా ! ఉండీ, ఉండీ ఆయనన్నారు గదా– "ఒరే రామూ ! –అమావాస్య పోయినాక పంచమి రోజున మనం ఇలు తీర్థం వెళ్తున్నామురా !"

"ఇలు తీర్థమంటే ఏంది నాన్నా?" అని అడిగాను.

నాన్నగారు వివరించారు– "ఇలు తీర్థమంటే ఇంట్లో ఎవరూ వుండకుండా, తలుపుమూసి, తాళం బిగించి, అందరమూ కలిసి తిరుపతి కొండకు వెళ్ళి, స్వామిని దర్శించుకొని, మొక్కుబళ్ళు చెల్లించుకొని తిరిగి రావడమన్న మాట!"

కుటుంబ సభ్యుల నందరినీ లెక్కపెట్టుకుంటూ నేను మళ్ళీ అడిగాను. "నాన్న, అమ్మ, చెల్లి, చిన్నాన్న, పిన్ని, బుజ్జిపాప, చిన్నచిన్నాన్న, నాన్నమ్మ, నేను — మొత్తం తొమ్మిది మంది. అందరమూ వెళ్తున్నామా నాన్నా ?"

"అరగొండ నుంచి మీ అత్తమ్మగూడా వస్తుందిరా రామూ !"

అత్తమ్మ వస్తే దేవకి గూడా తప్పకుండా వస్తుంది. దేవకంటే మా అత్తమ్మ కూతురు, నాకంటే, మూడేళ్లో, నాలుగేళ్లో పెద్దది. అరగొండ హైయర్ ఎలిమెంటరీ స్కూల్లో నిరుటి సంవత్సరమే ఎనిమిదో తరగతి పాసయింది. మీకూ, నాకూ మధ్య రహస్యాలెందుకులెండి! ఆ పిల్లను మా చిన్న, చిన్నాన్నకే చేసుకోబోతున్నాము. అయినా నేను 'పిన్నీ' అని పిలవనబ్బా! సిగ్గుగా వుంటుంది. 'అక్కా' అనే పిలుస్తాను. ఏమనుకున్నారో మీరు! మాదేవకంటే కథలకు కాణాచి. పాటలకు పుట్టిల్లు. యాత్రలో దేవకి గూడా వుందంటే భలే సంబరం !

పంచమి రేపనగా ఈరోజు సాయంకాలానికి మా అత్తమ్మ దేవకితో బాటుగా ఒంటెద్దు బండిలో వచ్చేసింది.

అప్పటికి మాయింట్లో పెళ్ళిపడిన పాటుగా వుంది. గోడలకు వెల్లవెయ్యడం, గచ్చుకడగడం, ముగ్గులు వెయ్యడం, మామిడాకుల తోరణాలు గట్టడం పూర్తయింది. మురుకులు, పప్పుబిళ్ళలు, అతిరసాలు — అంతెందుకు, నిలవ వుండే ఫలహారాలన్నీ చేసి బుట్టలకు నింపేశారు. చవితినాటి రాత్రియితే మా ఇంట్లో పెద్దవాళ్ళకెవరికీ నిద్దర్లేలేవు. అర్ధరాత్రి నుంచి అభ్యంగన స్నానాలు మొదలెట్టారు. పులిహోరలు, పెరుగన్నాలు చేసి కళాయిపోసిన పాత్రల్లో పదిల పరిచారు. బట్టలూ, బ్లాంకెట్లూ దుప్పట్లూ సర్దుకున్నారు. కొండపైన వంట చేసుకోడానికి బియ్యం, పప్పు, మిరపకాయలు, చింతపండు లాంటి కొంత అత్యవసర సామగ్రిని మేదర పెట్టెల్లో పెట్టించుకున్నారు. బరువులు మోయడానికి, ఆసరాగా వుండడానికి ఇద్దరు లేబ్రాయపు యువకులు గూడా మా వెంట రావడానికి సిద్ధమయ్యారు. పద్మూడుమంది వ్యక్తులతో రకరకాల సరంజామాతో తెల్లవారు జామున రెండు రెండెడ్ల బండ్లు కదిలాయి. విరగ బండి వాలిపోయిన పరిమళ్ళ మధ్య, జండా లెగరేస్తున్న చెరకు తోటల నడుమ, నీళ్ళు ఒడ్డును వొరుసుకుంటూ దబకలాడుతున్న చెరువు కట్టపైన, పక్షుల కలకూజితాలు వింటూ, మోటదోలే పంటకాపుల కబిల పదాలు ఆలకిస్తూ, చుక్కలు మసకబారి మాయమైపోతుండగా తూరుపు

దిక్కున లేలేత కెంజాయలు పైకి లేవడం గమనిస్తూ ఎద్దుల బండిలో ప్రయాణం చేస్తుంటే యెంత హాయిగా వుందో, చెప్పలేను. దామతె చెరువు స్టేషను చేరు కునే సరికి భళ్ళున తెల్లవారింది. రాబోతున్న రైలు బండిని గురించి మా నాన్న గారి మూలంగా కొన్ని వివరాలు తెలిశాయి. దాన్ని పడమటికి వెళ్ళే బండి అంటారట. అంటే అదిప్పుడు పడమటి నుంచి తూర్పు దిశగా వస్తుందన్నమాట. రాత్రి ఎనిమిది గంటలకు ధర్మావరంలో బయల్దేరి ముదిగుబ్బ, మొలకవేముల, ముక్తాపురం, కదిరి, మొలకల చెరువు, మదనపల్లి, వాయల్పాడు మొదలైన స్టేషన్ల మీదుగా అది ఉదయం ఏడు గంటలకు పాకాల జంక్షను చేరుకుంటుందట! అక్కడ దక్షిణాది నుంచి వచ్చే రైల్లోకి మారవలసి వుంటుందట. పాకాల నుంచి తిరుపతికి రెండు స్టేషన్లే అడ్డం !

బండి పొగలు గ్రక్కుతూ వచ్చి స్టేషన్లో ఆగిన దృశ్యం నిన్న మొన్నటి దృశ్యంలా నాకింకా బాగా జ్ఞాపకం వుంది. సాగిపోతున్న రైలు బండిలో నుంచి చూస్తుంటే ఇళ్ళు, పొలాలు, చెట్లూ వెనక్కు పరుగెత్తడం మహాచోద్యంగా వుంది. వక్కకొరికేటంత సేపట్లో మేము పాకాల జంక్షనులో వున్నాము. విళ్ళుపురం - రేణిగుంట బండి రావడానికి కొంత ఆలస్యమైంది. వచ్చిన బండి తమిళదేశపు గ్రామీణ ప్రాంతపు యాత్రికులతో బాగా రద్దీగానే వచ్చింది. అయినా ఒక పెట్టెలో ఎలాగో సర్దుకున్నాము.

బండి పనపాకం దాటి, చంద్రగిరి స్టేషను గూడా దాటుకుని ముందుకు పరుగిడుతోంది. పెట్టెలోని ప్రయాణీకులు ఉన్నట్టుండి ఒక్కవెట్టున "వడ్డికాసుల వాడా ! వేంకటా రమణా! గోవిందా! గోవిందా!" అంటూ భగవన్నామస్మరణ చేయసాగారు. అదేరా తిరుపతికొండ" అన్నారు నాన్నగారు.

"పాల సంద్రములోన పాప పానుపులా
రైలునందుండగనె కనిపించునీకు,
తులలేని అందాల తిరుపతి కొండ !
తెలుగమ్మ జడలోన మల్లెపూదండ!" – అంది దేవకి.

"అక్కా, అక్కా ! ఏదీ, ఇంకొక్క నిడుగు" అంటూ బ్రతిమాలు కున్నాను. అప్పటికి తిరుపతి స్టేషను దగ్గరి కొచ్చేసింది.

దేవకి కొనసాగించింది.

"ఏడు శిరసుల నాగు పడగెత్తినట్టు
బండి దిగుచుండగనె కనిపించు నీకు
గగనమ్ము నందుకొను గాలి గోపురము !
గోవింద రాజుల కచట కాపురము !"

"సాయంకాలం ఆ గుడికి వెళ్తున్నాము గదా !" అన్నారు నాన్నగారు.

ఆరోజు మధ్యాహ్నం స్టేషను దగ్గరగా ఉన్న దేవస్థానం వారి ధర్మ సత్రంలో బస చేశాము. మధ్యాహ్న భోజనం తరువాత ఒళ్లెరుగకుండా నిద్ర పట్టింది. సత్రాని కల్లంత దూరంలోనే గోవిందరాజుల గుడి. వేంకటేశ్వరుడికి గోవింద రాజ స్వామి వరుసకు అన్న అవుతాడట ! తమ్ముడి పెండ్లికి అప్పు చెయ్యడం కోసం ఆయన కుబేరుడి దగ్గరికి వెళ్ళాడు. కుబేరుడు కొండంత బంగారు కాసుల రాశిని చూపించి కొలుచుకోమన్నాడట. బళ్ళతో కొలిచి కొలిచి అలసి పోయిన స్వామి అట్లాగే బళ్ళను తలగడగా ఉంచుకుని శేషునిపైన వాలిపోయాడట. ఈ కథా వృత్తాంతాన్ని బలపరుస్తున్నట్టుగా గోవిందరాజస్వామి మాకు అనంత శయనుడై దర్శనమిచ్చాడు.

ఆ రాత్రికిక సత్రంలోనే నిద్ర. మరునాటి ఉదయం అయిదు గంటలకే మా యాత్రా బృందం కొండవైపు తరలింది. చీకట్లు విచ్చిపోతున్న కొద్దీ స్వామి కొండ స్పష్టంగా దృగ్గోచరం కాసాగింది.

దేవకి నా భుజంపైన చేయివేసింది. ఏమిటన్నట్టుగా తలపైకెత్తి ఆమె ముఖంలోకి చూచాను.

"అందు కోవలసిన ఆదర్శమట్లు
అహిరాజుగిరి పైన కనిపించు నీకు
లీలగా అలిపిరి గాలిగోపురము !
బాబులూ ! శ్రమపడి ఎక్కాలి మనము!"

ఆ మాట నిజమే ! అలిపిరిని అందుకునే సరికి అసురుసురై పోయాము. దేవకి హెచ్చరికలోని వాస్తవం ఏ పాటిదో తెలిసొచ్చింది.

"అప్పుడే ఏమయింది? మోకాటి మెట్ల దగ్గర వుంది మీ కథ!" అన్నారు నాన్నగారు.

"ఆయాసంగా వుందిరా నాయనా! కాసేపు బడలిక తీర్చుకోక పోతే నేనెక్కలేను" అంటూ నాన్నమ్మ ఒక మెట్టుపైన కూలబడిపోయింది.

అప్పటికి సూర్యోదయమై నాలుగు బారల ప్రొద్దెక్కింది. నులివెచ్చని పసిమి కిరణాల మలామాలో, పచ్చని తరులతా గుల్మాదులతో కూడిన కొండలు, కోనలు కన్నుల పండువగా ఉన్నాయి. మైమరిచి అక్కడెంత సేపు చూర్చు న్నామో తెలియదు.

"ఆలస్యమైతే ఎండకు తట్టుకోలేము. పదండి, పదండి" అంటూ వేగి రించారు నాన్నగారు.

మా యాత్ర మళ్ళీ కొనసాగింది.

అరణ్య గర్భం గుండా ముందుగా నేను వెళ్తున్నాను. లోగొంతులో పాడు కుంటూ దేవకి నా వెనుక నుంచి నడుస్తోంది.

"జామ మామిడి వెలగ సీతాఫలము చెట్లు
చెట్లతో పెనవేసుకున్న పొదరిళ్ళు
కొల్లలమ్మా చెల్లి, ఈ కొండపైన
జల్లు జల్లని పారుచుండు సెలయేళ్ళు !"

అబ్బో, ఎన్నెన్ని సెలయేళ్ళో! విరామ మనేది తమ స్వభావానికి విరుద్ధమై నట్టుగా పడుతూ లేస్తూ త్రుళ్ళింతలిడుతూ, మలుపులు తిరుగుతూ, ఒకచోట బాహా టంగా కనిపించి, మరొకచోట అంతర్ధానమైపోతూ అల్లరి పిల్లల్లా ఇచ్ఛవచ్చినట్లల్లా ఆడుకుంటూ, తమ దైన గొంతుతో పాడుకుంటూ అవి ఎక్కడికి వెళ్తున్నాయో !

మేమొక కొండ పేటు ప్రక్కన నడుస్తున్నాము. ఎడమవైపున నిటారుగా పైకి లేచిన పేటు. కుడివైపున పాతాళాన్నంటే పెద్దలోయ...

"కొండ కొమ్మును జూడ తలయెత్త బోకు
కొప్పులో పువ్వులు క్రింద జారేను !
ఆ లోయ పేరు అవ్వా సేరు కోన,
అటుచూడ బోకురా కళ్ళు తిరిగేను !"

చొక్కా కాలరు పట్టుకొని నన్ను వెనక్కు లాగుతూ అంది దేవకి.

ఉదయం తొమ్మిదింటికి మేము ఏడుకొండల మేడలెక్కి ఎక్కడికి చేరు కోవాలో అక్కడికి చేరుకున్నాము. పదివేల శేషుల పడగల మయమైన శ్రీహరి వాసాన్ని దూరదూరాల నుంచే కనుగొంటూ, దగ్గిరికి నడిచాము. శరీరానికి ఇంపిత మైన, మనసుకు ఆహ్లాదకరమైన ఆ ప్రశాంత వాతావరణంలో పులకించిపోయాము. కళ్యాణ కట్టలో తలనీలాలు సమర్పించడం, పుష్కరిణిలో స్నానం, పూట కూళ్ళ ఇంట్లో మధ్యాహ్న భోజనం, ఇన్ని పనులూ ముగిశాక, కదులుతున్న భక్తుల వరుసతో బాటు కదులుతూ జగములేలే ప్రభువు సన్నిధానంలోకి చేరుకునే సరికి గంట నాలుగున్నర కావచ్చింది.

నిలువెత్తు దేవుడు, నయన మనోహరంగా నిల్చున్నాడు. అభయముద్రపట్టి ఆశీస్సులందిస్తున్నాడు.

వరుసలో నా ముందుగా నిల్చున్న దేవకి మెల్లగా పాడుకుంటూ వుంది.

"భక్తితో కొలిచిన కరుణించి మనకు
వరమిచ్చు వడ్డికాసుల వేల్పు వీడు-
ఈ రేడు లోకాల పాలించు వాడు
ఏడు కొండలపైన వెలసి యున్నాడు !

శ్రీనివాస ప్రభో ! నీకు జోహారు !
శ్రీ వేంకటేశ్వరా ! నీకు జేజేలు !
అనుచు చేతులు మోడ్చి మ్రొక్కవలెనండి !
శుభములొదవును మనకు, ఇది తథ్యమండి !"

దేవకి చేతులు జోడించింది.

స్వామి పెదవిపైన మందహాసం మెరిసింది. "అమ్మాయ్ ! నీ భక్తిభావం గొప్పది. నీకు సమస్త సన్మంగళాలూ కలుగునుగాక !" అని దీవించాడు.

తరువాత వంతు నాదే ! ఏమంటాడో ! ఏమిటోననీ జంకు గొంకులతోనే అంజలి ఘటించాను.

"ఓరి చిలిపికుంకా ! పుట్టి తొమ్మిదేళ్ళయ్యాక ఇప్పుడొస్తున్నావా ! ఇక మీదట వీలయినప్పుడల్లా వస్తుంటావు గదా?" అన్నాడాయన.

"అట్లాగే స్వామీ. అట్లాగే" అన్నాను.

మరునాడు మేము గోగర్భం వెళ్ళాము. పాపనాశనంలో గ్రుంకులు తీశాము. జాబాలి తీర్థమంతా తిరిగి చూచాము. కొండల్లో కోనల్లో, పెరిగిన తరువుల్లో, విరిసిన పువ్వుల్లో, జలాశయాల్లో, జలపాత్రాల్లో, సూర్యకాంతుల్లో, వెన్నెల వెలుగుల్లో, చలిగాలుల్లో, వానజల్లుల్లో వివిధ ప్రాంతాల, వివిధ భాషల, వివిధ వేషాల, వివిధ ఆకారాల ప్రజల వెల్లువల్లో భగవల్లీలలు భావించి, దర్శించి తరించాము. సత్రంలో ఓ గది తీసుకుని మా వంట మేమే చేసుకుంటూ మూడు రోజులపాటు భగవత్సన్నిధిలోనే ఉండి నాలుగో నాడు చంద్రగిరి దారిలో క్రిందికి దిగి వచ్చేశాము. పంచమి నాటితో ప్రారంభమైన మాయాత్ర దశమినాటితో ముగిసింది.

ఏకాదశి రాత్రి మా ఇంట్లో పెద్ద సమారాధనం జరిగింది. గాడిపొవ్వులు తవ్వించి, గుండిగలు పెట్టించి, పెద్ద యెత్తున వంటలు చేయించి, సమీప ప్రాంతాల లోని బంధుమిత్రుల నందరినీ పిలిపించి, యాత్రకు వెళ్ళి తీసుకొచ్చిన తీర్థ ప్రసాదాలన్నీ పంచిపెట్టిన తర్వాత, మృష్టాన్నాలతో వారిని సంతృప్తుల్ని కావించాము. సాకల్యంగా నెరవేరిన ఇలు తీర్థాన్ని పురస్కరించుకొని, ఫలానా వాళ్ళు గొప్ప సమారాధన చేశారని చుట్టుపక్కల గ్రామాల వాళ్ళు ఘనంగా చెప్పుకున్నారు.

* * *

చెప్పాను గదండీ, ఇదంతా యాభైయేళ్ళ క్రిందటి సంగతి. నా ప్రస్తుత నివాసం హైదరాబాదు. రాష్ట్రస్థాయి ఉద్యోగిని. జీతం పదివేలు, క్వార్టర్స్ ఫ్రీ' రెండు కార్లు, మూడు ఫోన్లతోబాటు నలుగురు పనివాళ్ళు ఎల్లప్పుడూ నా అధీనంలో వుంటారు. ఉన్న వ్యాపకాలను బట్టి నాకు వీలు దొరకడం కలలోని మాట ! అయినా వీలు చేసుకుని ఏడాదికోసారి తిరుపతి వెళ్తాను.

ఏదైనా ఎక్స్‌ప్రెస్‌లో వెళ్ళి దిగేసరికి స్థానికులైన క్రింది ఉద్యోగులు నా కోసం కారు ఏర్పాటు చేసి వుంటారు కొండపైకి ఓ గంట ప్రయాణం. మధ్యాహ్నానికల్లా ప్రత్యేక దైవ దర్శనం. సాయంకాలం మళ్ళీ ఏదో ఒక బండిలో తిరుగు టపా తప్పనిసరి.

ఈ తాపత్రయాన్ని చూచి స్వామి జాలిపడడం రివాజైపోయింది. "ఏం

నాయనా! బాగా బిజీ అయిపోయావు గదూ! భార్యా బిడ్డలతోనైనా గడపడానికి తీరికలేనట్టుంది. అయ్యో పాపం!" అంటుంటా డాయన.

"అవును స్వామీ! నేను తింటున్నానే గానే ఆ తిండిలోని రుచిని ఆస్వాదించలేకపోతున్నాను. జీవిస్తున్నానే గానీ జీవితంలోని మాధుర్యాన్ని చవి చూడలేకపోతున్నాను. యాత్ర చేస్తున్నానే గానీ యాత్రానందాన్ని పొందలేకపోతున్నాను. యాంత్రిక నాగరికత నన్నొక యంత్రంగా మార్చేసింది. నువ్వేమో రాతినే నాతిగా మార్చిన వాడివి! నన్ను మళ్ళీ మనిషిగా చేయవా స్వామీ?" అని నేను వేడుకుంటూ వుంటాను.

— ఆంధ్రప్రభ వారపత్రిక, 1991.

# జగమేలే పరమాత్మా
# ఎవరితో మొరలిడుదు

శ్రీనివాసమూర్తి కత్తిమీద సాము చేయగలనని చెప్పడం మాత్రమేకాదు, కత్తివాదర మీద నడిచి నిరూపిస్తున్నాడు కూడా ! వ్రతంలో దాదాపు ముప్పాతిక వంతు నిర్విఘ్నంగా నెరవేరినట్టే లెక్క. కార్యక్రమం ఇంకొక అరగంటలో పూర్తి కావచ్చు. ప్రస్తుతం శాస్త్రిగారు 'నగు మోము గనలేని తన జాతిని గురించి' పరాత్పరుడికి తెల్పుకుంటూ, నిశ్చల కాసారంలో గులకరాయి పడడం వల్ల అలలు క్రమక్రమంగా పెద్దవై అంచులదాకా విస్తరించినట్టుగా, ఆభేరి రాగంపైన భేరీ ధ్వనుల తరంగాలను సృష్టిస్తున్నారు. రెండు గంటల సేపటి నుంచి కొనసాగు తున్న కచ్చేరీ ఒక స్థాయీభావంలోకి వచ్చేసినట్టు సభ అంతా ఒక నిశ్చలమైన చిత్తరువులా స్తంభించిపోయింది. సైడ్ కర్టెన్ అవతల స్తంభానికి ఆనుకుని పోత పోసిన విగ్రహంలా నిల్చున్న 'రసతరంగిణి' కార్యదర్శి శ్రీనివాసమూర్తి పాత్ర నిర్వహణలో తానప్పటివరకు తీసుకున్న మెలకువలను గురించి, ఇకమీదట తీసు కోవలసిన జాగ్రత్తల్ని గురించి తలపోసి చూసుకుంటున్నాడు.

ఆనాటి సాయంకాలం నాలుగున్నర గంటలప్పుడు స్టేషనులోకి వచ్చి ఆగిన ఎక్స్‌ప్రెస్ బండిలోని ఒక ఫస్టు క్లాసు కంపార్టుమెంటులో నుంచి దిగి, దర్పాన్ని ప్రకటించే చూపుల్తో ప్లాట్‌ఫారాన్ని సర్వేచేస్తూ నిల్చున్న దేవకోట అనంత నారాయణ శాస్త్రిగారి మెడలో ట్రిక్ ఫోటోగ్రఫీలో తనంతట తానుగా వచ్చి దివ్య పురుషుడి కంఠంలో పడబోయే హారంలా ఏవైపు నుంచి వచ్చిందో, ఎలా వచ్చిందో తెలియకుండా నిండైన గులాబీ దండ ఒకటి వచ్చి పడిపోయింది. దూర దూరాలకు ప్రసరిస్తున్న చూపుల్ని శాస్త్రిగారు తమ చెంతకు లాక్కునేటప్పటికి అవనత శిరస్కుడై ముకుళిత హస్తుడై ఎట్టయెదుట నిల్చున్న శ్రీనివాసమూర్తి కనిపించాడు.

"రసతరంగిణి కార్యదర్శి మీరేనా?" శాస్త్రిగారి పలకరింపు కూడా త్యాగ రాయ కీర్తనల్లోని ఒక పల్లవిలాగే వినవచ్చింది.

"అవునండీ, నేనే" అన్నట్టుగా శ్రీనివాసమూర్తి తలాడించాడు.

ఈలోగా ఎక్కడో జనరల్ కంపార్ట్‌మెంటులో కూర్చున్న శాస్త్రిగారి నౌకరు కుప్పుసామి పరుగెత్తుకుంటూ వచ్చి కంపార్టుమెంటులోనుంచి పెట్టె క్రిందికి దించేశాడు!

మహారాజుగారికి "ఇటు, ఇటు" అంటూ దారిచూపే కంచుకిలా శ్రీనివాస మూర్తి ముందు నడవగా, అతడి వెనుక శాస్త్రిగారు, ఆయన వెంట నౌకరు కుప్పుసామి స్టేషనులో నుంచి ఈవలికి వచ్చారు. "వాకిటనే పదిలముగా వాతాత్మజుడు" అన్నట్టుగా అక్కడ కారు సిద్ధంగా వుంది.

బస ఏర్పాటు చేసింది కూడా హోటల్లో గీటల్లో కాదు. ఆర్ అండ్ బి వారి టి. బి.లో ప్రత్యేకగారం. మంచంపైన మెత్తటి పరుపు, మల్లెపువ్వులాంటి దుప్పటి, పొందికైన తలగడ, చుట్టూ దోమతెర, సుఖాసనాలు, బాత్‌రూంలో వాష్ బేసిన్ దగ్గర పార్సెల్ విప్పవి సోపు, స్టాండుకు మడత చెరగని టవలు, హాల్లో అగరొత్తుల పరిమళాలు.

స్నానం చేసి ఈవలికి రాగానే, ప్రత్యేకంగా పురమాయించి నేతితో తయారుచేసి తెప్పించిన ఉపాహారం— తీసి తినుబండారాలతో సహా.

ఆఖరికి పాటలో ముక్తాయింపులా తాంబూలం, చెన్నూరు నుంచి తెప్పించిన తమలపాకులు, పొట్టులా తరిగిన పచ్చి వక్కలు తంగభస్మం పొగాకు.

ఏ విధంగా చూసినా వేలెత్తి చూపడానికి వీల్లేని ఉపచారాలై పోయాయి. "దొరుకునా ఇటువంటి సేవ" అని అనుకోవలసిన పరిస్థితి.

బుగ్గన దిట్టంగా తాంబూలం దట్టించిన శాస్త్రిగారు ఆరూ పదిహేనుకు కాలింగ్‌బెల్ నొక్కి "ఏమయ్యా కార్యదర్శిగారూ! ఆరున్నరకే గదా ప్రోగ్రాము?" అని అడిగారు.

'చిత్తం చిత్తం' అన్నట్టుగా శ్రీనివాసమూర్తి తల పంకించాడు.

అంగుళం వెడల్పున వెండి జరీ అంచు వచ్చిన కాంచీపురం పట్టు పంచె పైన ఈగ వాలినా జారిపోయేటట్టున్న సగిషీల హాంబట్టు జుబ్బా తొడుక్కొని, కనకాంబరం రంగు కాశ్మీరు శాలువా భుజం పైనుంచి నిలువునా వేలాడేటట్టుగా పల్లెవాటు వేసి, కర్ణకుండలాలతో, గండపెండేరంతో, కరకంకణాలతో, రవ్వల

అంగుళీయకాలతో, వినతాసుత వాహనుడై వెడలిన కోదండపాణిని తలపిస్తూ శాస్త్రి గారు కారులో అధివసించారు.

హాలు దగ్గర కూడా స్వాగత సత్కారాలకు కొదవేమీ లేదు. పక్క బలంగా వచ్చిన వాళ్ళు కూడసంగీత విద్యా విశారదులే. ఆకాశవాణిలో పనిచేసి పదవీ విరమణ పొందిన కర్పూరపు సూరిబాబుగారు వయొలిన్. లయవిన్యాస కోవిద కోడూరు లింగప్పగారు మృదంగం. ఇక ఘట విద్వాంసుడేమో శ్రీరంగ పురం సంతానమయ్యరు కచ్చేరీల్లో పాల్గొన్న ఘటికుడు మేల్పాడి పరమశివం. ఈ ముగ్గురితో కలిసి అనంత నారాయణ శాస్త్రిగారు వేదికపైన కొలువుదీరేసరికి జనంతో క్రిక్కిరిసిపోయి ఉన్న సభ తంత్రులు బాగా బిగించిన జంత్ర వాద్యంలా నాద సుధా రసపానానికి సిద్ధంగా వుంది.

రసతరంగిణి అధ్యక్షుడు, రిటైర్డ్ శిరస్తాదారు కలిదిండి పున్నారావు జాగ్రత్తగా రాసుకొచ్చిన వాక్యాలతో పరిచయ కార్యక్రమం పూర్తిచేశారు.

దేవకోట అనంత నారాయణ శాస్త్రిగారి జన్మస్థలం తిరువేలంగాడు. ఒకప్పు డది చిత్తూరు జిల్లాలో ఉండి, పటాస్కర్ కమిషన్ నిర్ణయం మేరకు తమిళనాడుకు బదలీ అయింది. అందువల్ల మదరాసు నగరంలో స్థిరపడినప్పటికీ శాస్త్రిగారు తెలుగువారి క్రిందే లెక్క. వీణ కుప్పయ్య వంశానికి చెందిన వీణ పద్మనాభయ్య దగ్గర శిష్యరికం చేసి శాస్త్రిగారు చాలా చిన్నవయసులోనే సంగీత వారాశిని ఔపోసనం పట్టారు. పన్నెండేళ్ళ ప్రాయం నుంచి కచ్చేరీలు చేస్తున్నారు. దక్షిణాదిలో ఆయన కచ్చేరీ చేయని పట్టణాలే లేవు. ఆకాశవాణి నిర్వహించే అఖిల భారత సంగీత కార్యక్రమాల్లో పెక్కుసార్లు పాల్గొన్నారు. అఖండ సన్మానాలందు కున్నారు. అనేక బిరుదులకు పాత్రులైనారు. అంతటివారు 'రసతరంగిణి' వంటి చిన్న సంస్థ ఆహ్వానాన్ని మన్నించి ఇక్కడికి రావడం మన అదృష్టం..."

పరిచయాలు పూర్తికాగానే శాస్త్రిగారు రాగాలాపన మొదట్టాలెరు. హంస ధ్వనిలో వినాయక స్తవం... 'వినాయక విను విన్నాబోచుటకు వేరెవరున్నారు.'

తొలి వేలుపుకు చెల్లించవలసిన మర్యాద చెల్లించేశాక సభావందనం చేయ దలచుకున్నట్టుగా ఆయన పంచరత్న కీర్తన అందుకున్నారు—

"ఎందరో మహానుభావులు
అందరికిని వందనములు..."

హృదయారవిందంలో లోకేశ్వరుడి అంతరంగాన్ని దర్శించి బ్రహ్మానందం అనుభవించేవారికి, స్వాంతమనే సరోజాన్ని దేవదేవుడి పాదపూజ నిమిత్తం వినియోగించేవారికి, శ్రుతి, పురాణాలలోని మర్మాలను, షణ్మతాల గూడార్థాలను గ్రహించి, భావ, రాగ, లయాదుల పరిజ్ఞానంతో చిరాయువు కలిగి సుఖాతిశయాలతో అతిశయిల్లే వారికి ఇలా వరుసగా అందరికీ వందనాలు చెల్లించిన తర్వాత, నల్లేరుపైన బండి నడిపించినట్టుగా పద కవితా పితామహుడి పాటలు రెండు పాడి వినిపించి, ఆపైన తూము నరసింహదాసు కీర్తనలు రెండు ఆలాపించి, స్వాతి తిరునాళ్ జావళీ ఒకటి గానం చేసి, మళ్ళీ ఆయన త్యాగబ్రహ్మ గాన సామ్రాజ్యంలోకే తరలి వచ్చేశారు.

"శాంతము లేక సౌఖ్యము లేదు
సారసదళ నయనా !
దాంతునికైన, వేదాంతునికైన..."

వాక్కుల సముదాయమే వాఙ్మయం. నిఘంటువులు తెరిచి చూస్తే వేలకొలది పదాలు కనిపిస్తాయి. వట్టి అక్షరాల కలయికగా ఉన్నంత వరకు పదం వెలగని విద్యుద్దీపం లాంటిదే ! ఏ పదానికైనా జీవం రావటం ఉచ్చారణ వల్లనే. అయితే, మాటలు ఒక్కొక్కరి నోట ఒక్కొక్క రకంగా వినిపిస్తాయి. కొందరి ప్రసంగం గంభీరంగా వుంటుంది. కొందరి సంభాషణ పేలవంగా వుంటుంది. కొందరు మాట్లాడుతుంటే తలపైన సుత్తితో కొట్టినట్టు కర్ణకఠోరంగా వుంటుంది. కొందరు మాట్లాడుతుంటే ఇంకా మరికొంతసేపు వినాలన్నంత కర్ణరసాయనంగా వుంటుంది. కొందరివి చిలక పలుకులైతే, కొందరివి నెమలి క్రేంకారాల్లా వుంటాయి. అయితే, అన్నింటిలోనూ వేణువులా, వీణలా, నాదస్వరంలా ఏ స్థాయిలోనైనా అత్యంత మధురంగా ఉండేది జీవితమంతా సాధన చేసిన గాయకోత్తముల కంఠస్వరమే. అనంత నారాయణ శాస్త్రిగారి స్వరపేటిక దానికదే ఒక సంగీత వాద్యంలా వుంది అందులో నుంచి వెలువడిన ప్రతి స్వరమూ ఆపాత మధురమైన ఒక సంగీత తరంగంలాగే ఉంది. అందులో నుంచి వెలువడిన ప్రతి మాటా నిండుగా ప్రాణాలు పోసుకుని ఒక మంత్ర శబ్దంలాగే వినవస్తోంది.

శ్రోతలందరూ చెక్కి పెట్టిన చెక్కబొమ్మలు !

అవును. శాంతము లేక సౌఖ్యము లేదు. ఇది రాజులకైనా, కవిరాజులకైనా మునిరాజులకైనా సమానంగా వర్తించే మాట.

"దారసుతులు ధనధాన్యములుండిన
సారెకు జపతప సంపద కలిగిన
ఆగమ శాస్త్రములన్నియు చదివిన
భాగవతులనుచు బాగుగ పేరైన..."

ఏమైనాసరే ! ఎంతవారలైనా సరే, శాంతము లేక సౌఖ్యము లేదు.

భృగు మహర్షి ఉరోభాగంలో తన్నినా విష్ణుదేవుడు కోప్పడలేదు. కౌరవులు ఎన్ని దురన్యాయాలు చేసినా ధర్మరాజు కోపించుకోలేదు. గయ్యాళి భార్య తలపైన కడివెడు నీళ్ళు కుమ్మరించినా సోక్రటీసుకు కోపం రాలేదు. త్యాగయ్యగారు మాత్రం ? ఆయన ప్రాణాధికంగా భావించి, ఆరాధించుకునే సీతారామ లక్ష్మణుల విగ్రహాలను తీసుకెళ్ళి అన్న జపేశుడు నదీజలాలలో పారేశాడు. త్యాగరాజు దుఃఖించాడే గానీ దురుసుగా ఒక మాట అనలేదు. 'హరి, నేనెందుకు వెదుకురా' అని ఆక్రోశించాడే గానీ, ఆగ్రహలేశమైనా ప్రకటించలేదు. అందువల్ల శాంతము లేక సౌఖ్యము లేదు అన్నది త్యాగరాజు నాలుక చివరినుంచి ఊడిపడిన మాట అయి ఉండదు. నిస్సందేహంగా అంతరంగం నుంచి పెల్లుబికి వచ్చిన మాట అయి వుంటుంది. అది ఒక కాలానికి, ఒక దేశానికి సంబంధించిన మాట కాదు. సర్వకాలాలకు, సర్వదేశాలకు చెందిన శాశ్వత సత్యం. అర్ధ నిమీలిత నేత్రాలతో మైమరచి వింటున్న శ్రోతలకది అనంత నారాయణ శాస్త్రిగారు పాడుతున్న పాటలా లేదు. కావేరీ తీరంలో, సాంద్రవృక్ష ఛాయలో కూర్చుని త్యాగయ్యగారు ఆలాపిస్తున్న కీర్తనలాగే వుంది

ఈత నేర్చినవాడికి త్యాగరాజగాన సుధాంబుధిలో ఎన్నెన్ని అనర్ఘ రత్నాలైనా లభిస్తాయి. శాస్త్రిగారీసారి మరొక అమూల్య రత్నాన్ని ఒడిసి పట్టుకున్నారు. ఇదివరకు పాడింది స్టేట్‌మెంటు అయితే, ఇప్పుడు మొదలెట్టింది ప్రశ్న. ఇందులో త్యాగరాజుగారు బదులు చెప్పవలసిందిగా తన మనసును తానే అర్థిస్తూ 'నిధి చాల సుఖమా, రాముని సన్నిధి సేవా సుఖమా' అని ప్రశ్నిస్తున్నారు. ధన కనక వస్తు వాహనాలంటే ఆయనకు తృణప్రాయం. శ్రీరాముని

సేవచేసే భాగ్యమే ఆయనకు పెన్నిధి. కమ్మని అనుబంధాలపైన ఆయనకు మక్కువ లేదు. నిరంతర భగవత్సంకీర్తనం పట్లనే ఆయనకు ధ్యాస.

అలాగని నాస్తిక భావం కన్నా ఆస్తికత గొప్పదని గానీ, ధనార్జన పట్ల పూర్తిగా ఆసక్తి కలిగి ఉండరాదని గానీ అనుకోనక్కర్లేదు. తాను ప్రవచించిన సిద్ధాంతాలకు త్యాగయ్యగారు ఎంతవరకు అంటిపెట్టుకో గలిగారన్నదే ముఖ్యమైన విషయం. ఎందరో ప్రభువులు, శ్రీమంతులు త్యాగరాజు గానామృతాన్ని తనివి తీరా గ్రోలి, పరవశించి ఆయనకేదైనా ఉపకారం చేయాలనుకున్నారు. సన్మానాలు చేద్దామంటే ఆయన ఒప్పుకోడు. డబ్బిస్తే తీసుకోడు. 'మరెట్లా ? చేతిలో పైసా లేకుండా నిజ దార సుతోదర పోషణ ఆయనకెలా సాధ్యమైంది?' అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఉదయకాలపు అనుష్ఠానాలన్నీ ముగిసిన తర్వాత ఆయన నాలుగు వీధులూ తిరిగొచ్చేసరికి చేతిలోని భిక్షపాత్ర నిండిపోయేది. ఆ బియ్యంతో రోజు గడిచిపోయేది.

'దమశమమను గంగా స్నానము సుఖమో'క
ర్దమ దుర్విషమ కూప స్నానము సుఖమో
మమత బంధనాయుత నరస్తుతి సుఖమో
సుమతి త్యాగరాజ నుతుని కీర్తన సుఖమో.

ఏ పరలోకాలనుంచో దిగివచ్చి త్యాగరాజు ఆత్మ తనను ఆవేశించినంత అర్థవంతంగా శాస్త్రిగారు గీరాలాపన చేస్తున్నారు. సభలో ఇప్పుడు మిగిలి ఉన్న వల్లా కర్ణామృతమైన గానమూ, దానినాస్వాదించే సభికుల సూక్ష్మశరీరాలూ మాత్రమే. సంగీత విద్యా ప్రదర్శనం ఆ స్థాయికి చేరుకున్నాక ఆయన కచ్చేరీ కంతా శిఖరాయమానంగా మరొక సుప్రసిద్ధ త్యాగరాయ కీర్తన అందుకున్నారు.

"నగుమోము గనలేని నా జాలి తెలిసి
నను బ్రోవ రాదా, శ్రీ రఘువరా..."

ప్రవాహం ఆనకట్ట దగ్గర ఆగిపోయినట్టుగా, రెండు గంటల సేపటి నుంచి కొనసాగుతున్న కచ్చేరీ ఈ పాట దగ్గరే ఆగిపోయింది.

"ఖగరాజు నీ ఆనతి విని వేగమె చనలేదో
గగనానికి ఇలకు బహుదూరంబనినాడో

జగమేలే పరమాత్మా !
ఎవరితో మొరలిడదు..."

ఆనకట్ట దగ్గర కూడా నీరు ఒక మట్టం దాకా పెల్లుబికిన తర్వాత తూము తలుపులు తీసేస్తారు. అప్పుడిక తెరిచిన తూము గుండా నీరు మరింత ఉరవడిగా తొండాలతో చిమ్మినట్టు క్రిందికి దూకుతుంది. 'జగమేలే పరమాత్మా' అన్న సంబోధన దగ్గిరికి వచ్చేసరికి, పాట కచ్చేరీ కూడా ఆ స్థితికి వచ్చేసింది.

అయితే, ఒకటి త్యాగరాజుదంతా ఆత్మవిచారం. స్వామి నగుమోము కనిపించలేదన్నదే ఆయన ఆవేదన. కానీ, చెలమ తీసిన కొద్దీ నీళ్లూరినట్టుగా, కాలం గడిచినకొద్దీ అదే మాటకు ఎన్నెన్నో కొత్త అర్థాలు స్ఫురిస్తున్నాయి.

బిడ్డ తనకేదైనా అవజ్ఞ జరిగితే తల్లితో చెప్పుకుంటాడు. శిష్యుడు తనకేమైనా ఇబ్బందులేర్పడితే గురువుతో చెప్పుకుంటాడు. సివిల్, క్రిమినల్ తగాదాలు పరిష్కరించడానికి సుప్రీం కోర్టు దాకా వివిధ న్యాయస్థానాలున్నాయి. అయితే తల్లిదండ్రులుగానీ, సంఘనేతలు గానీ, న్యాయస్థానాలు గానీ నివారించలేని అస్తవ్యస్త పరిస్థితులు సమాజంలో ఉన్నప్పుడు మానవుడు తన సొదనంతా ఎవరి దగ్గర వెళ్ళబోసుకుంటాడు ? అలాంటి సందర్భాల్లో ఆస్తికులైన వారికి ఆలించినా, పాలించినా భగవంతు డొకడే ఏడుగడగా కనిపిస్తాడు. "స్వామీ! సమాజం ఉండవలసిన తీరుకు, వున్న తీరుకు గగనానికీ ఇలకూ ఉన్నంత అంతరం ఏర్పడిపోయింది. మాటలకు,చేతలకు పొంతన వుండడం లేదు. సేవ అనే ముసుగు క్రింద స్వార్థం బుసలు కొడుతోంది. మూర్ఖులు సభాపూజ్యులై పోయారు. అవినీతిపరులకే అగ్రపీఠాలు లభిస్తున్నాయి. మంచివాళ్లు అప్రయోజకులైపోయారు. గూండాలు హీరోలుగా చలామణి అవుతున్నారు. ప్రజాస్వామ్యం పట్టి నేతి బీరకాయ చందమైపోయింది. కంచెలే చేలు మేస్తున్నాయి. విధ్వంసక కృత్యాలు పెచ్చరేగిపోతున్నాయి. కళలు వ్యాపార ధోరణికి దాస్యం చేస్తున్నాయి. జగన్నాయకా! ఈ విపర్యాయాన్ని గురించి నేనెవరితో చెప్పుకోను ? నువ్వే వినిపించుకోకపోతే మరెవరు వినిపించుకుంటారు ?

మంగళంతో ఇక కార్యక్రమం పూర్తికావడమే తరువాయి. ఆ వ్యవధిలో మునిసిపల్ చైర్మన్‌గారు శాలువా కప్పి, మెమెంటో సమర్పించి, చందన పుష్ప తాంబూలాదులతో సహా నగదు పారితోషికాన్ని శాస్త్రిగారికి అందజేశారు.

సత్కారంనెరపిన తర్వాత "ఇప్పుడు సన్మానపత్ర బహూకరణ" అంటూ సెలవు తీసుకున్నారు.

స్వర్ణకాంతుల జిలుగుతో మెరిసిపోతున్న వెడల్పాటి ఫ్రేముతో బిగించిన భారీసైజు సన్మాన పత్రాన్ని రెండు చేతులతోను పదిలంగా పట్టుకున్న శ్రీనివాస మూర్తి అద్దంలోకి నీడ ప్రవేశించినంత నిశ్శబ్దంగా సైడ్ కర్టెన్ వెనుకనుంచి రంగ స్థలం పైకి వచ్చి మైకు ముందు నిలబడ్డాడు. చాలా తక్కువగా మాట్లాడుతా డంటూ మూర్తి పట్ల అభిజ్ఞ వర్గాల్లో ఓ ఆరోపణ ఉంది. అయితే, అతడు మాట్లా డుతూ వుంటే మరికొంతసేపు వినాలనిపిస్తుంది. గొంతు సవరించుకుని, బిరుదు లన్నీ పూర్తయ్యాక "శ్రీయుతులు దేవకోట అనంత నారాయణ శాస్త్రిగారికి రస తరంగిణి సమర్పించిన సన్మానపత్రం" అంటూ హెడ్డింగ్ చదివి వినిపించి, గాయక శిరోమణీ, గాంధర్వ విద్యా పయోనిధీ, సంగీత జ్ఞాన మహార్ణవా లాంటి సంబోధనలు గుప్పిస్తూ శ్రీనివాసమూర్తి పత్ర పఠనం కొనసాగిస్తుంటే ప్రేక్షకుల తడి వైపు కన్నార్పకుండా చూస్తూ వుండిపోయారు. వాళ్ళు ఊపిరి తిప్పుకునే సరికే అతడు సన్మానపత్రంలో సగం ముప్పాతిక దూరం సాగిపోయాడు.

"...నిత్య నిరంతర నాదోపాసన కళాధురీణా! మీకివే మా జేజేలు. మహిత సంగీత సాధనే యాగంగా, యోగంగా, భోగంగా బతుకును పండించు కున్న సార్థకజన్ములు మీరు! ప్రణవనాదానికి వ్యాఖ్యాన ప్రాయమైన గీతంలో, గీతాలాపనలో అడుగడుగునా నర్తించే లయలో, లయలోనుంచి ఉద్భవించే మహా దానందంలో ఓలలాడే మహానుభావులు మీరు! రాగాల పూలతెప్పల్లో శ్రోతల్ని రసానందలోకాలకు తీసుకొనివెళ్ళగల గాన వైదుష్యం మీ సొమ్ము. అందాల సరసిలో రాయంచ ఒయారాలు పోతూ విహరించినట్టుగా, సుందర నందనవనంలో మలుపులు తిరిగే సందుల వెంట తుమ్మెద బాలుడు మెలకువలు కనబరుస్తూ పుష్ప రథం తోలినట్టుగా, పచ్చిక మైదానంలో హరిణ శాబకం ఉల్లాసంగా గంతులు వేస్తూ పరుగులు తీసినట్టుగా, కొండవాలున సెలయేరు పడుతూ లేస్తూ, వంపులు తిరుగుతూ ఉరవళ్ళు పెడుతూ వెయ్యి విన్యాసాలు నెరపినట్టుగా, సంగీత విద్యా పాటవాన్ని అదొక అసమాన హేలగా, ఆహ్లాదలీలగా ప్రదర్శించగల గాయక సార్వభౌములు మీరు! సర్వ రాగాలకు కొలువు మీ హజారం. శివరంజని మీ వశవర్తిని. కల్యాణి మీ రాణి. సురటి మీ ఇంటి చేటి. శంకరాభరణం మీ ముంజేతి కంకణం. తోడి మీ సైదోడు..."

ఆ పనితో అవసరమున్న వాళ్ళందరూ కలిసి కూడబలుక్కున్నట్టుగా, సన్మాన పత్రాలు సిద్ధం చేయడంతో ఒక సంప్రదాయం ఏర్పడి పోయింది. వాస్త వానికి అంటిపెట్టుకోవాలన్న చాదస్తాన్ని కాస్తా సడలించి, ఏరికోరి ఎన్నిక చేసిన పదాల పోహళింపుతో పన్నీరు చిలకరించినట్టుగా, పువ్వులు కురిపించినట్టుగా పొగ డ్తలు రువ్వడం అందులోని ముఖ్యమైన లక్షణం. రసతరంగిణి. వాళ్ళ సన్మాన పత్ర మున్నూ అదే ఒరవడిపై సాగిపోయింది.

కుర్రాడి చేత కారియర్ ఎత్తించుకుని రాత్రి 9.30 గంటల ప్రాంతంలో శ్రీనివాసమూర్తి టి. బి. ప్రాంగణంలో అడుగు పెట్టేసరికి వాతావరణంలో మార్పు వచ్చేసినట్టు అతీంద్రియ శక్తి ఏదో చెప్పినట్టయింది. మూసిన తలుపుల కీవల కుప్పుసామి సిమెంటుతో చేసిపెట్టిన బొమ్మలా నిలబడిపోయి వున్నాడు. కారులో శాస్త్రిగారిని తీసుకొచ్చి విడిదిలో దిగబెట్టిన నిమురుక్కుల చంద్రారావు క్రోటను మొక్కల వెనుక సిగరెట్టు కాల్చుకుంటూ వుండి, శ్రీనివాసమూర్తి కనిపించగానే గబగబా ఈవలికి రాసాగాడు. ఆలోగా కుప్పుసామికి కూడా కాళ్ళొచ్చేసాయి. నాలుగడుగుల్లో అతడు మూర్తిని సమీపించి "అయ్యగారు ఏలనో ఒకటే కోపంగా వుండారు సార్! చెప్పి మాళదు. గ్లాసు పీసులు తీసేద్దామని పోతే "అడె మడయా! పోడా వెళియా" (ఒరే మొద్దూ! పోరా బయటా) అని కసిరినారు ? అంటూ వున్న పరిస్థితిని పుటాక్షరాలతోనే నివేదించుకున్నాడు.

శ్రీనివాసమూర్తి హతాశుడైపోయాడు. శాస్త్రిగారిని త్యాగబ్రహ్మ రూపం లోనే సాగనంపెయ్యాలని అతడు శతవిధాలుగా ప్రయత్నించాడు. ఎన్ని జాగ్ర త్తలు తీసుకున్నా ఫలితం దక్కలేదు. కుప్పుసామి మాటల్ని బట్టి చూస్తే ఇప్పు డాయన దుర్వాస మహర్షిగానే రూపాంతరం చెందినట్టున్నాడు.

చంద్రారావు ద్వారా మరిన్ని వివరాలు తెలిశాయి. మూర్తి చేతిని పట్టుకుని అతడు చరచరా ఓ స్తంభం చాటుకు లాక్కెళ్ళిపోయాడు.

"నాయనా శ్రీనివాసమూర్తీ ! సింహంతోబాటు దాని గుహలోకి నన్ను కూడా పంపించేశావు గదటయ్యా బాబూ ! నేను కనక కొంచెం ఆదమరచి ఉంటే నమిలి మింగేసేవాడే ! అయినా, ఈయనొక్కడేనా పైకప్పు ఎగిరిపోయేటట్టుగా అరవగలిగింది ? ఆ మాత్రం పని మనకు చేతగాదా ? ఎట్లాగూ కచ్చేరీ జరిగి పోయింది గదా! ఇక ఇప్పుడు మనం ఎగరేసి మాట్లాడితే మాత్రం ఏం చేస్తాడు!"

"ఇంతకూ ఏం జరిగిందయ్యా మహానుభావా !" కణతల్ని గట్టిగా అదిమి పట్టుకుని నేలచూపులు చూస్తూ ఆక్రోశించినట్టు అడిగాడు మూర్తి.

"నువ్వు కారెక్కించావా, మేమిక్కడ దిగామా..."

"అదంతా ఉండనీలే ! అసలు సంగతి చెప్పు..."

"లోపలికి వెళ్ళగానే పూలదండా, మెమెంటో టేబిల్‌పైన పెట్టాను. సన్మాన పటాన్ని పదిలంగా గోడకానించాను. కుప్పుసామి మంచినీళ్ళు గ్లాసులోకి వంచి తీసుకు రాబోతున్నాడు. ఈ వ్యవధిలో కుర్చీలో కూర్చుని స్టూలు పైకి కాళ్లుసాచు కున్న అయ్యగారు కవరులోని నోట్లను ఎంచుకోడం కూడా పూర్తయింది. అంతే నయ్యా సంగతులు! "ఎక్కడయ్యా మీ సెక్రెటరీ? బుద్ధుందా అతడికి?" అంటూ గావు కేక వినిపించింది. నాకు మనసు చివుక్కుమంది. ఒళ్లు చరాలుమంది. అయినా, నన్ను నేనే నిలవరించుకుని "ఏమిటండీ?" అని అడిగాను. "అదే నయ్యా మీ సెక్రెటరీని గురించి! అతడికి బుద్ధుందా అని అడుగుతున్నా" అంటూ ముదలంకించుకున్నాడు. అప్పుడు నేనేదో కారుబారుచేసి వుంటానని నువ్వను కుంటున్నావేమో ! అదేంలేదు నింపాదిగానే బదులందుకున్నాను. "అయ్యా, మీరు చెబుతున్న మాట వాస్తవమే. మా సెక్రెటరీకి బొత్తిగా బుద్ధి లేదు. బుద్ధి అనేది వుంటే కాలు మీద కాలు వేసుకుని ఇంట్లో కూచోలేక ఇలాంటి పనులు పెట్టుకునేవాడు కాదు. ఫస్టు క్లాసు చార్జీలిచ్చి తమబోటి వాళ్ళను ఇంతదూరం రప్పించేవాడే కాదు. రప్పించిన తరువాత అడుగులకు మడుగు లొత్తేవాడే కాదు. కరపత్రాలు అచ్చేసి కాళ్ళరిగిపోయేట్టు ఆఫీసులన్నీ తిరిగి పదీ పరకాలెక్కన చందాలు పోగుచేసి, హాలు మాట్లాడి, ఆహ్వానాలు పంచి– అబ్బే! ఈ బాదరబందీ అంతా పెట్టుకొనేవాడు కాదు. ఎందుకులెండి! సెక్రెటరీకి బుద్ధిలేదంటూ తమరొక కాగితం పైన రాసి పడెయ్యండి ! అతడు ఫ్రేము కట్టించి ఇంట్లో తగిలించుకుంటాడు" అనేశాను. ఆహాహా, అప్పు డాయన ముఖం పోయిన పోకళ్ళన్నీ నువ్వు చూసి ఉండాల్సిందోయ్ మూర్తీ ! కనుగుడ్లు ముందు కుబికి వచ్చేశాయి. కనుబొమలు పిటవాలుగా పైకిలేచాయి. నుదుట ముడుతలు పడ్డాయి. బుగ్గలు ఉబ్బిపోయాయి. పెదవులదిరిపోయాయి. అంతటి కోపం మనిషికి రానే రాగూడదయ్యా మూర్తీ ! వచ్చిందో ఎంతటి అఘాయిత్యాన్నయినా ఎదురు చూడొచ్చు. సరిగ్గా జరిగిందదే! "ఎవడివయ్యా నువ్వు? ఏమనుకుంటున్నావు?

ఎవరితో మాటాడుతున్నావో తెలుసా?" అని రౌద్రంగా ఉగ్రడిస్తూ ఆయన కాళ్ళు పైకెత్తి బలం కొద్దికీ ఒక్క పెట్టున స్టూలును తన్నేశాడు. పాలగచ్చుపైన అది తల్లక్రిందులుగా పల్టీ కొట్టబోయి గోడ కానించిన సన్మాన పటానికి వెళ్ళి మోదు కుంది. మరుక్షణంలో హాలంతా గాజుముక్కలే! "నువ్వెవరితో మాటాడుతున్నావో తెలుసా?" అన్న గద్దింపు నా చెవుల్లో మారుమ్రోగిపోతూనే వుంది. అప్పుడు నేనేమన్నానో తెలుసా మూర్తీ! "తప్పయితే మన్నించండి సార్! ఒక మనిషి ఇంకొక మనిషితో ఎలా మాట్లాడాలో అట్లాగే నేను మీతో మాట్లాడాను" ... అంటూ చల్లగా బయటికొచ్చేశాను !!

శ్రీనివాసమూర్తి దిగాలు పడిపోయాడు. శాస్త్రిగారీవిధంగా రుద్రతాండవం చేయడానికి కారణమేమై ఉంటుందో అతడొక విధంగా ఊహించగలిగాడు. ఆయన తన రేటు అయిదు వేలని ఖరా ఖండిగా తెలియజేశాడు. అయితే, రస తరంగిణి తన స్థితిగతులను బట్టి చంద్రునికొక నూలుపోగుగా మూడు వేలు మాత్రం చెల్లించుకోగలదని శ్రీనివాసమూర్తి సవినయంగా తెలుపుకున్నాడు. ఈ మనవిని లెక్కకు తీసుకుని ఆయన రేటు విషయంలో పునర్యాలోచించగలదని తానాశించడం పెద్ద పొరపాటైపోయిందని శ్రీనివాసమూర్తి గ్రహించాడు. చాలని దానికి ఈ చంద్రారావొకడు. చూసి రమ్మంటే కాల్చివచ్చినట్టుగా ఆయన్ను బాగా రెచ్చగొట్టి వచ్చేశాడు. ఇప్పుడు గదిలోకి వెళ్ళడమంటే ఆయన కోపాగ్నికి ఇంధనం కావడుమన్న మాటే! అయినా, రోటిలో తల పెట్టక తప్పదు.

శబ్దం కాకుండా రెక్క తలుపుల్ని ముందుకు తోసుకుని దొంగలా మెల్లగా లోపల అడుగు పెట్టాడు శ్రీనివాసమూర్తి. దొంగగొడ్డుకు బడితెపూజ చెయ్యగోరి పొంచి ఉండే పొలంకాపులా వేచి ఉన్న శాస్త్రిగారు శ్రీనివాసమూర్తి కనిపించగానే పెట్రేగిపోయారు. "మంచి పనోడివేలే! వచ్చేస్తివా! ఇందాకా నాపైకి తోలితివే, వాడెవడు? ముట్టాళ్, వాడంతా ఎంత ? నన్నే సరాయిస్తాడా? నీ మట్టుకు నువ్వు మాత్రం ? నేను చెప్పిందేమి, నువ్వు చేసిందేమి? ఇదేం బిచ్చమా బీరకాయ! వద్దొద్దు నువ్వొక పైసా అయినా ఇవ్వొద్దు. తీసుకెళ్ళు" అంటూ అరచేతిని టేబిల్ పైన పెట్టి డబ్బున్న కవరును ఒక విసురుతో క్రిందికి తోసేస్తూ ఆయన వడివడిగా పడక గదిలోకి వెళ్ళిపోయారు.

శ్రీనివాసమూర్తి తన పాదాల దగ్గరికొచ్చిపడిన కవరును తీసి పదిలంగా

జేబులో ఉంచుకున్నాడు. హాల్లో చెల్లాచెదురుగా పడి వున్న గాజుముక్కలన్నింటినీ ఒక్కటైనా మీరు పోకుండా ఏరి బయట పారవేశాడు. కారియర్ తీసుకొచ్చి టేబిల్ పైన పెట్టాడు. బోసిపోయిన సన్మాన పటాన్ని చంకలో ఉంచుకున్నాడు. విషాదాంత నాటకాన్ని చూసి నిర్విణ్ణుడైపోయి, ఆలస్యంగా బయటికి వచ్చిన చివరి ప్రేక్షకుడిలా నిద్రలో నడుస్తున్నట్టుగా అడుగులు వేస్తూ గది గుమ్మం దాటి ఈవలికి వచ్చాడు. వసారాలో నుంచి మెట్లు దిగబోతుండగా పైమెట్టుపైన కుప్పుసామి కనిపించాడు.

"నాయినా కుప్పుసామీ ! ఉదయం ఎనిమిదింటికల్లా టిఫినొస్తుంది. కారు ఎనిమిదిన్నరకు సిద్ధంగా వుంటుంది. తొమ్మిదింటికే రైలు. నేను స్టేషను కొస్తాను. ఏ కొరతా లేకుండా సాగనంపే పూచీ నాదని అయ్యగారితో చెప్పు. అన్నట్టు కారియర్ టేబిల్ పైన వుంది. భోజనం చెయ్యమని చెబుతావు గదూ ?"

'రసతరంగిణి'లో ప్రోగ్రాం ఇచ్చి వచ్చిన కొత్తలో ఒక మాస పత్రిక విలేఖరి ఇంటర్వ్యూ చెయ్యడం కోసం అనంత నారాయణ శాస్త్రిగారితో భేటీ అయ్యాడు. చింతాద్రిపేటలో పాత హవేలీ లాంటి శాస్త్రిగారి సొంత ఇంటి హాల్లో ఇంటర్వ్యూ ఇచ్చేవారు, పుచ్చుకునేవారు ఎదురెదురుగా కూర్చున్నారు. వివిధ సభల్లో, వివిధ సందర్భాల్లో శాస్త్రిగారికి సమర్పించబడిన జ్ఞాపికలతో నిండిన షోకేసులతోనూ, వాటిపైన గోడ ఊనికగా చీలలకు బిగించిన సన్మాన పటాలతోనూ ఆ హాలు ఒక మ్యూజియంలా ఉంది.

పుట్టుక, బాల్యం, విద్యాభ్యాసం, సంగీత శిక్షణ, సాధన, పాల్గొన్న సభలు, ఉత్సవాలు, అందుకున్న గౌరవాలు – ఇలా వివరాలన్నీ నమోదు చేసుకున్న తర్వాత "చెప్పండి స్వామీ! మరేమైనా విశేషాలుంటే చెప్పండి" అన్నాడు విలేఖరి. "కచ్చేరీల కోసం మీరెన్నెన్ని ప్రదేశాలకో వెళ్తుంటారు గదా ! అక్కడ మీకెదురయ్యే అనుభవాలను గురించి కూడా చెప్పండి" అంటూ ఒక నిర్దిష్టమైన అంశాన్ని సూచించాడు.

శాస్త్రిగారు ఒక్క పెట్టున గుర్రపు పిల్ల సకిలించినట్టుగా నవ్వేశారు. "పులికి ఏ అడివైతే నేమయ్యా పిచ్చోడా! వాళ్ళెవళ్ళూ నా దగ్గర తోకాడించరు. ఆడించారో కత్తిరించేస్తాను. మొన్నటికి మొన్న ఏమైందో తెలుసునా? ఒక చోట తక్కువ

డబ్బిచ్చి నా ముఖానికి మసి పూయాలని చూశారు. నేనాకవరును నేలపైకి విసరి కొట్టాను. ఆ మరునాటి ఉదయం సెక్రెటరీ స్టేషనుకు తలతో నడిచొచ్చి మనకు ఇవ్వవలసిందంతా ఇచ్చేసి చెంపలేసుకున్నాడు. అమ్మో, ఈ కాలంలో నోరుండి బ్రతకాలి. లేకుంటే ఊది పారెయ్యరూ." ఇంటర్వ్యూ ముగిసింది. బ్యాక్‌గ్రౌండులో కొన్ని మెమెంటోలు, సన్మాన పత్రాలు వచ్చేటట్టుగా ఒకటి రెండు ఫోటోలు తీసు కుంటానన్నాడు విలేఖరి. కోణాన్ని ఎన్నుకోడం కోసం అటూ ఇటూ తిరుగుతూ ఉండి, ఒక చోట తటాలున ఆగి, ఆగిపోయిన వాడు మానసికంగా నిర్వీర పడి పోయి, శారీరకంగా కొయ్యబారిపోయి, కొద్ది నిమిషాల్లో ఎట్లాగో తేరుకుని "ఏమిటి సార్! ఇక్కడ రెండు వాక్యాలు చాలా డామేజింగ్‌గా ఉన్నాయే!" అంటూ తన విస్మయాన్ని వెల్లడించాడు.

"వాక్యాలు డామేజింగ్‌గా ఉన్నాయా?"— శాస్త్రిగారు కళ్ళు పెద్దవి చేసు కుని అతడి వైపు చూశారు.

"ఏం సార్ ! మీరు వీటిని చదివి చూడరా?" ఇంటర్వ్యూలో అది కూడా ఒక భాగమే అయినట్టు విలేఖరి వాకబు చేశారు.

"ఆ ఓపిక ఎక్కడుంది? అక్కడ వాళ్ళు చదివి వినిపించినప్పుడు వినడమే! ఏదీ, ఎక్కడ?" ఇంకా పాతవాటిలో కలవకుండా, కొత్తదనం పసివాడకుండా ఉన్న ఒక సన్మాన పత్రం చివర అతడు చూపించిన వాక్యాలపైన తన చూపుల్ని తూపుల్లా గుచ్చి చూశారు శాస్త్రిగారు.

"సంగీత విద్వాంసులుగా ఎంతటి గొప్పవారో, మనిషిగా అంతటి హీనులు మీరు. మానవత లేని మేధావులకన్నా మంచితనం కలిగిన మానవులే ఈ సమా జానికి అవసరం..."

"అడె కుప్పసామీ! వాడా ఇప్పటి! ఇదై ఎడుత్తు ఎరుంజుడుడా వెళియే..." (ఒరే కుప్పసామీ ! రారా ఇట్లా! దీన్ని తీసి పారెయ్యరా బయట) అంటూ అరి చారు శాస్త్రిగారు.

'కానీ, వచ్చిన కితాబు ఎక్కడికి పోతుం..?'— అనుకున్నాడు విలేఖరి

— "ఇండియా టుడే" మాసపత్రిక, 1992

# సంస్కారం

ఇది చాలా మంచి వూరు- అనుకున్నాడు రమాపతి. అంతటితో వూరుకోకుండా ఆ అభిప్రాయాన్ని బాహాటంగా పదిమందితోనూ చెప్పేశాడు.

"అలాగా" అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించారు కొందరు. "నిజం, నిజమే" అంటూ ఏకీభవించారు కొందరు. 'రీసెర్చిచేసి గొప్ప విషయమే కనిపెట్టాడయ్యా ఈ ప్రబుద్ధుడు' అనుకొన్నారు కొందరు.

తలా ఒక విధంగా అనుకుని తలలు పంకించుకుని ఎవరిదారిని వాళ్ళు వెళ్ళిపోయారు లోకులు. వాళ్ళల్లో మచ్చుకొక్కడైనా రమాపతి అభిప్రాయానికి ప్రాధాన్యమిచ్చిన పాపాన పోలేదు.

కానీ యిది చాలా మంచివూరని అన్నాడో లేదో యింతలేసి కళ్ళతో అతడివైపు ఆశ్చర్యంగా చూసి "ఐనా ఈ వూరిని గురించి మీ కప్పుడే ఏం తెలిసిందండీ! అసలు మనమీ వూరికి వచ్చి ఎంతకాలమైంది?" అంటూ భర్తను నిలదీసి అడిగింది రాజేశ్వరి.

చొప్పదంటు సందేహాన్ని వ్యక్తపరచినందుకు చిరచిరలాడిపోతూ, తన విజ్ఞతను శంకిస్తున్న భార్యకేసి చురచుర చూశాడు రమాపతి.

ఆ మాత్రానికే వెనుకంజవేసే తత్వంగాదు రాజేశ్వరిది! "అదేమిటండీ! అలా చూస్తారు? చూపులకే గ్రుడ్లు తేలవేసి క్రిందపడి పోవడానికి నేనేమీ కొంగను కాను లెండి!" అంటూ ఓ పురాణగాథను జ్ఞప్తికి తెచ్చింది రాజేశ్వరి.

ఆడవాళ్ళతో గొప్ప విషయాలు చెప్పనే గూడదనుకున్నాడు రమాపతి. చెప్పి అవహేళన పాలైనందుకు కించపడ్డాడు. తనీ విషయాన్ని ఎందరితో చెప్పాడు! అందరూ తన అభిప్రాయాన్ని యధాతథంగా ఆమోదించేశారు. రాజేశ్వరికేం తెలుస్తుంది? ఈవిడకు వితండవాదం తప్పా మరొకటి చేతగాదు.

—ఐనా నాలుగుగోడల మధ్య జీవితాన్ని గడుపుకుపోవడానికి అలవాటుపడిన

ఆడవాళ్ళకే వూరైతేనేమి? వాళ్ళకావూరెంతో, ఈవూరూ అంతే! ఇక్కడి హెడ్మాస్టరుగారు మంచివారనీ, సహోపాధ్యాయులు స్నేహితులంటే ప్రాణాలు విడిచి పెట్టేస్తారనీ, విద్యార్థులు ఉపాధ్యాయుల కనుసన్నల్లో మసలుకుంటారనీ, చివరికిక్కడి హోటలు సర్వర్లు, చిల్లరంగడి వర్తకులు, జట్కాబళ్ళ సాహేబులు సైతం ఎంతో మర్యాదస్తులనీ విశదంగా వివరాలు ఏకరువు పెడితే మాత్రం ఈవిడకు వాస్తవం అవగతమౌందన్న నమ్మకమేమిటి ?

తీరా తానింతగా కంఠశోష పెట్టుకున్న తరువాత రాజేశ్వరికి సరిక్రొత్త సందేహాలు స్ఫురించవని మాత్రం ఉమాపతి ఎలా అనుకోగలడు ?

రమాపతికి మౌనమే శరణ్యమైంది.

కానీ ఎలాంటి దురభిప్రాయాలనైనా సమూలంగా తుడిచిపెట్టగలిగినది కాలం ? కాలం గడిచినకొద్దీ రాజేశ్వరికి వాస్తవం తనంతటదే తెలిసివస్తుందిలెమ్మనుకున్నాడు రమాపతి.

కాలం దొర్లిపోతోంది.

నిన్నగాక మొన్ననే జరిగినట్టున్నా రమాపతి సతీసమేతుడై ఆ వూరిలో కాపురం పెట్టి, అప్పుడే నెలరోజులు గడిచిపోయాయి.

ఓరోజు ఉదయం లాబొరేటరీలో ఏదో ప్రయోగం కోసం రమాపతి ఉపకరణాలను ఎన్నుకుంటూ ఉండగా ఓ విద్యార్థి సుడిగాలిలా వచ్చిపడ్డాడు. ఎవడో ఒకడు ఆగంతకుడు ఆఫీసురూం వరండాలో తనకోసం వేచి వున్నాడట! "రమాపతి గారెక్కడ, రమాపతి గారెక్కడ" అంటూ అతడు కనుపించిన వారినల్లా వాకబుచేసి పారేస్తుంటే వసారాలో కూర్చోమని చెప్పి, ఈ విద్యార్థి తనకోసం యిలా పరుగెత్తి వచ్చాడట !

ఎవరో బంధు సత్తముడు కాబోలు ననుకున్నాడు రమాపతి. ఇల్లు దూరక మునుపే ఎలుకల రాకడని చెప్పనే చెప్పారు మరి !

బంధువైనా బాగుండేది! ఓ కుర్రాడిని తోడిచ్చి ఇంటికి పంపగలిగి ఉండేవాడు రమాపతి. ఆగంతకుడు బంధువు కాడు. ఒక మానాన వదలి పెట్టడు. తుమ్మబంకలా అంటుకున్నాడు. "సన్నగా, తుంగకాడలా ఉండే వాడివి, ఇప్పుడు బాగా కండబట్టి పోయావురా రమాపతీ! రైటో రైటో! మనిషన్న తర్వాత ఈ

మాత్రం పుష్టిగానైనా వుండాలి. నాకేం తెలుసు— నువ్వీవూళ్లో వున్నావని! నా పనేమిటో, నా లోకమేమిటో ! ఈరోజెవరో కుర్రాళ్ళు మాట్లాడకుంటూ వుండగా విన్నాను. "మా సైన్సు మాష్టారు రమాపతిరావుగారు ఎంత బాగా పాఠం చెబుతా వనుకున్నావురా అంటూ ఓ కుర్రాడు తెగమురిసిపోతున్నాడు. పేరు వినగానే నా బుర్రలో ఓ మెరుపు మెరిసింది ! దగ్గరికి పిలచి విచారిద్దును గదా," నా అను మానం కాస్తా నిజమైపోయింది. ఎలాగైతేనేం నిన్ను కనిపెట్టేశాను. అన్నట్టు ఎప్పుడొచ్చావు ? ఏం కథ? ఈవూరు నీకెలా వుంది?..." ఎక్కడుంటున్నావు? మాటల ధోరణి సంగతలా వుండగా ఆగంతకుడి వేషం కూడా చూపరులను ఆక ర్షించ గలిగిందనే చెప్పాలి. అతడు కాకీ ట్రౌజరు తొడుక్కున్నాడు. అదే రంగు అరచొక్కా వేసుకున్నాడు. ఆ దుస్తులపైన మసి మరకలు కొదువలేదు. క్రాపింగు బుట్టలా పైకి లేచింది. చెంపలపైన చెమట ధారలు ధారలుగా స్రవిస్తోంది.

పది పదిహేనుగురు విద్యార్థు లక్కడ ప్రోగైపోయారు. టీచర్సు రూములో నుంచీ నలుగురైదుగురు ఉపాధ్యాయులుగూడా బయటికి వచ్చేశారు. జవాను రాఘవులైతే స్తంభంచాటున నిల్చొని ముసి ముసి నవ్వులు నవ్వుకుంటున్నాడు.

ఉదయం తాను నిద్రలేచిన వేళ మంచిది కాదేమో ననుకున్నాడు రమాపతి. లేకుంటే తనకిలా తలవంపులు కలిగేవికావు. ఎదుటి వ్యక్తి ఒకానొక హైస్కూలు టీచరన్న పరిజ్ఞానం ఆగంతకుడికి బొత్తిగా వున్నట్టు లేదు. అతని ధోరణి అతనిది. అతనివే ప్రశ్నలు! అతనివే సమాధానాలు. కనుబొమలు పైకెత్తి ముక్కును క్రిందికి దించి ప్రసంగం మధ్య మధ్యలో ఆశ్చర్యార్థకపు గుర్తులు !

అరగంటసేపు గాలివానలా పీడించిన తరువాత అతడు సెలవు తీసు కున్నాడు. ధర తగ్గుట హెచ్చు కొరకో నన్నట్టుగా ఆ సెలవు తీసుకోడం గూడా మళ్ళీ కలుసుకోడానికే: ఒకటీ, రెండు రోజుల్లో అతడు రమాపతిని ఇంటిదగ్గరే సంధిస్తా నన్నాడు. గృహిణితో పరిచయం చేసుకుని ఆలూమగల దాంపత్యం తాలూకు ముద్దూ ముచ్చటలు గమనిస్తా నన్నాడు.

"ఎవడోగానీ 'జూ'లో వుండవలసిన వాడండీ రమాపతి గారూ !" అన్నాడు డ్రాయింగు మేష్టారు కోదండం.

"ఎందుకైనా మంచిది ! ఎవడైనా పేషంటు పిచ్చి ఆసుపత్రి నుంచీ పారి

పోయి వచ్చాడేమో తెలుసుకుంటావా రమాపతీ !" అన్నాడు లెక్కల టీచరు రామకృష్ణ.

"ఇంతకూ ఇత డెవరో, ఏవిధంగా నీకు పరిచితుడో చెప్పవయ్యా రమాపతీ ! అతగాడి ఉదంత మేమిటో ఆకర్ణింపగా కుతూహలం బయ్యేదిని" అన్నారు తెలుగు పండితులు అవధానిగారు.

"అబ్బే, పెద్దగా పరిచయ మేముందండీ! జీవితం కదా ! ఎందరినో కల్సు కుంటాము. విడిపోతాము. అందరినీ జ్ఞప్తిలో ఉంచుకో గలమా!" అంటూ పొసగీ పొసగని మాటలతో తప్పించుకున్నాడు రమాపతి.

కానీ, అప్పటికప్పుడు తప్పించుకోవడంతో ఏమైంది? ఇదేదో అపశ్రుతిలా తనను వెన్నంటే సూచన లున్నాయి. వీడి పేరు కామేశం. చిన్ననాటి స్నేహితుడు. ఆ వీథిలోని కుర్రాళ్ళ కందరికి రింగ్ లీడరు వంటివాడు. మిత్ర బృందంలో వారి మాట కెదురుండేది గాదు. ఎటొచ్చీ వాడి నాన్న మిగిలిన వాళ్ళకు మల్లే కలిగినవాడు కాడు. అందుకు తోడుగా చదువుపైన వాడి శ్రద్ధ అంతంత మాత్రం! ఫోర్తుఫారంతో వాడి చదువు ఆగిపోయింది. ఆ తరువాత అత డొకటి రెండు పర్యాయాలు మాత్రం కనిపించాడు. ఒకసారి రైల్వేలో తాత్కాలికోద్యోగం ఒకటి చేస్తున్నట్టు చెప్పాడు. మరొకసారి కిళ్ళీకొట్టు వ్యాపారం లాభదాయకంగా వుందన్నాడు.

ఆరోజు ఉదయం స్కూల్లోకి గాలివానలా వచ్చిపడిన కామేశం తానిప్పుడు స్థానిక బస్సుల కంపెనీకి సంబంధించిన మరమ్మత్తుల కార్ఖానాలో పనిస్తున్నా నన్నాడు. అలాగైతే యిది వీడి సరిక్రొత్త అవతార మన్నమాట !

మధ్యాహ్నం ఇంటికి రాగానే రమాపతి భార్యను పిలిచి "చూడు రాజేశ్వరీ! మన పాలిటి కివ్వాళ్లో ఒక తోకచుక్క మొలిచింది" అన్నాడు.

"తోకచుక్కా!" విస్తుపోయింది రాజేశ్వరి.

"అవును మరి! నిజమే ! ఆ తోకచుక్క పేరు కామేశం. రేపో మాపో వాడు మనపైన విరుచుక పడిపోగల ప్రమాదం వుంది. మనం జాగ్రత్తగా ఉండడం ఎంతైనా అవసరం ! ఎందు కంటావా? ఆ కామేశంగా డున్నాడే. వాడు పొమ్మని మెడబట్టి గెంటినా చూరుపట్టుకుని వ్రేలాడే రకం!"

"అలాగా ! అయితే మీ కెందుకూ, మీ రూరుకోండి. పొమ్మనకుండా పొగబెట్టడం నాచేత నౌను" అంది రాజేశ్వరి.

కానీ, తీరా కామేశం వచ్చిన తరువాత పొగ బెట్టలేక పోయింది రాజేశ్వరి. పళ్ళతో, పూలతో, ప్రసన్న వదనంతో మూర్తీభవించిన బంధు ప్రేమలా వచ్చాడు కామేశం ! వచ్చినవాడు తెచ్చిన పళ్ళన్నీ భార్యాభర్తలకు వొలిచిపెట్టి తాను మాత్రం బాల్యస్మృతులు నెమరు వేసుకో సాగాడు "అలాంటి రోజులిక రావురా రమాపతీ ! తాటిముంజలు తిని, కడుపునిండా ఏటి చలమలో నీళ్ళు త్రాగి ఇసుక తిన్నెలపైన ఆటలాడుకుని ప్రొద్దుగ్రుంకి చీకటి పడ్డాక యింటిదారి పట్టి తల్లి దండ్రుల దగ్గర మెత్తగా నాలుగు చీవాట్లు తిని ఒళ్లెరుగకుండా పడి నిద్రపోయే రోజులు మళ్ళీ ఎప్పుడొస్తాయి ? వయసు పైబడినకొద్దీ బరువులు, బాధ్యతలూ మనిషిని కృంగదీసేస్తాయి. తోడునీడగా వుండే అర్ధాంగి, నవ్వుతూ ఎదురయ్యే బిడ్డలు, మనసిచ్చే స్నేహితులు లేకపోతే ఈ జీవితం పక్కా ఎడారే ననుకో!... అన్నట్టు మీ రిద్దరూ ఒకసారి మా యింటికి రావాలమ్మా రాజేశ్వరీ ! ఎప్పుడో కాదు, నాలుగు వీథులు దాటి రావడానికి వాయిదాలు కూడా ఎందుకు?..."

"అలాగే అన్నయ్యా! తప్పకుండా వస్తాముగానీ మీరీపూట భోజనం చేయందే వెళ్ళగూడదు" అంది రాజేశ్వరి.

ఆచరణలోకి వచ్చేసరికి తన హెచ్చరిక బూడిదలో పోసిన పన్నీరయి పోయినందుకు లోలోపల అగ్గి మీద గుగ్గిలమై పోయాడు రమాపతి. కానీ పైకి మాత్రం "ఔనౌనురా కామేశం ! భోజనం చేసే వెళ్ళు"... అన్నాడు .

కానీ రమాపతి ఊహించినట్టు తిండికోసం అంతగా కక్కుర్తి పడేవాడిలా కనిపించలేదు కామేశం ! "భోజనాని కేమమ్మా! ఎప్పుడో ఒకప్పుడు నా అంతట నేనే వూడిపడగలను. ఇంటిదగ్గర భోజనంచేసి వచ్చాను. గనుక, ఇప్పుడు మళ్ళీ రెండో విడత భోజనానికి సిద్ధమయితే మీకు పెట్టిన తృప్తీ వుండదు నాకు తిన్న తృప్తీ ఉండదు." అన్నాడు కామేశం.

ఉండి ఉండీ ప్రాణాంతకమయిన సందేహాలను బయటపెట్టే రాజేశ్వరి కామేశం వెళ్ళిపోగానే "అదేమిటండి! ఇలాంటి మంచివాణ్ణి పట్టుకుని తోకచుక్క అనేశారూ !" అంటూ సాగదీసింది.

తాను నిల్చున్నచోట భూకంపం వాటిల్లినట్లు తలక్రిందులై పోయాడు రమా

పతి. "ఆహాఁ, అది, కాదు రాజేశ్వరీ! మరి ...ముఖాన్ని చూచి గానీ మాటల్ని బట్టి గానీ మంచితనాన్ని నిర్ణయించగూడదు. పీ డున్నాడే కామేశం - పైకి కనిపించేటంత మంచివాడు కాదు..."

తన సంజాయిషీ తన చెవులకే కృత్రిమంగా ధ్వనించడం వల్ల నైతేనేమి, సంజాయిషీ పూర్తికాక మునుపే రాజేశ్వరి వంట గదిలోకి వెళ్ళి పోవడంవల్ల నైతే నేమి రమాపతికి మళ్ళీ మౌనమే శరణ్యమయింది.

* * *

మానవుడు దేనినుంచి వైదొలగా లనుకుంటాడో అది వాడికి మరింత సన్నిహితం గావడం విధి లీలకు సంబంధించిన విచిత్రాల్లో ఒకటి. కామేశం పట్ల తన కెందుకు వైముఖ్యం కలిగిందో రమాపతికి తెలియదు. ఆ మాత్రం ఆత్మ పరిశీలనకు అతడు పూనుకోలేదు. బహుశా కామేశం సంస్కారం లేనివాడని రమాపతి భావించి ఉండవచ్చు. అతనితో కలిసి మెలిసి తిరగడం తన అంతస్థుకు తగని పనిగా అతనికి తోచి వుండవచ్చు. పింతలలోకల్లా వింత మానవుడి మనస్సు. వెయ్యి ధాతువుల రసాయనిక సమ్మేళనం లాంటిదది. ఎవడి మనస్సులో ఏముందో వాడికే తెలియనప్పుడు, ఇక రెండోవాడి మానసిక ప్రవృత్తుల్ని సూక్ష్మ వివరాలతో సహా విశ్లేషించి చెప్పడం ఎవడి తరం ?

వీధిలో ఎక్కడైనా కామేశం తారసిల్లితే రమాపతి యిరకాటంలో తగులుకున్నట్టు గింజుకునేవాడు. ఆ తారసిల్లడం గనుక హైస్కూలు మిత్రుల సమక్షంలో నయితే రమాపతి ముంత పొగలో వూపిరాడనివాడిలా విలవిలలాడిపోయే వాడు. ఒకప్పుడు గత్యంతరం లేక కామేశం పలకరింపుల్ని పరామర్శల్ని సహిస్తూ, ముభావంగా వుండిపోయేవాడు. మరొకప్పుడు మొగమాటానికి స్వస్తి చెప్పి దులపరించుకునేవాడు. కామేశం గాకుండా మరొకడెవడైనా అయితే అంతటితో రమాపతి అంతరంగంలోని యింగితాన్ని అవగతం చేసుకో గలిగి వుండేవాడు. సంస్కారాన్ని గణించి చెప్పడానికి నిర్ణీతమైన కొలబద్దలు లేవు. కనుక కామేశం సంస్కారహీను డౌనా కాదా అన్నది వివాదాస్పదమైన విషయం. కానీ కామేశాన్ని గురించి నిస్సంశయంగా ఒకమాట చెప్పుకోవచ్చు. పరేంగితాన్ని పసిగట్టే తెలివితేటలకూ అతడికి చాలా దూరం. కామేశం కందుకం లాంటి వాడు. గోడకు వేసిన మోదినకొద్దీ, మళ్ళీ కొట్టినవాడి వైపుకే తిరిగి రావడం కందుకం స్వభావం!

భార్యాసహితంగా వచ్చి రమాపతి తన యింట ఆతిథ్యం స్వీకరించగల డన్న ఆశ అదొక ఎండ మావిలా నాలుగైదు మాసాలపాటు కామేశంతో దాగుడు మూత లాడుకుంది. "పిలుస్తూనే వున్నావుగా! ఎప్పుడో వస్తాములే!" అనేవాడు రమాపతి. నిజమే కాబోలు ననుకున్నాడు కామేశం. ఆఖరు కొకనాడు రమాపతి "రావాలని నిర్బంధ మేముంది! వస్తే వస్తాం. లేకుంటే లేదు" అనేశాడు.

అప్పటికీ మిత్రుడు తనతో పరిహాస మాడుతున్నాడేమో ననుకున్నాడు కామేశం.

మళ్ళీ కొంతకాలం గడిచిపోయింది.

ఓ రోజు రాత్రి తొమ్మిది గంటలవేళ పాలార బోసినట్టు కాస్తోంది వెన్నెల. పగటిపూట ఎండ దెబ్బలకు శోషిల్లిపోయిన ప్రాణాలకు హాయిగా చల్లటి గాలి వీస్తోంది. ఇంటికి వెనుక ఆరు బయట చాప వేసుకొని పడుకున్నాడు రమాపతి. దగ్గరగా లాంతరు వెలుగులో పత్రిక చదువుకుంటోంది రాజేశ్వరి. కామేశం అన్నీ అవకతవక పనులు చేయడానికే పుట్టాడనుకునే రమాపతి గూడా అలాంటి ప్రశాంత సమయంలో అతడు వూడిపడవచ్చు ననుకోలేదు. అనుకోకపోతేనేమి, అంతపనీ జరిగింది. తలుపు దబదబా బాది, రాజేశ్వరి గడియ తీయగానే ముఖం లోపలికి చూపించి "మరేం భయపడొద్దు లేవమ్మా రాజేశ్వరీ! భోజనం చేసే వచ్చాను. కానీ కాసిన్ని మంచినీళ్ళు మాత్రం త్రాగలేకపోను" అంటూ రమాపతిని సమీపించాడు కామేశం !

మిత్రుణ్ణి కూర్చోమనైనా చెప్పలేదు రమాపతి. కామేశం చాపపైన కూలబడ్డాడు. కూర్చున్న కాసేపటికి "ఏమిటోరా రమాపతీ ! ఇప్పుడే ఇంటికి వెళ్ళి స్నానంచేసి భోజనం చేశాను. ఎందుకో బుద్ధి నీపైకి మళ్ళింది చక్కా వచ్చేశాను." అంటూ తలగడ పైకి ఒరిగిపోయాడు.

వచ్చినవాడు దూరంగా కూర్చోకుండా తాను పడుకున్న చాపపైన్నే కూర్చోడ మేమిటి ? కూర్చున్నాడుబో, అంతటితో ఆగకుండా తన శరీరాన్ని చిత్తు చిత్తు చేస్తూ తలగడపై వ్రాలి పోవడ మేమిటి ? కామేశం ప్రవర్తన రమాపతి కేమాత్రము నచ్చలేదు. కానీ, ఆగ్రహాన్ని ఎలా వ్యక్తం చేయాలో అతనికి తోచడం గూడా లేదు.

"అన్నయ్యా! మంచినీళ్ళు!" అంటూ పళ్లెరంలో ఉపాహారంతో సహా ప్రత్యక్షమైంది రాజేశ్వరి.

కామేశం ఫలహారం స్వాహా చేసి ఒక గ్రుక్కలో గ్లాసు ఖాళీ చేసేశాడు. గొంతుక సవరించుకుంటూ అసలు విషయానికి మెల్లిగా ఉపోద్ఘాతం ప్రారంభించాడు.

"మా అవిడ దగ్గర నేను తలెత్తుకుని తిరగలేక పోతున్నానురా రమాపతీ!"

"పోనీ, తల దించుకునే తిరుగు" ఎండుపుల్లను విరిచినట్లు పెళుసుగా, బదులు చెప్పేశాడు రమాపతి.

వెన్నెల్లో కామేశం ముఖం వెలవెల పోవటం గమనించింది రాజేశ్వరి.

కామేశం నోటికితాళం పడిన మాటనిజం. అతడెంతగానో ప్రయత్నించాడు. వూహుం. మాట పెకిలిందిగాదు. పది పదిహేను నిముషాలు మౌనంగానే గడిచి పోయాయి. కామేశం ఓ నిర్ణయానికి వచ్చినవాడిలా తటాలునలేచి కూర్చున్నాడు. కూర్చుంటూ "నీతో ఒక మాట చెప్పాలి రమాపతీ!" అన్నాడు.

"రహస్యమా!" అన్నాడు రమాపతి కామేశం ముఖంలోకి విచిత్రంగా చూస్తూ.

"వడ్లగింజలో బియ్యపు గింజ రహస్యమేముంది నా తలకాయ! మిత్రుడివి. అంతరంగికంగా నా మనసులోని విషయాలు బయటపెట్టుకుందామని..."

"ఐతే పద" అంటూ రమాపతి లేచి నిల్చుని చరచరా వీధిలోకి వచ్చేశాడు.

వీధిలోకి వచ్చిన రమాపతి ఒక్క విసురుతో ముందుకు తిరిగేసరికి, వెను వెంటనే వచ్చిన కామేశం ఓ అడుగు వెనక్కి వేసి "మరేం లేదురా రమాపతీ! నీకొక కొరత వుంటే వుండవచ్చు. మాటి మాటికి మిమ్మల్ని పిలవడమేగానీ, మేము యింటికి వచ్చి ఒకటి రెండు పూటలుండకపోవడం నీ మనసుకు బాధాకరంగానే వుంటుంది. కానీ ఒక విషయం గమనించాలి నువ్వు. మీరైతే భార్యాభర్త లిద్దరు "మేము పిల్లా జల్లా కలిసి అర డజను మందికి తక్కువగా లేము. పైగా అమ్మాయిని చూద్దామంటే వట్టి మనిషిగా కూడా లేదు. ఇలాంటప్పుడు

బంధువుల ఇళ్ళకు వెళ్ళాలనీ, విందులు తినాలనీ, వినోదంగా కాలం గడపాలనీ ఆడవాళ్ళ కెన్నయినా కోరిక లుంటాయి..."

"ఇదిగో కామేశం !" కటువుగా అడ్డు తగిలాడు రమాపతి. "ఎవరి కోరికలు వాళ్ళకుంటాయి. ఎవరి హద్దులు వాళ్ళకుంటాయి. నువ్వేమో పిలిచావు. రావడమో, రాకపోవడమో నిర్ణయించుకునేవంతు మాది. మా పాటుకు మమ్మల్ని బ్రతకనివ్వకుండా నువ్వెందుకిలా తొందర పెడతావో తెలియకుండా వుంది..."

అలాంటి జవాబు వస్తుందని కలలోనైనా అనుకోని కామేశం కృంగిపోయాడు.

* * *

కాల మొక్క రీతిగా గడవదని చెబుతారు లోక జ్ఞానులు. సన్నగా పూల రెమ్మలా యింటిలో ఆ మూల నుంచి ఈ మూలకు చకచకా తిరుగుతూ వుండిన రాజేశ్వరి పండ్ల బరువుతో వంగిపోయిన రసాల వృక్షంలా బుట్ట బొమ్మలా తయారైంది. కానీ నవమాసాల కింకా వ్యవధి లేకపోలేదు. ప్రతి రోజూ మామగారి రాక కోసం ఎదురు చూస్తున్నాడు రమాపతి.మామగారు రాగానే రాజేశ్వరి పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఆ తరువాత తన బ్రతుకు 'సత్రంలో భోజనం, మఠంలో నిద్ర'కు డిటో అయిపోతుంది. గత్యంతర మేముంది? ఈ వియోగం తప్పనిసరి. ఆ మాటకొస్తే వియోగానంతర సంయోగం నిర్భరానంద హేతువు. ఇందుకు తోడుగా పొత్తిళ్ళలో చిన్నారి పాపతో సహా తరలి వస్తుంది రాజేశ్వరి. అప్పుడప్పుడూ ఆ సన్నివేశాన్ని తలచుకుని పులకితు డవుతున్నాడు రమాపతి.

ఓ రోజు ఉదయం నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని పత్రిక పఠనం కోసం రీడింగు రూముదాకా వెళ్ళొచ్చాడు రమాపతి. గంట ఎనిమిదిన్నర కావస్తున్నా రాజేశ్వరి! యింకా పడక పైన్నుంచి లేవలేదు. "అదేమిటి రాజేశ్వరీ! ఇంకా తెల్లవారలేదా నీకు?" అన్నాడు రమాపతి.

"ఏమిటోనండీ! ఒళ్ళు ఒక మాదిరిగా వుంది" అంది రాజేశ్వరి.

అంతకు ముందు దినపత్రికలో పడవ మునకను గురించి విమాన ప్రమాదాలను గురించి, చదివిన రమాపతి, అవన్నీ తన వెనుకనే వచ్చి ఒక్కుమ్మడిగా ఇంటిలోపలికి జొరబడినంతగా గగ్గోలు పడిపోయాడు. నిల్చున్న చోట నిల్చోలేక

కూర్చున్న చోట కూర్చోలేక ఏవేవో సందేహాలతో, భయాలతో కలవరపడి పోయాడు. శలవు చీటి వ్రాసి హెడ్మాస్టరుగారికి పంపించాడు. ఆ తర్వాత ఏం చేయడానికి పాలుపోక "వెళ్ళి డాక్టరమ్మగారిని పిలుచుకు రమ్మంటావా రాజేశ్వరీ!" అన్నాడు.

"డాక్టరమ్మగారెందుకుగాని, ఒకసారి ఎదురింటి బామ్మగారిని వచ్చి వెళ్ళమని చెప్పండి" అంది రాజేశ్వరి.

తన విధానానుభవాల పరిజ్ఞానంతో రాజేశ్వరిని పరీక్షించి చూచిన బామ్మగారు "చూడు నాయనా ఇదేమిటో విడ్డూరంగా వుంది. అమ్మాయి నెలలు పూర్తి కాలేదంటుంది. కానీ, చెబుతున్న లక్షణాలనుబట్టి ఆ మాట నమ్మడానికి లేదు. ఎందుకైనా మంచిది. మీవాళ్ళ కెవరికైనా కబురు పెట్టు" అంది.

మధ్యాహ్నం హోటల్లోనుంచీ కారియర్‌లో భోజనం తెప్పించాడు రమాపతి. తింటేగానీ ఒప్పుకోనని మొండికెత్తి కూర్చున్న రమాపతి సంతృప్తికోసం రాజేశ్వరి పట్టెడన్నంతిని, తిన్నదంతా వమనం చేసుకుంది.

మామూలు ప్రకారం సాయంకాలపు వాహ్యాళికి బయల్దేరిన హైస్కూలు మిత్రులు వీధిలో నిల్చుని ఎలుగెత్తి రమాపతిని పిలిచారు. తెరలు తెరలుగా దిగులు పారాడుతున్న ముఖంతో రమాపతి ఈవలికి వచ్చి హఠాత్తుగా తానెదుర్కోవలసి వచ్చిన పరిస్థితిని గురించి స్నేహితులతో చెప్పుకున్నాడు. మిత్రులందరూ ఏక కంఠంతో సానుభూతి ప్రకటించారు. "ఈ వూళ్ళో మంచి వైద్య సహాయం లభిస్తుందా రమాపతీ! పట్నానికి తీసుకెళ్ళి ఉంటే బాగుండేది" అన్నారొకరు. "ఎందుకూ! డబ్బివ్వగలిగితే రాణీపేట నుండి నర్సు పరుగెత్తుకుంటూ రాదూ" అన్నారు వేరొకరు. "ఐనా డాక్టర్లు, నర్సులు చేయగలిగింది మాత్రం ఏముంది ? ఎవరైనా ఆత్మీయులు అండగా వుండటం అవసరం" అన్నారింకొకరు. ఎవరికి తోచిన అభిప్రాయన్ని వారు సెలవిచ్చి, నవ్వులతో, కేరింతలతో దూరంగా వెళ్ళి పోతున్న మిత్రుల్ని చూస్తూ వేడిగా నిట్టూర్చాడు రమాపతి.

అర్ధరాత్రివరకూ ఉండి ఉండి నొప్పులు కనిపించాయి. ఆపైన రాజేశ్వరికి కాస్తా కునుకు పట్టింది. కానీ, రమాపతి మాత్రం నిద్రపోగలిగిన స్థితిలో లేడు. ఇలాంటి సందర్భాల్లో ఏ సమయానికి ఎలా ఉంటుందో వూహించడం కష్టం.

దేవుడి దయవల్ల ప్రస్తుతానికేమీ తొందరలేకపోతే రేపు సాయంకాలానికల్లా అత్త గారిని తీసుకురావచ్చు ననుకున్నాడు.

మిగిలిన రాత్రి ప్రశాంతంగానే గడిచింది. ఉదయం మొదటి బస్సుకే అత్త గారి వూరికి బయల్దేరాడు రమాపతి. బస్సు పాతికమైళ్ళవేగంతో పరుగెడితే మూడు గంటల్లో ఆ వూరు చేరుకోవచ్చుకానీ, వాయువేగాన్ని మించి పయనించే మనో వేగంముందు బస్సువేగం ఏ పాటిది? పోగా మార్గమధ్యంలో ఎదురైన ప్రతి నాష్టా అంగడి దగ్గరా బస్సు ఆగిపోతూ వచ్చింది. అయిన టీ నీళ్లన్నీ త్రాగి ఆపసోసాలు పడిపోతున్న మహోదరుడైన బస్సు డ్రయివరు తన కాయాన్ని కదలిస్తున్నంత మెల్లగానే బస్సును కూడా తరలిస్తున్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలకు గానీ బస్సు గమ్యస్థానం చేరలేకపోయింది. రిక్షా చేసుకుని అత్తగారింట వ్రాలాడు రమాపతి. వ్రాలగానే ఏమైంది? మూసిన కిటికీలతో, వేసిన తలుపులతో బిగించిన తాళాలతో ప్రత్యక్షమైన అత్తగారింటి ఎదుట చేష్టలు దక్కి విగ్రహంలా నిల్చుండి పోయాడు రమాపతి.

కోలుకున్న తర్వాత వాకబు చేయగా తెలిసింది— అత్తమామ లిద్దరూ యాత్రా స్పెషల్లో బయల్దేరి పూరీ, కలకత్తా మీదుగా ఉత్తరదేశ యాత్రలకు వెళ్ళి పోయారని !

ఆ క్షణాన బంధువర్గం మీద రమాపతికి పట్టరానంత కోపం వచ్చినమాట వాస్తవం! ప్రసవాని కింకా ఒకటి రెండు మాసాల వ్యవధి వుండవచ్చునని తాను సూచనగా జాబు వ్రాసిన మాట నిజమే! ఐతే మాత్రం? తీర్థయాత్రల కిదా సమయం! అసలీ అత్తారింటి వారికి అదినుంచీ తనపట్ల చిన్న చూపు కద్దు! మొదటి అల్లుడేదో ఇంజనీరు. రెండో అల్లుడు బాగా ఆర్జిస్తున్న లాయరు. ఎటొచ్చీ మూడో అల్లుడైన తాను మాత్రమే బడి పంతులు.

'ఛా ఛా. ఏం మనుషులు!' అనుకున్నాడు రమాపతి.

అత్తగారి వూరునించి రమాపతి సరాసరి స్వగ్రామానికి బయల్దేరాడు. రాత్రి పది గంటలప్పుడు గ్రామంలో బస్సు దిగాడు. వసారాలో మంచం పైన పడుకున్న నరసింహంగారు, ఓ కార్డు ముక్కయినా లేకుండా హఠాత్తుగా వూడిపడిన కుమా రుణ్ణి చూచి కంగారు పడిపోయారు? "ఏమిట్రా రమాపతీ! ఏమైంది? అమ్మాయి కులాసాగా వుంది కదూ?" అంటూ పరామర్శించారు.

"కులాసాగానే ఉంది నాన్నా? నొప్పులు ప్రారంభమౌతున్నట్లున్నాయని చెబితే అమ్మను పిలుచుకు పోదామని వచ్చాను" అన్నాడు రమాపతి.

"ఓ అమ్మను పిలుచుకపోదామనా ! అందుకోసం వచ్చావా ? అదెక్కడుందిరా రమాపతీ ! మీ అక్కయ్యకు ప్రసవం చేయడానికి అని మొన్ననే హిందూపురం వెళ్ళిపోయిందిగా ! ఐనా అమ్మాయికి ఇది మొదటి ప్రసవం గదా రమాపతీ ! ఆవిడ పుట్టింటివాళ్లేమయిపోయారు ?" విస్తుపోతూ అడిగారు నరసింహంగారు.

రమాపతి హతాశుడై అరుగుపైన చతికిలబడి పోయాడు.

* * *

మరునాటి ఉదయం తొమ్మిది గంటలకు భూమి గుండ్రంగానే వుందని ఋజువు చేస్తూ క్రితం రోజు ఉదయం ఎక్కడైతే బయల్దేరాడో అక్కడే బస్సు దిగాడు రమాపతి. సుడిగాలిలో నూలు తెగిన గాలిపటంలా కొట్టుకుపోతూ అతడు సందు మలుపు తిరగగానే తల పైకెత్తి ఇంటి వైపు చూచాడు. చూచిన క్షణంలో అతడి శరీరంలోని రక్తం నరాల వెంట శరవేగంతో పరుగులు తీసింది. ఎందుకో గానీ ఇంటి యెదుట జనసందోహం ప్రోగైంది. రమాపతి యిప్పుడు నడవడం లేదు. పరుగెడుతున్నాడు.

"శుభవార్తరా రమాపతీ ! నోటి నిండుకూ చక్కెర పోసిన తర్వాత గాని చెప్పను. తెరువు. నోరు తెరువు" – చక్కెర కోసం చేతులు చాస్తున్న కుర్రాళ్ళ నందరిని తొలగ ద్రోసుకుని రమాపతి ఎదుటకు వచ్చేస్తున్నాడు కామేశం !

"బలేవారండి మీరు! లేకపోతే లోపలికైనా రానివ్వకుండా వీధిలోనే నిలబెట్టేస్తారా ! నాన్నగారు కనిపించలేదనేమో, కుర్ర కుంక అదేపనిగా గొంతు చించుకుంటున్నాడు" అంది తలుపు చాటున నిల్చున్న కామేశం భార్య.

మిత్రుడి యెదుట ముఖాముఖిగా నిల్చోలేక ముఖం అవతలికి త్రిప్పుకున్నాడు రమాపతి. పుత్రోదయం మాటకేమి గాని రమాపతికి జ్ఞానోదయం కూడా అయింది. జ్ఞానోదయానికి చిహ్నాలే అతడి కళ్ళల్లో నిలిచిన ఆనంద బాష్పాలు !

— ఆంధ్ర వారపత్రిక, 1957

# నిషిద్ధాక్షరి

"సరికొత్త కథ చెపుతాను" అన్నాడు అడ్వొకేటు ఆనందరెడ్డి.

"అది నీ తరంగాదు!" ఏక కంఠంతో అడ్డు తగిలారు మిత్రులిద్దరూ.

రెడ్డి ప్రాక్టీసులేని లాయరుగా నగరంలో ఎంతటి ప్రసిద్ధుడో, రచయితగా దేశంలో అంతటి ప్రసిద్ధుడు. లేని ప్రాక్టీసు ఎలాగూ లేనే లేదు. రాణించిన రచనా వృత్తి మూలంగా ముప్పూటలా తిండికాదు. సరికదా, ఒక పూట ఉపాహారానికైనా వెరవు లేదు. ఐనా ఆనందరెడ్డి అదృష్టవంతుడు. గ్రామంలో అతనికి పిత్రార్జితమైన ఆస్తిపాస్తులు దండిగా ఉన్నాయి. క్లయింట్లు రాకపోయినా, కథలు తరచుగా ప్రచురింపబడకపోయినా జీవితంపైన విసుక్కునే దురవస్థను భగవంతుడతని నుదుట వ్రాసిపెట్ట లేదు.

అడ్డు తగిలిన మిత్రుల్లో మొదటివాడేమో రాధాపతి. ఏదో ఆఫీసులో మరీ అంత చిన్నదో – పెద్దదో కాని ఉద్యోగం చేస్తున్నాడతను. 'లా'కు వెళ్లలేదు గానీ. ఆ పనిచేసి ఉన్నట్టయితే తాను పెర్రీ మాసన్ లాంటి క్రిమినల్ లాయరై ఉండవచ్చునన్న ఆత్మ విశ్వాసం రాధాపతికుంది. రెండో మిత్రుడు దామోదరం. హైస్కూల్లో ఉపాధ్యాయుడు. నైతికంగా ఉపాధ్యాయ వృత్తిలో దీటు రాగలిగినది ప్రపంచంలో మరొకటి లేదన్నది దామోదరం యొక్క నమ్మకం బి. టి. కన్నా బి. ఎల్. మెరుగైనదని ఎవరైనా చెబుతే దామోదరం మండిపడతాడు. 'లాయరా, టీచరా – ఎవరు గొప్ప?' అన్న విషయం పైన అంతర్జాతీయంగా చర్చ జరిగితే, ఆ చర్చలో టీచర్లకు ప్రతినిధిగా తాను పాల్గొనే అవకాశం లభిస్తే, అప్పుడు లాయర్ల కందరికీ ఖాయిలా వచ్చినంతపని అవుతుందని దామోదరానికొక నిశ్చితమైన అభిప్రాయం కద్దు!

పోగా ఆనందరెడ్డిలోని రచయితను గురించి మిత్రద్వయానికి తెలిసింది చాలా తక్కువ. రచనా వృత్తి అనగా అహొక పెట్టుబడి లేని లాభసాటి బేరమని వాళ్ళ అభిప్రాయం. ఎంతో కొంత ఆదాయమే గనుక రాకపోతే వాళ్లు దాన్నొక

వృత్తిగానే పరిగణించక పోదురు....

తా నొక సరికొత్త కథ చెబుతా నన్నాడా రెడ్డి. అది నీతరం గాదు పొమ్మ న్నారా మిత్రులిద్ద రలా. ఆ విధంగా ఈ కథ మొదలైంది.

"ఎందుకంటే...." వివరణ ప్రారంభించాడు రాధాపతి. "లోకంలో చెప్ప డాని కింక కథలేవీ మిగిలి లేవు. నువ్వేకథ చెప్పాలనుకున్నా, దాన్ని ఇంతకు ముందెవరో చెప్పే వుంటారు. ఆ చెప్పడం గూడా బహుశా నీ కంటే బాగానే చెప్పి వుండవచ్చు..."

"బహుశా ఏమిటి! ఆ మాట నిష్కర్షగానే చెప్పరాదా రాధాపతీ!" అందు కున్నాడు దామోదరం. "మునుపు మన కథకులు కథలకోసం ఇరుగు పొరుగు భాషల్లోని పత్రికలన్నీ గాలించేవారు. లేదా మన తెలుగువే పాత పత్రికలు కొన్ని తిరగవేసేవారు. ఇటీవల మరీ తెలివి మీరిపోయి బి. సి. నాటికే వెళ్ళిపోతున్నారు. ఎలా గంటావా? అదే చెబుతున్నాను. మొన్న మా హెడ్మాస్టరుగారు ఓ పత్రిక తీసుకొచ్చి అందులో ఒక కథ బ్రహ్మాండంగా వుందన్నాడు. తీరా చదివి చూద్దును గదా, నవ్వొచ్చింది నాకు! మూలం మహా భారతమునిగానీ, వేద వ్యాసునికి అనుసరణ అని గాని వ్రాయలేదు. కానీ అది పేర్లు మార్చి వ్రాసిన కుంతీ కర్ణుల కథ!"

"నిజమే బ్రదర్స్, నిజమే!" అన్నాడు రెడ్డి. "కానీ ఒక విషయాన్ని గమనించాలి మీరు. కథలు ఆకాశం నుండి వూడిపడవు. అవి జీవితంలో నుంచి పుట్టుకొస్తాయి. మరి ఆ జీవితం మానవుడిదే కద! ఆ మానవుణ్ణి తయారు చేయ డానికి భగవంతుడు ఉపయోగిస్తున్న ముడి సరుకు నాటికీ నేటికీ ఒకటే గదా! కోపతాపాలు, రాగద్వేషాలు, కోరికలు, ఆశలు, భేదాలు–ఆమోదాలు– వాటిలో మార్పురాలేదు గదా! మరింక దేశ చరిత్రలే పునరావృత్తం అవుతుండగా కథ మళ్ళీ మళ్ళీ చెప్పబడడంలో ఆశ్చర్య మేముంది? రామకథను ఎంత మంది వ్రాశారు కారు? ఎందరు వ్రాసినా మనం మళ్ళీ మళ్ళీ రామాయణాన్ని చదువుకోడం లేదా? అందువల్ల నేను చెప్పే దేమిటంటే..."

రెడ్డి కేస్‌లోంచి సిగరెట్టు పైకి తీశాడు. టక్కున అగ్గిపుల్ల గీశాడు.

"నువ్వేమీ చెప్పలేదు. సిగరెట్టు ముట్టించుకున్నావు" అన్నాడు రాధాపతి.

"శాంతం, శాంతం. నేను చెప్పే దేమిటంటే - ఇతి వృత్తాలన్నీ పాతబడి పోయాయి; క్రొత్తవాటిని రచయితలు వెదికి పట్టలేరని మీరు చెబుతున్నారు గనుక కథలో మీరు పట్టి చూడవలసిన విషయం ఇతివృత్తం పాతదా, కొత్తదా అన్నది కానే కాదు..."

"మరైతే నీ ఉద్దేశంలో సరికొత్త కథ. అంటే ఏమిటోయ్ రెడ్డీ!"

"ఇదివరకు నేను చెప్పని కథ. నేను చెప్పగా మీరు వినని కథ!"

"నిర్వచనం సాదాగానే వుంది గనుక అభిప్రాయ భేదాలకు తావు లేనట్టే!" తప్పనిసరై ఒప్పుకుంటున్నట్టుగా అన్నాడు దామోదరం.

"ఏమాత్రం కథకైనా ఉపోద్ఘాతం ఒకటుండాలిగదా! అందుకే చెబుతున్నాను, ఇది కల్పనా కథ కాదు. కేవలం జరిగిన కథ."

"ఇలాంటి తస్సాలకు మోసపోయేంతటి అజ్ఞానులం కాము."

"కథ పూర్తిగా విన్న తర్వాత గానీ నా మాట తస్సా అవునో కాదో తెలియదు."

"అలాగైతే నీ మాటలోని నిజానిజాలు తెలుసుకోడానికైనా మేము కథంతా వినవలసిందే నన్నమాట!" బిక్కమొగం పెట్టాడు రాధాపతి.

"నిర్బంధ మేమీ లేదు. గమ్యస్థానానికి టిక్కెట్టు కొనుక్కుంటాం. వెళ్ళడం అనవసర మనిపిస్తే మధ్యలో ఏ స్టేషనులోనైనా దిగిపోవచ్చు"

"కానీ ఈ రైలు గమ్యస్థానాన్ని చేరుకుంటుందా అన్నదే సందేహం."

"నిజమే! ఈ మధ్య గొలుసు లాగి రైళ్ళను ఆపడం మరీ మామూలు పనై పోయింది. అది రూలుకు విరుద్ధం. పోగా ఇకపైన గొలుసు లాగవద్దని వేడుకుంటూ దిగో, రైలు కదులుతోంది. ప్రతి కథకూ ఒక నాయకుడుంటాడు. ఉండి తీరాలి గాడా! మరి నా కథానాయకుడి పేరేమిటంటే -"

టక్కమని అడ్డు తగిలాడు రాధాపతి- "నేను చెబుతానోయ్! నూటికి డెబ్బయి యిదు పాళ్ళు వాడి పేరు సుబ్బారావై వుంటుంది. అదీ గాకపోతే నరసింహం. దా వెంకట్రావు."

"ముసలాడైతే చలమయ్య..."

"పడుచువాడైతే గోపాలం..."

"ఆపం డాపండి!" బిగ్గరగా నవ్వేసాగాడు రెడ్డి. "పేరు తీసుకుంటున్న శ్రమకు కృతజ్ఞుడ్ని. కానీ మీ ఊహాశక్తి ఇలా వృథాగావడం నా కిష్టంలేదు. మీరిలా జాబితా కట్టి పెయ్యి పేర్లు చెప్పినా సరే. నా కథానాయకుడి పేరు మాత్రం పసిగట్టలేరు."

"ఓ యబ్బో. ఎవడయ్యా ఆ అనామకుడు?"

"సనామకుడే! అతడి పేరు బషీరుద్దీను."

"జలాలుద్దీను బంధువా ఏమిటి ?"

"గొలుసు లాగినా ఇక రైలాగదు. అప్పుడు నేను బియ్యే మొదటి సంవత్సరం చదువుకుంటున్నాను. మదరాసులో —కాలేజీ అంటే మీకు తెలుసు. అది కాలేజి లా వుండదు. అరణ్యంలా వుంటుంది. అరణ్యంలో అంతఃపుర మనడం సముచిత మేమో! ప్రాకారకుడ్యం దాటి ఒకటి రెండు ఫర్లాంగుల దూరం వెళితేగాని లోపల పెద్ద పెద్ద కట్టడాలున్న సంగతి తెలియదు. నగరానికి కాలేజీ చాలా దూరం. నగరంలోని ఆనందాలకు కాలేజీకి మరింత దూరం. కనీసం ఒక సినిమాచూచి రావాలన్నా సరే,అందుకు విశ్వప్రయత్నం చేయవలసివచ్చేది.అలాంటి కట్టుదిట్టాలుండే వక్కడ. ప్రిన్సిపాలు మాక్డొనాల్డు దొరగారు చండశాసనులు. మా హాస్టలు వార్డెను యూసఫ్ లోకనాథన్ ది కోతిపట్టు. వానరుడు నరుడుగా మారుతూ వచ్చిన పరిణామ క్రమంలో ఒకానొక దశకు ప్రతిబింబంగా వుండేది. అతని ఆకారం. ప్రిన్సిపాలుకూ, వార్డెనుకు ఏకాభిప్రాయం కుదిరితే ఒక విద్యార్థిని ఏం చెయ్యాలన్నా చేయగలిగేవారు. ఒక్క ఆదివారం పగటివేళల్లో తప్పితే మరె ప్పుడూ నగరంలోకి వెళ్ళరాదు. మిన్నులు విరిగిపడినా సరే, మేదిని చీలినా సరే నియమాతిక్రమణం జరగడానికి వీలు లేదు. నేను కాలేజీలో చేరి అప్పటి కింకా నెల రోజులు కాలేదు. అక్కడి శిక్షాస్మృతి నాకింకా ఒంటబట్టలేదు. నగరంలో 'శాంసన్ అండ్ దలైలా' ఆడుతోంది. వెళ్ళి చూశాను. ఎలక్ట్రిక్ రైల్లో తిరిగి వచ్చి స్టేషనులో దిగాను. గంట పదకొండు. స్టేషను నుంచి కాలేజి కాంపౌండుకు అరమైలు దూరం వుంటుంది — రోడ్డు కటూ ఇటూ చెల్లా చెదరుగా ఇళ్ళయితే వున్నాయి గానీ, అప్పటికే గాఢనిద్రలో వున్నాయి. రోడ్డు నిర్జనంగా వుంది.

జరుగుతున్నది పండు చలికాలం. కప్పుకోడానికి బట్టలులేక చేతులు ముడుచుకుని కూర్చున్న కాందిశీకుల్లా చెట్లు సైతం చలిలో ముద్దగట్టుకు పోయి నట్టున్నాయి. అవేళప్పుడు, రోడ్డు వెంట ఒంటరిగా నడవవలసి వచ్చినందుకు నేను లో లోపలే కొంత గాభరా పడిపోయిన మాట నిజం. ఓ భయ వీచిక రివ్వు రివ్వున నా రక్త నాళాల్లో పారాడింది. దిగులు దిగులుగా వెనుదిరిగి చూశాను. కొద్ది గజాల్లో ఓ ఆకారం కనిపించింది. నాతోబాటే రైలు దిగాడేమో, ఓ వ్యక్తి నా వెను వెంటనే వస్తున్నాడు. ప్యాంటు, కోటు, చెవులకడ్డంగా మఫ్లర్లు, కళ్ళకు సులోచనాలు- వాలకాన్ని బట్టి చూస్తే కాలేజీ విద్యార్థిలాగే వున్నాడు. ప్రాణం తేరుకున్నట్టయింది నాకు!

"మీరు హాస్టలుకేనా..." ఇంగ్లీషులో పలకరించాను...

"అవును." ముక్తసరిగా జవాబు వచ్చింది.

మాట తీరును బట్టి చూస్తే అతడు తెలుగు వాడిలా తోచలేదు. కాలేజీలో ఆంధ్రులు, అరవలు, కన్నడులు' మళయాళీలేగాక ఉత్తరదేశం నుంచి, ఇంకా విదేశాలనుంచి వచ్చిన విద్యార్థులు గూడా ఉన్నారు. ఆయాప్రాంతీయ భాషలు ఎప్పుడోగానీ వినిపించవు. పరాయి భాషలో ఎంతసేపు మాట్లాడినా ఆత్మీయత కుదరదు. దూర ప్రాంతంలో నా అన్నవాళ్ళు లేని చోట ఆత్మీయులైన స్నేహితులు గూడా లేకుండా కాలం గడపడం చాలా కష్టం. ప్రయత్నించని దోషం నాదిగాదు. కానీ నా మట్టుకు నాకు మాత్రం స్నేహం చేయదగ్గ వాడుగా ఒక్కడూ కనిపించలేదు.

ఆ రోజు రాత్రివేళ రోడ్డుపైన తారసిల్లిన వ్యక్తిలో స్నేహలక్షణాలేవైనా ఉన్నాయో లేవో తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది నాకు!

"మీరు బియ్యేనా చదువుతూ వుండటం?" మళ్ళీ పలకరించాను.

బాణానికి బాణం ఎదురైనట్టుగా నా ప్రశ్న కొక ప్రశ్నే ఎదురైంది — "మీరూ సినిమా నుంచేనా వస్తూ వుండటం?"

తెల్లబోయినా బదులు చెప్పాను. చిత్రం చాలా బాగుందన్నాను. శాంసన్ పాత్రధారి అమోఘంగా నటించా డన్నాను. డలైలా అందంగా లేదా అన్నాడు. అవుననిపించుకున్నాక బిగ్గరగా నవ్వుతూ "ప్రిన్సిపాల్‌గారి మేజా సొరుగులో

ఓ పేము బెత్తం వుంది. అది దలైలాకన్నా అందంగా వుంటుంది. దలైలా నడుములా అది గూడా వెయ్యి ఒయ్యారాలు పోతుంది. చూద్దువుగానీ వుండు" అన్నాడు.

నా పాటుకు నే నూరుకోక అతడ్ని మాటల్లోకి దించినందుకు నన్ను నేనే తిట్టుకున్నాను ప్రిన్సిపాలుగారి దండ నీతిని గురించి ఆపాటికే ఎన్నో దారుణ గాథలు విని వున్నానేమో, అప్పు డదనంగా ఇంకొకటి తెలిసి వచ్చింది.

అంతలో గేటు దగ్గరికి వచ్చేశాము.

బావురు కప్పలాంటి పెద్ద తాళంతో సహా ఇనుప కమ్మీల తలుపులు పకడ్బందీగా బంధింపబడి వున్నాయి గూడు లాంటి గదిలో ఓ మూడుకాళ్ళ కుర్చీ మీద వాచ్ మన్ కునికిపాట్లు పడుతున్నాడు.

వాచ్ మెన్‌తో ఎలా మాట్లాడాలో నాకు తెలియదు. ఏ భాషలో మాట్లాడాలో అంతకన్నా తెలియదు !

అతడితో వ్యవహరించవలసిన బాధ్యతను పూర్తిగా నా తోడి వ్యక్తే తనే స్వీకరించాడు.

రెండు మూడు నిమిషాలపాటు హిందీలో వాగ్యుద్ధం కొనసాగింది. కీచురాయి గీపెట్టినట్టుగా వాచ్ మెన్ కూర్చున్న చోటునుంచి గొంతు చించు కున్నాడు. లేచివచ్చి తలుపులు తీయకపోతే ఆ హ్రస్వాకారాన్ని గుప్పిట్లో వేసి నులిమి పారవేసే ధోరణిలో నా 'అపరిచిత మిత్రుడు' అతడి పైపైకి వెళ్ళసాగాడు.

చివరికెలాగైతేనేం, కొంతసేపటికి మాధ్యేమార్గమొకటి స్ఫురించినట్టు తోచింది.

వాచ్ మెన్ తన జేబులోనుంచి డైరీ పైకి తీశాడు.

వ్రాసుకోమని ధీమాగా తన పేరు చెప్పేశాడు నా సహ నేరస్తుడు–"దీపక్ ది సౌజా."

"ఆప్‌కానామ్ క్యాహైసాబ్?" వాచ్ మెన్ నావైపు తిరిగాడు.

చెప్పుకున్నాను.

తలుపులు తెరుచుకున్నాయి.

హాస్టలుదాకా నడిచే వెళ్ళానో, పరుగిడుతూ వెళ్ళానో గుర్తులేదు. గదిలో పడుకున్నానేగానీ నిద్రపట్టలేదు. తెల్లవారు జామున అది కలతనిద్రో, కాకపోతే పీడ కలో ఏదో ఒకటి మగతగా నన్ను చుట్టుముట్టింది. తెల్లవారేసరికి నాకోసం పిలుపు సిద్ధంగా వుంది...

కోరమీసాలు మెలిపెడుతూ లూసఫ్ లోకనాధన్ తన రూములో నాకు దర్శనమిచ్చాడు.

"అబ్బాయ్! ఇంకా రూల్సుకు అలవాటు పడలేదేమిటి ? అర్ధరాత్రి షికార్లు దంచేస్తున్నావటగా!"

"మన్నించండి సార్! పొరపాటే చేశాను. ఇక నెప్పుడూ యిలా జరగదు."

"చాల్లేవోయ్! నీ సంజాయిషీ ఎవరికి కావాలి? వాచ్‌మెన్‌ను నుగ్గు నూచం చేసి వేస్తానన్నావటగా నీ స్నేహితుడు? ఎవడతను ?"

"అదే, అతడెవరో తెలియదు సార్ ! చీకట్లో కలుసుకున్నానేమో, ఇప్పుడు గుర్తుపట్టగలనన్న నమ్మకమైనాలేదు. కానీ అతడు వాచ్‌మెన్‌తో పేరు చెబుతుండగా విన్నాను – అతడి పేరు దీపక్ డి సౌజా !"

"దీపక్ డి సౌజా!" వికటంగా నవ్వసాగాడు లూసఫ్ లోకనాధన్ ! "అది వాచ్‌మెన్ కళ్ళల్లో కారం చల్లడానికి పెట్టుకున్న మారుపేరు. అతడి నిజమైన పేరేమిటో నాకు కావాలి?"

"పొమాణికంగా నాకు తెలియదు సార్! మీరే ఒట్టుకోమన్నా సరే."

"ఛత్, మాటలాడకు ! నాకు కావలసింది అతడి పేరు. కావలిస్తే నీకు సాయంకాలం ఏడుగంటలదాకా గడువిస్తున్నాను. ఆలోగా అతణ్ణి ట్రేస్ చెయ్యగలిగావో సరేసరి, లేకుంటే పది రూపాయలు అపరాధం చెల్లించుకోవాలి."

మారుమాట్లాడకుండా వెలుపలికి వచ్చేశాను. 'దీపక్ డి సౌజా' అన్నది మారు పేరైతే, యిక నిజమైన పేరేమిటో తెలుసుకోగల మంత్ర తంత్రాలేవీ నాకు తెలియదు.

రహస్యాన్వేషణను పూనుకోవడం కన్నా – పదిరూపాయలు మనవికావనుకుంటే సరిపోతుంది.

పదిరూపాయల నోటు జేబులోవేసుకుని ఈ రోజు సాయంకాలం ఏడు గంటలు కాక మునుపే లూసఫ్ లోకనాధన్‌గారి భేటీకి వెళ్ళాను.

"వచ్చావా అబ్బాయ్! అపరాధం చెల్లించనక్కరలేదులే! మొదటి తప్పుగా భావించి నీకు వార్నింగ్ యిస్తున్నాను." ప్రసన్నవదనుడై కనిపించాడు లూనఫ్ లోకనాథన్. తన ధోరణికి విరుద్ధంగా మృదువుగా మాట్లాడుతున్నాడు గూడా!" "ఈ లోకనాథన్ నిఘానుంచ్చి తప్పించుకోడం వాచ్‌మెన్‌ను బెదిరించినంత సుల భంగాదు. నేరస్తుడు తనంతట తనే బయటపడి, స్వయంగా నేరం ఒప్పేసు కున్నాడు. ఇదిగో, ఇరవై అయిదు రూపాయలు జరిమానా గూడా చెల్లించాడు..."

"అలాగా! ఎవరు సార్ అతను?" కుతూహలంతో ప్రశ్నించాను.

"లిచరేటర్ స్టూడెంటు. బషీరుద్దీను. రూం నెంబరు నలభై రెండు..."

నా పాదాలు నన్ను అప్రయత్నంగా రూం నెంబరు నలభై రెండుకే తీసు కొని వెళ్లాయి. కిటికీ దగ్గర నిల్చుని అడవిలాంటి కాలేజీ ఆవరణలోకి చూస్తున్న బషీరుద్దీను తలుపు కిరకిర వినిపించగానే వెనుదిరిగి చూచాడు.

"మిస్టర్ బషీరుద్దీన్! నువ్వు నన్ను గుర్తుపట్టవచ్చు. పట్టక పోవచ్చు! మూడో వ్యక్తి ఒకడు పరిచయం చేసి పెట్టేదాకా స్నేహభావం కుదరని ఈ కాలేజీ సమాజంలో నేనిలా నా అంతటా నేనుగా నీ గదిలోకి రావడం నీ కిష్టంగావచ్చు. కాకపోవచ్చు. నా పేరు రెడ్డి. నేను 'ఆంధ్రా' నుంచి వచ్చాను. నేను నీతిపరుడినో, కానో చెప్పలేను. కానీ నీతి నిజాయితీల పట్ల నా కెంతైనా గౌరవం వుంది. అందుకే నిన్నిలా అభినందించడానికి వచ్చాను..."

"వాట్ వాట్! ఏమిటోయ్ నువ్వు చెబుతున్నది? నాకేమీ అర్థం కావడం లేదు" అన్నాడు బషీరుద్దీను.

"ఎందుకూ కొరగాని అప్రయోజకుడివిగా ఉండడం కంటే అబద్ధాలు చెప్పడమైనా నేర్చుకోమన్నాడు వివేకానందుడు. అబద్ధాలు చాలామంది చెప్ప గలరు. కానీ అవసరం వచ్చినప్పుడు అందువల్ల తమ కపకారం జరిగినా నిజం చెప్పగల చేవ అరుదుగా కొందరిలో మాత్రం వుంటుంది. అందుకే నిన్ను నేను హృదయపూర్వంగా అభినందిస్తున్నాను."

దుమ్మును ధూళిని దులుపుకున్నట్లుగా బషీరుద్దీను నా కాంప్లిమెంటుకు పెద ముఖం పెట్టేశాడు. "చాల్లే బ్రదర్! పొగిడింది చాలు! నీతికి, నిజాయితీకి నిలబడా లన్న మహదాశయమేదీ నాకు లేదు. ఎప్పటికి ఎలా చేయాలనిపిస్తే అలా చేసేయడం నా అలవాటు. నేను చేసిన తప్పుకు మరొక నిర్దోషి శిక్షింపబడటం

నా మట్టుకు నాకు అర్థంలేని విషయంగా కనిపించింది. అంతే మరి ! అందుకే అలా చేశాను."

"నేను థాంక్స్ చెప్పుకుంటూ వుండడం గూడా అందుకే! అలా చేయబట్టె లూసఫ్ లోకనాధన్‌తో బాటుగా నీ పేరు నాకూ తెలిసింది..."

"అవునవును. అన్నట్టు లూసఫ్ లోకనాధన్‌తో చెప్పింది మారు పేరు కాదు లేవోయ్ రెడ్డీ! ఇది నిజమైన పేరే! నేను కడపజిల్లా నుంచి వచ్చాను. ఎప్పుడైనా కడపజిల్లాకు వచ్చావుటోయ్ రెడ్డీ ! మా జిల్లా దోసకాయలకు, కర్బూజా పళ్ళకు, తమలపాకులకు ప్రసిద్ధి !"

"అవునట! నేనూ విన్నాను. కడపజిల్లా కాటకాలకు నెలవటగూడా ! కానీ అలాంటి దుర్భిక్ష ప్రాంతంలో మార్దవానికి, మాధుర్యానికి పేరు మోసిన సరుకులు ఉత్పత్తి కావడం చాలా ఆశ్చర్యం..."

"కొంపదీసి నన్నుగూడా ఆ సరుకుల్లో కలిపేశావా ఏమిటి?" పెద్ద పెట్టున నవ్వేసాగాడు బషీరుద్దీను.

అలా ప్రారంభమైంది మా స్నేహం. రోజుకొక్కసారైనా మేము కలుసుకునేవాళ్ళం. "ఏం చేస్తున్నావోయ్ రెడ్డీ! ఏమిటోగానీ చెప్పరానంత బోరింగుగా వుందోయ్ బ్రతుకు! ఎక్కడికైనా వెళ్ళిపోదామా!" అంటూ తుఫానులా గదిలోకి వచ్చేవాడు.

"వెళ్లొచ్చు! కానీ లూసఫ్ లోకనాధన్ ఒప్పుకుంటాడా?" అనేవాణ్ణి.

"వదిలేయ్! స్వేచ్ఛా విహంగాన్ని అడ్డుకోగల శక్తి ఎవరికుంది? విహంగ మంటే జ్ఞాపకమొచ్చింది. వర్డ్స్‌వర్త్ ఏమన్నాడో తెలుసా ?"

బషీరుద్దీనుకు ప్రపంచంలో అన్నింటికన్నా ప్రియమైనది ఆంగ్ల సాహిత్యం. హిగ్గిన్ బాదమ్స్‌లో క్రొత్త పుస్తకం వచ్చిందని తెలిస్తే ఆరోజు కాలేజి ఎగ్గొట్టేశాడన్నమాటే ! క్రొత్త పుస్తకం కొరికితే చాలదు. చదువుకోడానికి అతని కొక అనువైన చోటు కూడా కావాలి. నగరమంతా గాలించి తనకు నచ్చిన ప్రదేశాన్ని ఎన్నిక చేశాడు బషీరుద్దీన్. అది నగర గర్భంలోవున్న మృగశాల. "అరరే! ఆ కుందేలును చూడవోయ్ రెడ్డీ! ఎంత బాగా గెంతుతోందో చూచావా!" అంటూ నేరుగా కప్పుల పంజరం దగ్గిరికి పరుగెత్తేవాడు. కోతులకు బిస్కట్లు పంచేవాడు.

చిలకల్ని పలకరించేవాడు. జంతువులతో ఆడుకున్నంతసేపూ ఆడుకున్నాక చొక్కా తీసి చెట్టు కొమ్మకు తగిలించి హాయిగా పచ్చికపైన పవ్వళించేవాడు. మృగశాలసృష్టిపై చిత్ర్యాల కన్నింటికీ నిలయం. ఆ విచిత్రాల కన్నింటికీ తల మానికంలా కనిపించేవాడు బషీరుద్దీను.

"మనం కాలేజీ విద్యార్థులం. ఇలా పసిపిల్లల్లా ప్రవర్తించడం ఏం బాగుం టుంది బషీరుద్దీన్? చూచిన వాళ్ళు నవ్వుకోరా?" అనేవాణ్ణి.

"నాన్‌సెన్స్! ఆ మాట చెప్పకోయ్ రెడ్డీ! నీ నాగరికతనంతా మూట గట్టి ఏటిలోకి గిరవాటుపెట్టు. కూర్చోవాలంటే ఒక నియమం. లేవాలంటే ఒక నియమం. ఈ నియమాల హద్దులో ఒదుగుళ్లపోతూ బ్రతుకును కుంచించుకోవలసిన అవసర మేమిటయ్యా? అడ్డూ ఆపూ లేకుండా ఆనందంగా నదిలా ప్రవహించి పోగూడదా జీవితం!"

బషీరుద్దీను ఫిలాసఫీ నా బుద్ధికి బాగున్నట్టే తోచేది. కానీ పైపైకి బాగానే వున్నట్టు కనిపించే పద్ధతుల్తో బ్రతక సాగితే కాలక్రమాన ఏవేవో ముప్పుతిప్పలు ఎదురుగావచ్చునన్న అనుమానం మాత్రం లేకపోలేదు. ఐనా బషీరుద్దీనుతో వాదించి అతడి సిద్ధాంతాన్ని త్రోసిరాజనిపించగల తెలివి తేటలు మాత్రం నాకు లేవు.

కానీ యిక్కడొకమాట నొక్కిచెప్పాలి బషీరుద్దీను మాత్రం తన సిద్ధాం తానికి అనుగుణంగానే నడచుకునే వాడు.

ఎలాగంటారా? అదే చెబుతున్నాను.

చదవాలనిపిస్తే రాత్రి రాత్రంతా మేలుకుని చదువుతూ వుండిపోయేవాడు. బద్ధకిస్తే ఎనిమిదింటికే నిద్రపోయేవాడు. నిద్ర అతడికి పిలవగానే పలికేది. సినిమా బాగుండకపోతే ఒక్కొక్కప్పు డతనికి హాల్లోనే నిద్రపట్టి పోయేది. అతనికీ ఆకలికి చాలా దగ్గరి చుట్టరికం. ఆకలౌతున్నట్టు అనుమానం కలిగినా చాలు— దగ్గర్లో ఏ హోటలుంటే ఆ హోటల్లోకి దూకేసేవాడు. ఏది దొరికితే దానితో పొట్ట నింపుకునేవాడు భోజనానంతరం వెచ్చగా సిగరెట్టు కాల్చుకుంటూ "అబ్బ- ఎంత హాయిగా వుందోయ్ రెడ్డీ! ఇప్పుడేం చేయాలో తెలుసా?" అనేవాడు. "ఏం చేయాలి?" అనేవాణ్ణి. "నేరుగా బీచికి దారితీద్దాం" అనేవాడు,

నా సందేహాలు నావి ! వెళ్ళవచ్చు గానీ అర్ధరాత్రి దాటిన తరువాత మా గమ్యస్థానానికి రైళ్ళులేవు...

"ఫరవాలేదువోయ్! టాక్సీలో వెళ్ళిపోదాం..." అనేవాడు బషీరుద్దీను.

టాక్సీలు దొరక్కపోవు. నిజమేగానీ ఆ వాచ్‌మేన్‌తో గొడవ పడవలసి వుంటుంది.

"వాడి ముఖం! రెండు రూపాయలు పారేస్తే కుక్కలా తోకాడించడూ!"

ఆ మాటగూడా నిజమే! కానీ మా దగ్గర మిగిలివున్న డబ్బులు టాక్సీకి మాత్రమే సరిపోతాయి.

"ఐతే గోడ దూకేద్దాం" అనేవాడు బషీరుద్దీను.

కాలేజీలో ఏ ఫంక్షను జరిగినా అందులో బషీరుద్దీను పాటలకు తప్పనిసరిగా ఒక అవకాశం వుంటూ వుండేది. ఎంతో కొంత కళాభినివేశం వున్న వ్యక్తి పదిమందిలోనూ తన ఆధిక్యతలను పొదుకొల్పుకోడానికి ప్రయత్నించడం మనకు విదితమే! బషీరుద్దీనుకు అలాంటి ఉద్దేశం ఏ కోశానా వుండేది గాదు. కృష్ణశాస్త్రిగారన్నట్టు పువ్వెందుకైతే తావులు వెదజల్లుతున్నాయో, చంద్రుడెందుకైతే చంద్రిక వెదజల్లుతున్నాడో, ఏల సలిలం పారుతోందో ! ఏల గాడ్పు విసరుతోందో అలా ప్రతిఫలాపేక్ష లేకుండా తన ఆనందం కోసం తాను పాడుకునే వాడు బషీరుద్దీను. ఒకసారి కాలేజీలో హాస్టలు డే సెలబ్రేషన్స్ జరిగాయి. ఒకానొక సుప్రసిద్ధ సినిమా డైరక్టరుగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. బషీరుద్దీను గానం విని అతడు పరవశించిపోయి, తాను తీయబోతున్న సినిమాలో అతడికొక అవకాశాన్ని వాగ్దానం చేశాడు. పది రోజులు గడిచాయి. డైరెక్టరుగారి వాగ్దానాన్ని బషీరుద్దీను ఖాతరు చేసినట్టే లేదు. నాలాంటి శ్రేయోభిలాషులు కొందరు చెవిలో యిల్లు కట్టుకుని పోరగా, ఆ డైరక్టరుగారి నొకసారి కలుసుకోడానికి సమ్మతించాడు. ఇతగాడు వెళ్ళిన సమయానికి తన పనుల తొందరలో తానుండి పోయాడేమో, ఆ డైరక్టర్ కాలేజీలో మాట్లాడినంత ఆప్యాయంగా స్టూడియోలో మాట్లాడలేదు. బషీరుద్దీన్ గిరుక్కున వెనుదిరిగి వచ్చేశాడు. "ఆ ఏడుపుగొట్టు ముఖం ఛాన్సు యివ్వడమూను, మనం పాడడమూనా! ఐనా మన తెనుగు వాళ్ళు మనల్ని

ఎక్కడ ఎంకరేజ్ చేస్తారోయ్ రెడ్డీ! మనం వెళ్తే హిందీ ఫీల్డుకే వెళ్ళాలి" అన్నాడు.

ప్రతి మానవుడి జీవితంలోనూ మరపురాని మధురానుభవాలు కొన్ని వుంటాయి. బషీరుద్దీనుతో కలిసి బీచికి వెళ్ళిన అనుభవాలు అలాంటివి. మేము వెళ్ళే సమయానికి సముద్రతీరం బాగా నిర్జనమైపోయి వుండేది. కొన్ని సంద ర్భాలలో చిమ్మచీకటి. మరికొన్ని వేళల్లో పుచ్చపువ్వులాంటి వెన్నెల. గిల్లికజ్జా లాడుకుంటున్న పసిపిల్లల్లా అంబుధిలో అలలు మా ఎదుట. ఎడతెగని క్రీడా విలాసాలు నెరపుతుండేవి. గొంతెత్తి స్వేచ్ఛగా పాడుకోడానికి అంతకంటే తగిన చోటు ప్రపంచంలో వుండదనేవాడు బషీరుద్దీను, సాగర సంగీతంలో పోటీకి కూర్చున్నట్టుగా గంటల తరబడీ, మళ్ళీ ఆకలయేదాకా పాడుతూ వుండిపోయే వాడు. ఎంత చక్కగా పాడేవాడు బషీరుద్దీన్! వసంతంలో కోకిల గానం, తెల్ల వారు జామున సన్నాయి మేళం, అర్ధరాత్రి దాటిన తరువాత నీరవ నిశీధిని చీల్చు కుంటూ వినవచ్చే వేణుగానం — వీటి నెప్పుడైనా విన్నారా మీరు? అంత నాజూగ్గా. అంతకమ్మగా, అంతగా పారవశ్యం కలిగిస్తూ పాడేవాడు బషీరుద్దీను."

* * *

భూమ్యాకర్షణనుంచి తప్పించుకుని నేరొక కక్ష్యలోకిదూసుక పోయిన రాకెట్టులా— శబ్ద ప్రపంచంలోనుంచి ఆలోచనా ప్రపంచంలోనికి జారుకున్నట్టుగా ఉన్నట్టుండి మౌన ముద్ర వహించాడు రెడ్డి.

"ఏమైంది రెడ్డీ! స్టేషను లేనిచోట రైలుబండి ఆగిపోయినట్టుంది" అన్నాడు రాధాపతి.

దామోదరం శ్రుతి కలిపాడు. "కొంపదీసి కథ పూర్తయిపోయిందని చెప్పవు గదా?"

"చెప్పినా చెప్పవచ్చు. కథ దాదాపుగా పూర్తయినట్టే!" అన్నాడు రెడ్డి.

"అలాగైతే నువ్వు చెప్పింది కథ మాత్రం కాదు. కనీసం స్కెచ్ అయినా కాదు. అది మధ్యాంతాల్లో నువ్వు చెప్పిన దానికి మొదటి రెండూ వున్నాయిగానీ, చివరిదిలేదు. తలలేని మనిషి ఎలాగో, ముగింపులేని కథ అలాగు!"

"కావచ్చు. అందుకని నేను చేయగలిగిందేమీలేదు. జీవన పథంలో మే

మిద్దరమూ ఎంత హఠాత్తుగానైతే కలుసుకున్నామో, అంత ఆకస్మికంగానే విడి పోయాము. ఆ విడిపోవడం కూడా విద్యాభ్యాసం సాంగోపాంగంగా పూర్తయిన తర్వాత జరిగిన సహజ సంఘటన గాదు."

"సర్లే! ఇంకా వివరణెందుకు? ఏదో పొరబాటు చేయడం వల్ల నీ స్నేహితుడు కాలేజీనుంచి బహిష్కరింపబడి వుంటాడు. అంతేనా మిష్టర్ రెడ్డీ!"

"అబ్బే, అలాంటిదేమీ జరగలేదు. ఎంతగా పొరబాటు చేసినా బషీరుద్దీను లాంటి స్టూడెంటుని కాలేజీనుంచి తరిమివేయడం జరగదు. కానీ అతడు వెళ్ళి పోయిన మాట నిజం!"

రెడ్డి సిగరెట్ ముట్టించుకుని నింపాదిగా కొనసాగించాడు. "బషీరుద్దీనుకు తల్లిదండ్రులులేరు. చనిపోయిన తండ్రి ఏదో మంచి ఉద్యోగమే చేసి కొంత డబ్బు మిగిల్చిపోయాడు. ఆ డబ్బు బషీరుద్దీను మేనమామ దగ్గర వుండిపోయింది. దానికి సంబంధించిన జమా ఖర్చుల వివరాలను గురించి బషీరుద్దీన్‌కు తెలిసింది చాల తక్కువ. అవసరమైనప్పుడల్లా ఇతడు జాబు వ్రాయడం, జాబు వ్రాసినప్పుడల్లా అతడు డబ్బు పంపడం— అలా జరుగుతూ వచ్చింది. కానీ ఒక సందర్భంలో అతడి జాబుకు బదులుగా డబ్బు రాలేదు సరికదా, ఒక ప్రత్యుత్తరం మాత్రం వచ్చింది. ఆ విధంగా మామగారి దగ్గరనుంచీ అతడికొక ఉత్తరం వచ్చిన ఉదంతం కూడా చాలా కాలం తర్వాత తెలిసింది. కానీ అప్పటికప్పుడు తెలిసిందేమిటంటే బషీరుద్దీను కాలేజీలో కనిపించలేదు. ఓ రోజు తెల్లవారేసరికి అతడిగది ఖాళీగా కనిపించింది. ఎటొచ్చీ బషీరుద్దీన్ ఆచూకీని గురించి చెప్పగలిగిన వాణ్ణి నేనొక్కణ్ణే! అందరూ నన్ను చుట్టుముట్టి బషీరుద్దీన్ అంతర్ధానాన్ని గురించి ప్రశ్నల వర్షం కురిపించారు. "అబ్బే ఆ విషయాన్ని గురించి మీ కెంత తెలుసునో నాకూ అంతే తెలుసు" అన్నాను. బషీరుద్దీను మాయమైపోయిన క్రొత్తలో నాకా కాలేజి కారాగారంలా అనిపించింది. అంతకంటే అండమాన్ దీవుల్లో ప్రవాస శిక్షే నయంగా తోచింది. చదువుకు స్వస్తి చెప్పి స్వగ్రామానికి వెళ్ళిపోతే బాగుండునని ఎన్నోసార్లు అనుకున్నాను. కానీ ఎంతగా తమకు సరిపడక పోయినా సామాన్య మానవులు పరిస్థితులతో సంఘర్షణ పెట్టుకోరు. ఎంతో కొంత లొంగుబాటు ప్రకటించి రాజీ పడడానికే సమ్మతిస్తారు. నేనూ అదే పనిచేశాను. క్లాసుకు వెళ్తున్నాను. లెక్చర్లు వింటున్నాను. పాఠాలు చదువుకుంటున్నాను. రాత్రుల్లో

నిద్రపోతున్నాను. అలాగే కొంతకాలం గడిచిపోయింది. ఎప్పుడైనా బషీరుద్దీను కనిపిస్తే, ఆ కనిపించడం కలలో మాత్రమే జరిగేది. ఇక ఇలలో అతడు నాకు కనిపించడేమో అనుకున్నాను..."

"మళ్ళీ కనిపించాడన్న మాట ?"

"ఎక్కడ కనిపించాడు ?"

"ఎలా కనిపించాడు ?"

"ఓ ఆదివారంనాడు సిటీకి వెళ్ళాను. మ్యాట్నీ నుంచీ ఈవలికి వచ్చే సరికి ఆరుగంటలైంది. రోడ్డుపైన నడుస్తుండగా వీధి దీపాలు వెలిగాయి. ఏదైనా పుస్తకం కొనుక్కుందామని ఓ బుక్‌షాపు లోపలికి వెళ్ళబోతుండగా, షాపులో నుంచి వెలుపలికి వస్తూ ఎదురయ్యాడు బషీరుద్దీన్. రెండు మూడు మాసాల ఎడబాటు ఆ తరువాత ఆప్తమిత్రుడు కనిపించగానే కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున తిరిగాయి. మాటలు వెకిలి వచ్చాయిగావు. విడిపించుకుని పారిపోతాడేమోన్నట్టుగా అతడి చేతిని గట్టిగా పట్టుకున్నాను. బషీరుద్దీను నా భుజం పైన చేయి వేసుకున్నాడు. ఇద్దరమూ కలిసి సాగరాభిముఖంగా నడవసాగాము..."

"ఈ మాత్రానికే ఇలా విచారిస్తా వెందుకోయ్ రెడ్డీ!" ప్రారంభించాడతను– "అసలు నీకు చెప్పే వద్దామనుకున్నాను. కానీ చెబితే నువ్వు నన్నక్కడినుంచి కదలనీయవని నాకు తెలుసు. విషయమేమిటంటే, మా నాన్నగారు, చనిపోయే నాటికే మా యింట్లో ఎంత లేదన్నా పదివేల రూపాయల రొఖ్ఖం వుంది. అందులో నా చదువుకు నాలుగైదు వేలకన్నా ఖర్చై వుండదు. మా మామయ్య నాకోసం తన స్వంత డబ్బు ఖర్చు పెడుతున్నట్టుగా బాధపడి పోవడం చూస్తే నాకు మనుషుల పైనే నమ్మకం నశించింది. ఉన్నపాటున ఇలా వచ్చేశానా, ఇక్కడొక కంపెనీలో ఉద్యోగం దొరికింది. సుందరమయ్యరు వీధిలో నవాబుల కాలం నాటి మేడ ఒకటి వుందిలే, దానిలో పావురాల గూళ్ళ నమూనాలో గదులున్నాయి. ఓ గదిలో నా నివాసం. నివాసమంటే రాత్రుల్లో పడుకోవడం మాత్రమే! తెల్లవారితే ఇదిగో, ఇలాగే రోడ్లపైన—కాకపోతే ఆఫీసులో కాలం గడచిపోతోంది. కాలేజిలో నైతే క్లాసుకు వెళ్తుండేవాడినా, ఇప్పుడదే విధంగా ఆఫీసుకి వెళ్తున్నాను మళ్ళీ అదే రొటీన్ జీవితం. ఏం బ్రతుకోయ్ రెడ్డీ! 'క్వీన్స్ రైవల్' చదివావా– సరోజినీ

దేవిది! క్వీన్ గుల్నార్ చెబుతుంది– 'నో సవర్ ఆర్ స్టా' అంటూ చప్పిడి జీవితా లను గురించి! ఉప్పూ, ఊరగాయ లేని బ్రతుకులోయ్ మనవి!"

ఈ అసంతృప్తి, ఈ నిరాశ బషీరుద్దీన్‌ను ఎక్కడికి తీసుకుని వెళ్ళ నున్నాయో నాకా క్షణాన తెలిసిందిగాదు. కానీ ఆ సత్యం గూడా అనతికాలం లోనే తెలిసి వచ్చింది. వారం రోజులు గడవకముందే బషీరుద్దీను దగ్గరనుంచి నాకో ఉత్తరం వచ్చింది. అందులో వున్నవి గూడా నాలుగే ముక్కలు. "డియర్ మిస్టర్ రెడ్డీ! సిటీకి వస్తే నువ్వు నాకోసం సుందరమయ్యారు వీధికి రావద్దు. గదిలో నేనుండను. గదిలోనే ఏమిటి, ఇకపైన నేను నీకి నగరంలోనే కనిపించను. కంపెనీలో ఉద్యోగం అన్నాను గదూ ! ఆ మేనేజరుకు నా ఇంగ్లీషు అర్థమైంది గాదు. అర్థం అడిగి తెలుసుకోవచ్చుగదా, ఊఁహూ, ఆ మాత్రం సహృదయత ఎక్కడ ఏడ్చింది! అతగాడు నా వ్రాతలోనే తప్పులు పట్టసాగాడు వాడికీ వాడి ఉద్యోగానికీ నమస్కారం పెట్టేశాను. వెళ్ళిపోతున్నాను. ఎక్కడికో చెప్పలేను. బాగా చదువుకుని పైకి రావలసిన వాడివి. విష్ యూ గుడ్‌లక్...నిరంతరం నీ మిత్రుడు బషీరుద్దీను."

* * *

"ఈ ముగింపు గూడా అట్టే తృప్తికరంగా లేదు" అన్నాడు రాధాపతి.

"బషీరుద్దీన్ అలా వెళ్ళిపోయి ఏడెనిమిదేళ్ళయింది. ఈ ఏడెనిమిదేళ్ళ పొడుగునా అతడి ఆచూకీ తెలుసుకోడానికి శతవిధాల ప్రయత్నించాను. సాధ్యం కాలేదు. ఈ మధ్యకాలంలో నేను వంద కథలైనా వ్రాసి వుంటాను. వ్రాయడానికి వీలుండి గూడా నేను వ్రాయలేకపోయిన కథ ఒక్కటే! అదే బషీరుద్దీను కథ!"

"ఎందుకు వ్రాయలేకపోయావు రెడ్డీ?" దామోదరం ప్రశ్నించాడు.

"ముగింపు తెలియకపోవడంవల్ల... ఎలాంటి ముగింపైతే సముచితమో, అది గూడా నే నూహించలేకపోయాను. డైరెక్టరు మర్యాదగా చూడలేదని బషీరుద్దీన్ సినిమా ఛాన్సు పోగొట్టుకున్నాడు. మామగారు నిష్ఠూరంగా జాబు వ్రాశాడని కాలేజీ వదిలిపెట్టేశాడు. మేనేజరుతో పొసగక ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాడు. ఆ తరువాత ఏమై ఉంటాడతను? బషీరుద్దీన్‌ను గురించి తలచుకున్నప్పుడల్లా నాకో విషయం మాత్రం జ్ఞప్తికి వస్తుండేది. ఒక సందర్భంలో అతడు జీవితం నదిలా ప్రవహించి పోవాలన్నాడు. కానీ అడ్డూ ఆపూ లేకుండా ప్రవహించిన నదీ

జలాలు చివరికేమౌతాయి? కడలి పాలౌతాయి వాటివల్ల వసుంధర సస్యశ్యామలం కాదు. వాటివల్ల ప్రజానీకానికి ఆనందం కలగదు. మీదు మిక్కిలి వరదలొస్తే పంట పొలాలు నాశనమౌతాయి. ఊళ్ళు నట్టేట కలుస్తాయి..."

"నిజమే ! అలాంటి జీవిత గాథకు అంతకంటే సముచితమైన ముగింపు కనిపించదు" అన్నాడు దామోదరం.

ఈ ఊహ కప్పటికప్పుడు రాధాపతి కొన్ని రెడీమెడ్ దుస్తులు తొడగ సాగాడు.

" 'రోలింగ్‌స్టోన్ గేదర్స్ నోమాస్, అనడం వినలేదా? 'పెక్కు భంగుల వివేక భ్రష్ట సంపాతముల్' అని భర్తృహరి మరింత ఘాటుగా చెప్పాడు గూడా ! బషీరుద్దీ నేమౌతాడు ? అలాంటివాళ్ళకు ఏ ఊరూ రుచించదు. ఏ ఉద్యోగమూ నచ్చదు, తెగిన గాలిపటంలా కొట్టుకపోతారు. చివరికే ముళ్ళ పొదలోనో తగులు కుంటారు. విరిగి...చిరిగి"

"స్టాప్, స్టాప్!" అన్నాడు రెడ్డి. "ఈ ముగింపు కేవలం ఒక ఊహ, ఒక్కొక్కప్పుడు జీవితం మన ఊహల్ని తల్లక్రిందులు చేస్తుంది. అదే జీవితంలో ఉన్న చమత్కారం..."

కొనసాగించాడు రెడ్డి.

"గడచిన వేసవి సెలవుల్లో హైదరాబాదు వెళ్ళాను. రచయితల సభల్లో పాల్గొంటున్నానని తెలిసి ఎవరో ఒక వ్యక్తి నన్ను కలుసుకోడానికి వచ్చాడని తెలిసింది. వెళ్ళి చూద్దును గదా. అతడు బషీరుద్దీను– ఊపిరి త్రిప్పుకోడానికైనా వీల్లేకుండా బిగ్గరగా కౌగిలించుకున్నాడు– "మహదానందంగా ఉందోయ్ రెడ్డీ! పత్రికల్లో నీ కథ పడినప్పుడల్లా నాకు పండుగలా ఉండేది. పదిమందితోనూ ఇతడు నా మిత్రుడని చెప్పుకునేవాణ్ణి. ముఖ్యంగా మా ఆవిడకు నీ కథలంటే చాలా యిష్టం..."

ఆనందాశ్రువుల్ని తుడుచుకుంటూ "పెళ్ళిచేసుకున్నావా బషీరుద్దీను?" అన్నాను.

"ఇద్దరు బిడ్డలు గూడా! నువ్విక్కడ ఉన్నంతకాలం మా ఇంట్లోనే ఆతిథ్యం పుచ్చుకోవాలి..."

బషీరుద్దీన్ నన్ను తన ఇంటికి తీసుకెళ్ళాడు. ఘోషా మహల్ ప్రాంతంలో అతడి నివాసం. అతడి భార్యకు మాత్రం ఘోషా వున్నట్టులేదు. వెళ్ళగానే ఉపాహారంతో సత్కరించి చిరకాల పరిచితుణ్ణి పలకరించినట్టుగా ఆమె అరమరికలు లేకుండా మాట్లాడసాగింది — "ఎంతకాలానికి వచ్చారండి అన్నగారూ! ఈయన మిమ్మల్ని తలుచుకోని రోజుండదు. మా ప్రాంతంలో ఏ కాపువాళ్ళ అమ్మాయి అయినా "మా రెడ్డి" అంటూ ప్రారంభించిందంటే ఆమె తన భర్తను గురించి చెబుతోందని అర్థం! 'మా రెడ్డి మా రెడ్డి' అంటుంటారు గదా! ఆయన మీకు పెనిమిటా ఏమిటండీ? అనేదాన్ని. 'అంతగా దగ్గరివారు గదా! మరైతే జాబు వ్రాసి ఇక్కడి కోసారి పిలిపించగూడదు?' అనేదాన్ని 'ఎక్కడున్నాడో ఏమిటో, ఏ పత్రికల వాళ్ళకైనా వ్రాసి అడ్రసు తెలుసుకోవాలి' అంటుండేవారు. చివరి కెలాగైతేనేం. మీరే దొరికిపోయారు..."

"నేను దొరకడాని కేముందమ్మా! బషీరుద్దీన్‌ను ఈ స్థితిలో చూడగలిగినందుకు పరమానందంగా వుంది. ఈ కోడెకు ముకుదాడు వేయగలిగినవారు లేరనే అనుకున్నాను..."

"ఆ మాటెందుకు లెండన్నగారూ నేను కాబట్టి ఈయనతో వేగుతున్నాను. మరొకరూ మరొకరూ అయితే..."

తుఫాను గాలిలా భార్య మాటలకు అడ్డొచ్చాడు బషీరుద్దీను- "అచ్ఛే, ఈవిడ మాటలు నమ్మకోయ్ రెడ్డీ! అన్నీ అబద్ధాలే! మనం ఎంత చెబితే అంత గాడుగా మారిపోయి చాలాకాలమైంది. తన మాట వినకపోతే పగలంతా ఉద్యోగం చేస్తూ, రాత్రుల్లో ఈవెనింగు కాలేజీకి వెళ్ళి నేను బియ్యే పూర్తిచేసే వాడినే కాను. ఉన్న పొలం కాస్తా అమ్మి ఇక్కడ ఈ మేడ కొనేవాణ్ణిగాను. నెలకైదు వందల రూపాయలు సంపాదిస్తున్నానా, ఈవిడ నా స్వంత ఖర్చుల కోసం పాతిక రూపాయలు మాత్రమే మంజూరు చేసింది. అంతకుమించి ఒక రూపాయి ఖర్చు చేయాలేన్నా తన పర్మిషన్ కావలసిందే! నెలకొకటి రెండు సినిమాలు మాత్రమే చూడాలి. దానికైనా కుటుంబమంతా కలిసే వెళ్ళాలి. సాయంకాలాల్లో ఏడు కొట్టకమునుపే ఇల్లు చేరుకోవాలి. పెందలకడనే పడుకోవాలి. తొలికోడి కూతతో నిద్రలేవాలి. ఏమిటో లేవోయ్ రెడ్డీ! బ్రతుకిలా పరిణమిస్తుందని అనుకోలేదు...."

బషీరుద్దీను నిట్టూర్చలేదు నవ్వుతున్నాడు!

— 'జ్యోతి' మాసపత్రిక, 1965

# సర్వ మంగళ

అయిదేళ్ళ తర్వాత గురువుగారిని కలుసుకోబోతున్నందుకు చాలా ఆనందంగా వుంది. అయితే ఈ ఆనందానికి వెనుక ఒక నీలి నీడ లేకపోలేదు. మానవ జీవితంలో అయిదేళ్ళ కాలం స్వల్పమైనదేమి కాదు. ఈ వ్యవధిలో అనుకోని విషయాలెన్నయినా జరగొచ్చు. పైగా మా వూరిని వదిలేటప్పటికే ఆయనకు అరవైయేళ్ళు. సజీవులై వుంటే ఇప్పుడాయనకు...ఛీ, ఛీ. అమంగళం శాంతించుగాక !

అతీ గతీ తెలుసుకోడానికి ఉత్తరాలు రాయని నేరం నాది కాదు. గుండ్రాళ్ళను బావిలో పడేస్తే నీటి బుడగలైనా వస్తాయి. నా ఉత్తరాలకా మాత్రం రెస్పాన్సు కూడా లేక పోయింది. అయితే ఒకటి. నేను రాసింది కరెక్ట్ చిరునామా కాదేమో! ఇందుకైనా బాధ్యత నాది గాదు. గురువు గారిదే ! శేష జీవితాన్ని ఆయన బళ్ళారిలో గడపదలచుకున్నాడు. చిరునామా యిచ్చి వెళ్ళమని అర్థించాను. 'ఏముందీ ! జిల్లా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రికి వెనుక వైపున' అన్నారు. "రాయవరం విశ్వపతిశాస్త్రిగారు, ఫేమస్ సొయెట్ అండ్ స్టోరీ రైటర్, బిహైండ్ ది డిస్ట్రిక్ట్ హెడ్ క్వార్టర్స్ హాస్పిటల్, బళ్ళారి" అంటూ నేను ఉత్తరాలు రాశాను. ఒకటి- ఆ మాత్రపు వివరాలు పోస్ట్‌మాన్‌కు చాలకపోయి వుండాలి. రెండు— తన పేరు, ప్రతిష్ట ఇతరులకు తెలియనీ కుండా గురువుగారు అజ్ఞాతంగానైనా జీవిస్తూ వుండాలి. మూడు- ఉత్తరాలు రాసి పరిచయాలు నిలబెట్టుకోడంలోను, లేదా పెంపొందించుకోడంలోను ఆయనకు బొత్తిగా ఆసక్తి అయినా లేక పోవాలి.

అయితే నేనైనా ఇంతకాలం తరువాత శాస్త్రి గారిని చూచి రావడానికి బయల్దేరడం నిస్వార్థంగా జరుగుతున్న పనేమీ గాదు. అంతఃకరణాలు, ఆత్మీయతలు అనేవి వట్టి పడికట్టు రాళ్ళలాంటి పదాలై పోయాయి. పని గట్టుకుని వెళ్ళి ఒక వ్యక్తిని చూచి రావడానికి అవి తమంతటనే చాలడం లేదు. అందుకు మరొక ప్రబలమైన కారణం రావలసి వస్తోంది. నాకలాంటి దొకటి ఏర్పడింది. "విజ

యాంధ్ర" పత్రిక ఉప సంపాదకులు కారుమంచి సుబ్బారావు గారితో నాకు చెప్పు కోదగ్గ పరిచయం వుంది. గడచిన వేసవి సెలవుల్లో నేను హైదరాబాదు వెళ్ళినప్పుడు ఆయన, నేనూ హుసేన్ సాగర్ గట్టుపైన కూర్చుని దాదాపొక గంట సేపటివరకు సమకాలీన సాహిత్య విషయాలు ముచ్చటించుకున్నాం. అప్పుడు మాటల సందర్భంలో విశ్వపతిశాస్త్రిగారి ప్రసక్తి వచ్చింది. ఆశ్చర్యమేమిటంటే సుబ్బారావు గారాయన్ను కీర్తిశేషుల్లో జమకట్టి వుండడం! నిరుద్యోగులు ఎంప్లాయిమెంటు ఆఫీసులో పేరు 'రెన్యూ' చేయించుకున్నట్టుగా రచయితలున్నూ ఏడాది కొకటి రెండు సార్లయినా పత్రికల్లో తమ పేరు పడేటట్టు చూసుకోవాలి. శాస్త్రిగారు పాతికేళ్ళకు మును పెప్పుడో అస్త్రసన్యాసం చేసేశారు మరి! ఇదాయన కోరి తెచ్చుకున్న శిక్షే!

"అబ్బే, ఆయన జీవించే వున్నారండీ సుబ్బారావుగారూ! ప్రస్తుత నివాసం బళ్ళారి. అక్కడికి వెళ్ళక ముందు ఒక ప్రయివేటు హైస్కూల్లో పనిచేస్తూ ఆయన మూడేళ్ళపాటు మా వూళ్ళోనే వున్నారు. అప్పట్లో వీలైనప్పుడల్లా నేనాయన్ను కలుసుకుంటూ వుండేవాణ్ణి. మీరు "కమిట్‌మెంట్" అంటుంటారు చూడండి! దాని విశ్వరూపాన్ని నేనాయనలోనే చూచాను. తాను నమ్మిన సిద్ధాంతాలకు అంతగా కట్టుబడిన వ్యక్తి ఇంకొకర్ని నేను చూడనేలేదు" అన్నాను.

"అయ్యో! అట్లాగా!" అంటూ నొచ్చుకున్నారు సుబ్బారావుగారు. "మేష్టరు గారూ! మీరు మా కోసం ఓ పని చేస్తారా? ఈ శతాబ్ది మలితరం కవుల్లో ఒకరుగా, సీనియర్ కథకుల్లో విశిష్టులుగా విశ్వపతిశాస్త్రిగారి పట్ల మాకు గౌరవం వుంది. అలాంటి పెద్దల్ని గురించి ఈ తరం వాళ్ళకు తెలియవలసిన అవసరం ఎంతైనా వుందని మా నమ్మకం. మీరొకసారి శాస్త్రిగారిని కలుసుకుని ఆయన జీవితాన్ని గురించి, సాహిత్య వ్యాసంగాన్ని గురించి వివరాలు సేకరిస్తే ఆ ఇంట ర్వ్యూను మేము పత్రికలో వేసుకుంటాం" అంటూ కొనసాగించి "ఖర్చులన్నీ మేమే పెట్టుకుంటాంలెండి!" అంటూ భరోసా కూడా ఇచ్చేశారు సుబ్బారావుగారు.

తీర్థానికి తీర్థమూ, స్వార్థానికి స్వార్థము! నా బళ్ళారి ప్రయాణం అలా ఒనగూడింది.

[13]

'తిరుపతిలో నేనెక్కింది రాయలసీమ ఎక్స్‌ప్రెస్. ఇది తెల్లవారు జామున ఏ రెండు గంటలకో రాయచూరు చేరుకుంటుంది. అక్కడి నుంచీ బళ్ళారికి బస్సులుంటాయని తెలిసింది.

నిజానికి జీవిత విశేషాల కోసం నేను శాస్త్రిగారితో కొత్తగా ఇంటర్వ్యూ జరపవలసిన పనిలేదు. స్వవిషయాలను గురించి ఏకరువు పెట్టే ఆసక్తి ఆయనకు బొత్తిగా లేకపోయినప్పటికీ నేనెట్లాగో ఒకటి, అరా వివరాలు రాబడుతూ వచ్చి ఆఖరుకు స్థూలంగానైనా ఆయన జీవిత చరిత్రను ఊహించుకోగలిగాను. శాస్త్రిగారి జన్మస్థలం శ్రీకాకుళం జిల్లాలో పలాసా. చిన్నప్పుడే తల్లి చనిపోయింది. ఒరిస్సా రెవిన్యూ డిపార్టుమెంటులో తాశీల్దారుగా పనిచేస్తూ వుండిన తండ్రి ఒరియా రాయస్తుల అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడు. ఆ రెండో పెళ్ళి తర్వాత తండ్రీ కొడుకులు ముఖాలు ముఖాలు చూచుకోనేలేదంటే ఆ మాట నమ్మడానికి శక్యమైనదిగా వుండదు. అయితే అక్షరాల నిజం. పునర్వివాహం గురించి కాదు గానీ, అది సాంప్రదాయ విరుద్ధం కావడం దగ్గరే వచ్చింది పేచీ. శాస్త్రిగారు విజయనగరంలో మేనమామల యింట వుండి హైస్కూలు చదువు ముగించారు. ఉన్నత విద్యాభ్యాసం కూడా అక్కడే జరగవలసింది. కానీ ధర్మ విపర్యయ మనేది ఇంట్లో జరిగి, ఊళ్ళో జరగకపోవచ్చుననడానికి వీల్లేదు గదా! స్థానిక కళాశాల ప్రిన్సిపాలు గారితో శాస్త్రిగారికో గొడవొచ్చిపడింది. బ్రహ్మసమాజానికి చెందిన ఆ ప్రిన్సిపాలు పేరు పరమహంసగారు. ఆయన కెక్కడలేని సంస్కరణల పిచ్చి. 'చాతుర్వర్ణ సమాజమూ— దాని బాగోగులు' అన్న విషయంపై ఆయన ఒక సదస్సు ఏర్పాటు చేశారు. ప్రారంభంలో వృత్తుల్నిబట్టి వర్ణాలేర్పడ్డాయనీ, కానీ దేనికదే విడిగా గాకుండా అన్ని వర్ణాలు ఒక సమాజంలోనే వుండి అనేక విషయాల్లో ఒకదానిపైన ఒకటి ఆధారపడి వుండడంవల్ల కాలక్రమంలో వర్ణ సాంకర్యం తప్పలేదనీ, అందువల్లనే బ్రహ్మంగారు "ఏ కులమనినను వివరమడిగితే ఏమని తెలుపుదు లోకులకు' అంటూ నిర్వేదం ప్రకటించవలసి వచ్చిందనీ కొందరు పెద్దలు తమ శాస్త్ర పాండిత్యాన్ని, లౌకిక విజ్ఞానాన్ని కలబోసి సుదీర్ఘోపన్యాసాలిచ్చేశారు.

పరమహంసగారి ప్రియ శిష్యులు కొందరైతే మరి కొంత దూరం వెళ్ళి మానవ యాత్రా ప్రస్థానం తొలి మజిలీల్లో మతాలు, కులాలు లేసే లేవనీ, చివరి దశల్లోను వుండబోవనీ, నడిమంతరపు అడ్డుగోడలు నడిమంతరంలోనే నడ్డి విరిగి

నేలమట్టం కాక తప్పదని బహిరంగంగానే పగటి కలలు కన్నారు. అప్పటికి శాస్త్రి గారి వయస్సు పద్దెనిమిదేళ్ళే. కానీ కొదమ సింగానికి వయసుతో ఏం పని? ఆయన లేచి సదస్సు ఏర్పాటు చేయడానికి వెనుక నిర్వాహకులకు గల దురుద్దేశాన్ని చీల్చి చెండాడేశారు. అలాంటి సదస్సులు వెయ్యి జరిగినా సనాతన ధర్మానికి వాటిల్లే పేగియేదీ వుండదని ఢంకా బజాయించి చెప్పేశారు. అంతటితో ఊరుకున్నారా? టి. సి. ఇప్పించుకుని ఆ కాలేజికి స్వస్తి చెప్పేశారు. తల్లి నగలు కొన్ని మిగిలి వుంటే వాటిని తెగనమ్మి, రాజమండ్రి వచ్చి అక్కడ విద్యాభ్యాసాన్ని కొనసాగించారు. పట్టభద్రులైన తర్వాత ఉపాధ్యాయ శిక్షణ కూడా అక్కడే పొందారు. ఉద్యోగిగా చెన్న రాష్ట్ర ప్రభుత్వ విద్యా శాఖలో కాలు మోపారు. క్రీడాకారుడు పుట్‌బాలును తన్నినట్టుగా ఆ ఉద్యోగం ఆయన్ను ఎక్కడికి పడితే అక్కడికి విసిరిపారేస్తూ వచ్చింది. ఇలా బదిలీలు ముంచుకరావడానికి కూడా, ఆయన విలక్షణ వ్యక్తిత్వమే కారణమని చెప్పాలి. డి. ఇ. ఓ. గారితో ఘర్షణ, జిల్లా బోర్డు అధినేతలకు ఆగ్రహం తెప్పించడం, సహోద్యోగులతో సరిపడకపోవడం, డిపార్టుమెంటుకు ఆకాశరామన్న ఉత్తరాలు, ఎంక్వయిరీలు, బెదిరింపులు– ఇలా ఎన్నెన్నో ఆటు పోట్లకు గురవుతూ కూడా ఆయన కొన్ని దశాబ్దాల పాటు సాహిత్య వ్యాసంగం కొనసాగించారంటే, అది ఆయన ఆత్మ బలానికి నిదర్శన మని నేను భావిస్తూ వుంటాను.

నేను కాలేజీలో చదువుతునేటప్పటికి విశ్వపతి శాస్త్రిగారి పేరు సాహిత్య ప్రపంచంలో ప్రముఖంగా వినవస్తుండేది. వార, మాసపత్రికల్లో ఆయన వ్యాసాలు, కథలు, పద్య ఖండికలు, గేయ నాటికలు తరచుగా వెలువడుతుండేవి. అన్నట్టు నాకాయన పేరు బాగా గుర్తుండిపోవడానికి మరొక ముఖ్యమైన కారణం కద్దు. తొమ్మిదో తరగతి తెలుగు వాచకంలో ఆయన రచించిన చారిత్రక గాథ ఒకటి మాకు పాఠ్య భాగంగా వుండేది పేరు సరిగ్గా గుర్తు లేదు. "ధర్మచ్యుతి, ధర్మ గ్లాని, ధర్మ హాని ఇలాంటిదేదో అయివుండాలి. గ్రీకు చక్రవర్తి అలెగ్జాండరుకు ప్రతినిధిగా సెల్యూకస్ భారత దేశంలో ఒక భూభాగాన్ని పాలిస్తూ వుంటాడు. సెల్యూకస్‌కు మూడో తరం వాడు ప్రొకారియస్. ఈ ప్రొకారియస్ ముద్దుల కొడుకు ప్లాటోమ్. నూనుగు మీసాల నూత్న యౌవనుడైన ప్లాటోమ్‌కి పంచ కల్యాణి గుర్రంపైన సాయంకాలాలలో షికారుకు వెళ్ళి రావడం అలవాటు. అతడు మామూలుగా షికారు వెళ్ళే చోట ఓ కొండచరియలో చిన్న నది ఒడ్డున ఒక

అందమైన దేవాలయం. శ్యామలీ చిదానందులు అక్కడ భగవత్కైంకర్యంలో నిమగ్నులై వున్న పూజారి దంపతులు. భక్తుల ద్వారా లభించే కొద్దిపాటి రాబడే వారికి జీవనాధారం. వారి ఏకైక సంతానం తరళనయన. ప్లాటోమ్ తొలి చూపులోనే ఆమెను ప్రేమిస్తాడు. పూలు పండ్లు, ఆభరణాలు మొదలైన ప్రేమ కానుకలు ఆమెకు బహూకరిస్తాడు. వచ్చీ రాని ప్రాకృతంలో తన కోరికను బయట పెడతాడు. తరళనయన నిర్భ్రాంత పడిపోతుంది. తన తల్లిదండ్రులు ఎంతటి నిష్ఠాగరిష్ఠులో వివరించి, వైదిక ధర్మానికి వ్యతిరేకంగా జరిగే చర్యను వాళ్ళు సహించరని హెచ్చరిస్తుంది. ప్లాటోమ్ వినిపించుకోడు. పెళ్ళి కార్యం కాస్తా జరిగిపోతే వాళ్ళు తమంతట తామే సర్దుకోగలరు లెమ్మని నచ్చజెబుతాడు. గుర్రంపైన తీసుకెళ్ళిపోయి భారతీయ సాంప్రదాయానుసారంగానే ఆమెను పెళ్ళాడేస్తాడు. అయితే వధువు తల్లిదండ్రుల విషయంలో అతడు వేసుకున్న అంచనా ఘోరంగా పీగిపోతుంది. తర్పణాలు వదిలిపెట్టి, పిండ ప్రదానాలు చేసి తన కూతురు చనిపోయింది పొమ్మని చిదానందుడు బహిరంగ ప్రకటన గావిస్తాడు. నిక్షేపంగా బ్రతికి వున్న కుమార్తెను చనిపోయినట్టుగా భావిస్తున్న ఆ తల్లిదండ్రుల పట్ల ప్లాటోమ్‌కి పట్టరాని ఆగ్రహం కలుగుతుంది.

ప్రతీకారం తీర్చుకోడానికన్నట్టుగా అతడు కొండచరియలో ఆ గుడికెదురుగానే ఓ భవంతి నిర్మించి, భార్యతో బాటు అందులో కాపురం పెడతాడు. ఐశ్వర్యాలలో మునిగి తేలుతున్న కుమార్తెను అనుదినమూ చూస్తూ రావడంవల్లనైనా ఆ వృద్ధ దంపతుల మనసులో మార్పు రావచ్చునని అతడాశిస్తాడు. కానీ ఆ ఆశ గూడా అడియాసే అయిపోతుంది. ధర్మభ్రష్టురాలైన కుమార్తెను చూస్తూ చూస్తూ జీవించడం సాధ్యంకాదనుకున్న ఆ దంపతులు విషపానం చేసి ఆత్మహత్యకు పాల్పడతారు. జీవితం పట్ల విరక్తి చెంది తరళనయన సన్యాసినిగా మారిపోతుంది...

ఈ కథ మా క్లాసులో పెద్ద అలజడికి దారితీసింది. ముగింపు బాగుండలేదని కొందరు, ఇంతకంటె సముచితమైన ముగింపు వుండబోదని కొందరు– ఇలా తరగతి రెండు జట్లుగా చీలిపోయింది తెలుగు మేష్టారు చెన్నబసవప్పగారు రెండో పక్షాన్ని బలపరచడంవల్ల నేనున్నూ ఆ పక్షంలో వుండక తప్పింది గాదు. కానీ "నాలో నాకు తెలియని అంతర్వాణి ఏదో అరచి, గగ్గోలు పెట్టినట్టే వుండేది.

రాత్రుల్లో ఏదైనా పీడకల వచ్చి మేలుకుంటే తరళయన దీనవృత్తాంతం జ్ఞప్తికి వచ్చి గుండె విషాద సాగరంలా ఘూర్ణిల్లిపోయేది.

పై కథ చదువుకున్న తర్వాత ఇరవై యేళ్ళకుగానీ నేను శాస్త్రిగారిని ముఖాముఖిగా కలుసుకోలేకపోయాను. అప్పట్లో ప్రభుత్వోద్యోగులకు ముట్టే పింఛను నామమాత్రంగా వుండేది. అందువల్ల ఒక ప్రయివేటు విద్యా సంస్థలో పనిచేయడానికి ఒడబడి ఆయన మా వూరికి వచ్చారు. ఆ ప్రయివేటు స్కూలు వాళ్ళు గూడా నువ్వుల్ని గానుగాడినట్టు ఆయన బోధనాశక్తిని పూర్తిగా వినియోగించుకుని దయాభిక్షగా ఎంతో కొంత ప్రతిఫలం ముట్టజెప్పేవారు. ఉద్యోగం లాగే జీవితం గూడా ఆయన్ను చాలా చిన్న చూపే చూసిందని గ్రహించడానికి ఎంతో కాలం పట్టలేదు. ఇంట్లో దొంగలు పడితే కలిమిని దోచుకపోతారు. ఉత్సాహాన్ని, ఆనందాన్ని ఎవరు దోచుకపోతారు? కాలమే దోచుకపోతుందని చెప్పాలి. పుట్టిన బిడ్డలు ముగ్గురూ కూడబలుక్కున్నట్టు ఒకరి తర్వాత ఒకరుగా కాలగర్భంలో కలిసిపోతే, వృద్ధాప్యం రెక్కలు విప్పిన రాబందులా వెన్నంటి తరుముతుంటే ఎవరి బ్రతుకైనా మరెలా వుంటుంది? బంధువులతో సంబంధాలు తెగిపోయాయి మిత్రుల సలే లేరు. పట్టించుకునేవాళ్ళు కరువై పోయారు. సాహిత్య ప్రపంచం విస్మరించింది. నౌకా భంగం జరిగిన తర్వాత ఒంటరి దీవిలో చిక్కుపడిపోయిన ఇద్దరు సహ యాత్రికుల్లా ఆ దంపతులు ఒకరి కొకరు తోడుగా మిగిలిపోయారు. ఎన్నడో ఓబి కాలంలో బళ్ళారి టీచర్స్ ట్రెయినింగు స్కూలులో పనిచేస్తుండగా కారు చౌకగా దొరికింది గదా అని కొనుక్కున్న ఖాళీ జాగాలో ఆయన ఒక పెంకుటిల్లు లేపి, దాన్ని నాలుగు వాటాలుగా చేసి అద్దెకిచ్చారట! లోకంతో మిగిలి వున్న లంకె అదొక్కటి మాత్రమే కాగా, ఆ బంధం ఆయన్ను బళ్ళారికి లాగింది. స్టేషనులో వీడ్కోలిచ్చిన వాణ్ణి నేనొక్కణ్ణే. మూడు గోతం సంచుల పాత్ర సామగ్రి, రెండు ట్రంకు పెట్టెల బట్టలు, అయిదారు అట్టపెట్టెల్లో పుస్తకాలు- ఈ సరంజామాతో ఎండిమోడు వారిపోయిన రెండు మొక్కల్ని తొట్లల్లో పాతి, పార్సెల్ చేసి ఎక్కడికో పంపుతున్నట్టుగా, నేను వాళ్ళనిద్దర్నీ రైలెక్కించి బండి కదలిపోయిన తరువాత గూడా చాలసేపటి వరకు – శరీరంతో బాటు మనసు గూడా మొద్దుబారిపోయిన స్థితిలో ప్లాట్‌ఫారం పైన్నే నిల్చుండిపోయాను.

* * *

బళ్ళారిలో దిగేసరికి మధ్యాహ్నం కావచ్చింది. ఎందుకైనా మంచిదని హోటల్లో ఓ గది తీసుకుని, స్నానమూ భోజనమూ కానిచ్చి, ఎండ తగ్గేదాకా విశ్రాంతి తీసుకున్నాను. ఈ లోగా గమ్యాన్ని నిర్దేశించుకోవడంతో హోటలు కుర్రాడు కొంతవరకు నాకు తోడ్పడగలిగాడు.

"ఆస్పిటలు ఎనకాల హనుమంతరాయరు గుడి అని జెప్పండ! ఆడ రిక్షా దిగిపొండ! ఇంటి నంబర్లు, గింబర్లు సరిగ్గుండవు. పలానాయన ఇల్లేళ అని అడగతా బోతే తెలిసినోళ్ళవురైనా జెబుతారులెండ !"

ప్రభుత్వ ఆసుపత్రి ఒకప్పుడు బళ్ళారి పట్టణానికి పడమటి శివారుగా వుండేదట ! పాతకాలపు నవాబులెవరో కట్టిపెట్టిపోయిన నేల కోటలో అది ఏర్పాటైంది. హనుమంతరాయని గుడిదగ్గర నిల్చుని ఈశాన్య మూలగా చూస్తే కోటగోడ తాలూకు అవశేషాలు కనిపిస్తాయి. కందకం పూడిపోయి పెద్ద మురికి నీటి కాలువగా మారింది. పశ్చిమంగా దాదాపొక కిలో మీటరు దూరంలో ఏరు లాంటి దేదో ప్రవహించేటట్టుంది. దాని గట్టు పొడుగునా నిల్చున్న కొబ్బరితోటలు ఆకాశాని కద్దిన ఆకుపచ్చ రంగు బార్డరులా కనిపిస్తున్నాయి. రోడ్డుకు, కోటకు, కొబ్బరి తోటలకు మధ్యన వున్న స్థలం మంతా ఒప్పుడు ఖాళీ జాగాగా వుండి వుండాలి. మిట్టలు, పళ్ళాలు, ముళ్ళ దుబ్బలు, సర్కారు కంప చెట్లు ఈ ఊహను బలపరుస్తున్నాయి. అల్లా ఉద్దీను తన అద్భుత దీపం సహాయంతో అద్దాల మేడను సృష్టించాడని చెబుతారు. అలాంటి ఇంద్రజాలం చేతగానివాళ్ళు పొట్ట చేతబట్టుకుని ఏయే దూరప్రాంతాల నుంచో వలసవచ్చినవాళ్ళు, బ్రతుకు తెరువుకోసం ప్రకృతితోను, పరిసరాలతోను పోరాడవలసిన వాళ్ళు, నగరంలోని ఇళ్ళకు అద్దె చెల్లించుకోలేక సువిశాల భూతలంపైన తమకంటూ స్వంతంగా ఏ మాత్రపు జాగా వున్నా చాలు ననుకునేవాళ్ళు తాత్కాలికమైన ఆవాసాలు ఏర్పాటు చేసుకుని అక్కడ స్థిరపడి పోయినట్టున్నారు. పాకలుగా, గుడిసెలుగా, కొట్టాలుగా విస్తరించిన ఆ వూరి చివరి వాడలో పెంకుటిళ్ళు. సిమెంటు కట్టడాలు చాలా సకృత్తుగా మాత్రమే కానవస్తున్నాయి. శాస్త్రిగారిది నాలుగు వాటాలున్న పెంకుటిల్లు గదా, ఆ 'క్లూ' మాత్రమే ఆధారంగా సందుల్లో నడుస్తూ, గొందుల్లోకి మళ్ళుతూ ముందుకు సాగి పోతున్నాను. లేమి వుండొచ్చు. బ్రతుకు బరువులుండొచ్చు. ఈతి బాధలుండొచ్చు కానీ అక్కడ జీవన సంరంభానికి లోటు లేదు. కన్నడంతో బాటు తెలుగు, తమిళం, హిందీ, మరాటీ... ఇంకా నాకు తెలియని భాషలేవో వుండి

వుండి చెవిలో పడుతున్నాయి. సందు మొగదలలో భజన గుడిగా దూపుదాల్చిన గారమిద్దె. దానికి కూతవేటు దూరంలో మసీదుగా రూపాంతం చెందిన బండల కట్టడం. దానికి కొంత దూరంలో శిలువను తలపైన మోస్తూ చర్చిగా మారిన పూరిల్లు. ప్రాంతాలు, భాషలు, మతాలు, కులాలు వేరైనా 'మనమంతా మానవులం' అన్న ఒకే ఒక సిద్ధాంత ప్రాతిపదికపైన అక్కడ జనం ఒక పెద్ద తండాగా చేరి పోయినట్టున్నారు శాస్త్రిగారిల్లెక్కడ అని వాకబు చేయకుండానే నేనొక అరగంటసేపు ఆ వాడంతా చెదతిరిగేశాను. ఎందుకు వాకబు చేయలేదని అడక్కండి ! ఎలాంటి సమాధానం వినవలసి వస్తుందో నన్నదే నా భయం !

చివరికి వెదకబోయిన తీగ కాలికే తగిలింది. పెంకుటింటి ముందు నిలబడి 'విశ్వపతి శాస్త్రిగారి ఇల్లిదే గదండీ?' అని అడిగాను. మూడో వాటాలోని వ్యక్తి తొంగిచూచి "ఇదేనయ్యా ! ఆ మొదటి దర్వాజాగుండా లోనికి వెళ్ళండి" అన్నాడు.

నేను లోపల అడుగుపెట్టాను. వసారాలోకి వెళ్ళి నిల్చున్నాను. హాల్లోపలికి తొంగి చూశాను. కానీ అది శాస్త్రిగారి నివాసమంటే మాత్రం నమ్మలేక పోయాను. మెరుగు మాయని స్టీలు కుర్చీలు, కాశ్మీరు దృశ్యాల చిత్రపటాలు, మూలలకున్న మచ్చులపైన చిన్న సైజు అజంతా శిల్పాలు, టేప్ రికార్డరులో నుంచీ సన్నటి సంగీతం— అబ్బే, యివన్నీ గావు నా కాశ్చర్యం కలిగించినవి! హాలుకు మధ్యగా చిన్న సితిచాప. దానిపైన వలయాకారపు పట్టాల వెంట పరుగెత్తే రైలు బండి, జానెడెత్తున్న ఒక రంగుల రాట్నం, కాళ్లు సాచుకున్నట్టుగా కూచున్న ఓ రబ్బరు బుల్లి పాప,– ఊహూ, ఇవి గూడా కావు. నాకాశ్చర్యం కలిగించినవి !– ఆ బొమ్మల నడుమ సజీవ శిల్పంలా వున్న ఓ మూడేళ్ల పసిపాప. తళుక్ తళుక్కుమంటూ చెవులకు చిన్ని లోలక్కులు. మెడలో సన్నటి డాలరు చైను. రెండు జడల్ని తోరణంలా కలుపుతున్న మల్లెపూలు, నీలికాంతులు చిప్పిల్లుతున్న కళ్ళు. మోకాళ్ల కిందికి వస్తున్న పావడాపైన కుచ్చులుపోసిన కుట్టిన గౌను వేసుకున్న ఆ పసిపిల్ల నన్ను చూడగానే ఠటాలున లేచి నిల్చుని "తాతయ్యా! ఎవులో వచ్చాలు! అమ్మమ్మా! ఎవులో వచ్చాలు" అంది. అమ్మాయి నోట మాట పెకలడంతోటే గదిలో నుంచీ శాస్త్రిగారు, వెనకవైపు పెరట్లో నుంచీ ఆయన భార్య ఇంచుమించు ఒకేసారిగా హాల్లోకి వచ్చేశారు. "ఎవరూ! రాజశేఖరమా ! అరరే, ఎన్నాళ్ళకెన్నాళ్ళకు? ఎప్పుడొచ్చావు బాబూ? రా కూచో...అలా చూస్తూ నిల్చుంటావేమే!

అబ్బాయికి మంచినీళ్ళు తెచ్చి యివ్వరాదూ..." శాస్త్రిగారిలా పరామర్శలు గుప్పిస్తూనే వున్నారు. నా ధ్యాస మాత్రం గులాబీ బుగ్గల ముద్దుల పాప పైన్నే వుంది.

"ఈ పిల్ల సంగతేనా! నేను చెబుతాగా!" అని తాళజెప్పి, మళ్ళీ "ఎప్పుడొచ్చావు? ఎక్కడ దిగావు? అయ్యో, నేనీ ఊళ్ళో వుండగా నువ్వు హోటల్లో దిగడమేమిటి? అన్నట్టు మీ అమ్మగారు బాగున్నారా? తమ్ముళ్లేం చేస్తున్నారు? చెల్లెలికి పెళ్లయిందా? ఎక్కడిచ్చారు.." అంటూ యోగక్షేమాలన్నీ అడిగి తెలుసుకున్న తర్వాత ఆయన అసలు విషయంలోకి వచ్చారు.

"ఏం చెప్పమంటావులే రాజశేఖరం! పెద్దలు దైవ ఘటన అంటుంటారు గదా! అదే జరిగింది? ఓ రోజు తెల్లవారు జామున నేను బయటికి వెళ్ళి తిరిగొస్తున్నాను. కంప చెట్ల కింద పిచ్చి మొక్కల నడుమ నుంచో సన్నటి ఎలుగుతో కీచు కీచుమంటూ ఏడుపు వినిపించింది. ఏమిట్రా యిది అనుకుంటూ వెళ్ళి చూద్దునుగదా, చుట్టబెట్టిన బట్టల్లో పసినిసుగు కంటబడింది. ఏం చేస్తాం? అలా వదిలెయ్యగలమా! ఇంటికి తీసుకొచ్చి మా ఆవిడకప్పగించాను. ఆ తర్వాత బాధ్యతంతా ఆమెదే!"

ఆయన ఇంకా ఏమిటో చెప్పుకపోతున్నారు. నేను కూడా వింటూనే వున్నా ఆ మాట లేవీ అర్థం కాని స్థితిలోకి చేరుకున్నాను. నిండు పున్నమినాటి చంద్రబింబంలాంటి ఏకైక సత్యమేదో ఆ క్షణాల్లో నాకు స్ఫురించినట్టెయి, మనసులో ఏవో ఆనంద సాగరాలు ఉప్పొంగిపోతున్నట్టున్నాయి. ఉన్నట్టుండి ఆ తన్మయత్వంలో నుంచీ లేచుకుని నేను ప్రశ్నించాను– "అమ్మాయికేమని పేరు పెట్టారండీ మేష్టరుగారూ?"

"సర్వమంగళ" అన్నారు విశ్వపతి శాస్త్రిగారు.

—"ఆంధ్రజ్యోతి" వారపత్రిక, 1989.

# కఠోరసత్యం

ఆరు నెలల తర్వాత హఠాత్తుగా రోడ్డుపైన తారసిల్లిన ఆప్తమిత్రుడు అనంతమూర్తి "ఏమిరోయ్ ఉమాపతీ! నువ్వు జీవించే ఉన్నావా?" అని పలకరించాడు.

నేనూ అంతే సీరియస్‌నెస్ ఒలకబోస్తూ "నాకున్నూ సరిగ్గా అలాంటి సందేహమే కలిగిందిరా బాబూ! అయితే నువ్వుగూడా జీవించే వున్నావన్న మాట!" అంటూ బదులిచ్చాను.

నిజానికిదేం తమాషా వ్యవహారంగా తోచడం లేదు. ఈ మధ్య నా మట్టుకు నాకు చావడమే సహజంగానూ, బ్రతికి వుండడమే అత్యాశ్చర్యకరమైన విషయంగానూ తోస్తూ వుంది మరి!

అప్పుడు నేనన్నాను– "మునుపటికి నచికేతుడనే మునికుమారుడు యమధర్మరాజు సముఖానికి వెళ్ళి మృత్యు రహస్యమేమిటో సెలవివ్వమని అడిగాడట! ఆ నచికేత యమసంవాదానికి కఠోపనిషత్తని పేరు. నేనెలా జీవించి వున్నాను, నువ్వెలా జీవించి వున్నావు? ఈ ప్రపంచంలో ఇంతమంది వ్యక్తులూ ఎలా జీవించి వుండగలుగుతున్నారన్న కీలకమైన ప్రశ్నకు నేనిటీవల సమాధానం తెలుసుకున్నాను. ఇది సరిక్రొత్త ఉపనిషత్తు."

"బాబ్బాబూ! దాన్ని కాస్తా నా కుపదేశించరాదా?" అన్నాడు అనంతమూర్తి.

"అబ్బో, ఆశ! ఊరికేనా గురుదక్షిణ యిచ్చుకోవాలి. అల్లదిగో అజంతా..." హోటల్ని చూపెట్టాను.

"పద పద" అన్నాడు అనంతమూర్తి. జేబులో పర్సును తడిమి చూచుకుంటూ!

* * *

చెట్టు నుంచి మామిడి పండు రాలి పడడం చాలా చిన్న సంఘటన. అతి మామూలు విషయంగూడా. కానీ అది భూమ్యాకర్షణ శక్తి అనే గొప్ప సత్యాన్ని తెలుసుకోడానికి దారితీయలేదా? అట్లాగే నాకొచ్చిందిగూడా సాదాసీదా ఉత్తరం. కవరుపైన ఫ్రమ్ అడ్రస్సు గజిబిజిగా వుండిపోయింది. చిరునామాదారుణ్ణి మాత్రం నేనే. చించి చూచాను. "డియర్ ఉమాపతీ! ఎంత కాలమైంది మనం కలిసి! పంట పొలాల్లో, కాలవగట్టుల్లో, ఇసుక తిన్నెలపైన..." సినిమాల్లో డ్యుయెట్ల సన్నివేశాలన్నీ మనసులో నిలిచి నాకెందుకో ఒళ్లు కంపించి పోయింది. ఎవరైనా నన్ను ఫూల్ చేయాలనుకుంటే తప్పా నాకిలా లవ్‌లెటర్స్ రాయగలిగినవాళ్లెవరూ లేరు. అది లెటర్ పాడ్‌లో నుంచి చించిన కాగితం కాదు. అప్పటికప్పుడు దొరికిన ఏదో కాగితంపైన తొందర తొందరగా గిలికినట్టున్న అక్షర పంక్తులు. నిశిత పరీక్షకు గురిచేసి సంతకాన్ని పరిశీలించాను. ఆ పేరులో రెండు పదాలున్నాయి. రెండూ 'యస్' తోనే ప్రారంభమవుతున్నాయి. ఈ సంతకంతో బాగా పరిచయమున్నట్లే గుర్తు. తినబోతూ రుచు లడగడమెందుకని మళ్ళీ కొనసాగించాను. "...ఆటలాడుకుంటూ, కథలు చెప్పుకుంటూ మనం గడిపిన రోజులు నీకు జ్ఞాపకం లేదా? కాలువలో మునిగి ఈదులాడుతూ అవతలి గట్టుకు వెళ్ళి దుస్తులారేదాకా బనీన్లనే గోచీగా పెట్టుకునే వాళ్ళం గుర్తుందా? నాగప్పగారి తోటలో దొరగిల్లిన జామకాయలు! అవి కండ చక్కెరకన్నా తియ్యగా వుండేవి గదూ!..." అమ్మయ్య, తెలిసిపోయింది. వీడెవడో కాదు. చిన్ననాటి చెలికాడు సోమసుందరం. హైస్కూలు చదువు పూర్తయ్యేదాకా మేము ఎడబాయని జంటగా మసలుకున్న వాళ్ళం. ఇంటరులో చేరవలసి వుండగా వాడి తల్లి ఉన్నట్టుండి కళ్లు మూసింది. అంతటితో వారికి స్వగ్రామంతో వున్న లంకె తెగిపోయింది. బెంగుళూరులో మేనమామ యింట వుండి ఇంటరు, ఆ తర్వాత బి. ఇ. పూర్తిచేశాడు. ఆ మేనమామ కూతురినే పెళ్ళి చేసుకున్నాడు. ధార్వారు జిల్లాలో ప్రభుత్వ యాజమాన్యంలోని పెద్ద ఫ్యాక్టరీలో చీఫ్ మెకానికల్ ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. ఉద్యోగరీత్యా వాడితో పోల్చుకుంటే నేను ఎదగ గలిగింది చాలా తక్కువ. ఆర్ట్సు కాలేజీలో డిగ్రీ పుచ్చుకుని, బి. ఇ. డి. ముగించి మునిసిపాలిటీ బడిలో మాస్టారు గిరీ సంపాదించేసరికీ నాకు తల ప్రాణం తోకకొచ్చింది. పెళ్ళయ్యేదాకా వీలయినప్పుడల్లా ఈ ప్రాంతాలకు వచ్చి కొద్ది రోజులు గడిపి పోతుండేవాడు సోమసుందరం. పెళ్లయ్యాక కొంతకాలం పాటు ఆరు నెలలకో, సంవత్సరానికో ఓ ఉత్తరం

ముక్కయినా రాసి పడేస్తూ వుండేవాడు. గడచిన అయిదారేళ్ళుగా మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు సైతం లేవు ఇప్పుడిలా వున్నట్టుండి వాడి దగ్గరి నుంచి ఓ జాబు వూడి పడిందంటే చెప్పుకోదగ్గ విశేషం వుండేవుండాలి, నా ఊహ నిజమే.
"... కొద్ది రోజులపాటు మనం కలిసి వుండే అవకాశం ఒకటి ఏర్పడిందిరా ఉమాపతీ! మదరాసులో ఓ కంపెనీవాళ్లు జపాను నుంచీ ఓ కొత్త యంత్రాన్ని దిగుమతి చేసుకున్నారు. దాన్ని 'ప్రాసెస్'లో పెట్టే విషయంలో వాళ్ళకు మా ఫ్యాక్టరీవాళ్ల సహకారం కావలసి వచ్చింది. వారం రోజుల డెప్యుటేషనుపైన నేను బెంగుళూరు నుంచీ బయల్దేరి బృందావన్ ఎక్స్‌ప్రెస్‌లో మదరాసు వెళ్తున్నాను..." (ఇక్కడ వెళ్ళే తారీఖు, టైము వగైరాలు పేర్కొన్నాడు సోమసుందరం.) "నువ్వు అర్కోణం జంక్షనులో తప్పక నన్ను కలుసుకోవలసింది. సెలవు పెట్టి రావాలని నీకు ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. అర్కోణం స్టేషనులో మదరాసు టిక్కెట్టు కొనుక్కోడమూ మరిచిపోవద్దు. నాకు మదరాసులో వుంటే గింటే రెండు మూడు రోజుల పని మాత్రమే వుంటుంది. మిగిలిన నాలుగు రోజులూ విశ్రాంతే, కంచి, పక్షితీర్థం, మహాబలిపురం, మెరీనా, అడయారు ఆ ప్రదేశాలన్నీ ఎంచక్కా చక్కర్లు కొట్టి రావచ్చు. కబుర్లు చెప్పుకోవచ్చు. నన్ను డిసపాయింట్ చెయ్యవు గదూ..."

అనుదిన జీవిత రొటీన్ కార్యక్రమాల నడుమ మనిషిగా మాత్రం రిలీఫ్ అవసరమే. పైగా బాల్యమిత్రుడి అభ్యర్థన, ఊళ్ళు చూడాలన్న ప్రలోభం నాకున్నూ లేకపోలేదు. తీర్థమూ, స్వార్థమూ గూడా కలిసివచ్చే పనైపోయింది గదా! ఆ రోజు కోసం నిరీక్షిస్తూ కూచున్నాను. ఆ శుభ సమయం గూడా రానే వచ్చింది.

తిరుపతిలో ప్రయాణీకుల రద్దీ మహాచిత్రంగా వుంటుంది. శని, ఆదివారాల్లోనైతే బస్ స్టేషను యాత్రికులతో కిటకిటలాడిపోతుంది. దారి చేసుకుంటూ నడవడానికైనా వీలుండదు. బ్రహ్మోత్సవాలు జరుగుతున్నా, సంవత్సరాది దగ్గరికి వచ్చినా, మరే విశేష దినాలలోనైనా జనస్తోమం నేల ఈనినట్టే తయారైపోతుంది. అప్పటికీ రెండు నిమిషాలకో బస్సు చొప్పున యిటు ఓవర్ బ్రిడ్జి దిగిగానీ, అటు కొర్లగుంట వైపునుంచిగానీ వచ్చి బస్ స్టేషనులో దిగబడిపోతుంటాయి. వీలయినంత మందిని ఎక్కించుకుని సాగిపోతూనే వుంటాయి. అయినా రద్దీ మాత్రం తగ్గదు.

అంతకు ముందటి దినం తిరుమల దేవుడి హజారంలో పెద్ద పండుగ ఏదో జరిగి వుండాలి. నేను అర్కోణం వెళ్ళవలసిన రోజున తిరుపతి బస్ స్టాండులో జనం కుంభమేళ తిరణాలలా మూగి పోయి వున్నారు ఎట్లాగో వీలు చేసుకుని ఈ చివరి నుంచి ఆ చివరకు రెండు మూడుసార్లు తిరిగి చూచాను. బస్సులపైన నాక్కావలసిన ఊరిపేరు తప్పితే మిగిలిన ఊళ్ల పేర్లన్నీ కానవస్తున్నాయి. దేశంలో ఏ మూలనుంచైనా తిరుపతికి యాత్రికులు వస్తుంటారు అర్కోణం ప్రాంతాల నుంచీ రావడానికి గూడా బస్సుండాలి గదా! ఏదీ, ఎక్కడుందది?

ఎంక్వయిరీలో కూర్చున్న ఉద్యోగి బస్సుల రాక పోకల వివరాలు చెప్పి చెప్పి డస్సిపోయినట్టున్నాడు. ఒకటి రెండుసార్లు నా స్వంత గొడవ చెప్పుకున్న మీదట అతడు టేబిలు పైన్నుంచీ తల మాత్రం పైకెత్తి "అర్కోణమా?" అంటూ కలవరించాడు. ఆపైన కాస్తా తెప్పరిల్లుకుని "మీరొక పని చేయండిసార్! మొదట తిరుత్తణికి వెళ్ళిపోండి, అక్కడి నుంచి అరగంట కొకటి లెక్కన అరక్కోణానికి తిరువళ్ళువర్ ట్రాన్స్‌పోర్టు బస్సులుంటాయి" అన్నాడు.

"తిరుత్తణి బస్సు ఎక్కడుంటుంది?" అని అడిగాను.

"ఇక్కడగాదు. పాత బస్‌స్టాండులో."

రైల్వే స్టేషనుకు చేరువగా వున్న పాత బస్టాండు దిష్టితీసి విసరిపారేసిన మట్టి పిడతలా వుంటుంది. పది పదిహేనింటికన్నా ఎక్కువ బస్సులు అక్కడ నిలవలేవు. రాష్ట్ర ఆర్. టి. సి. వారు వదిలిపెట్టిన కొన్ని పొరుగు రాష్ట్రాల లింకు రూట్లను కైవశం చేసుకుని, వాటిపైన కొన్ని ప్రయివేటుకంపెనీల వాళ్ళు తమ బస్సులు నడిపిస్తూ వుంటారు. అక్కడ పద్ధతులకు, నియమాలకు తావులేదు. అంతా ఇష్టా రాజ్యం. బస్టాలో దూదిని కూరినట్టు బస్సుల్లో ప్రయాణీకులను ఎక్కించడం కోసం బ్రోకర్లు కొందరు ఊళ్ల పేర్లు చెబుతూ గొంతు చించుకుంటూ వుంటారు. చెత్తా చెదారం, కుక్కలు, బిచ్చగాళ్లు మొదలైన నేపథ్యంతో అది చిన్న సైజు నరకంలా వుంటుంది. ఏ మాత్రం వాన వచ్చినా సైడు కాలువలు పొంగి మురికి నీళ్లన్నీ మిట్టపళ్ళాల బస్‌స్టాండులోకి ప్రవహిస్తాయి. అప్పుడది నరకం గాదు. వైతరణి.

అలాంటి పాత బస్‌స్టాండులో నేను ప్రయాణం చెయ్యవలసి వచ్చిన రోజున అక్కడ నిలిచిన బస్సులన్నింటినీ అవలీలగా ఎత్తుకెళ్ళిపోగలిగినంత మంది

ప్రయాణీకులు ప్రోగై పోయి వున్నారు. బుట్టలు, పెట్టెలు, పిల్లలు, పాపలు, అరుపులు, ఏడుపులు మొదలైన వాటితో బస్‌స్టాండు నానా ఖంగాళీగా వుంది. ఎవడి ధ్యాసే వాడిదిగానీ, ఇంకొకరిని గురించి ఎవరూ పట్టించుకోవడం లేదు. "తిరుత్తణి బస్సా? వెళ్ళిపోయిందే" అని ఒకరు, "రావాలి. ఎప్పుడొస్తుందో తెలియదు" అని ఒకరు. "సాయంకాలం 'సప్తగిరి' వుంది గా! అందులో వెళ్తేపోలా" అని ఒకరు యిలా ఎవరికి తోచిన మాట వాళ్లు చెప్పి నాలో మిగిలి వున్న మతిని కాస్తా పోగొట్టారు. సాయంకాలం ఆరున్నరకల్లా నేను అర్కోణం రైల్వే స్టేషన్లో వుండాలన్న విషయం వాళ్ళకేం తెలుసు? పైగా దారిలో బస్సు మారాల్సి వుంది గూడా! అందువల్ల మరికొంత విలంబనం జరిగినా జరగొచ్చు. ఇంతకూ ఇతరుల్ని తప్పుపట్టడం ఏం లాభం? అప్పటికేదో సొంత కారున్నట్టు మధ్యాహ్న భోజనం కానిచ్చి, నింపాదిగా బయల్దేరినందుకు నాపైన నాకే కోపం పుట్టుకొచ్చింది.

ప్రయాణీకుల తలలపైన్నుంచీ బస్సుల కదలికలు కనిపెడుతూ కాలుగాలిన పిల్లిలా బస్‌స్టాండు చుట్టూ తిరగసాగాను. గంట రెండు కాబోతుండగా "తిరుత్తణి, తిరుత్తణి" అన్న గగ్గోలు చెలరేగడంతో, నేనెక్కవలసిన బస్సు వచ్చేసిందని నేను నా శ్రవణేంద్రియాల ద్వారా గ్రహించడం మాత్రమే సాధ్యమైంది. శబ్దవేది బాణంలా ఆ సవ్వడి వినవచ్చిన దిశకు దూసుకుపోయాను. "తిరుత్తణి టు తిరుపతి" బస్సు బురద నీటిలో జొరబడుతున్న బాతులా ముందుకూ వెనక్కూ ఊగిసలాడి, సంకుచిత పరిధిలోనే ఒక చుట్టు తిరిగి, తిరిగి వెళ్ళడానికి వీలుగా గేటుకు అభిముఖంగా నిల్చుండిపోయింది. బస్సు గుమ్మానికప్పుడు నేను రెండు బారలదూరంలో నిలబడి వున్నాను. మధ్యజాగాలో దాదాపు రెండు వందల మంది ప్యాసెంజర్లు ప్రాణాలను పణంగా పెట్టి అయినాసరే బస్సులో దూరడానికి ఉద్యుక్తులై వున్నారు. వాళ్ళు దిగేవాళ్ళని దిగనివ్వడం లేదు. దిగేవాళ్ళ పాదాలను చితక త్రొక్కేస్తూ వాళ్ళనలాగే లోపలికి నెట్టి ఖడ్గమృగాల్లా లోపలికి చొచ్చుకపోతున్నారు. ద్వారంలో నుంచీ "కుయ్యో, మొర్రో" అంటూ ఆక్రందనలు వినిపిస్తున్నాయి. "బలం వుంటేనే బ్రతుకు" అన్న ఈ ప్రదర్శనను చూస్తూ నిల్చునే ఓపికలేక సగం మంది ప్రయాణీకులు కిటికీ అంచుల్ని అందిపుచ్చుకుని, తలల్ని లోపలికి దూర్చి బొరియల్లోకి దూరిపోయే పందికొక్కుల్లా తమ కాయాలను బస్సులోకి చేరవేసుకుంటున్నారు. లగేజ్‌తోబాటు బిడ్డలు గూడా కిటికీలలో

నుంచే లోపలికిడ్చుకోబడ్డారు. బస్సులో దిగి సీట్లు పడేసిన మగవాళ్ళు అప్పుడిక అసహాయ శూరులై విజృంభించి తమతమ ఆడవాళ్ళను సైతం కిటికీలగుండా లోపలికి చేరకోడంలో కృతకృత్యులై పోయారు. యుద్ధ వ్యూహంలో నుంచీ బయట పడిన క్షతగాత్రుల్లా బస్సులో నుంచి దిగబడిన వాళ్ళు జనాన్ని తొలగ దోసుకుని ఊచ్చులు తెంచుకున్నట్టుగా పారిపోతున్నారు. ట్రిక్ ఫోటోగ్రాఫ్ ద్వారా జరిగిన ఇంద్రజాలంలో నేలపైన వున్న జనం రెండు నిమిషాల వ్యవధిలో బస్సులోకి వెళ్ళిపోయి ఫుట్ బోర్డులో చివరి మెట్టుదాకా ఆక్రమించేసుకున్నారు. ముందువైపు నిల్చున్నవాళ్లు ఎంతో కొంత సర్దుబాటు చేస్తేగానీ అదనంగా ఒక ప్రయాణీకుడు ఫుట్ బోర్డుపైన ఒంటికాలితో నిలబడడమైనా సాధ్యంగాదు.

"బాబ్బాబూ! తొందర పనిమీద అర్జెంటుగా వెళ్ళాలి. కాస్త సర్దుకోరూ" అంటూ ప్రతిమాలు కున్నాను.

"టాపుపైన కూచోరాదూ!"– ఒకాయన ఉచిత సలహా యిచ్చారు.

ఎట్లాగైనా బుద్ధి జీవినిగదా! నా బుద్ధి కాస్త చురుగ్గా పనిచేసింది. కండక్టరు బస్సులో లేడు. డ్రయివరుతో కలిసి టీ సేవించడం కోసం వెళ్ళినట్టున్నాడు. అతడు తిరిగి వచ్చినప్పుడైనా ఈ ఫుట్ బోర్డు ప్రయాణీకులు కొంచెం వొత్తిగిల్లి దారి యివ్వాలి గదా! ఆ వ్యవధిలో సందు చూచుకుని ఫుట్ బోర్డు కంటుకపోవాలి. అంతకుమించి గత్యంతరం లేదు.

అయిదు నిమిషాలు గడిచేలోగా డ్రయివరు కండక్టరిద్దరూ "పోదామా" అంటే "పోదాం" అని కూడబలుక్కుంటూ ఏ మూలనుంచో ఊడిపడ్డారు. బస్సులోని ప్రయాణీకులు ఊపిరాడకుండా విలవిలలాడిపోతున్నారన్న విషయం వాళ్ళకేమీ బాధాకరంగా లేదు. అందుకు బదులుగా తమ వాహనం పుష్పక విమానాన్ని తలపిస్తున్నందుకు సంబరపడి పోతున్న వైఖరే వాళ్ళ ముఖాల్లో తాండవించింది. "మొదట డోర్ వేసుకో" అని హెచ్చరించి డ్రయివరు బస్సు ముందువైపు నుంచీ అటు ప్రక్కకు వెళ్ళిపోయాడు. "సర్దుకుంటే సర్దుకోండి, లేకుంటే క్రిందికి దిగండి" అని కండక్టరు సింహగర్జన చేయడంతో గుమ్మంలోని ప్రయాణీకులు పునుగు పిల్లుల్లా ఒళ్లు ముడుచుకుని లోవైపుగా ఒదిగి పోయారు. కండక్టరు విజయగర్వంతో ఫుట్‌బోర్డు పైకెక్కి "రైట్, రైట్" అన్నాడు. వెనువెంటనే నేనుగూడా ఫుట్‌బోర్డు పైన కాలు మోపాను.

బస్సు మెల్లగా కదిలి సాగబారింది. దేవస్థానం వారి ధర్మసత్రం దాకా అట్లాగే మందగమనం చేసింది. ఈలోపల డ్రయివరు "డోరు, డోరు" అంటూ రెండు రెండుసార్లు బిగ్గరగా అరిచాడు. తలుపు పైన చేయివేస్తూ కండక్టరు నావైపు తిరిగి చూచాడు. "సార్, మీరొకరుండిపోయారా బయట?" వినయం పుట్టి పడు తుండగా అడిగాడు. ఫుట్ బోర్డుపైన నా ఉనికికి అతడు సమ్మతిస్తున్నాడనే నేన కున్నాను. "కొంచెం దిగండి సార్! మళ్ళీ ఎక్కించుకుంటాను" ఈసారి మరీ ప్రాధేయపడుతున్నట్టుగా అన్నాడు. అతడి సౌమనస్యానికి సంతోషిస్తూ నేను క్రిందికి దిగాను. నేను దిగిన మరుక్షణంలోనే తలుపు టపీమని మూసు కుంది. కండక్టరు పెద్ద గొంతుకతో "రైట్, రైట్" అన్నాడు. బస్సు వేగం పుంజుకుంది. బస్సు బాడీని డబడబా మోదేస్తూ నేను పరుగులంకించుకున్నాను. కానీ పరుగు పందెంలో బస్సే గెలిచింది. నేను దిగాలు పడిపోయి బాలాజీ భవన్ ఎదుట రోడ్డుపైన నిల్చుండిపోయాను.

ఇంటికి తిరిగి వెళ్ళడమా, యింకొక బస్సుకోసం వేచి వుండడమా ? ఎటూ పాలుపోయింది గాదు. మళ్ళీ పాత బస్టాండువైపు వెళ్ళడానికి మాత్రం మన స్కరించలేదు. అక్కడొక హోటల్లో కాఫీ త్రాగి కాళ్ళీడ్చుకుంటూ ఆర్. టి. సి. బస్ స్టేషనువైపే నడవసాగాను. బస్సు దిగిన ప్రయాణీకుణ్ణిగా భావించి కొందరు రిక్షావాళ్లు "ఎక్కండి సార్, ఎక్కండి సార్" అంటూ నన్ను వెంటాడుతున్నారు. ఇంటి అడ్రసు చెప్పి రిక్షా ఎక్కబోతుండగా వెనుకవైపు నుంచీ బస్ హారన్ విని పించింది. తిరిగి చూద్దునుగదా, నా కళ్లను నేనే నమ్మడానికి వీల్లేని పరిస్థితి ! అందాకా ఎక్కడ పొంచి వుండి పోయిందోగానీ, మరొక తిరుత్తణి బస్సు సావకా శంగా పురవీధివెంట బయల్దేరి వస్తోంది. ఇంకా నయం ! ఇందులో నిల్చోడానికైనా తావుంది. చెయ్యి అడ్డంసాచి బస్కెక్కేశాను. టికెట్టు కొనుక్కునేలోగా ఎవరో యిద్దరు కుర్రాళ్లు కల్పించుకుని తమ సీటులో నాకు కాస్త జాగా చూపించారు. మధ్యాహ్నం నుంచీ ఎదురైన నేసటవల్ల బాగా అలసిపోయానేమో, బస్సు రేణి గుంట చేరుకునేలోగా నాకు కాస్తా కునుకుగూడా పట్టింది.

అలా ఎంతసేపు గడచిందో తెలియదు. హఠాత్తుగా ఉలికిపడి మేలు కున్నాను. బస్సు ఘాటురోడ్డు మలుపులో ఆగిపోయి వుంది. జరగరాని సంఘటన ఏదో జరిగిపోయినట్టు, చూడరాని సన్నివేశాన్ని దేన్నో చూచినట్టు ప్రయాణీకుల ముఖాలు వెలవెలపోయి వున్నాయి. రోడ్డుపైకి దిగినవాళ్లు కొందరు కనుగ్రుడ్లు

నిండుకు క్రమ్ముకున్న కన్నీటిని తుడుచుకుంటూ ఆదరా బాదరా బస్సులోకి వచ్చేస్తున్నారు. కంగారుపడిపోతూ "ఏమిటి, ఏమిటి" అని అడిగాను. ప్రక్కన కూర్చున్న కుర్రాడు "చూడండి సార్, అటు చూడండి" అన్నాడు. గబగబా బస్సుదిగి ముందుకు అడుగు వేయబోతూ ఆగిపోయాను. పిట్టగోడ నాలుగైదు బారల మేరకు విరిగి అయిపు లేకుండాపోయింది. ఢీకొన్న బస్సూ, లారీలు వికృతంగా రూపాంతరం చెంది ఏడెనిమిది నిలువున లోతున ఎండిపోయిన వాగులో అడ్డదిడ్డంగా పడివున్నాయి. లారీలోని బస్తాలు, నుగ్గునూచమైన గాజు పలకల శకలాలు కొండచరియ అంతటా చెల్లా చెదురుగా పడివున్నాయి. అవయవాలు ఊడిపోయి, విరిగిపోయి, తెగిపోయి రక్తసిక్తంగా మారిపోయిన మానవ కళేబరాలు చెట్లు, పొదలు, పుట్టలు ఆలంబనంగా వివిధ వికృత భంగిమల్లో వ్రేలాడుతున్నాయి. ఇంకా యింకిపోని, ఆరిపోనిపచ్చినెత్తురు నేలపైన, బండలపైన అట్టలు గట్టుకపోతూ వుంది. చాలు బాబూ చాలు! ఒకసారి చూస్తే మళ్ళీ జీవితాంతం వెంటాడే దృశ్యం అది.సుడిగాలిలా తిరిగివచ్చి బస్సులో పడిపోయి, కళ్ళుగట్టిగా మూసుకున్నాను.

* * *

"అనంతమూర్తీ! అదిరా బాబూ సంగతి! పాత బస్‌స్టాండులో నన్ను దిగవిడిచిపోయిన బస్సే అది! నేనింకా జీవించి వున్నానంటే అందుకు కారణమేమిటో నువ్విప్పుడు ఊహించగలవనుకుంటాను" అంటూ ఆగాను.

అనంతమూర్తి తల పంకిస్తూ "మరైతే నేను జీవించి వుండడానికి కారణమేమిటో చెప్పలేదే!" అన్నాడు.

"నువ్వూ నేనూ, వాడూ వీడూ, ఆమె ఈమె వెరశి మనమందరమూ ఇంకా సజీవులమై వున్నామంటే అందుకు కారణం యిదే! మనం రోడ్డు ప్రక్కన పల్టీ కొడుతున్న బస్సుల్లో లేము. వంతెన పైన్నుంచీ క్రిందికి దూకేసే రైళ్లలో లేము. బాంబులవల్ల కూలిపోయే విమానాల్లో లేము. విద్రోహ చర్యలవల్ల పతనమయ్యే భవనాల్లో లేము. మందు పాతరలవల్ల ప్రేలిపోయే జీపుల్లో లేము. నాయనా అనంతమూర్తీ! ఇదే నేను నీకు చెప్పదలచుకున్న 'జీవన రహస్యం'. ఇది కఠోపనిషత్తు గాదు. కఠోరోపనిషత్తు."

ఎట్ట యెదుట టేబిలు పైన వున్న గ్లాసులో కాఫీ చల్లారిపోతోంది. అనంతమూర్తి విచ్చుకున్న మిడిగ్రుడ్లతో పైకప్పు కేసి చూస్తున్నాడు. అతడిలో చలనం లేదు.

— 'ఆంధ్రజ్యోతి' దీపావళి సంచిక, 1990.

# రాత్రిలో తేమ

రామాపురం స్టేషన్లో రైలు దిగి మామిడి తోపులకు కంచెగా పెరిగిన కల బంద మొక్కల బారులగుండా మలుపులు తిరుగుతూ, ఏడాది కారు నెలలైనా నీళ్ళు పారే ఒక కొండవాగును దాటి, ముదురు కొబ్బరిచెట్ల చలువ పందిళ్ళు గడిచి, పూరేళ్ళ మడుగు వెంబడి నక్కల బంద అంచుల్లో సాగి, స్టేషను నుంచీ చుట్టు దారిగా వచ్చే మట్టి బాటలోకి దిగి, అక్కడి నుంచి ఎగుడు ముఖం పట్టే బాట గుండా రెండు ఫర్లాంగుల దూరం నడిచి, ఆ మిట్టపైన్నుంచీ ముందుకు చూస్తే ప్రపంచం అక్కడికి ఆఖరైపోయినట్టు తూరుపు దిక్కుకు హత్తుకున్నట్టుగా ఓ కొండ కనిపిస్తుంది. కొండంటే కొండ గాదు. పెద్ద గుట్ట. గుట్టపైన నిటారుగా ఓ పెద్ద రాతిపేటు ఉండడంతో దాని కొక విరాడ్రూపం వచ్చేసింది. చాలని దానికి ఓ అరమైలు చుట్టు కైవారం ఉన్న ఆ కొండపేటు మీద ఓ శిథిలమై కోట గూడా!

పేటు వెనుక వైపునుంచి పైకి దారి ఉండేదట. ఇప్పుడది వినియోగంలో లేదు. అయినా నిధి నిక్షేపాల ప్రలోభాలున్న వాళ్ళు ఎట్లాగో పైకి వెళ్ళి, సమాధుల్ని కుళ్ళగించి, కట్టడాల్ని కూలదోసి, గడ్డపార దిగిన ప్రతిచోటా త్రవ్వి త్రవ్వి కోట అంతర్భాగాన్ని రూపు మార్చి పారేసినట్టు చెప్పుకుంటారు. నిధుల మాట ఏమిటో గానీ, కొన్ని చోట్ల ఎముకలు, పుర్రెలు మాత్రం బయట పడ్డాయట. చుట్టు ప్రక్కల గ్రామాల వాళ్ళకు ఆ కోటకు సంబంధించిన చరిత్రనంతా త్రవ్వి పోసుకోడం ఒక ఇంపితమైన కాలక్షేపం. ఆర్కాటు నవాబుల కాలంలో 'ముంతపొగ మన్నీలు' అనే పాళేగాళ్ళు దాన్ని నిర్మించారట! ముంతలో నిప్పు వేసి ఎండుమిరపకాయలు దట్టిస్తే వచ్చే పొగే ముంతపొగ.

పల్లెల్ని దోపిడీ చేసినప్పుడు విలువైన వస్తువు లెక్కడున్నాయో చెప్పని వాళ్ళని కిటికీలు లేని గదిలో బంధించి, ఊపి రాడకుండా ముంతపొగ పెడుతూ వచ్చినందువల్ల వాళ్ళకు ముంతపొగ మన్నీలని పేరొచ్చిందట! వాళ్ళ ప్రతాపాన్ని

గురించి విని, సజావైన యుద్ధ ప్రక్రియలతో వాళ్ళని లొంగదియ్యడం అసాధ్య మని భావించిన నవాబులు వాళ్ళని ఆర్కాడుకు పిలిపించుకుని సత్కరించి కొంత రాజ్య భాగాన్ని వాళ్ళకోసం కేటాయించేశారట! అంతటితో పాత దోపిడీ దొంగలైన కొత్త పాళేగాళ్ళు అనువైనచోట ఈ కోటను నిర్మించుకుని, పరోక్షమైన దోపిడీ విధానాలకు స్వస్తి చెప్పి, ప్రత్యక్షంగా పన్నులు వసూలు చేయడం మొదలెట్టారట. వసూలైన మహసూలులో పాతిక వంతు నవాబులకు కప్పంగా చెల్లిస్తే మిగిలిన ముప్పాతిక వంతు పాళేగాళ్ళ వినోద విలాసాలకే దఖలుపడుతూ వచ్చిందట.

ఏ స్థాయికి దగిన కవులు ఆ స్థాయికి ఉంటారు గదా! అలాంటి కక్కుర్తి కవి ఒకడు పనికిమాలిన బూతు కావ్యం ఒకటి రాసి ఓ పాళేగాడికి అంకితమిచ్చి అందులో వాళ్ళను సమర నిశ్శంకులుగాను, అరివైరి కంఠ విలుంఠన కాలకంఠీ రవులుగాను, సముద్ర వేలావలయిత మహీ మండలాధిపతులుగానూ కీర్తించాడట! అందులో మహీమండలాధిపతులనడం మాత్రం సహజోక్తి ఎందుకంటే ఆ దుర్గం పేరు మహీమండల దుర్గం.

ఉభయ వేళల్లో కోట నీడ పడేచోట కాలక్రమాన ఒక జనావాసం ఏర్పడింది. కోట బాగా శిథిలమైపోయేటప్పటికి ఊరు బాగా వికాశ దశకు వచ్చేసింది. దీని పేరు గూడా అదే – మహీమండలం. లేదంటే 'మైమండలం'గా రూపాంతరం చెందింది. ఏ వాస్తు బద్ధతి ప్రకారం నిర్మించారో గానీ గ్రామ మంటే ఎలా ఉండాలో మైమండలాన్ని చూస్తే తెలిసొస్తుంది. అక్షరంలో తలకట్టులా ప్రముఖ స్థానంలో పెద్ద దేవిడీ, షడ్భుజాల్లా దానికటూ ఇటూ మూడు రెండ్ల ఆరు వీధులు మొదటి వరుసలో సమీప జ్ఞాతుల, బంధువుల లోగిళ్ళు. రెండో వరసలో సన్నకారు రైతుల, చిన్నతరహా ఉద్యోగుల గృహాలు. మూడో వరుసలో వృత్తి పనుల వాళ్ళు, బాగా బ్రతికి చెడిపోయినవాళ్ళు జీవించే ఇళ్ళు. ఊరికి కొంచెం దూరంగా ఆ వైపున, ఈ వైపున గూడా రెండు వెలి వాడలు, సోపాన క్రమానికి ఏమాత్రం భంగం వాటిల్లకుండా తరతరాలుగా అంగీకృతమైన ఒక పురాణ వ్యవస్థకు మైమండలం ఒక చిన్న నమూనా అని చెప్పొచ్చు. ఇన్నాళ్ళకిన్నాళ్ళకు ప్రస్తుత సన్నివేశం ద్వారా ఆ గ్రామ స్వరూపానికి నిండైన వైవిధ్యం కూడా చేకూరి నట్టయింది.

అదెలాగంటే–

ఎండ కెండి, మాడి, మరింత నలుపెక్కి కాలిపోగా మిగిలిన తుమ్మ మొక్కల లాంటి వాళ్ళు, నిన్నటిని గురించిన తీయటి జ్ఞాపకాలు గానీ, ఈనాటి జీవితానికి భద్రత గానీ, రేపటిని గురించిన ఆశలు గానీ లేని పరిస్థితుల్లో గాలి ఏ వైపు, వీస్తే ఆ వైపు కొట్టుకపోయే ఎండుటాకుల లాంటి వాళ్లు, ఆకులకు, చెట్ల బెరళ్ళకు, జంతువుల తోళ్ళకు ప్రత్యామ్నాయంగా మాసినా, చిరిగినా మానానికి మరుగ్గా ఏ కొద్దిపాటి బట్టయినా చాలు ననుకోవడంలో శిలాయుగపు మానవుల కన్నా రెండడుగులు ముందున్న వాళ్ళు, కొన్నివేల సంవత్సరాల మానవ నాగరికత గుప్పించిన వరాలేవీ తమ దరిదాపులకైనా రాలేదని తెలియని వాళ్ళు, తెల్సినా పట్టించుకోని వాళ్ళూ, ముసలీ ముతకా, ఆడా మగా, పిల్లాజెల్లా అంతా కలిసి ఎభ్భై ఎనభైమంది దాకా ఉన్న బడుగుజీవులు మాటల సడిగానీ, అడుగుల సవ్వడి గానీ లేకుండా, నిశ్శబ్దంగా కదిలే నీడల్లా వచ్చి వచ్చి దేవిడీ ఎదుట ఇనుప కమ్మీల గేటు కభిముఖంగా వీధిలో నిల్చుండిపోయారు.

మసక చీకటి ముసుగులు కొంచెం కొంచెంగా విచ్చిపోతున్న సమయం. దేవిడీ ముంగిట చప్టా నేలంతా చెత్త ఊడ్చి నీళ్ళు చల్లి, ముగ్గు వేసిన తర్వాత పనిమనిషి పాపులక్క అప్పటి కొక పదినిమిషాల క్రితమే లోపలికి వెళ్ళింది. తన అనుదిన వ్యవహారాల్లో తొలి చర్యగా వంటలక్క నాంచారమ్మ పాకశాలను సర్దుకోడం ప్రారంభించింది. పశువుల కొట్టంలో ఇద్దరు సేద్యగాళ్ళు తొలి కోడి కూసినప్పటి నుంచీ పాలు పిండుతున్నారు. ఏడింటికి డైరీ వ్యాను వచ్చేటప్పటికల్లా నాలుగు కేన్లు సిద్ధంగా వుండాలి. ఆపైన ఇంటి వాడుకకు పది పన్నెండు లీటర్లు ప్రత్యేకం. అట్లాగని ఆ ఇంట్లో ఓపినంతమంది ఉన్నారనుకుంటే పొరబాటే!

పెద్దబ్బాయీ, కోడలూ కూడా డాక్టర్లు. వాళ్ల ప్రాక్టీసు అమెరికాలో. నెలకొకసారి ఎస్. టి. డి.లో కొనసాగే పది నిమిషాల పలకరింపే వాళ్ల ఉనికికి నిదర్శనం. రెండో కొడుకు రైల్వే కాంట్రాక్టరు. నివాసం సికిందరాబాదు. పెద్ద వంతెనలు, గొప్ప కట్టడాలు అతడి కార్యరంగం. చిన్నబ్బాయి తాను చదువుకున్న కోయంబత్తూరు కాలేజీలోనే అసిస్టెంటు ప్రొఫెసరు. అవసరం ఏర్పడగానే అక్కడి నుంచి బంచా ఎత్తేసి, తండ్రి దగ్గరినుంచీ కుటుంబబాధ్యతలు స్వీకరించే ఉద్దేశంతో ఆ మధ్య కాలంలో మజిలీగా అతడు కోయంబత్తూరులో వ్యవసాయ శాస్త్ర పాఠాలు చెబుతున్నాడు. పోగా కూతుళ్ళిద్దరూ లక్షణంగా వాళ్ళ సంసారాలు వాళ్ళు చేసుకుంటున్నారు. స్కూళ్ళకు సెలవు లిచ్చినప్పుడో, మైమండలం గుడిలో

తిరణాల జరిగినప్పుడో వాళ్ళు వచ్చి కొద్ది రోజులుండి వెళ్ళిపోతుంటారు. పోగా, ఆ లంకంత లోగిలిలో ఉన్న కుటుంబ సభ్యులు రెడ్డేరు, రెడ్డిసాని ఇద్దరే! 'రెడ్డివారు'కు రూపాంతరం రెడ్డేరు. రెడ్డి దొరసానికి సంగ్రహ రూపం రేడ్డిసాని. తోపుల కాపులా, పొలం సాగు, ట్రాక్టర్ల నిర్వహణ, పశువుల పెంపకం - ఇలా హోం శాఖలో ఎన్నో డిపార్ట్‌మెంట్లు. దేనికి తగిన మనుషులు దానికుండి పోయారు. కనుక రెడ్డేరుకు స్వంత బాదరబందీలు తక్కువేనని చెప్పొచ్చు. లేదంటే తన అధికార పరిధిలో తిరుగుబాట్లూ, కట్టు మీరడాలు, నిర్లక్ష్యధోరణులు మొదలైన విద్రోహచర్యలు తలయెత్తినప్పుడు పకడ్బందీగా దండనీతిని అమలు పరచడం మాత్రమే ఆయన వంతు. ఆయన్ని కాలాన్ని ఎక్కువగా మింగేసేది లోక వ్యవహారాలే.

బూరగమందలో ఇరు పార్టీల వాళ్లూ కొట్టుకోగా ముగ్గురు వ్యక్తులు అక్కడి కక్కడే సీలిగి చస్తారు. ఆ హత్యానేరాలు తమపైన పడకుండా ఉండడం కోసం ఒక పార్టీ వాళ్ళు బూరగమందలో మునిగి, మైమండలంలో తేలి రెడ్డేరు పాదాలు గట్టిగా పట్టుకుంటారు. రంగాపురంలో రంగనాథస్వామి దేవ మాన్యాల రాబడినంతా సుష్టుగా తిని పుష్టిగా బలిసిన ధర్మకర్త ఆఖరి కెట్లాగో ప్రభుత్వాధికారులకు దొరికిపోయాడు. 'స్వామీ నీవే దిక్క'ంటూ అతడు రెడ్డేరు శరణాగతిలోకి వచ్చేస్తాడు. వరదయ్యపాళెం చెక్ పోస్టులో తిక్కశంకరయ్య లాంటి డిప్యూటీ తాశీల్దా రొకడు చేరి బియ్యం కలప, దొంగసారా రవాణాకు అడ్డు తగిలాడు. అప్పుడు చట్ట బాధితు లందరూ కట్టకట్టుకుని తమను గట్టెక్కించవల సిందిగా కోరుతూ రెడ్డేరు హజారంలో హాజరైపోతారు. ఇలాంటి పన్లపైన వచ్చి పడిపోయే జనంతో రెడ్డేరు కొలువెప్పుడూ సందడి సందడిగా వుంటుంది. గంట గంటకూ కాఫీ భాండాలో, టీ కమండలాలలో పైకి వెళ్తుంటాయి. రాత్రి పడుకో డానికి బాగా ఆలస్యమైపోతూ వుంటుంది గనుక రెడ్డిగారి కింక తెల్లవారేది ఉదయం తొమ్మిదింటికే!

రెండంతస్తుల చుట్టు భవంతిలో వెనుకవైపు మిద్దెపైన ఓ పడగ్గదీ, ఒక పెద్ద హాలు, అతిథుల కోసం కొన్ని గదులు. అవన్నీ రెడ్డేరు ప్రత్యేకంగా తనకోసం అట్టి పెట్టుకున్నవి. మౌన ప్రార్థన చేస్తూ గ్రామ సంచారం సల్పినట్టుగా జోగల తండా వచ్చి దేవిడీ ఎదుట నడి వీథిలో విడిసేటప్పటికి రెడ్డేరు తన గదిలో నిద్ర పోతున్నారు. నడవాలో బెంచీపైన నిశ్చలంగా కూర్చున్న ఇరవై నాలుగ్గంటల

అంగరక్షకుడు చెంగప్ప ఏమీ చేయకుండా ఎంత కాలమైనా గడపడం సాధ్యమేనని నిరూపిస్తున్నాడు.

దుర్గం కొండ అడ్డుగా ఉండడం వల్ల లోకానికంతా సూర్యోదయమైన తరువాత గంటా గంటన్నరకు గానీ మైమండలం పైకి బాలభానుడి తొలికిరణం ప్రసరించదు. ఆ రోజు ఎండడాలు ఊరిపైకి ప్రాకి వచ్చేటప్పటికి 'దేవిడీ ఎదుట జోగలోళ్ళ మౌన సత్యాగ్రహ' మన్న వార్త గుప్పుమంటూ గ్రామ మంతటా ప్రాకిపోయింది. ఇలాంటి సన్నివేశం ఇదివర కెప్పుడూ ఎన్నడూ ఊహించింది గాదు. 'తల్లో ఏ పురుగు తొలిచిందో ఈ జోగలోళ్ళకు? లేకపోతే వచ్చి వచ్చి నల్ల రాతితో చెక్కి పెట్టిన విగ్రహాల మాదిరిగా నడి వీథిలో నిలబడిపోతారా?'

చెరువు వైపునుంచీ వేపపుల్లతో పళ్లు తోముకుంటూ ఇంటిదారి పట్టిన పోతుల పుల్లారెడ్డి ఆ దృశ్యాన్ని చూచి కొద్ది క్షణాల పాటు నిర్ఘాంతపడిపోయి అసలింతకూ విషయ మేమిటో ఆరా తీయదలచుకున్నాడు.

"ఒరే జోగల పెద్దన్నా ! ఇట్లా రారా ముందు" అంటూ హుకుం జారీ చేశాడు...

పొడుగాటిలాంటివాడు, కంకాళంలాంటివాడు, మొల కొక తుండు కౌపీనంగా కట్టుకున్నవాడు, తలకు చుట్టుకోడానికైనా, ఒంటిపై కప్పుకోడానికైనా ఒక్కటే చిరుగుల దుప్పటి కలిగినవాడు అయిన జోగల పెద్దన్న పిలుపు వచ్చిన వైపు తిరిగాడు. తిరిగి పుల్లారెడ్డి వైపు చూచి, చేతిలోని దుడ్డుకర్రను క్రిందికి జారవిడిచి, రెండు చేతులూ పైకెత్తి జోడించాడు.

'సామీ ! మాలో మా ఎవ్వారం ఇది. ఇంకెవురికీ ఇందులో జోక్యెం లేదు దయచేసి మీపాటుకు మీ రూరుకోండి' అన్న అంతరార్థం పెద్దన్న నమస్కార భంగిమలో వ్యక్తమైంది.

పోతుల పుల్లారెడ్డి బుతుంగున ఆశ్చర్య సాగరంలో మునిగిపోయాడు. 'ఓరి మీ వుపాతకం' కూలా ! ఆడికొచ్చి ఈడికొచ్చీ ఆఖరుకు రెడ్డేరు పెద్ద సిద్ధారెడ్డితో ఎవ్వారం మీ అంటట మీరే తేల్చుకునే టంతటోళ్ళయిపోతిరా? భలే భలే, మోచేతులకు మీసా లొచ్చినా యేమిరా మీకు?"

"అన్నా పుల్లారెడ్డన్నా! ఇట్రా, నేన్జెప్తా"– తమాషా చూస్తూ దూరంగా

నిల్చున్న గుంపులో నుంచీ ఎవరో పిలుస్తుండడం విని పుల్లారెడ్డి ఆ వైపుగా కాలు కదిపాడు.

"ఏం జరిగిందంటే" – ఆవలిలి వక్త, సాగదీస్తూ ప్రారంభించాడు. "నిన్నటి తెల్లారి రెడ్డేరు సేద్యగాడు ఎరికల నారిగాడు లేడా, వాడు గుండాల మిట్టలో గొడ్లు మేసతా ఉండి లల్లాయి పదం పాడుకుంటూ కటవ పైకెళ్ళి శనిగచేల మక్క చూచినాడన్నా! చూచేటప్పటి కేమైంది? ఒక కయ్య – అయిదు గుంటల కయ్య – ఎట్లా ఉంది? పిల్లలు కాపరం చేసిన ఇల్లు మాదిరిగా ఉంది. చీడ తిని పోయిన మునగచెట్టు మాదిరిగా ఉంది చెట్టుండాల్సిన చోట చెట్టు లేదు. రాయుండాల్సిన చోట రాయలేదు. చెట్లన్నీ పెరికి పారేసినట్టుగా, తీగలన్నీ తుంచి పారేసినట్టుగా కయ్య కయ్యంతా కల్లం మాదిరిగా ఉంది. 'ఇదేందిరా సామీ! రెడ్డేరు కేం జబాబు చెబుదునురా తండ్రీ' అనుకుంటూ వాడు పరుగునా వెళ్ళి చూచినాడు గదా, కయ్యంతా అడుగులే ! ఏ మడుగులు? పందుల అడుగులు ! దొంగనాయాండ్లు గదన్నా ఈ జోగలోళ్ళు! ఏ చెట్టు కిందబడి నిద్రబోయినారో, వాళ్ళ పందులు బోయి చేన్లో బడినాయి. అది ఎవురి చేను ? రెడ్డేరు చేను..."

పుల్లారెడ్డి తల పంకిస్తూ అన్నాడు. "అంతేలే! పోగాల మొచ్చినప్పుడు ఎవురైనా అంతే! కడుపులో పేగులు లెనోళ్ళుగా కనిపిస్తారే గానీ. వీళ్ళకు కొవ్వు మాత్రం కళ్ళలోకి ఎగదట్టినట్టుంది..."

"తగిన శాంతి జరిగిందిలే పుల్లారెడ్డన్నా ! నారిగాడు పరుగెత్తుకొచ్చి చెంగప్పతో చెప్పినాడు. చెంగప్ప రెడ్డేరుతో చెప్పినాడు. రెడ్డేరు చెంగప్పతో ఏమని చెప్పినాడో, చెంగప్ప నారిగాడితో ఏమని చెప్పినాడో మనకు తెలియదు. సాయంత్రానికంతా జమాజెట్టీల మాదిరి పదిమంది మనుషులు వెళ్ళి జోగలోళ్ళ గుడిసెల మీద దూకినారు. కప్పు లెగిరిపోయినాయ్. గోడలు కూలిపోయినాయ్. సత్తు బోకులు, తగరం డబ్బాలు, గోనెసంచులు చెట్టు కొకటిగా, పుట్ట కొకటిగా ఎగిరిపోయినాయ్. పందులు తోలుకుని జోగలోళ్ళు ఇండ్లు చేసుకునేటప్పటికి ముసలోళ్ళు, పిల్లోళ్ళు నెత్తీ నోరూ బాదుకుంటూ ఏడ్చి మొత్తుకుంటున్నారు..."

"కాదులే! చింత జచ్చినా వీళ్ళల్లో పులుసు చచ్చినట్టు లేదు. లేకపోతే తెల్లారేటప్పటి కిట్లా కట్టగట్టుకుని దేవిడీ ముందు కొస్తారా! కొరడా దెబ్బలు తింటే గానీ వీళ్ళకు తిక్క కుదిరేటట్టు లేదు..."

"సాయంత్రం దాకా ఇట్లాగే మొండితనం చేస్తే అదిగూడా తప్పదులే పుల్లారెడ్డెన్నా!"

వ్యవహారం అంతవరకూ వస్తే ఆ వినోదాన్ని తిలకించాలన్న ఉబలాటం ఉన్నవాళ్లు మైసుండలంలో తక్కువగా లేరు. అందుకు విరుద్ధంగా "అయ్యో పాపం! వీళ్ళు కడుపు కాలిన వాళ్లు. దిక్కులేని వాళ్లు. ఇప్పుడు నిరాశ్రయులు గూడా! రెడ్డేరు ఎవరినైనా పంపించి వాళ్లెందుకొచ్చారో అడిగి తెలుసుకుంటే బాగుండును" అని ఆశించే వాళ్లు గూడా లేకపోలేదు. ఈ రెండో తరహాకు చెందిన వ్యక్తి ఒకావిడ దేవిడీలోనే వుంది. ఆవిడ అరగంట కొకసారి సింహ ద్వారానికి పక్కవాటంగా ఉన్న గదిలోకి వచ్చి కిటికీ గుండా వీధిలోకి తొంగి చూచి పోతోంది.

సూర్యబింబం విష్ణుచక్రంలా గిరగిర తిరుగుతూ నడిమింటి దరిదాపుల్లోకి వచ్చేసింది సూదులై పొడిచి, మంటలై మాడ్చి, చెమటలై చిరచిరలాడి ఎండ వాళ్ళ శరీరాలపైన రకరకాల విన్యాసాలు చేస్తోంది. వయసు మళ్ళిన వాళ్ళు నిల్చునే త్రాణలేక దుమ్ములోనే గొంతుక కూర్చున్నారు ఆడవాళ్ళు తలపైన ముసుగేసు కుని మట్టిలోనే శోష్ఠిల్లిపోయారు. బిడ్డ లేడ్చి యేడ్చి అలిసిపోయారు. కిటికీ చువ్వల్లోనుంచి ఆ దృశ్యాన్ని తొమ్మిదోసారిగా చూస్తున్న రెడ్డిసాని అంతరంగంలో దిగులు కెరటాలు కెరటాలుగా పొరాడింది. "ఎప్పుడు తిన్నతిండో! బిడ్డలకు తల్లుల దగ్గర పాలున్నాయో, లేవో? ఎందుకొచ్చిన యాతనో ? ఇలా ఎంతసే పిక్కడ అఘోరిస్తారో, ఏమిటో? కొంపదీసి వాళ్ళల్లో వడదెబ్బకు తట్టుకోలేక ముసలివాళ్లె వరైనా నీలిగి చస్తే? ఏ బిడ్డయినా అక్కడ ఎండుకపోయి గుటుక్కుమంటే? వీళ్ల చేసింది మహాపరాధమే అవును గాక! అందు కిప్పటివరకు పడిన శిక్ష చాలకపోతే పోవచ్చును గాక! అట్లాగని నీటిలోనుంచీ తీసి కాలే బండపైకి గిరవాటు పెట్టిన వచ్చి చేపల్లా వీళ్ళు వాడి వత్తలైపోవడానికి తాను ఒప్పుకోదుగాక ఒప్పుకోదు... అబ్బే, ఈ పరిస్థితి ఇట్లా కొనసాగడానికి వీల్లేదు..."

ఓ దృఢ నిర్ణయానికి వచ్చేసిన రెడ్డిసాని చరాలున హాల్లోకి వచ్చింది. హాల్లో నుంచి మేడ పైకి మెట్లున్నాయి. విసురుగా వెళ్ళి క్రింది మెట్టు మీద కాలు పెట్ట బోయి, అంతలోకరెంటు షాకు కొట్టినట్టుగా ఆమె అడుగు వెనక్కు తీసుకుంది.

మనసు చుట్టూ క్రమ్ముకున్న మబ్బుల్లో ఓ జ్ఞాపకం మెరుపులా మెరిసి పోయింది. అవును తాను మెట్లెక్కి మేడ పైకి వెళ్ళి ఆరు నెలలయింది...

భార్యా భర్తల మధ్య శారీరక సంబంధం మాత్రమే గానీ, మానసికమైన అనుబంధాల కంతగా ప్రాధాన్యం ఇవ్వని మొగిలి రెడ్ల కుటుంబంలోనికి తాను కోడలై వచ్చింది. కొత్త మనుషుల మధ్య కొత్త పరిసరాల మధ్య తనను తాను సర్దుకోడానికే కొంతకాలం పట్టింది. ఆ తరువాత వరుసగా కానుపు లొచ్చాయి. బిడ్డకూ బిడ్డకూ రెండేళ్ళు ఎడంగా ఆరుగురు సంతానం. అబ్బో, మొగిలి రెడ్ల రాజసం అంతా ఇంతా కాదు. ఎదుటి వ్యక్తితో చనువుగా మాటాడితే తామెక్కడ లోకువైపోతామోనని వాళ్ళ అనుమానం. కట్టుకున్న భార్య కన్నబిడ్డ కూడా అందుకు మినహాయింపు కాదు. అందువల్ల పసిప్రాయంలో పిల్లల అచ్చట్లు, ముచ్చట్లు, వాళ్ళు మరికొంచెం పెరిగాక చదువూ సందెలు, ఆపైన పెళ్ళి సంబంధాలు అన్నీ తానే గమనించుకోవలసి వచ్చింది. చిన్న కొడుకు కూడా వివాహితుడై వెళ్ళిపోయాక ఆమె ఆలోచనలు కుటుంబ పరిధిలోనుంచి, బాహ్య ప్రపంచం లోకి విస్తరించాయి. అక్కడి వ్యవహారాల్లో ఎక్కువ భాగం సజావైన దిశగా నడుస్తున్నట్టు లేదు. మరమ్మత్తు చేయడానికి వీల్లేనంతగా పాడైపోయినట్టున్నాయి. అడ్డుకోడానికి బదులుగా తన భర్త అవి అట్లాగే కొనసాగడానికి దోహదం చేస్తున్నట్టు తోచడంతో ఆమె మానసికంగా పెద్ద గందరగోళంలో పడిపోయింది.

భార్య భర్తలు ఎప్పు డెప్పుడు ఏయే విషయాలపైన విభేదించారో చెప్పాలంటే పెద్ద పురాణ మవుతుంది. పొరపొచ్చాల అంతర్యమేమిటో తెలియాలంటే కొన్నింటిని గురించైనా చెప్పుకోవాలి. ఆ మధ్య ఒకసారి ఎన్నికల ఉప్పెన వచ్చి పడింది. బరిలోని అభ్యర్థు లొక్కొక్కరూ మద్దతును గోరుతూ మైమండలం వచ్చి వెళ్తున్నారు. మొగిలిరెడ్ల మద్దతంటే మాటలా? వాళ్ళ మాటపైన పడే వోట్లు పదివేల దాకా వుంటాయి. ఎన్నికల కింక వారం రోజులుందనగా గానీ రెడ్డేరు ఎవర్ని బలపరుస్తున్నారో తెలిసింది గాదు తీరా తెలిసేసరికి రెడ్డిసాని విస్తుపోయింది. దిగ్భ్రాంతికి లోనైంది. తన చెవుల్ని తానే నమ్మలేకపోయింది. వెంటనే మేడపైకి వెళ్ళి "ఏమండీ! నేను వినింది నిజమేనా?" అని చిలదీసి అడిగింది.

"ఏం, నీ కెందుకు సందేహ మొచ్చింది?" అన్నాడాయన.

"కాదండీ! అపద్దపు సాక్ష్యాలు పుట్టించి, తప్పుడు సర్టిఫికెట్లు సృష్టించి ఉరి శిక్షను తప్పించుకున్న వాడు, పనులు చేసి పెడతానని అవసరమున్న వాళ్ళ దగ్గర

డబ్బు గుంజి హైదరాబాదులో తాగి తందనాలాడినోడు, కూలికి రాలేదని చీకటి రాత్రివేళ గూడెంలో గుడిసెలకు నిప్పు పెట్టించినోడు — అటువంటి మహానుభావుడే దొరికినాడా మీకు? ? ఇతడు జనాని కేమైనా మేలు చేయగలడని మీరనుకుంటున్నారా?"

"జనానికి మేలు చేస్తాడో, లేదో మన కెందుకు? మన చెప్పుచేతల్లో ఉంటాడు. మనం కూచోమంటే కూచుంటాడు. నిలుచోమంటే నిల్చుంటాడు."

"గొప్ప అర్హతే! మొగిలిరెడ్ల హజారంలో కుక్కలా పడి ఉంటాడనీ, రామాపురం నాయుళ్ళ మోచేతి గంజి ప్రియంగా తాగుతాడనీ మరెవరికో ఆనందంగా ఆడపచాపలు మోస్తాడనీ — ఒక గూండాను ప్రజా ప్రతినిధిగా అసెంబ్లీకి పంపిస్తారా మీరు?"

"ఇదంతా నీ కెందుకులే అమృతం! రాజకీయా లనినాక ఎన్నో తిరకాసు లుంటాయి. అయినా ఇటువంటివి షయాల్లో ఎప్పుడూ జోక్యం పెట్టుకునే దానివి కావే! ఈ కొత్త బుద్ధి ఎప్పట్నుంచి?"

"మీ రాజకీయాల కొక నమస్కారం! నేను మాత్రం నా వోటు వెయ్యను పోలింగ్ స్టేషనువైపే తిరిగి చూడను" వెనుదిరిగి ఆమె క్రిందికి దిగి వచ్చేసింది.

రెడ్డిసాని పూర్తి పేరు అమృతవల్లి. ఆమె కొత్తకోట రెడ్లి ఆడపడుచు. చెట్టెక్కి కాయలు కోస్తున్న వాణ్ణి భద్రంగా క్రిందికి దిగి రమ్మని చెప్పి, "నన్నడిగితే వద్దంటా నట్రా?" అంటూ మందలించి, కోసిన కొబ్బరికాయల్ని మూటగట్టి తీసుకపొమ్మని చెప్పేపాటి ఔదార్యం కలిగిన కొత్తకోట రామస్వామిరెడ్డి కూతురు.

చాలా కాలం దాకా బిడ్డలు లేకపోయేటప్పటికి భార్యా భర్తలు ఘటికాచల క్షేత్రం వెళ్ళి మండలం రోజులు సేవచేశాక కలిగిన ఆడబిడ్డకు మొక్కుబడి మేరకు అక్కడి అమ్మవారి పేరు పెట్టుకున్నారు. వేళకు అతిథులు, అభ్యాగతులు, యాచకులు ఎంద రొచ్చినా అన్నం పెట్టి తీరాలన్నది ఆయన పాటిస్తూ వచ్చిన వ్రతం . రాత్రి భోజనానంతరం విశ్రాంతిగా వచ్చి కూర్చున్న గ్రామస్థులకు పురాణ ప్రవచనం చెయ్యడం జీవితాంతం ఆయన ఒక వ్యాపకంగా పెట్టుకున్నాడు. బాగా అక్షర జ్ఞానం అలపడింది మొదలు అమృతవల్లి తండ్రి ప్రవచనంలో గొంతెత్తి రాగయుక్తంగా ఎత్తుగడ పద్యాలు చదువుతూ వచ్చింది. కాని

ఏం లాభం? ఆదరణ ఒకగూడనిదే ఏ కౌశలమైనా అణగారిపోవలసిందే! భౌతిక విషయాలకు మాత్రమే ప్రాధాన్యం ఇచ్చే అత్తవారింట్లో ఆమె పరిజ్ఞానం, సాహిత్యాభిరుచీ కూడా రాణింపుకు రాకుండా పోయాయి. కొత్త వ్యక్తుల మధ్య, కొత్త పరిసరాల్లో ఇమిడిపోవడానికి ఆమె ఇంచుమించుగా పరకాయ ప్రవేశం చేయవలసినంత పనైపోయింది.

ఎన్నికలు జరిగిపోయిన తర్వాత మళ్ళీ కొంతకాలానికి ఇంకొక సంఘటన వల్ల ఆమె మరింత నిర్వేదానికి గురైంది. ప్రక్క ఊళ్ళో ఓ లేత ఇల్లాలు అత్యాచారానికి గురైంది. పిల్లికి చెలగాటమే అయినా ఎలుకకు ప్రాణసంకటం తప్పలేదు. దౌర్జన్యానికి ఎర అయిన అమ్మాయి ఆత్మహత్యకు పాల్పడింది. సాక్ష్యాలు ఉచ్చులా బిగుసుకుని శిక్ష తప్పదనే పరిస్థితిలో ఆ కేసు రెడ్డేరు దగ్గర విచారణకు వచ్చింది.

పదివేల రూపాయలు నష్టపరిహారంగా ఇప్పించే షరతు మీద ఆయన వాది పక్షం వాళ్ళ చేత కేసును ఉపసంహరణ చేయించేశాడు

"నిండు ప్రాణం నీళ్ళపాలు కావడానికి కారకుడైనాడే! వాడికి యావజ్జీవ శిక్ష పడినా తక్కువేనే! ఏమండీ! ప్రాణాల విలువ పది వేల రూపాయలా మీ లెక్కలో?" రెడ్డిసాని నిక్కచ్చిగా ప్రశ్నించింది

"అదేం తక్కువ మొత్తం కాదే! ఆ డబ్బుతో ఇంకొక పెండ్లి చేసుకోవచ్చు గదా!" తేలికగా కొట్టిపారేశాడు రెడ్డేరు.

"మంచిదే! ఆ రెండో పెండ్లి పిల్ల ద్వారా కూడా ఇంకొక పది వేల రూపాయలు దక్కొచ్చు. ఆపైన మూడో పెండ్లి. అబ్బ, ఎంత అదృష్టమో!"

"అయితే నువ్వేమంటావు?"

"చెప్తా నుండండి! చొక్కా తిరగేసి తొడుక్కున్నట్టుగా ఈ కేసును కూడా తిరగేసి చెప్పుకుందాం. అత్యాచారానికి పాల్పడినవాడు ఓ బీదింటి అబ్బాయి అనుకోండి! అందుకు గురై ఆత్మహత్య చేసుకున్నది ఖామందుల కోడలనుకోండి! అప్పుడు మీ తీర్పెలా వుంటుందో?"

"బీదింటి అబ్బాయైతే నష్టపరిహార మెక్కడినుంచీ తెస్తాడు? వాడెట్టయినా కోర్టు శిక్షకు బాధ్యుడే?"

"అదీ, ఆ మాటనినారు గనుక బాగుంది. అయితే ఇందులో మరొక ధర్మ సూక్ష్మం కూడా ఉందని మీరు మరిచిపోయి వుండగూడదు. నీళ్ళల్లో దూకి నిండు ప్రాణాలు విడిచింది ఖామందు కోడలైతే, నష్టపరిహారం పది వేల దగ్గర ఆగాలని ఎక్కడుంది? అప్పుడది లక్ష దాకా ప్రాకి ఉండొచ్చు గదా! ఏమంటారు?"

ఏమనాలో తోచక ఆయన భార్యవైపు తెల్లబోయి చూడసాగాడు. ఈమె తనను సమర్ధిస్తున్నదా? లేక ఈసడిస్తున్నదా? రెండో ఊహ నిజమైన పక్షంలో తన తీర్పును వేలెత్తి చూపే సత్తా ఈమె కెక్కడినుంచి వచ్చింది? ఆ స్థాయికి తన వ్యక్తిత్వం తరిగిందా? లేక ఆమె వ్యక్తిత్వం పెరిగిందా?

భర్త మనోఫలకంపైన మెలికలు తిరుగుతున్న ఆలోచనా రేఖను ఆమె గుర్తించగలిగింది. పెదవిపైకి ఒక హాసరేఖం తెచ్చి పెట్టుకుంటూ అంది- "తెలుసులెండి! ఏమిట్రా ఇది మన మాటకు మారాడే తెగువ ఈ ఆడమనిషి కెట్లా వచ్చిందని అనుకుంటున్నారు మీరు! ఈ ఇంట్లో ఆడవాళ్ళు పాటించవలసిన హద్దు లేవో నాకు తెలుసు. ఆ హద్దుల్ని దాటి ఒక అడుగు వెయ్యడానికి గానీ, ఒక మాట మాట్లాడ్డానికి గానీ ఒప్పుకోరనీ తెలుసు పొరబాటైపోయింది. ఇక మీదట మీ వ్యవహారాల్లో జోక్యం పెట్టుకోను."

ఆడిన మాట కామె కట్టుబడిపోయింది. గ్రామ ప్రాంత రాజకీయాలను గురించి గానీ, మేడపైన జరిగే మధ్యస్థాలను గురించి గానీ, అందులో వెలువడే తీర్పులను గురించి గానీ ఆమె "కనను, వినను, మాట్లాడను" అన్నట్టుగా పట్టించుకోవడం మానేసింది. అయితే భార్యాభర్తల మధ్య ఎడం ఏర్పడిందని పసిగట్టిన వాళ్ళెవరూ లేరు. గడప దాటకుండా ఇంటిగుట్టును పరిరక్షించడంలో మొగిలిరెడ్ల ఇంటి కోడళ్ళకు తరతరాల ప్రఖ్యాతి వుంది. ఆ ఖ్యాతిని ప్రస్తుత రెడ్డిసాని కూడా పదిలంగా కాపాడుకుంటూ వచ్చింది.

అయితే పులిమీద పుట్ర లాంటి ఒక సంఘటన వల్ల వాళ్ళ మధ్య దూరం మరింత విస్తరించింది.

చత్వారం ముదిరిపోయి సులోచనాలు మార్చుకున్నప్పటికీ రెడ్డి వారికి కొంత కాలానికి దినపత్రికలు చదువుకోడం కష్టసాధ్యమైపోయింది. అలా కాదని చదివినా కళ్ళు నొప్పెడుతూ వచ్చాయి. కళ్లకు శ్రమ పెట్టకూడదని డాక్టర్లు సలహా ఇచ్చారు. అందుకని ప్రతి రోజూ ఒక గంటసేపు దినపత్రిక చదివి వినిపించడం

రెడ్డిసాని కొక అవశ్య కర్తవ్యమైపోయింది. పురాణాల మాట దేవు డెరుగు, న్యూస్ పేపరు చదివి వినిపించే అవకాశమైనా అబ్బురమే కదా! దాదాపు రెండేళ్ళుగా ఆ పనిని నిర్విఘ్నంగా నిర్వహిస్తూ వచ్చింది. అయితే ఇంచుకోను ఆమె కొక ఇబ్బంది ఎదురైందంటే అది పులిమీద పుట్ర కాక మరేమవుతుంది??

"వార్త" అనేది సమాజానికి చెందింది. బుద్ధి ఆలోచన, జ్ఞానమూ ఉన్న వాళ్ళు ఏ వార్తకైనా అంతో ఇంతో స్పందించక తప్పదు. ఈ స్పందించే గుణమే రెడ్డిసానిలోని పెద్ద బలహీనతైపోయింది ఉండి ఉండీ ఒక్కొక్క వార్త మింగుడు పడని కవళంలా, గొంతుకను కాల్చేసే గరళంలా, గుండెల్ని కలచివేసే సంక్షోభంలా ఆమెలోని జీవ చైతన్యాన్ని మొద్దువారిపోయేటట్టుగా చేస్తూ వచ్చింది. కొన్ని కొన్ని వార్తల్ని చదువుతుండే వనాలు వంటచెరకైపోయినట్టుగా, పంట పొలాలు ఎడారులైపోయినట్టుగా, ఊళ్ళు శ్మశానమైపోయినట్టుగా ఆమె మనసు వికలమైపోయింది. క్రిందికి వెళ్ళి దట్టంగా తల నొప్పి మందు దట్టించి, వేడిగా ఓ గ్లాసు కాఫీ తాగి, ఒక గంటసేపు పడుకున్నాకగానీ ఆమె మామూలు మనిషి కాలేకపోయేది.

కానీ, ఇది ఒక రోజుతో ముగిసిపోయే యాతన కాదు గదా!

రోజులు గడవగా గడవగా ఒకనాటి వార్తాపత్రిక విషవాహికలా, కాకపోతే దగ్ధవేదికలా ఆమె చేతి కొచ్చింది ఒకానొక రాష్ట్రంలో ఘోరమైన నరమేథం జరిగింది. నాలుగు కుటుంబాల్లో ఒక్కరైనా మిగల్లేదు. తాగిన మత్తులో ఒక డ్రయివరు నిండు బస్సును వంతెనపైన్నుంచీ నదిలోకి దూకించేశాడు. పన్నెండు గురు మాత్రమే ప్రాణాలతో బయటపడ్డారు. సలభై నాలుగు మంది గల్లంతై పోయారు. ఒక లారీ జీపును గుద్దేసింది. అక్కడి కక్కడే ఏడుమంది హతమై పోయారు. ఒక గ్రామీణ ప్రాంతంలో వర్ణ విద్వేషం కారణంగా నడిరాత్రి గృహ దహనాలు జరిగాయి. కాలిపోతున్న కొంపల్లో నుంచి నిస్సహాయుల హాహాకారాలు అరగంటదాకా వినిపించాయి. కోరిన వరాలిచ్చే షరతుపైన ఒక ఉద్యోగ సంఘాల వాళ్ళ దగ్గర పది లక్షల రూపాయల బక్షీసు తీసుకున్నాడని ప్రతిపక్షాలవారు ఆరోపించారు. "లాకప్ డెత్"కు నిరసనగా స్టేషను ఎదుట ధర్నా చేసిన ప్రజలపైన పోలీసులు జరిపిన కాల్పుల్లో ముగ్గురు అసువులు గోల్పోయారు. అయిదుగుర్ని ఆసుపత్రిలో చేర్చారు. నిర్భయంగా ఒక వార్తను వెల్లడించిన నేరానికి గాను

ఒకానొక ఎం.ఎల్.ఏ.ఒక పత్రికా విలేఖరిని నడి రోడ్డులో రౌడీల చేత కొట్టించాడు. రోడ్డుపైన వెళ్తున్న పోలీసు శకటం ఒకటి మందుపాతరల వల్ల ప్రేలిపోయి ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరు, ఇద్దరు సబ్-ఇన్‌స్పెక్టర్లు, నలుగురు కానిస్టేబుళ్ళ ఆనవాలు కూడా పట్టడానికి వీల్లేకుండా కండకండలుగా ప్రిదిలిపోయారు. కల్తీసారా తాగి ఒకచోట వందకు పైచిలుకు వ్యక్తులు ఆసుపత్రి పాలయ్యారు. పరీక్ష హాల్లో కాపీ కొట్టడానికి అడ్డుపడిన ఇన్విజిలేటర్ని విద్యార్థి కత్తితో పొడిచి గాయపరిచాడు. పద కొండేళ్ల బాలికపైన ముప్ఫై అయిదేళ్ళ యువకుడు జరిపిన లైంగిక బలాత్కారంలో వారంరోజులు ఆసుపత్రిలో అపస్మారకంలో పడి ఉండి...

వ్రేళ్లు కాలుతున్నట్టయి పేపరు క్రిందికి జారిపోయింది.

"ఏమండీ! జన్మ జన్మలకూ మీకు ఋణపడి వుంటాను. నన్నీ శిక్షనుంచి తప్పించరూ?"

అర్థం కానట్టు ఆయన చిత్రంగా ఆమె వైపు చూచారు.

"ఈ దేశంలో ప్రభుత్వ మనేది ఉన్నట్టుగా నాకు తోచడం లేదు. సమాజంలో వ్యవస్థ ఉందనడానికి ఆధారాలేవీ కనిపించడం లేదు. ఎందుకండీ దీన్ని చదవడం, నిశ్చింతంగా వున్న ప్రాణాలపైన నిప్పులు చల్లుకోవడానికి గాకపోతే?"

"అయితే నువ్విక్కడికి రావడం దేనికి? రానే వొద్దు. నేను పేపరు నాథముని దగ్గర చదివించుకుంటాలే."

ఆమె కొద్ది క్షణాల పాటు ఆయన ముఖంలోకి చూస్తూ వుండిపోయి, సరేనంటూ ఆయన ఆజ్ఞను శిరసా వహించినట్టుగా లేచి నిల్చుంది. ఆ రోజు మేడ మెట్లు దిగి రావడమే రావడం! మళ్ళీ పైకి వెళ్ళలేదు.

ఆ విషయం స్ఫురణకు రావడంతో ఆమె క్రింది మెట్టు దగ్గరే ఆగిపోయింది.

గిరుక్కున వెనుదిరిగి తన గదిలోకి వెళ్ళిపోయింది.

మధ్యాహ్నం ఒంటిగంటప్పుడు – "అమ్మగారూ! భోజనానికి రారా?" అంటూ వచ్చి ద్వారం దగ్గర నిలబడింది నాంచారమ్మ.

"నన్ను పిలవొద్దులే, నాంచారూ! ఈ పూట నాకేం ఆకలిగా లేదు" అంది రెడ్డిసాని.

"అదేం దమ్మా! తెల్లవారి ఒక టంబ్లరు పాలు తాగడమే గదా! టిఫిన్నైనా చేయకపోతిరి. మధ్యాన్నం గూడా ఆకలి కాలేదంటే ఎట్లా?"

కొద్ది క్షణాలు లేచి చూచింది నాంచారమ్మ. బదులు లేకపోయేసరికి తిరిగి వెళ్ళిపోయింది.

— గాజు దుమ్ము తూర్పార బట్టినట్టుగా, ఐరీ పోగులు వేలాడదీసినట్టుగా, బాణాలు జుళిపించినట్టుగా బయట ఎండ విరగకాస్తోంది. కాయనీ, దిక్కులేని జోగ ళ్ళోళ్ళు సొమ్మసిల్లిపోనీ తానేం చేయగలుగుతుంది? తన మాట కేం చెల్లుబాటుంది?

తెచ్చిపెట్టుకున్న నిగ్రహంతో ఆమె తనను తాను అదుపులో ఉంచుకోగలి గింది. నిస్త్రాణగా ఉందేమో, తానుగూడా శోషిల్లినట్టుగా పరుపుమీద పడి ఉండి పోయింది. అలా ఎంతసేపు గడిచిందో తెలియదు. హఠాత్తుగా జాగ్రదావస్థలోకి వచ్చింది. దగ్గర్లో గగ్గోలు చెలరేగుతోంది. కేకలు, రోదనలు, అంగలార్పులు- అంతకంతకూ ఉధృతంగా వినిపిస్తున్నాయి.

ఆమె చివాలున మంచం దిగి చరచరా సింహద్వారం దగ్గరికి వచ్చేసింది.

చెంగప్ప చేతిలోని కొరడా నల్ల త్రాచులా విరుచుకపడుతోంది. దెబ్బతిన్న వాళ్ళు తిన్నట్టుగానే వాలిపోతున్నారు. "వొద్దు సామీ! కొట్టొద్దుసామీ! నీకు పదేలు దండాలు సామీ!" అని ఆడవాళ్ళు గొంతు చించుకుంటూ ఆక్రోశిస్తున్నారు.

"కొడతానా, కోసి ఖాగా లేస్తానా! అమ్మో ఎంతపొగరుమ్మస్సుందిరా మీకు! కుక్కల్ని కొట్టినట్టుగా కొట్టొచ్చు మిమ్మల్ని! వస్తారా? దేవిడీ ముందరి కొస్తారా?" అసహాయశూరుడై పేట్రేగిపోతున్నాడు చెంగప్ప.

"ఇదిగో — చెంగప్పా! నువ్విట్లా వస్తావా, లేదా?"— కోప ఘూర్ణితమైన కంఠంలో నుంచీ తూటాల్లా వెలువడిన ఆ మాటలు సూటిగా వెళ్ళి తాకడంతో చెంగప్ప నోటికీ, చేతికీ బ్రేకులు పడ్డాయి.

చుట్టగా చుట్టుకున్న కొరడాని వెనక్కు దాచిపెట్టుకుంటూ, అతడు జంకు గొంకులతోనే అమ్మగారిని సమీపించాడు.

"చెంగప్పా! బాగుందయ్యా! ఎంతో బాగుంది. మునుపటి కిట్లనే నీకు తోడుబోయిన వాడెవడో మూడు నెలలు సాము చేసి మూలనుండే ముసలిదాన్ని

చావగొట్టినాడంట! ఆహా, ఏం ప్రతాపమున్యా మనది! వెళ్ళెళ్ళు వాళ్ళ సంగతేందో నేను చూచుకుంటాలే..."

చెంగప్ప నిష్క్రమించి, అమ్మగారు ప్రత్యక్షం కావడంతో జోగలోళ్ళకు పెద్ద ఏడుగడ దొరికినట్టంది.

"అమ్మా తల్లీ! బిడ్డల్ని గన్న చల్లని కడుపమ్మా నీది! నువ్వొస్తివి, దెబ్బలు తప్పిస్తివి. నీ సంతు చల్లగుండాల" అంటూ వాళ్ళు ఒకరి నొకరు తోసుకుంటూ ఆమె పాదాల దగ్గిరికి రాబోయారు.

"వద్దు పాదాలు తాకొద్దు." వారిస్తూ అంది రెడ్డిసాని. "మీ రెందు కొచ్చినట్టో చెప్పండి చాలు. ఏం కావాలో్నో చెప్పండి."

"మాకేమీ వొద్దమ్మా తల్లీ!" జోగల పెద్ద ముందుకొచ్చాడు. "మావల్ల తప్పు జరిగిపోయింది. అందుకు దగిన శిచ్చ గూడా పడింది. అందుకు గాదమ్మా మే మొచ్చింగి ఇకమీదట మా మూలకంగా పొరపాటు జరగకుండా చూసుకుంటాం. అయితే ఈ మాట రెడ్డేరు మనసు కెక్కాల. ఆయన ఉండమంటే ఇక్కడుంటాం. వొద్దంటే దేశాలు పట్టుకుని వెళ్ళిపోతాం..."

కొద్దిసేపటివరకు ఆలోచిస్తూ వుండిపోయింది రెడ్డిసాని. ఆ వ్యవధిలో ఓ నిర్ణయానికి రాగలిగింది. "ఉండండి, చెప్తా"నంటూ మేడవైపు తిరిగింది.

మళ్ళీ కొద్ది నిమిషాలకల్లా మేడపైన మూసి వున్న రెడ్డేరు గది తలుపులు గబాలున తెరచుకున్నాయి. వాలు కుర్చీలో పడుకున్న రెడ్డేరు తలత్రిప్పి గుమ్మం వైపు చూచాడు. అలా చూచినంతసేపు ఆయనవి రెప్పపాటు లేని కళ్ళైపోయాయి.

"ఇది కలా, నిజమా"

ఆయన ప్రశ్నార్థకంగా చూస్తుండగానే ఆమె గదిలో అడుగు పెట్టింది. నెమ్మదిగా వెళ్ళి వాలుకుర్చీకి అభిముఖంగా గోడ కానుకుని నిల్చుంది.

"- ఎందుకొచ్చినట్టు ఆరు నెలల వ్రతాన్ని తోసిపారేసిందే! వచ్చిన మనిషి ఎంతకూ మాటాడదే!..." రెడ్డేరు అంతరంగంలో ప్రశ్నలు తేనెటీగల్లా ముసురుకుంటూ ఉండగానే ఆమె పెదవి కదిపింది.

"ఒక మాటడిగిపోదామని వచ్చినాను."

కనుబొమలను మాత్రం పైకెత్తి ఆయన భార్యవైపు నిశితంగా చూచాడు.

"ఒక ముసలాయన ఉండేవాడు. కొల్లాయి గట్టుకుని, చుప్పటి కప్పుకుని, కళ్ళద్దాలతో, బోసినోటితో, నాల్గు పరకల పిలకతో బలంగా గాలి తోలితే కొట్టుకుని పొయేటట్టుండేవాడు. ఇప్పుడు లేడు. పోయినాడు. తనంతట తానుగా పోలా. కాల్చి చంపేసినారు. అతనివల్ల స్వరాజ్యం వచ్చిందంటే ఇప్పుడు నమ్మేవాళ్లెవరు? ఈ నలభై యేండ్లను జనం తెలివిమీరి పోయినారు. చాలామంది బుద్ధిమంతు లిప్పు డాయన్ని సర్కసులో బఫూనుగాను, పేకాటలో జోకరుగాను, తోలుబొమ్మ లాటలో జుట్టు పోలుగాడు గానూ లెక్కేస్తున్నారు నిజమే! ఆయన ఈ దేశానికి చేసిన ద్రోహాలు అన్నీ ఇన్నీ కాదు. అన్నింటికన్నా ముఖ్యమైంది కత్తులూ, తుపాకులూ వద్దని సత్యాగ్రహమనే ఆయుధాన్ని ఇచ్చి వెళ్ళడం. ఇప్పుడా ఆయుధాన్ని పట్టుకుని జోగలోళ్ళు మన దేవిడీ ముందర తికాణా వేసినారు..."

"చెప్పొద్దులే? ఎందుకూ" చరాలున మండిపడ్డాడు. రెడ్డేరు. "చెంగప్పకే వదిలిపెట్టుంటే ఈపాటికి జోగలోళ్ళు చెట్టు కొకరుగా, పుట్ట కొకరుగా ఉడాయించి వుందురు. నువ్వడ్డు తగిలినావంట గదా! మంచిది. ఈ సమస్యను నీ పద్ధతిలో నువ్వే పరిష్కరించు."

ఆయన అంతర్యాన్ని అధ్యయనం చేస్తున్నట్టుగా ఆమె అట్లాగే వుండి పోయింది. తటాలున ఆయన ప్రేలిపోయాడు.

"జరిగే పని జరగకుండా చూడడం మొగలాయితనం గాదు. పాడుచేసిన పనిని బాగుచేసే నిరవాకం కూడా వుండాలి. చెప్తిని గదా ఈ సమస్యను... నీ పద్ధతిలో...నువ్వే పరిష్కరించు..."

చెప్పాలనుకుంటున్న మాటలేవో ఆమె గొంతుకలో సందడిస్తున్నాయి. అయినా నిగ్రహించుకుని "సరే, అట్లాగే" అన్నట్టుగా తల ఊపి, గదిలోనుంచి ఈవలికి వచ్చేసింది.

తరువాత కొద్ది నిమిషాలకల్లా క్రింది అంతస్తులో నెలకొన్న స్తబ్దవాతా వరణంలోకి సంచలనం తెరలు తెరలుగా చొచ్చుకొచ్చేసింది.

"ఇదిగో నాంచారూ"

"పిలిస్తిరా అమ్మగారూ!" వంటలక్క పరుగెత్తుకొచ్చింది.

"స్టోరు రూంలోనుంచి అండాలు పైకి తియ్..."

"అట్లాగే నమ్మా!"

"పాపులక్క ఎక్కడుందో చూడు. మూతంచాలు శుభ్రంగా కడిగించు..."

"సరే నమ్మా"

"రెండండాల్లో నీళ్ళు పోసి గాడి పొయ్యి మీది కెక్కించు. ఇంకొక అండాలో పప్పువెయ్. అరటిపంబం ఒకటుంది కదా కాయలు తరిగించు. రెండం డాల్లో అన్నం పప్పూ, వంకాయ కూర. అరటికాయ వేపుడు అర్థమైందా?"

"అర్థమైందమ్మా!" అంది నాంచారమ్మ. అంతటితో ఊరుకోలేక యజమానురాలి దగ్గర తనకున్న చనవును బట్టి. "అమ్మగారూ! చుట్టాలెవరైనా వస్తా వుండారా" అని ప్రశ్నించింది.

"ఇంకా రావడమేందే పిచ్చిదానా! ఎప్పుడో వచ్చేసినారు గదా!"

* * *

పున్నమి వెళ్ళిన నాలుగో రోజు. బడికి ఆలస్యంగా వచ్చిన కుర్రాడిలా పది గంటల తర్వాతెప్పుడో కొండపైన్నుంచీ తొంగి చూచాడు చందమామ. అమృత కిరణాల దివ్యస్పర్శలో కొండ కోనలు, పైరు పచ్చలు మురిసిపోయి మిలమిల లాడు తున్నాయి.

నిద్ర పట్టని రాత్రివేళ సిగరెట్టు కాల్చుకుంటూ డాబాపైన పచార్లు చేస్తున్న రెడ్డి వారికి హఠాత్తుగా జోగలోళ్ళ ఉదంతం గుర్తుకొచ్చింది. సాయంకాలం నుంచి సడీ చప్పుడూ లేకపోవడం కూడా స్ఫురించింది. పడమటివైపు పిట్టగోడ దగ్గరి కొచ్చి నిలబడి ఆయన వీథివైపు పారజూచాడు.

జోగలోళ్ళందరూ హాజరే! లేదంటే కటిక నేలే పుష్పశయ్యగా, మంద పవనాలే వింజామరలుగా, భువన భవనమే తమ వజ్రాల మేడగా వాళ్ళు ఎక్కడి వాళ్ళడ చాపులు చాపులుగా పడి నిద్రపోతున్నారు

రెడ్డేరు గొంతుకలోనుంచి పిలుపు ఊడి పడింది.

"ఒరే చెంగప్పా!"

"అయ్యగారూ, పిలిస్తిరా?" పరుగెత్తుకొచ్చాడు చెంగప్పా.

"ఏం మనుష్యులా వీళ్లు! తెల్లారితే తిండి దొరికే విధాయక మేమో తెలియదు. రేపు రాత్రి కెక్కడ తలదాచుకోవాలో తెలియదు కట్టుకోవడానికి మారు

బట్ట వుండేది కూడా అనుమానమే ! అయినా ఇట్టా నిద్ర పట్టిందంటే ఎంత నిశ్చింతరా వీళ్ళకు?"

"అమ్మగారు వండించి రాసి పోయించిరి గదండీ! గొంతుక దాకా మెక్కినారేమో, ఒళ్లెరగకుండా నిద్ర పట్టేసింది. కడుపే కైలాస మనుకోండి! ఈ పూటకు తిండి దొరికితే చాలు, ఇంకేమి అక్కర్లేదు వీళ్ళకు!"

"మీ రెడ్డిసాని పెట్టిందంతా ఒకపూట తిండే గదరా! మన మాపాటి పని చెయ్యలేమా?"

"అదేం మాటండీ అయ్యగారూ! తమరు తలుచుకుంటే ఇంకెంతకైనా చేయగల్రు." -వంతపాడడం చెంగప్పకు బాగా అలవాటే! కానీ ఈసారి నోరు జారి మాటల్లో నుంచీ అపశ్రుతి ఏదో వినిపించినట్టయి,అతడు నాలుక కొరుక్కున్నాడు.

"ఒరేయ్ చెంగప్పా!"

"అయ్యగారూ!"

"నువ్వొక పని చెయ్!"

"చెప్పండి."

"ఈ జోగలోళ్ళుండింది తుమ్మ తోపులో గదూ! ఒకప్పుడది చెరువు మునక. ఇప్పుడు కూడా తేమగానే ఉండొచ్చు. అక్కడొద్దులే. చెరువు మరవకు ఉత్తరంగా మన మిట్ట చేనిలోనే వీళ్ళను ఇండ్లు కట్టుకొమను..."

"... ... ...."

"కట్టుకునే ఇండ్లు కొంచెం గట్టిగానే కట్టుకొని! దూలాలకు గాను మన తోపులోనే ఇంటి కొక తాటిచెట్టు కొట్టుకోమను. కావలి సొచ్చే వెదురు బొంగులు కూడా నరుక్కోమను...."

"... ... ..."

"నీటి సదుపాయానికి కూడా ఏర్పాటు చేద్దాంలే. ప్రస్తుతానికి మన వెంకటేసుతో చెప్పి మిషను బావి దగ్గర గారతొట్టిలో ఎప్పుడూ నీళ్ళు స్టాకు పెట్టమని చెప్పు."

చెంగప్ప కిదంతా ఏమిటో అర్థం గావడం లేదు. అయోమయంగా అతడట్లాగే రెడ్డివారి ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు. పాలిపోయిన చెంగప్ప ముఖాన్ని చూస్తూ చెంగలువలకు ప్రమోదం చేకూర్చే చందమామ పక్కున నవ్వసాగాడు.

— ఆంధ్రవారపత్రిక - 1993

# ఎదురుగాలి

మా రంగనాథం బాబాయికి అయిదుగురు మగబిడ్డల తర్వాత లేక లేక ఒక్క కూతురు. అమ్మాయి పేరు లీల. స్వభావంచేత వట్టి పేల. పరికిణీలు వదిలి పెట్టి పమిటె వేసుకునే వయస్సు. వాయిల్ చీర వలయాల్లో వంకరలు తిరిగిపోతూ, భుజంపైనుంచీ జారిపోయే జడను, రొమ్ముకు హత్తించుకొన్న మోపెడు పుస్తకా లను మాటిమాటికీ సర్దుకుంటూ సెలఏటి ఇసుక తిన్నెలపైన తారట్లాడే హరిణశాబ కంలా రోడ్డుపైన నడిచిపోతున్న లీలావతిని చూచినప్పుడల్లా ఈ అమ్మాయి కిప్పు డిప్పుడే పెళ్ళి చేయడం భావ్యం కాదనుకునేవాణ్ణి. ఒక్కింత సుఖానికీ, అంతకు రెట్టింపు బాధ్యతలకూ తావలమైనది వివాహానంతర జీవితం. సుఖం మాట దేవు డెరుగుగానీ, ఆ బాధ్యతల బరువును మోయడం సామాన్యం కాదు. అందునా ఆడ బిడ్డ విషయంలో అత్తగారి ఆరడీ, ఆడబడుచుల పోరులాంటి చిల్లర మల్లర గొడ వలు బోలెడు! ఈ బొమ్మను తీసుకెళ్ళి ఆ ఫ్రేమ్‌లో ఇరికించడమంటే ఎవరికి మాత్రం మనస్కరిస్తుంది?

కానీ మా రంగనాథం బాబాయి సంగతి వేరు. సాధారణంగా సామాన్య మానవుడి ఆలోచన ఎక్కడైతే ఆగి పోతుందో, అక్కడి నుంచీ ఆయన ఆలోచన ప్రారంభమవుతుంది. సలహాలను మూటకట్టుకుని ఆయన దగ్గరకు వెళ్ళిన శ్రేయోభి లాషి ఆకాశయానాన్ని గురించి రష్యావాడికి బోధింప దలచుకున్న విదేశీయ వైజ్ఞా నికుడులా ముఖం చిన్నబుచ్చుకుని బయటికి రావలసి ఉంటుంది. మా రంగనాథం బాబాయి అప్రమత్తుడు. గొప్ప చలనచిత్రంలో అడుగడుగునా ద్యోతకమయ్యే దర్శకుడి ప్రతిభలా అరవై యేండ్ల జీవిత గ్రంథంలో ఏ పుటను తీసి పరిశీ లించినా, ఆయన అప్రమత్తత కొట్టవచ్చినట్టుగా గోచరిస్తుంది అయిగురు కొడు కులు గదా బాబాయికి—శాంతాదేవి ప్రభావానికి లోబడిన నాటి ఋష్యశృంగుని నకళ్లుగా వాళ్ళనయినా పెంచిన తీరు, పరీక్షల్లో కడతేరకముందే వాళ్ళకు ఉద్యోగం రిజర్వు చేసి ఉంచడంలో ఆయన వ్యక్తపరచిన దూరదృష్టి, కన్యాకనకాలతో పాటు అంతో ఇంతో స్థిరాస్థికూడా కలిసి వచ్చేట్టుగా వాళ్ళకు పెండ్లి సంబంధాలు

కుదర్చడంలో ఆయన ప్రకటించిన లౌక్యం.. ఇవన్నీ మా బాబాయి విజ్ఞతకు తార్కాణమే! తోలుబొమ్మలాటలో సూత్రధారిలాంటివాడు మా బాబాయి. మూల విరాట్టుగా ఆయన ఉన్న చోటునుంచీ కదలడు. ఎలా జరిగిపోతాయో మరి, అన్ని పనులూ ఆయన అనుకున్నట్టుగానే జరిగిపోతాయి.

బ్యాంకులో ఉన్న డబ్బులాగా లీలావతి భవిష్యత్తు మా బాబాయి పిడికిట్లో సురక్షితంగా ఉందని నాకు తెలుసు. కానైతే ఆ భవిష్యత్తును ఆయన ఎప్పుడు ఏ విధంగా ఆవిష్కరించగలడో నాకు తెలియదు.

ఓ రోజు సాయంత్రం మా బాబాయి నాకు కబురు పెట్టాడు. వెళ్ళగానే ఆదరణ వాక్యాలతో ఉపచరించాడు. మాటల సందర్భంలో "చూడు శేఖరం! నే నింతవరకూ ఎవరితోనూ సంప్రదించలేదనుకో! అమ్మాయికి వీలైనంత త్వరగా పెళ్ళి చేయాలనుకొంటున్నాను. నీ అభిప్రాయమేమిటి?" అంటూ సూటిగా ప్రశ్నించి సీటుగా కుర్చీలోకి వాలిపోయాడు.

నేను తబ్బిబ్బు పడిపోయిన మాట నిజం! పుట్టిన తర్వాత ఇంత కాలానికి మా బాబాయికి ఓ నరమానవుడి సలహా కావలసి వచ్చినదంటే ఆ మాట నెమ్మనాన నమ్మదగింది కాదు. అమ్మాయిని తీసుకెళ్ళి ఓ కట్టు కూసానికి కట్టబెట్టినా అదే తమ బావమరిది అనుకోడానికి మా బాబాయిగారి కుమారపంచకం తయారు! తన మొగుణ్ణి తానే ఎన్నుకో కలిగేపాటి వయస్సు, చొరవ, తెలివితేటలూ లీలావతి కేలాగూ లేనేలేవు. మా బాబాయికి సలహా ఇవ్వగలిగినంతగా ఈ మధ్య నాలో వివేకం పరిణతి చెంది ఉంటుందన్న నమ్మకం కూడా నాకు బొత్తిగాలేదు. కాగా పోగా కుర్రవాడికి కాస్తా పెద్దరికమిచ్చి మన్నన చేయాలనుకుంటున్నాడేమో మా బాబాయి...

నా ఊహ నిజమే! మా బాబాయి ఒకరి సలహాకోసం పడిగాపులుబడి కూర్చోలేదు. ఆ దశను దాటుకొని ఆయన ఆలోచన ఎంతో దూరం ముందుకు సాగిపోయింది.

"నా ఎరుకలో ఓ మంచి సంబంధం ఉంది శేఖరం!"

ఉలికి పడ్డాను. "ఉందా బాబాయ్? ఇంకేం? శుభస్య శీఘ్రం అన్నారు కానిచ్చేయకూడదూ?" అన్నాను. అన్నానా? నా అభిప్రాయానికి విరుద్ధంగా నేనలా అనడమేమిటి? మా బాబాయిలోని ఏదో బలీయమైన శక్తి నా నోటంట అలా అనిపించి వుంటుంది.

"కుర్రాడు ఎస్సెల్సీదాకా చదువుకున్నాడు..."

ఆ తరువాత చదువుకోడానికి ఏముంది? ఏమీ లేదు. పరీక్షల తుఫానుల్లో నుంచీ చదువుల సముద్రాన్ని అవతలి గట్టుదుకా ఈది, గడిచి గట్టెక్క గలిగాడు. గనుకనే ఆ కుర్రవాడు మా బాబాయికి అల్లుడు కాగలిగిన అవకాశానికి నోచుకున్నాడు.

"ఇంతవరకూ నిరుద్యోగేననుకో! కాని ప్రయత్నిస్తే ఆదిలోనే గెజిటెడ్ ఉద్యోగంలాంటి దేదైనా దొరక వచ్చు..."

అయితే ఇప్పుడిప్పుడే ప్రయత్నించక పోవడం మంచిది. వరవిహీనపు పెళ్ళికొడుకు లాగా పెళ్ళిచేసుకోక ముసుపే గెజిటెడ్ ఆఫీసరు కావడమేమిటి?

"కుర్రవాడికి చెప్పుకోదగిన పెద్ద దిక్కెవరూ లేరు. ఓ తల్లిమాత్రం ఉంది. ఆవిడ కూడా కాటికి కాళ్ళు సాచుకున్న ముసల్ది..."

బాబాయి దృష్టిలో మంచి సంబంధానికి కనీసపు అర్హతలేమిటో నాకు క్రమ క్రమంగా అవగత మవుతున్నాయి.

"ఆ కుర్రాడి దగ్గర్నుంచి ఈ రోజే ఓ ఉత్తరం అందుకున్నాను. వచ్చి అమ్మాయిని చూచుకోవాలట!"

"ఇది మరీ బాగుంది! అమ్మాయిని చూడ్డం గూడానా బాబాయ్! అంతగా అవసరమైతే సంధ్యాదీపాన్ని, చంద్రబింబాన్ని, శతపత్ర సుందరినీ చూచుకోమని వ్రాయలేక పోయావా?" అన్నాను. మా బాబాయి మనసులోని ఉల్లాసానికొక చక్కిలిగింత పెట్టాలని నా ప్రయత్నం.

ప్రయత్నం ఫలించింది. కొండరాతి దగ్గర ప్రవాహంలా మా బాబాయి ముఖంలో ఆనందం నురగలు కట్టింది. "కుర్రకుంక! వాడికంత ఘాటుగా వ్రాయడ మెందుకు లేరా శేఖరం! రేపు శుక్రవారం గాక మళ్ళీ వచ్చే శుక్రవారం నాటికి దినశుద్ధి బాగా ఉందనీ, వచ్చి చూచుకో దలచుకుంటే మన అభ్యంతరమేమీ లేదనీ ఈ రోజు టపాకే ఓ కార్డు ముక్క వ్రాసి పడేశాను..." అన్నాడు బాబాయి.

తాను సూత్రధారిగా ఇదివర కెప్పుడో ప్రారంభించిన నాటకానికి నన్నొక ప్రేక్షకుడుగా ఆహ్వానిస్తున్నాడన్నమాట మా బాబాయి! నాకు ఆశాభంగం కలిగిన

మాట వాస్తవం. మా బాబాయి నాటకాల్లో మచ్చుకొకదానిలోనైనా నాకొక చిన్న పోర్షన్ లభిస్తే బాగుండునన్నది నా చిరకాల వాంఛ. ఆ ఆశ ఈ దఫాగూడా అడియాసే అయిపోతూంది...

కానీ ఘటనాఘటన సమర్థుడు మా బాబాయి. అంతలో నా ఆశకు జీవం పోశాడు.

"నాకు పంచపాండవుల్లా అయిదుగురు కొడుకు లున్నారనుకో శేఖరం! కానీ ఏం లాభం? ఒక్కడూ అక్కరకు పనికి రాడు. అమ్మాయి పెళ్ళంటే అది కాస్తా వెనకా ముందూ చూచుకోవలసిన వ్యవహారం. ఇందులో నీ తోడ్పాటు నాకు చాలా అవసరం!"

నా తోడ్పాటా! బాబాయి కవసరమా? నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను.

"నిజమేరా శేఖరం! చదువుల్లో ఏముంది? ఖర్చుకు తట్టుకోగలిగితే ఎమ్మే కావడం కష్టం కాదు. ఇక సిరిసంపద లంటావా? ఎవరో తాత ముత్తాతలు గడించి పెట్టిపోతే అందులో వీడి నిరవాకం ఏముంటుంది? చదువు సంగతీ, ఆస్తిపాస్తుల సంగతీ అలా ఉంచు. మనిషికి ముఖ్యంగా కావలసింది ప్రయోజకత్వం. అవతలి మనిషి చూపులకోసం వస్తే, ఇవతలి వాళ్ళు కళ్ళు మూసుకుని కూర్చోవాలని అర్థం కాదు. బంగారంలాంటి అమ్మాయి నిస్తున్నామా? పదివేల రూపాయల కట్నం పోస్తున్నామా? సరకు నాణెం తెలుసుకోకుండా పిల్లనిస్తారా ఎవరైనా? కుర్రాణ్ణి కాస్తా కదిలించి లోతులు ఆరా తీయాలి. మనిషిలో యే మాత్రం చేవ ఉందో కనుక్కోవాలి."

అమ్మో, ఏమిటో అనుకున్నానుగానీ బాబాయి నాటకంలో నాది కీలక పాత్ర! జ్వరమాపకంతో టెంపరేచరును నిర్ధారించినట్టుగా ప్రయోజకత్వాన్ని కొలవ డానికి మా బాబాయి నన్నొక సజీవ సాధనంగా వాడుకోదలచుకున్నాడు. జీవిత నాటకంలో ఎప్పుడు ఏ పాత్ర లభించినా అందుకు సిద్ధంగా ఉండాలి మానవుడు! వెనుకాడితే పెదవి విరచి నువ్వు పనికిరావని తేల్చేస్తారు డైరెక్టర్లు. నలుగురైదుగురు డైరెక్టర్లు అలా తేల్చి పారేసిన తర్వాత నటుడికి నేలపైన నూకలు గూడా పుట్టవు.

* * *

దినశుద్ధి బాగున్న శుక్రవారం రానే వచ్చింది. అబ్బాయి గూడా విచ్చేశాడు.

అతడికి పాతికేళ్ళుంటాయి. బక్కపలచటివాడు. తెల్ల జామపండు వంటి దేహచ్ఛాయ. అందమైన క్రాపింగు ముచ్చటైన ముఖారవిందం. నలగని దుస్తులు. కస్తూరిబొట్టు పెట్టి, తలకు పాగా చుట్టి, మెడకొక పూల దండ తగిలిస్తే అతడప్పటి కప్పుడే పెళ్ళికొడుకై పోయేటట్టున్నాడు.

బంగారంలాంటి పిల్ల. పదివేల రూపాయల కట్నం. ఈ ఊహల సులోచనాలలో నుంచీ చూస్తే అతడు టెక్నికలర్ చిత్రంలో హీరోలా మరింత భువనమోహనంగా గూడా ఉన్నాడు.

అన్నట్టు అతగాడి పేరు రఘుపతి.

రఘుపతి పుణ్యమా అని నాకాపూట మా బాబాయిగారింట్లో షడ్రసోపేతమైన విందు భోజనం. భోజనానంతరం విశ్రాంతి. సేదదీరి లేవగానే మళ్ళీ టిఫిన్, రఘుపతి కెలా ఉందోగానీ నామట్టుకు నాకు మత్తుగా వుంది. నేనలా మత్తులో వుండగానే పెళ్ళిచూపుల తతంగం ప్రారంభమైంది. పచ్చటి చీరకట్టుకుని, తెల్లటి జాకెట్టు తొడుక్కున్న లీలావతి తామరాకు పొత్తర్లలో నారద మహర్షి దివినుంచీ భువికి తెచ్చిన పారిజాత పుష్పంలా వుంది. సదరు పారిజాత పుష్పం తాలూకు పరిమళంలా లీలావతి వీణాగానం మధురాతి మధురంగా విస్తరిల్లుతూంది. అందరి చూపులూ అమ్మాయిపైన! బాబాయి చూపులు మాత్రం నిర్విరామంగా అబ్బాయిని అజమాయిషీ చేస్తున్నాయి. ఉదయం తొమ్మిదిగంటల కనగా వచ్చాడు రఘుపతి. అప్పటినుంచి అతడి పెదవుల కవాటాల్ని తెరచుకొని బయటపడిన మాటలన్నిటినీ లెక్కించుకొని సరాసరి లెక్కవేస్తే అతడు గంట కొకటి రెండు మాటలు మాట్లాడి వుంటాడు. అవిగూడా — అవును, కాదు, ఓహో, అలాగా, నిజమే— లాంటి పొడి మాటలు. లీలావతి పాడుతూంది. ఎల్లోరా గుహాలయంలో గంధర్వుడి శిల్పంలా నిశ్చలంగా కూర్చున్నాడు రఘుపతి. ఆనందమో, పరవశత్వమో, నిర్లిప్తతతో ఫలానా భావమని అంతుచిక్కడం లేదుగానీ, మొత్తంపైన అది చెక్కు చెదరని గంభీర ముద్ర!

వారగా పిలిచి ఆ గంభీర ముద్రకు వ్యాఖ్యానం చెప్పమన్నాడు బాబాయి! ఏమని చెప్పను? మౌనం మహనీయుల లక్షణమని చెప్పనా! లేక మూఢ మానవులకు భూషణమని చెప్పనా ?

దీప దీపాలవేళ. షికారు వెళ్ళి రమ్మన్నాడు బాబాయి? "షికారుకా? సరే,

పదండీ" అన్నాడు రఘుపతి దారిలో మాటలు లేవు. ఊరు దాటుకుని విజన ప్రదేశంలో ఓ బండపైన కూర్చున్నాము.

"మీకేమైనా హాబీ లున్నాయటండీ?" అంటూ ప్రసంగానికి ఉపక్రమించాను.

"హాబీలా! అవి నా కెందుకండీ?" అన్నాడు రఘుపతి – అప్పటికవేమో అంటరాని అప్రాచ్యపు వస్తువులైనట్లు! "పోనీ పుస్తకాలు చదువుతారా?" అన్నాను. "పుస్తకాలు ప్రకటించడంలో పబ్లిషర్ ఉద్దేశ్యం మన బోటివాళ్ళు చదవాలనే గదండీ!" అన్నాడు అమాయకంగా రఘుపతి. "సినిమాలు చూస్తారా?" అన్నాను. "చూడకపోతే ఎలాగండీ! మా ఊళ్లో ఏడెనిమిది థియేటర్లున్నాయి. మనం చూడకపోతే వాళ్ళ గతేం కావాలి?" అంటూ శాలిని ఒలకబోశాడు రఘుపతి. ఎలాంటి రచన రుచిస్తుంది? ఎవరి నటన బాగుంటుంది?– మొదలైన ప్రశ్నల గొలుసుకట్టుతో ప్రసంగాన్ని సాగదీశాను. సాగదీసుగా నాకు తెలిసిన విషయం ఒక్కటే –రఘుపతి ఏ ప్రశ్నకూ సజావుగా సమధానం చెప్పడు!

చెప్పడా? చెప్పలేడా?– అదే నా సందేహం.

ఆకాశాన నక్షత్రాలు, ఊళ్ళో విద్యుత్‌దీపాలు వెలుగుతున్నాయి. తేమగా ఉన్న భూమిపై నుంచి తడితడిగా గాలి వీస్తుంది. మాటల మధ్యలో వుండి వుండి దగ్గుతున్నాడు రఘుపతి. ఒకసారి రెండు నిమిషాలదాకా అతడు దగ్గును నిలుపు కోలేక పోయాడు. "రాత్రంతా రైలులో ప్రయాణం చేశాను గదండీ? కిటికీలోంచి వెలుపలికి చూస్తూ కూర్చోవడం నాకో అలవాటు! రాత్రి వీచిన చలిగాలంతా నా పాలే అయింది. తెల్లవారేసరికి ముక్కులు మూసుకుపోయాయి. అమాంతంగా జలుబు పట్టేసింది" అంటూ అతడు తన అనారోగ్యానికొక సంజాయిషీ గూడా చెప్పుకున్నాడు.

ఇంటి కెళ్ళగానే భోజనాలు వడ్డించేశారు. హాల్లో వరుసగా మూడు మంచాలు వేయించాడు బాబాయి. పడుకున్న అయిదు నిమిషాలకే రఘుపతి ముసుగు బిగదన్నుకున్నాడు. అతడు ఆవులిస్తాడేమోనని బాబాయి పాపం ఓపి నంత సేపు కాచుకుని కూర్చున్నాడు. ఆవులించలేదు. సరికదా, పల్లు పలకరించ కుండా నిద్రపోసాగాడు రఘుపతి.

బాబాయి ప్రేవులు లెక్కబెట్టడానికి వీల్లేకపోయింది.

హఠాత్తుగా మేలుకున్నాను. ఇంకా తెల్లవారలేదు. చీకట్లో నీడలా కూర్చుని

మంచం నవార్లు కదిలిపోతూండగా దగ్గుతో సతమతమవుతున్నాడు రఘుపతి. నేను మేలుకున్న కాస్సేపటికి బాబాయి కూడా మేలుకొని మంచం దిగి లైటు వేశాడు. పిన్నిని పిలిచి నీళ్లు కాచుకు రమ్మన్నాడు. పెట్టె తెరిచి మాత్ర తీసుకొచ్చాడు.

"గడిచిన రాత్రంతా రైల్లో ప్రయాణం చేశాడా బాబాయ్? చలిగాలి తగిలి జలుబు పట్టింది. కొత్తనీళ్ళు త్రాగడంతో ఆ జలుబులో నుంచే దగ్గు పుట్టుకొచ్చింది. ఏం చేస్తుంది? గుక్కెడు మందు త్రాగతే అదే పోతుంది..." అన్నాను.

కానీ బాబాయికి నా మాటలపైన నమ్మకం కలిగినట్లు లేదు. ఆయన అనుమానంగా నావైపు చూచి మళ్ళీ అదే అనుమానంతో రఘుపతి కేసి చూడసాగాడు.

* * *

రఘుపతి పెళ్ళి చూపులకోసం వచ్చి వెళ్ళిపోయిన తర్వాత నిండుగా నాలుగు మాసాలు గడిచిపోయాయి. వెళ్ళుతూ వెళ్ళుతూ స్పష్టంగా తన అంగీకారాన్ని ప్రకటించివెళ్లాడు రఘుపతి. అందువల్ల పెళ్ళి విషయంలో జరిగిన ఈ నాలుగు మాసాల విలంబనానికి రఘుపతిని కారకుడుగాభావించడానికి వీలయింది కాదు.

నాలుగైదు సార్లు బాబాయిని అడిగి చూచాను. అడిగినప్పుడల్లా ఆయన "పెళ్ళికదా! వెనుకాముందూ చూచుకోవాలి గదా!" అని సాగదీస్తూ వచ్చాడు.

చివరి కొకసారి "ఆ అబ్బాయి నీకు నచ్చలేదా ఏమిటి బాబాయ్?" అని నిలదీసి అడిగాను కూడా. ఆయన చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

కారణ ఏమయితేనేం? బాబాయి ఆ సంబంధంపట్ల సుముఖంగా లేడని అనుకోవలసి వచ్చింది. ఏవో వైమనస్యాలవల్ల ఒక్కొక్కప్పుడు పీటలపైకి వచ్చిన పెళ్ళిళ్ళే ఆగిపోతూ ఉంటాయి. వాటితో పోల్చిచూస్తే ఇదెంతో నయం! అదీగాక మానవుడి నిర్ణయాలన్నిటిపైనా నుదుటిరాత అన్నదొక్కటి ఉండనే ఉంది! అదెలా ఉంటే అలా జరుగుతుందనుకోవడం ఆలోచనలకన్నింటికీ హద్దు. నా ఆలోచన కూడా ఆ హద్దు దగ్గరే ఆగి పోయింది.

అనుదిన వ్యాసంగాల అలజడిలో కాలనిర్ణయం లేకుండా వాయిదా పడినట్టు తోచిన లీలావతి పెళ్ళి సంగతి విస్మరించి నా గొడవల్లో నేనుండగా ఓ రోజు రాత్రి యెనిమిది గంట లప్పుడు సుడిగాలిలా విరుచుకు పడ్డాడు బాబాయి.

"అదేమిట్రా శేఖరం? అవతల నేను పెళ్ళి ఏర్పాట్లలో సతమతమై పోతూం డగా ఒకసారి ఇంటిదాకా వచ్చే ఓపరికమైనా లేదా నీకూ? ఇదేనా నువ్వుచేసే తోడ్పాటు?" అని రుసరుసలాడుతూ కుర్చీలో కూర్చున్నాడు.

సైడు యాక్టరు చక్కగా నటించకపోతే రంగస్థలం పైన ప్రముఖ నటునికి చిరాకు కలగడం సహజం! అందుచేత నేనుకూడా నా పాత్రను సక్రమంగానే నిర్వహించదలచుకున్నాను.

ఉత్తపుణ్యానికి నా మీద అపవాదు వేస్తే నీకు పాపం చుట్టు కుంటుంది బాబాయి! పెళ్ళిచూపుల తర్వాత నువ్వు మనసు విడిచి నాతో మాట్లాడిందెప్పుడు? నువ్వు పెళ్ళి ఏర్పాట్లు చేస్తున్నావని నాకేం తెలుసు?" అంటూ నేను ముఖం ముడుచుకున్నాను.

లాలనగా నావైపికి ఓ సాదరపూర్వకమయిన దరహాసాన్ని వెదజల్లాడు. బాబాయి.

నువ్వింతటి అమాయకుడి వనుకోలేదురా శేఖరం! ఈ నాలుగు మాసాలుగా నేను గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నా ననుకున్నావా నువ్వు! నీకు తెలియకుండా ఎంత కథ జరిగిందీ, ఏం కథా......"

ఆ కథా, కమామీషూ వినాలనే ఉంది నాకు. కానీ కుతూహలం వ్యక్త పర చవలసిన అవసరం లేకపోయింది. చెప్పడానికే వచ్చాడు బాబాయి.

"ఆ అబ్బాయి వచ్చి వెళ్ళిపోయాడా శేఖరం? వెంటనే ముహూర్తం పెట్టించ మని మీ పిన్ని కూడా గోల పెట్టింది. కానీ నాకు మాత్రం అడుగు ముందుకు పడింది కాదు. సందేహం కలగనే కూడదు, కలిగితే అది నివృత్తి అయేదాకా నాకు నిద్ర పట్టదు. ఆ కుర్రవాడు బక్కపలచటివాడు. దగ్గుతున్నాడు. అందుకేదో కారణం కూడా చెప్పుతున్నాడనుకో. కానీ యెలా నమ్మగలం చెప్పు? నువ్వెప్పుడైనా కోడెల బేరం చూశావా శేఖరం? బేరగాడు పలువరుస చూస్తాడు. రొమ్ము వాటం చూస్తాడు. ఒంటిపై సుళ్ళున్నాయేమో చూస్తాడు. ఇన్నీచూచిన తర్వాత ఓ మోపెడు గడ్డివేసి వాటి భోజన పుష్టిని పరిశీలిస్తాడు. మహాచేస్తే అయిదు వందలు చేయని ఎద్దుగొడ్లకే ఇన్ని పరీక్షలు ఉండగా తంచనుగా పదివేలు పోస్తూ మనం మెహమాటాలకు పోవడం ఏం సబబు? వెయ్యిరకాలుగా ఆలోచించి ఆఖరుకు నేనొక నిర్ణయానికి వచ్చాను. ఇందువల్ల సంబంధం బెడిసిపోయినా సరే అందుకు నేను

సిద్ధపడ్డాను. వీడుకాకపోతే వీడిని తలదన్నేవాడింకొక డనుకున్నాను. తెగించి ఓ ఉత్తరం వ్రాసేశాను..."

"ఏమని వ్రాశావు బాబాయ్?" విస్మయంతో ప్రశ్నించాను.

"ఏముందీ?—ఇదిగో అబ్బాయ్! సందేహం ప్రాణసంకటం అంటారు. నాకిలాంటి సందేహం కలిగింది. దీన్ని నివృత్తిచేసే బాధ్యత నీది. మరేంలేదు. ఒకటి రెండు ఎక్సరే ఫోటోలుతీసి పంపిస్తే చాలు— అని వ్రాశాను. వ్రాసిన పదో నాటికల్లా నాచేతిలో ఫోటోలున్నాయి...."

కృష్ణపరమాత్ముడి విశ్వరూపం ఎదుట మ్రాన్పడిపోయిన కౌరవ రాజన్య నివహంలా మా బాబాయి బుద్ధిబలం ఎదుట నేను రిచ్చపడిపోతున్నాను.

"సరే—మన డాక్టరు దామోదరం లేడూ శేఖరం? పరిశీలనార్ధం ఫోటోలను ఆయన దగ్గరికే తీసుకెళ్ళాను. ఆయన పరీక్షించి చూచి "ఏమిటండీ మీరు మరీనూ! అప్పటం అపరంజిలాంటి ఆరోగ్యవంతుడిపైన అపోహను రగిలించుకోవడం తగునా మీకు?" అంటూ కోపగించుకో పోయాడు."

తలపైనుంచీ పెద్ద భారాన్ని ఎవరో దించుకున్నట్టుగా నేను వేడిగా నిట్టూర్చాను. కొద్ది నిమిషాలకు మునుపు నా కళ్ళ ఎదుట గిర్రున తిరగ సాగిన ప్రపంచం మళ్ళీ యథాస్థితికి వచ్చినట్టయింది. బాబాయి మాత్రం చెక్కుచెదరకుండా తన ప్రసంగాన్ని కొనసాగిస్తున్నాడు.

"అంతలో ఏమైంది శేఖరం? రసవత్తరమయిన కథంతా ఇకముందే ఉంది. మనిషి కేమీ జబ్బులేదని నిర్ధారించుకున్నామనుకో! కానీ మనిషి లోపలి మనసు సంగతేమిటి? ఆ అబ్బాయి వస్తుతః ఎలాంటివాడు? పుట్టు పూర్వోత్తరాలెలాంటివి? వాకబు చేయసాగాను. చేసినకొద్దీ కొత్త కొత్త విషయాలు బయటపడసాగాయి. వీళ్ళ పెదనాన్న ఒకతను పేకాటలో కొంపముంచుకున్నాడు. వీళ్ళ మేనమామ కట్టుకున్న పెళ్ళానికి విడాకులిచ్చేశాడు. వీళ్ళనాన్నగూడా సన్యాసుల వెంట, మఠాలవెంట తిరుగుతూ సంసారం పైన అట్టే పట్టింపులేకుండా కాలం వెళ్ళబుచ్చేశాడు. మరైతే ఈ అబ్బాయి ఎవరి స్వభావాన్ని పుణికి పుచ్చుకున్నాడు? కూపీ తీశాను. ఒకరు చెప్పినట్టు మరొకరు చెప్పలేదు. అతడి కాలేజీ సహపాఠకుడొకడు 'వాడికి పిల్లనిస్తారా! మితికి మించిన సాధు గర్వితనం ఉందండీ వాడిలో!' అన్నాడు. ఆ కుటుంబంతో బాగా పరిచయమున్న మరొక పెద్ద మనిషి 'నన్నేం

చెప్పమంటారండి? ముఖమేమో పద్మదళాకారం. పలుకేమో చందనశీతలం. హృదయం సంగతి నాకేం తెలుసు?' అన్నాడు. తేనెలోపడ్డ ఈగ చందమయింది నా పని. మతిపోయినంత పనైంది. వారం పది రోజులు అదేపనిగా ఆలోచిం చాను..."

అబ్బో, బాబాయి ఆలోచన! ముద్గరం, శూలం, కుంతం, కరవాలం లాంటి యుద్ధోపకరణాలు దాని ఎదుట బలాదూరు, అదీసారి ఏం చేస్తుంది? ఏం చేస్తుందో గానీ నా గుండె మాత్రం గుబగుబలాడుతూంది.

"నా ఎరుకలో చూచి రమ్మంటే కాల్చిరాగల మెరికెల్లాంటి మనుష లిద్దరున్నారు వాళ్ళను పిలిపించి దారి ఖర్చులకు, దిన భత్యాలకు డబ్బు లిచ్చాను. ఒప్పగించిన పనిని సక్రమంగా నెరవేరిస్తే ఈనాం గూడా ముట్ట జెబుతానన్నాను. వాళ్లా ఊరికి వెళ్ళి రెండు వారాలపాటు అక్కడే ఠికాణా వేయాలి. ఆ కుర్రాడి ప్రతి కదలికనూ కనిపెట్టాలి. అతడు సాధారణంగా ఎలాంటి వారితో కలుస్తాడు? ఏ విధంగా కాలక్షేపం చేస్తాడు? సన్నిహిత సమాజంలో అతడి కున్న పేరు ప్రతిష్ఠ లెలాంటివి?... క్షుణ్ణంగా ఆచూకీ తీయమన్నాను..."

నా స్మృతిపథంలో షెర్లాక్‌హోమ్స్, పెర్రీమేసన్, హెర్‌క్యూల్ పొరెట్ లాంటి సుప్రసిద్ధ అపరాధ పరిశోధకులు మెదులుతున్నారు. ఆ రంగంలో ప్రవే శించ లే దంతేగానీ, మా బాబాయి వాళ్ళకేమాత్రం తీసి పోడు!

"చెప్పవలసిందంతే శేఖరం! వాళ్లు తిరిగి వచ్చేశారు. వాళ్లు సేకరించిన భోగట్టాతోబాటు ఆ కుర్రవాడి నడత గూడా నాకు సంతృప్తికరంగా తోచింది. "— ఉపసంహారంలోకి వచ్చేస్తున్నాడు బాబాయి. "అమ్మాయి నివ్వడానికి అంగీకారం తెలుపుతూ జావాబు వ్రాశాను. బదులు రాగానే ఆచార్లు గారి దగ్గరికి వెళ్ళి ముహూర్తం పెట్టించాను. పైనెల్లో అమావాస్య పోయిన పంచమినాడు సూర్యోదయాత్పూర్వం దివ్యమయిన లగ్నం ఉంది. రేపు సాయంకాలానికల్లా ఇన్విటేషన్లు అచ్చవుతాయి. కుమార రత్నాలు బంధువులతో కలిసి సరిగ్గా పెళ్ళినాటికే హాజరవుతారేమో తెలి యదు. ఎటు చూసినా నాకు చేదోడు వాదోడుగా ఉండగలిగిన వాడివి నువ్వొక్కడివే కనిపిస్తున్నావు. నువ్వు స్కూలుకు పదిరోజులు సెలవు పెట్టాలి."

ఆఖరి వాక్యం చెబుతున్నప్పుడు బాబాయి ఇంట్లో లేడు. రోడ్డుపైన ఉన్నాడు.

* * *

ఆకాశమంత పందిరి, భూదేవంత వేదిక గాకపోయినా, కడకాకికి గూడా నేతివంటకాలే మిగలకపోయినా ఉన్నంతలో ఘనంగానే జరిగింది పెళ్ళి. వివాహానంతరం వారం రోజులకే లీలావతి కాపురానికి వెళ్ళిపోయింది.

ఒకటి రెండు రోజులు మాత్రం ఎలాగో ఓపిక బిగపట్టగలిగాడు బాబాయి. మూడోనాటి ఉదయం నుంచీ ఆయన పోస్ట్‌మన్‌కోసం వేచి చూడసాగాడు. ఎలా ఉందో అమ్మాయి? క్రొత్త వాతావరణంలో దిగులుపడి పోయిందేమో? అత్తగారి అధికారం క్రింద కోడంటికం అనుభవిస్తున్నదేమో...కుమార్తె యోగక్షేమాలు తెలుపవలసిందని కోరుతూ ఆయన రెండు రోజుల కొకటి చొప్పున అల్లుడికి ఉత్తరాలు వ్రాయసాగాడు. కానీ ఆయన శ్రమంతా 'వన్‌సైడ్ ట్రాఫిక్' అయిపోయింది. అల్లుడి దగ్గరి నుంచీ ప్రత్యుత్తరమే లేదు.

ఆఖరికొక సుదీర్ఘమైన ఉత్తరం వ్రాయడానికి పూనుకున్నాడు బాబాయి. ఆ బిడ్డను మోయడం, కనడం దగ్గరనుంచీ ప్రారంభించి, మమకారాలకు ఆకరముగా పెంచడం, ముద్దు ముచ్చటలకు హద్దుగా ప్రేమించడం మున్నగు విషయాలను వివరించి, చిట్టచివరకు తమ బిడ్డపైన అంతగా ప్రాణాలను పెట్టుకున్న తల్లి తండ్రులు కుమార్తె క్షేమాలను గురించి ఓ కార్డుముక్కైనా నోచుకోక పోవడం హృదయ విదారకమని మరీ మరీ వాపోయాడు.

"నా అంబులపొది ఖాళీ అయిపోతూందిరా శేఖరం! చివరి దిదే...బ్రహ్మాస్త్రము! దీనికి గూడా బదులు లేకపోతే, ఇక ఆశలు లేనట్టే!" అంటూ ఆయన కుర్చీలో క్రుంగిపోయాడు.

ఈ ఉత్తరానికి తిరుగు టపాలోనే ప్రత్యుత్తరం వచ్చింది. కానీ వచ్చినదాన్ని ప్రత్యుత్తరమనడం చప్పగా ఉంటుంది. బాబాయిది బ్రహ్మాస్త్రమైతే అందుకు బదులుగా వచ్చింది బ్రహ్మ శిరోనామకాస్త్రం!

"ప్రియమైన మామగారికి నమస్కారానంతరం రఘుపతి వ్రాయునది...

తపాలా శాఖవారి సౌజన్యంవల్ల మీ జాబులన్నీ సక్రమంగా చేరుతున్నాయి. వాటిలో మిగిలినవన్నీ ఒక ఎత్తు అయితే చివరి జాబుమాత్రం ఒక ఎత్తు. అందులో కన్న కూతురుపట్ల తల్లిదండ్రుల అనురాగాతిశయాన్ని గురించి మీరు వ్రాసిన ఆణిముత్యాల లాంటి మాటలను ఒకటికి రెండుసార్లుగా చదువుకున్నాను. మీ కుమార్తెకు గనుక ఒక కుమార్తె గలిగితే ఆ బిడ్డను పెంచి పెద్ద జేయడంలో మీ

సలహాలను, సూచనలను అక్షరాలా పాటించగలనని హామీ ఇస్తున్నాను. కానీ ఆడబిడ్డకు బదులుగా మీ అమ్మాయికి మగబిడ్డ కలిగితే వాడికి మాతామహుడి లక్షణాలు రాకుండా ఉండాలని మాత్రం భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

మీకు కోపం రావచ్చు. ఎవరి కోపం వాళ్ళకే శత్రువు. కనుక శాంతంగా సావధానంగా నా యీ మనవి మాటల్ని అవధరించగలరని కోరుతున్నాను.

పితృపంచకంలో పిల్లనిచ్చిన పెద్ద మనిషిగూడా ఒకడని శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ విధంగా మీరు నాకు పూజ్యులు. కాని ఆ పూజ్యభావాన్ని అటుంచి నిర్మొహమాటంగా ఆలోచించినట్టయితే మీలో తోడి మానవులు సహించడానికి వీల్లేని అవగుణాలు కొన్ని ఉన్నాయని తెలియజేయడానికి మిక్కిలి విచారిస్తున్నాను.

ఎంతోకొంత తెలివి తేటలతో భగవంతుడు ప్రతి మానవుణ్ణి ఈ భూలోకం పైకి పంపుతున్నాడు. ఉన్న తెలివి తెటలతో జీవితాన్ని సుఖప్రదంగా మలచుకోడానికి ప్రయత్నించడం మానవ సహజం. కానీ లోకంలో ఉన్న తెలివి తేటలన్నీ తమకే ఉన్నాయనీ, మిగిలిన వాళ్ళందరూ బొత్తిగా తెలివిమాలిన వాళ్ళనీ భావించడం. ఈ ఊహకు అనుగుణంగానే ప్రవర్తించడం...ఇది అనాదిగా కొందరు మానవుల్ని అంటిపెట్టుకొని వున్న అజ్ఞానం. ఈ అజ్ఞానం మీలో పుష్కలంగా ఉంది.

వివాహ నిర్ణయాలు పై లోకంలో జరుగుతాయంటూ ఒక సామెత ఉంది. ఈ శైలాంభోనిధి జంతు సంయుతమైన ధరాచక్రం గూడా తమ ఇష్టాయిష్టాలకు అనుగుణంగానే పరిభ్రమిస్తున్నదని అనుకోగలిగిన బుద్ధిమంతులకు ఇదొక చాదస్తపు మాటగానే తోచవచ్చు. చాతుర్యాన్నంతా వెచ్చించి మీ కుమార్తెకొక మంచి సంబంధాన్ని కుదుర్చుకోగలిగినట్టు భావిస్తుంటారు మీరు! కానీ నేను పంపిన ఎక్స్‌రే ఫోటోలు నాకు సంబంధించినవి కావని చెబితే మీరేం చేస్తారు?

రాజ్యాంగ సూత్రాల ప్రకారం నేరం చేయని వాడిపైన నేరాన్ని ప్రతిపాదించడం నష్టపరిహారం కోసం కోర్టుదాకా లాక్కెళ్ళే వ్యవహారం. ఏమి నేరం చేశానని నాపైకి సి.ఐ.డీ. లను పంపుతారు మీరు? మీ అమ్మాయిని పెళ్ళాడడానికి అంగీకరించడమేనా నా నేరం?

పోనీ...ఈ నేరస్థుడి ఆంతరంగిక జీవితాన్ని శోధించడానికి మేయబోయి మెడ తగిలించుకోగల అలాంటి ప్రబుద్ధులకంటే మరి కొంచెం నాటురకం పత్తేదారులెవరూ దొరక్కపోయారా మీకు?

మీకు డబ్బుంది. డబ్బున్నదన్న నిబ్బరంతో మానవత్వానికి మూల కందాలైన అమూల్యమైన విలువల్ని మీరు అవమానిస్తారు. సుఖ జీవన సౌలభ్యం కోసం మానవుడు సృష్టించుకున్న ఒకానొక వినిమయ వస్తువు డబ్బు. మీరా డబ్బుకు వినిమయంగా మనుషులకు మనుషులనే కొనేయ వచ్చునని భావిస్తారు. మీ అమ్మాయి అందచందాలను, గుణగణాలను చూచి ఆమెను నేను సహధర్మిణిగా వరించి ఉంటానని మీరనుకోరు. మీ కట్నానికి కక్కుర్తిపడి, మీ అనుమానాల బోనులో నిల్చుని, మీ సందేహాల కన్నింటికీ సంజాయిషీ లిచ్చుకున్నానని ఊహిస్తారు. నేను మనిషిని వస్తువును కాను. నన్ను మీరు కొనలేదు, కొనలేరు. ఈ జాబుతో పాటు మీ పదివేల రూపాయలను మీకు చెక్కురూపంలో త్రిప్పి పంపుతున్నాను.

ఐతే వివాహం కాకమునుపే నేనెందుకు కట్నాన్ని నిరాకరించలేదని మీ కిక్కడొక సందేహం కలగవచ్చు. అందుకు కారణం చెబుతున్నాను. కట్నాన్ని నిరాకరించడం అదొక ఉదారాశయంగా భావింపబడుతున్న రోజులు గావు. అది వరుడి అనర్హతగా పరిగణింపబడుతున్న దుర్దినాలు. అజ్ఞాతంగా ఏదో భయంకరమైన లోపం దాగి ఉండకపోతే, వరుడెందుకు కట్నాన్ని కాలదన్నుకుంటాడని మీరే కాదు, మీతోబాటు లోకులు గూడా అనుమానిస్తారని నాకు తెలుసు.

చి. సౌం. కుం. లీలావతి కులాసాకేమీ లోటులేదు, లేదంటే అప్పుడప్పుడూ మీరు కళ్ళల్లో మెదులుతున్నారని చెబుతూంది. వీలు చూచుకుని మీరొకసారి అత్తగారితో సహా ఇక్కడికి వచ్చి పోగలిగితే మంచిది. లేదా మేమే అక్కడికి రాగలము.

ఇట్లు, మీ అల్లుడు,
రఘుపతి."

బాబాయి ముఖాన నెత్తురు చుక్కలేదు. కాళ్ళక్రింద నేల కరిగిపోగా ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్న కాందిశీకుడి ముఖంలో సైతం అలాంటి నిస్సహాయత కనిపించదు!

—'ఆంధ్రప్రభ' వారపత్రిక, 1958

# రేపటి ప్రపంచం

ఉగాది సందర్భంలో లలిత కళా పరిషత్తువాళ్ళు ఆంధ్ర వారోత్సవాలు ఏర్పాటు చేసి ఎక్కడో పల్లెలో వున్న నాకు కూడా ఆహ్వానం అందజేశారు. భోజన సదుపాయాలు చూచేవరకే తమ వంతనీ వసతి సౌకర్యాలు ఎవరికి వారే చూచుకోవాలనీ హెచ్చరిక చేశారు. నాలోని కళాప్రియత్వానికి నిదర్శనంగా కళా పరిషత్తులో చాలాకాలంనుంచీ, నాకొక సభ్యత్వం వుంది. కానీ ఈ దఫా నేను సభలకు వెళ్ళాలనుకోవడం నా సభ్యత్వపు రుసుము సద్వినియోగం కావాలని మాత్రమే గాదు, కరపత్రం ద్వారా ఈసారి సభలకు పరాంకుశంగారు రాబోతున్నారన్న వర్తమానం తెలియగానే నాకు కోసరి కోనలో వాన కురిసినంత సంబరం కలిగింది.

పాతికేళ్ళ నుంచీ నేను పరాంకుశంగారిని గురించి వింటున్నాను. ఆయన పెద్ద మేధావి. అయిదారు భాషలు ఆయనకు కొట్టిన పిండి. కవనం చెప్పడమేమో ఆయనకు కూసు విద్య, రచన చెయ్యడం అదొక హేలావిశేషం. పోగా ఉపన్యాసాలకు టికెట్లు పెట్టే సాంప్రదాయాన్ని ఆయన దగ్గర్నుంచీ మొదలు పెట్టవచ్చు. ఇష్టాగోష్టిగా మాట్లాడ్డానికి కూచున్నా సరే, నిమిష నిమిషానికీ ఒక ఛలోక్తి ఊడిపడవలసిందే. ఆయన విదేశాలు తిరిగి వచ్చిన మనిషి. ఈ పర్యటనానుభవాలు చెబుతుంటే శ్రోతలకు స్వయంగా తామే ఆ యా దేశాలకు వెళ్ళివచ్చినట్టుంటుంది. ఇదంతా ఆయన్ను గురించి నేను ఇతరులద్వారా తెలుసుకున్నది. పత్రికలో చదివి తెలుసుకున్నది. పరాంకుశంగారిని గురించి వింటున్నకొద్దీ, తెలుసుకొంటున్నకొద్దీ ఆయన్ను చూడాలన్న కోరిక నాలో బలపడుతూ వచ్చింది.

పరాంకుశంగారిపైన నాకు అభిమానం వుండవచ్చు. ఆ అభిమానం ఆరాధనగా కూడా పరిణమించి వుండవచ్చు. కానీ అందువల్ల ఆయన వ్యక్తిత్వంలో వున్న లోపాన్ని నేను కప్పిపుచ్చవలసిన అవసరమేమీ లేదు. మరేం లేదు, ఆయన త్రాగుతాడు, ఆయన త్రాగుతాడన్న విషయం తెలియని వాళ్లులేరు. మరొకటీ మరొకటీ గాదు, ఆయన అన్నీ హైక్లాస్ పానీయాలే పుచ్చుకుంటాడు.

అయ్యో! పరాంకుశంగారు త్రాగుతారు నిజమే. నేను మిమ్మల్ని నిలదీసి ఒక మాట అడుగుతాను. ఆయన తాగితే మీ దేం పోయింది. మీరేమైనా మీ డబ్బు పెట్టి ఆయనకు కొనిస్తున్నారా! లేదే! ఆయన తన డబ్బు తాను ఖర్చుపెట్టి, తన పొట్టలో తాను పోసుకుని, తన ఆత్మానందానికి తానే దారి వెతుక్కోవడం గూడా ఒక నేరమేనా? అయ్యలారా! ఆయన త్రాగి వచ్చింది విస్కీయా, బ్రాందీయా అన్న జిజ్ఞాస మీకెందుకూ? మీ పాటుకు మీరు ఆయన రచనా పటిమ చవి చూడండి! మరీ దగ్గరగా వెళ్తే దుర్గంధం భరించడం కష్టమే ననుకోండి. కానీ దూరంగా కూర్చుని ఉపన్యాసం వినొచ్చుగా! ఛత్, ఏం చాదస్తపు మనుషులండీ లోకులు?

ఆయన త్రాగుడుతో నాకు పని లేదు. ఆయనతోనే నాకు ప్రసక్తి. చేస్తున్న ఉద్యోగానికి నాలుగు రోజులు సెలవు పెట్టి హుటాహుటిగా పట్టణానికి బయల్దేరేను.

మార్గమధ్యంలో బస్సు చెడిపోయింది రిపేరు కావడానికి రెండు గంటలు పట్టింది. ఫలితం ఆలస్యంగా వెళ్ళడం. తీరా గమ్యస్థానం చేరుకొనేసరికి ప్రారంభోత్సవం జరుగుతోంది.

సభాభవనం ఇంకొక వందగజాల దూరంలో వున్నదనగా నా ఆత్రం కొద్దీ నేను అక్కడున్న వాళ్ళనెవరినో అడిగాను— "ఏమండీ! పరాంకుశం గారు వచ్చారా?" అని. "వచ్చేశారే! మాట్లాడుతున్నారు" అంటూ జవాబు విన వచ్చింది.

పరుగో పరుగు! మరు నిమిషంలో నేను హాల్లో వున్నాను.

దండిగా ఛాయాచిత్రాలు చూచి వున్నానేమో, పరాంకుశంగారు నాకొక అపరిచిత వ్యక్తిలా కనుపించలేదు. అనుదినం నాకళ్ళ ఎదుట తిరిగాడుతున్న వ్యక్తి లాగే కనిపిస్తున్నారు.

నేను హాల్లోకి వెళ్ళి నిలుచునే టప్పటికి పరాంకుశంగారు మొహంజొదారో శిథిలావశేషాలను బట్టి ఆనాటి మానవుడి చిత్తవృత్తిని, నాగరికతను మతింపు వేస్తున్నారు. అప్పటి సామాజిక స్థితిగతులను కళ్ళకు కట్టినట్లుగా వర్ణిస్తున్నారు. నాగరి

కత అన్నది ఒక కాలానికి పరిమితం కాదని ఆయన వివరిస్తున్నట్లుగా తరవాత నాకు తెలిసింది. సుఖశాంతులకోసం సాగించిన అన్వేషణలో మానవుడికి సంచార జీవనంకన్నా స్థిరజీవనమే శుభప్రదంగా తోచింది. ఆ విధంగా ఏర్పడినవే జన పదాలు. కాలక్రమాన ఈజిప్టులో పిరమిడ్లు లేచాయి. చైనీయులు మహాకుడ్యం నిర్మించారు. నాగరికతా ప్రస్థానంలో భవనాల నిర్మాణం ఒక మజిలీ. అలాగే సముద్రయానం ఇంకొక మజిలీ. మార్కోపోలో, కొలంబస్, వాస్కోడిగామాలాంటి వాళ్ళు జాతులకు మధ్య సేతువులు వేశారు. కానీ మానవులందరూ ఒకటే ననుకోటానికి వీల్లేకుండా అంతకు మునుపే మతాలు పుట్టుకొచ్చాయి. ఆదిలో జీవితాలను ఒక సక్రమ పద్ధతి క్రిందికి తీసుకురావడానికి తోడ్పడినవే మతాలు. కానీ మత దురహంకారంవల్ల ఎన్నెన్నో ఉపద్రవాలు పొడసూపాయి. సమాజాన్ని పరోక్షంగా మత గురువులున్నూ, ప్రత్యక్షంగా రాజులున్నూ పరిపాలింప సాగారు. దండయాత్రలు, యుద్ధాలు, అంతః కల్లోలాలు ప్రజ్వలించాయి. జాతి జీవనంలో ఎంతగా భద్రత లేకపోయినా, ఒకవైపున శాంతికాముకుడైన మానవుడు విజ్ఞానాన్ని సముపార్జించుకోడానికి, వినోదాన్ని సంతరించుకోడానికి ప్రయత్నిస్తూ వచ్చాడు. భాషలు, కళలు, శాస్త్రాలు మొదలైనవన్నీ ఆ ప్రయత్నంలో నుంచే పుట్టుకొచ్చినవి!

ఇలా మాట్లాడుతూ వచ్చి పరాంకుశంగారు పదివేల యేండ్ల వయసు కలిగిన నాగరిక మానవుడు ఈనాడు విశ్వరూపాన్ని ధరించి చంద్రమండలాన్ని అంది పుచ్చుకున్నాడని చెప్పగానే సభ కరతాళ ధ్వనులతో మారు మ్రోగి పోయింది. ఉపన్యాసం వింటున్న తన్మయత్వంలో ఒకరి వీపునింకొకరు బాదేయడం గూడా నేను గమనించాను.

నిజం చెప్పొద్దూ! రసభంగం కలిగించే వాళ్ళంటే నాకు చాలా అయిష్టం వెండి తెరపై సినిమా చూస్తుండగా నటీనటుల వ్యక్తిగత జీవితాలను గురించి అవాకులు, చవాకులు చెప్పుకునే వాళ్ళను చూస్తే నాకు మంటకొస్తుంది నా గ్రహచారం కొద్దీ ఈ సభలోకూడా అలాంటి ప్రబుద్ధుడొకడు అఘోరించాడు. ఏదో పెద్ద రహస్యం చెప్పదలచుకున్నట్లు అతడు దగ్గరగా వచ్చి "డోసు ఎక్కువగానీ, తక్కువగానీ అయినట్లు లేదు. పరాంకుశంగారు ఎంత బ్యాలన్స్‌డ్‌గా మాట్లాడారో చూశారా?" అన్నాడు.

ముఖాన చింతనిప్పు చల్లినట్లయింది. నాకు. మౌనంగా అతడివేపు కొరకొరచూచి, నా పాటుకు నేను దూరంగా వెళ్ళిపోయాను.

పరాంకుశంగారి ప్రారంభోపన్యాసం తరువాత గూడా అయిదారుగురి ఉపన్యాసాలున్నాయట! కానీ సభాసదుల్లో ఆ ఉపన్యాసాలు వినాలన్న పట్టింపు కనిపించలేదు. సగానికి సగం మంది వెళ్ళిపోవడంతో సభాస్థలి బాగా పలచబడి పోయింది. వేదికకు దగ్గరగా వెళ్ళి నేనొక ఖాళీ కుర్చీ పట్టుకోగలిగాను. కానీ అక్కడైనా నేను సావధానంగా ఉపన్యాసాలు వినే వెసులుబాటు లేకపోయింది. బొట్టూ, కాటుకా పెట్టి పిలిచినట్లుగా ఎవరో ఒక అయిదేళ్ళ కుర్రాడు లోపలికి వచ్చి నా ముందరున్న కుర్చీలో ఆసీనుడై పోయ్యాడు వాడి ధ్యాస ఉపన్యాసాలపైన ఉండా లనుకోవడంలో న్యాయం లేదు సరే! కానీ బొమ్మలా కదలకుండా కూచోవచ్చుగదా! కూచోడే! వాడికి ముందరున్న కుర్చీలో చిన్న గోష్పాదమంత పిలకజుత్తున్న ముసలా యన కూర్చుని వున్నాడు. ఈ మహాశయుడికి సభా భవనంకన్నా, గోడలపైన వ్రేలాడు తున్న చిత్రపటాలకన్నా, వేదికపైన వెలసివున్న లక్ష్మీ సరస్వతుల విగ్రహాల కన్నా ఈ చిన్న పిలకజుత్తే అత్యద్భుతమైన వస్తువులా కనిపించి నట్టుంది. వాడు ముంగాళ్ళతో పైకి లేచి పిలకజుత్తును చాలా దగ్గరనుంచి పరిశీలించడానికి కుతూ హల పడుతున్నాడు. అతడల పొత్తు గనుక దాన్ని తాను తాకడానికి వీల్లేదన్న పరిజ్ఞానం వాడికి లేకపోలేదు. అందుకనే అరిచేతిని వీలైనంత దగ్గిరకు తీసుకెళ్ళి పిలకజుత్తును ముద్దుముచ్చటలు తెలుస్తున్నట్లుగా అభినయిస్తున్నాడు. కాసేపు దాని పొంకమూ, బింకమూ గమనించిన తర్వాత "ఉండు. ఇక్కడే వుండు." అని దీవిస్తు న్నట్టుగా చేతి నాడించి చివరకు అభయహస్తం పడుతున్నాడు. పక్కన నవ్వడం సభా మర్యాదకు విరుద్ధం గదా! చుట్టుపట్ల ముసిముసి నవ్వులు ముసురు కుంటు న్నాయి. అందరిలా చూస్తూ ఊరుకోడానికి మనస్కరించక "అబ్బాయ్! తప్పుగదరా! ఊరుకో దాబూ!" అంటూ మందలించి భుజంపైన చేయివేసి కుర్చీలో అదిమిపెట్టాను. ఇందుకు సంతోషించ వలసిందిపోయి ప్రక్క కుర్చీలో వున్న ఆసామీ నన్ను వారించాడు. "పోనీతెండి కుర్రవాడు గదా! ఎవరను కున్నారు? పరాంకుశంగారి అబ్బాయి" అన్నాడు.

నేను తెల్లబోయాను. ఈ కుర్రవాడు పరాంకుశంగారి అబ్బాయా? కావచ్చు. వంగి అతడి ముఖంలోకి చూచాను. పాలుగారే చెక్కిళ్లు, మెరిసే కళ్ళు పగడాల్లా వున్న బుల్లి పెదవులు. అమాయకత్వం ఉట్టిపడే ముఖం. మునిమాపు

కత అన్నది ఒక కాలానికి పరిమితం కాదని ఆయన వివరిస్తున్నట్లుగా తరువాత నాకు తెలిసింది. సుఖశాంతులకోసం సాగించిన అన్వేషణలో మానవుడికి సంచార జీవనంకన్నా స్థిరజీవనమే శుభప్రదంగా తోచింది. ఆ విధంగా ఏర్పడినవే జనపదాలు. కాలక్రమాన ఈజిప్టులో పిరమిడ్లు లేచాయి. చైనీయులు మహాకుడ్యం నిర్మించారు. నాగరికతా ప్రస్థానంలో భవనాల నిర్మాణం ఒక మజిలీ. అలాగే సముద్రయానం ఇంకొక మజిలీ. మార్కోపోలో, కొలంబస్, వాస్కోడిగామాలాంటి వాళ్ళు జాతులకు మధ్య సేతువులు వేశారు. కానీ మానవులందరూ ఒకటే ననుకోటానికి వీల్లేకుండా అంతకు మునుపే మతాలు పుట్టుకొచ్చాయి. ఆదిలో జీవితాలను ఒక సక్రమ పద్ధతి క్రిందికి తీసుకురావడానికి తోడ్పడినవే మతాలు. కానీ మత దురహంకారంవల్ల ఎన్నెన్నో ఉపద్రవాలు పొడసూపాయి. సమాజాన్ని పరోక్షంగా మత గురువులున్నూ, ప్రత్యక్షంగా రాజులున్ను పరిపాలింప సాగారు. దండయాత్రలు, యుద్ధాలు, అంతః కల్లోలాలు ప్రజ్వరిల్లాయి. జాతి జీవనంలో ఎంతగా భద్రత లేకపోయినా, ఒకవైపున శాంతికాముకుడైన మానవుడు విజ్ఞానాన్ని సముపార్జించుకోడానికి, వినోదాన్ని సంతరించుకోడానికి ప్రయత్నిస్తూ వచ్చాడు. భాషలు, కళలు, శాస్త్రాలు మొదలైనవన్నీ ఆ ప్రయత్నంలో నుంచే పుట్టుకొచ్చినవి!

ఇలా మాట్లాడుతూ వచ్చి పరాంకుశంగారు పదివేల యేండ్ల వయసు కలిగిన నాగరిక మానవుడు ఈనాడు విశ్వరూపాన్ని ధరించి చంద్రమండలాన్ని అంది పుచ్చుకున్నాడని చెప్పగానే సభ కరతాళ ధ్వనులతో మారు మ్రోగిపోయింది. ఉపన్యాసం వింటున్న తన్మయత్వంలో ఒకరి వీపునింకొకరు బాదేయడం గూడా నేను గమనించాను.

నిజం చెప్పొద్దూ! రసభంగం కలిగించే వాళ్ళంటే నాకు చాలా అయిష్టం. వెండి తెరపై సినిమా చూస్తుండగా నటీనటుల వ్యక్తిగత జీవితాలను గురించి అవాకులు, చవాకులు చెప్పుకునే వాళ్ళను చూస్తే నాకు మండుకొస్తుంది. నా గ్రహచారం కొద్దీ ఈ సభలోకూడా అలాంటి ప్రబుద్ధుడొకడు అఘోరించాడు. ఏదో పెద్ద రహస్యం చెప్పదలచుకున్నట్లు అతడు దగ్గరగా వచ్చి "డోసు ఎక్కువగానీ, తక్కువగానీ అయినట్లు లేదు. పరాంకుశంగారు ఎంత బ్యాలన్స్‌డ్‌గా మాట్లాడారో చూశారా?" అన్నాడు.

ముఖాన చింతనిప్పు చెక్కుస్తున్నది. నాకు. మౌనంగా అతడివేపు కొరకొర చూచి, నా పాటికి నేను మౌనంగా వుండిపోయాను.

పరాంకుశంగారి ప్రారంభోపన్యాసం తరువాత గూడా అయిదారుగురి ఉపన్యాసాలున్నాయట! కానీ సభాసదుల్లో ఆ ఉపన్యాసాలు వినాలన్న పట్టింపు కనిపించలేదు. సగానికి సగం మంది వెళ్ళిపోవడంతో సభాస్థలి బాగా పలచబడి పోయింది. వేదికకు దగ్గరగా వున్న నేనొక ఖాళీ కుర్చీ పట్టుకోగలిగాను. కానీ అక్కడైనా నేను సావధానంగా ఉపన్యాసాలు వినే వెసులుబాటు లేకపోయింది. బొట్టూ, కాటుకా పెట్టి పిలిచినట్లుగా ఎవడో ఒక అయిదేళ్ళ కుర్రాడు లోపలికి వచ్చి నా ముందరున్న కుర్చీలో ఆసీనుడై వున్నాడు వాడి ధ్యాస ఉపన్యాసాలపైన ఉండా లనుకోవడంలో న్యాయం లేదు సరే! కానీ బొమ్మలా కదలకుండా కూచోవచ్చుగదా! కూచోడే! వాడికి ముందరున్న కుర్చీలో చిన్న గోష్పాదమంత పిలకజుత్తున్న ముసలా యన కూర్చుని వున్నాడు. ఈ పుష్పాలంకృత సభా భవనం కన్నా, గోడలపైన వ్రేలాడు తున్న చిత్రపటాలకన్నా, వేదికపైన నెలకొనివున్న లక్ష్మీ సరస్వతుల విగ్రహాల కన్నా ఈ చిన్న పిలకజుత్తే అత్యద్భుతమైన వస్తువులా కనిపించి నట్టుంది. వాడు మునిగాళ్ళతో పైకి లేచి పిలకజుత్తును చాలా దగ్గరనుంచి పరిశీలించడానికి కుతూ హల పడుతున్నాడు. అతడల చొత్తు గమనిక దాన్ని తాను తాకడానికి వీల్లేదన్న పరిజ్ఞానం వాడికి లేకపోలేదు. అందుకనే అరిచేతిని వీలైనంత దగ్గిరకు తీసుకెళ్ళి పిలకజుత్తును ముద్దుముచ్చటలు తీరుస్తున్నట్లుగా అభినయిస్తున్నాడు. కాసేపు దాని పొంకమూ, బింకమూ గమనించిన తర్వాత 'ఉండు. ఇక్కడే వుండు.' అని దీవిస్తు న్నట్టుగా చేతి నాడించి చివరకు అభయహస్తం పడుతున్నాడు. పక్కన నవ్వడం సభా మర్యాదకు విరుద్ధం గదా! చుట్టుపట్ల ముసిముసి నవ్వులు ముసురు కుంటు న్నాయి. అందరిలా చూస్తూ ఊరుకోడానికి మనస్కరించక "అబ్బాయ్! తప్పుగదరా! ఊరుకో బాబూ!" అంటూ మందలించి భుజంపైన చేయివేసి కుర్చీలో అదిమిపెట్టాను. ఇందుకు సంతోషించ వలసిందిపోయి ప్రక్క కుర్చీలో వున్న ఆసామీ నన్ను వారించాడు. "పోనీలెండి కుర్రవాడు గదా! ఎవరను కున్నారు? పరాంకుశంగారి అబ్బాయి" అన్నాడు.

నేను తెల్లబోయాను. ఈ కుర్రవాడు పరాంకుశంగారి అబ్బాయా? కావచ్చు. వంగి అతడి ముఖంలోకి చూచాను. పాలుగారే చెక్కిళ్లు, మెరిసే కళ్ళు పగడాల్లా వున్న బుల్లి పెదవులు. అమాయకత్వం ఉట్టిపడే ముఖం. ముసిమాపు

వేళ ఇంటి ఇల్లాలు నట్టింట వెలిగించిన దీపకళికలా వున్నాడు. తల పైకెత్తి పరాంకుశంగారి వైపు చూశాను. పోతపోసిన కాంస్య విగ్రహం అలా ఉంటుందేమో నెరసీ నెరయని క్రాపింగు. జపాపుష్పాల్లాంటి కళ్ళు. సిగరెట్టు సాహచర్యం చేత నలుపు రంగు తిరిగిన పెదవులు. ఆయన వెల్తురుకన్నా పొగ ఎక్కువగా వెలి గ్రక్కుతున్న నూనె దివిటీలా ఉన్నాడు. ఆ తండ్రి పోలికలు ఈ కొడుకులో కానరావడం నేను గుర్తించాను. కానీ ఆ యిద్దరి మధ్య ఎంతో దూరం వున్నట్టు ఎందుకో ఓ చిత్రమైన ఊహ నా బుర్రలో పొరాడింది. తండ్రికొడుకు లిద్దరూ చెరొకవైపు నిల్చోగా పదివేల యేండ్ల నాగరికత ఆ యిద్దరికి మధ్య విస్తరించి వున్నట్టు నా కనిపించింది.

పది నిముషాల వరకూ ఆ కుర్రవాడు బుద్ధిగా కూర్చోబెట్టానో అలాగే కూర్చున్నాడు. అంతకుమించి పిలకజుత్తు వైభవాన్ని పరిశీలించకుండా వుండడం వాడికి సాధ్యంగాకపోయింది. మళ్ళీ ముంగాళ్ళమీద పైకిలేవడం లేచి లేచి పిలక లోకి చూడటం. గోలికాయంత పిలకముడి చుట్టూ తనచేతి వేళ్ళతో ప్రాకారంలా అభయహస్తం! మళ్ళీ ముసి ముసి నవ్వుల కెరటాలు...

నాకింక అక్కడ కూర్చోవటానికి మనస్కరించింది కాదు. దగ్గర్లో వున్న సినిమా థియేటరులో కొత్త చిత్రం ఒకటి ప్రదర్శించబడుతోంది. సినిమా చూచి బయటికి వచ్చేసరికి ఎక్కడ బస చేయాలన్న సమస్య ఎదురయింది. మామూల పేటలోవున్న ఒక దూరపు బంధువుకోసం బయల్దేరాను. రెండు గదుల పోర్షనులో అతడి కాపురం. స్టోరు రూములాంటి గదిలో అతడు నన్ను పడుకోబెట్టాడు. రాతంత్రా ఆ గదిలో నల్లులతో సహజీవనం నెరపేసరికి నేను కర్కోటకుడి కాటువల్ల నలుడెలావికృత రూపుడైపోయాడో గ్రహించగలిగాను. బాబ్బాబూ! ఇదేం లాభం లేదు. పల్లెల్లో నివసించి కొన్ని నెలల వ్యవధిలో సంతరించుకున్న ఆరోగ్యం ఒకటి రెండు రోజుల నగరవాసంతో దివాలా అయిపోతుంది. వీలయినంత తొందరగా ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి.

కానీ ఆ లోగా ఈ యాత్రకంతా పరమార్థమైన ప్రయోజనం నెరవేర్చు కోకపోతే ఎలాగూ? జన్మకల్లా శివరాత్రిలా పరాంకుశంగారితో ఓ గంటసేపు కాల క్షేపం, అందుకిదే మంచి సమయం. సాయంకాలమైతే మళ్ళీ ఆయన కేదైనా కార్య క్రమాలు వుండవచ్చు.

స్నానపానాలు ముగించి, దుస్తులు మార్చుకొని మిడిమిడి ఎండలో రెండు మైళ్ళదూరం నడిచి మునిసిపాలిటీవారి గెస్టుహౌస్ చేరుకున్నాను. శాఖోపశాఖలుగా అలముకున్న పెద్దపెద్ద చెట్లనీడలో నిమ్మకు నీరెత్తినట్లుగా వున్న ఆ అతిథి గృహం ఎండలో నడిచివచ్చిన ప్రాణాలకు హాయిని చేకూర్చింది. భవనం చుట్టూ గుబురుగావున్న క్రోటన్ మొక్కలగుండా వెళ్ళి మెట్లెక్కి వరండాలో కాలు మోపాను. చీమ చిటుక్కుమన్నా వినిపించేటంత నిశ్శబ్దం. తలుపువాకిలి ఓరగా వేసి ఉంది. గుమ్మానికివతల ఓ వాలుకుర్చీలో పడుకొని పరాంకుశంగారి అబ్బాయి వసారా చూరుకు వ్రేలాడుతున్న పట్టిపేళ్ళ చాపవైపు చూస్తున్నాడు.

"బాబూ! నాన్నగారున్నారామ్మా?" అంటూ పలకరించాను.

ఏదో చెప్పదలచుకున్నట్లుగా కుర్రవాడి పెదవులు కంపించాయి. అంతలో వ్యర్థ సంభాషణ ఎందుకని తెమ్మనుకున్నట్టు అవి బిగుసుకు పోయాయి. అతడి చూపులు మళ్ళీ పట్టిపేళ్ళ చాపమీదికే ప్రసరించసాగాయి.

చేసేదిలేక గుమ్మందాకా వెళ్ళి లోపలికి తొంగి చూశాను

పరాంకుశంగారి అబ్బాయి నా ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోవడానికి కారణమేమిటో ఆ క్షణాన నాకు స్ఫురించింది. ఉంటే ఉన్నారనవచ్చు. లేకపోతే లేరనీ అనవచ్చు. కానీ రెంటింటికీ అతీతమైన స్థితిని ఏమనాలి? లంగోటా మినహా మరొక అచ్ఛాదనం లేకుండా పరాంకుశంగారు మంచంపై బోర్లగిల పడివున్నారు. మంచాన్ని కావలించి పట్టుకున్నట్లుగా ఆయన చేతులు అటూ ఇటూ వ్రేళ్ళాడుతున్నాయి. కాళ్ళలో ఒకటి ఈ మంచం కోడుకు యింకొకటి ఆ మంచం కోడుకు అభిముఖంగా త్రిప్పి పెట్టిన "వి" ఆకరంతో దొండ మ్రానులా పడివున్నాయి. భౌతిక శరీరం ఇంత నిస్పష్టంగా కనిపిస్తుండగా "లేరని" చెప్పడం పొసగదు. ఉన్నారని అనడానికి గుర్తు చైతన్యం. జీవచైతన్యం ప్రాణులకు సహజ ధర్మం. చైతన్య విరహితమైన స్థితిలో "శరీరం అక్కడ పడివుంది." అనవచ్చునేమోగానీ ఆయనక్కడ వున్నారని చెప్పడం కుదరదు. భావాభావాల మధ్యనున్న స్థితిని ఏమని పేర్కొనాలో అయిదేళ్ళ పసివాడికేం తెలుస్తుంది?

ఏమైనా అంతటి చల్లటి ఆశ్రయాన్ని వదలిపెట్టి మళ్ళీ పట్టణంలోకి వెళ్ళడానికి నాకు మనస్కరించలేదు. చేతిలో వున్న పత్రికను చూసుకుంటూ ఓ మూలగా ఆ వరండాలోనే కూర్చుండిపోయాను.

అరగంట సేపలా గడిచింది. పరాంకుశంగారి అబ్బాయి బంతిలా గుడు గుడుమంటూ పరుగెత్తు కొచ్చాడు.

"మేస్తారూ! ఓ చిత్తెలుక యిలా పరుగెత్తు కొచ్చింది, చూశారా?" అన్నాడు.

చూడలేదంటే వెళ్ళిపోతాడేమో? ఎలాగూ పరాంకుశంగారితో మాట్లాడే అవకాశం కుదరలేదు. కనీసం వాళ్ళబ్బాయితోనైనా కొంతసేపు మాట్లాడగలిగితే బాగుండుననిపించింది.

"చిట్టెలుకా అబ్బాయ్! చూచానే? ఇటువైపే వచ్చింది. ఆ క్రోటన్ మొక్కల్లోకి వెళ్ళిందిమో! మళ్ళీ వస్తుందిలే. ఇక్కడే వుండు. చిట్టేలుకంటే నీకు యిష్టమా బాబూ?"

"భలే యిత్తం, పత్తుకుని గాజు పెత్తెలో పెత్తేయాలి. ఎంచక్కా తిరుగుతూంటుంది గదండీ!"

"వద్దమ్మా! నిజం ఎలుకలుపట్టుకుంటే కొరికిపెడతాయి. నీకంతగా ఇష్టమైతే ప్లాస్టిక్కు ఎలుకలు కొనుక్కోవచ్చు. మర నొక్కితే చాలు అవి బారెడు దూరం పరుగెడుతాయి..."

"మీ బజార్లో ప్లాత్తిక్కు ఎలుకలున్నాయా?"

"ఉండొచ్చు ఎందుకుండవు?"

"మరయితే బజారుకెళ్ళి కొనుక్కొద్దామా మేత్తాలూ? మీరెత్తుకోవద్దు నేనే నడిచొస్తాను."

తనతో ఆడుకునేవాళ్ళకోసం ఆ కుర్రాడు మొహం వాచిపోయినట్టున్నాడు. పెద్దలకు సాయం చేయడంకన్నా పసిపిల్లలకు ప్రమోదం కలగజేయడంలో ఎంతో ఆనందముంది. కాని భగభగలాడుతున్న ఎండవైపు చూచి కాస్త తటపటాయించాను.

"భోజనంచేసి వెళ్దాంలే అబ్బాయి! నాన్నగారితో చెప్పేవెళదాం."

"నాన్నారు నిద్దల లేవరు. సాలాసేపు నిద్దల పోతారు" చాలా చాలా దీర్ఘమే తీశాడు కుర్రాడు.

"సాయంకాలం నేను కొనిపెడతానుగా! తప్పకుండా కొనిపెడతాను" నీ పేరేమిటి బాబూ?"

"అమ్మ చిట్టిబాబు అంటుంది."

"నువ్వమ్మతో బాటు యింటి దగ్గరే ఉండిపోవచ్చుగదా! ఎందుకొచ్చావమ్మా ఈ ఊరికి?"

"అమ్మ యింట్లో లేదుగా! పాపాయి నెత్తుకుని అమ్మమ్మగారింటికెళ్లిపోయింది" కొద్ది క్షణాలు పరధ్యానంగా వుండిపోయి మళ్ళీ అందుకొన్నాడు చిట్టిబాబు. "ఎప్పుడొస్తుందో! ఒస్తె నేను మాటాడనే మాటాడను".

పరాంకుశంగారి సాంసారిక విషయాలు ఆరాతీసి తెలుసుకోవాలన్న కుతూహలం నాకులేదు. చిట్టిబాబును చూస్తే నాకు జాలిగా ఉండొచ్చు. అందుకని నేను చేయగలిందల్లా ఒక ప్లాస్టిక్కు ఎలుకను కొనిపెట్టడమే!

గంట పన్నెండు కొట్టిన తర్వాత ఓ మనిషి కారియర్‌లో అన్నం తీసుకొచ్చాడు. తనకెంతగా ఆకలి లేదని చెప్పినా అతను బలవంతంచేసి చిట్టిబాబును లోపలికి తీసుకెళ్ళాడు. నేనప్పుడు గమనించాను. లోపలి కెళ్ళడంకన్నా, బయట వుండడమే చిట్టిబాబు అభిమతంలా కన్పిస్తోంది.

ప్రొద్దు పడమటికి వ్రాలేసరికి నా కడుపులో సైతం ఆత్మారాముడు గోల పెట్టసాగాడు. మంచి హోటళ్ళ సంగతేమిటోగానీ, పట్టణంలో హోటళ్ళుగా పేర్కొనదగినవి దండిగానే వున్నాయి. రుచీ శుచీ దేవుడెరుగు. వాటికన్నా ప్రాణికి తిండి ముఖ్యం. కాళ్ళీడ్చుకుంటూ బయల్దేరాను. నాలుగు వీధులూ తిరిగి బస్‌స్టాండ్ దగ్గరికి వచ్చేసరికి నా చిన్ననాటి స్నేహితుడొకరు ఎదురయ్యాడు. హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాడట! ఇక్కడేదో ఆఫీసు ఇన్‌స్పెక్షన్ కోసం వచ్చాడట. పనైపోయిందని రాత్రి రైలుకు వెళ్ళిపోతున్నాననీ అన్నాడు.

బాల్యస్మృతులు నెమరువేసుకోవడంతో కాలం గడచిపోవడమే తెలిసిందిగాదు. తొమ్మిదిగంటల రైలుకు వాడిని రవాణాచేసి పరిషత్తు భవనాల దగ్గరికి వచ్చాను. అప్పటి కార్యక్రమం కవిసమ్మేళనం. పరాంకుశంగారు కార్యక్రమానికి హాజరై మధ్యలోనే వెళ్ళిపోయినట్టు తెలిసింది.

కవులు నింపాదిగా రాత్రి ఒంటిగంటదాకా కవితా పఠనం కొనసాగించారు.

ఆనాటి ఉదయం మునిసిపల్ గెస్టుహవుసులో కొద్ది గంటలసేపు గడిపిన అనుభవంవల్ల ఇంకొకచోట ఆ రాత్రిని వేగించటానికి మనసొప్పలేదు. కళాపరిషత్తు

వాళ్ళు ఏకంగా నాలుగు రోజులకు అద్దె చెల్లించి వుంటారు ఏ వరండాలో పడు కున్నా అడిగేవాళ్ళుండరు.

తీరా వెళ్ళదలచుకున్న చోటికి వెళ్ళేసరికి నా అంచనా తారుమారైపోయి వుండడం గమనించాను. అతిథి గృహం ఉదయం ఉన్నంత ప్రశాంతతగాలేదు. హాల్లో దీపాలు వెలుగుతున్నాయి. ద్వారబంధంగుండా. కిటికీ చువ్వల గుండా వెలుతురు వెల్లువలా వెలుపలికి గూడా ప్రవహిస్తోంది. నవ్వులతో, కేరింతలతో, సంభాషణలతో, ఆసనాల కదలికతో హాల్లోపలి వాతావరణం, నానా గందర గోళంగా వుంది.

పడుకోడానికి ముందుగా ఒకసారి హాల్లోపలికి తొంగిచూశాను. జరుగుతున్న గలాభానుబట్టి అక్కడ నలుగురైదుగురు వ్యక్తులుండవచ్చుననుకున్నాను! నా ఊహ పొరపాటు. అక్కడున్న వ్యక్తులిద్దరే! అడ్డపంచ కట్టుకొని, అరచొక్కా వేసుకుని పరాంకుశంగారొక కుర్చీలో కూచున్నారు బల్ల కింకొక వైపున కూర్చున్న వ్యక్తి నా కపరిచితుడు. మనిషి బక్క పలచివాడు. కోల మొగంతో, పొడుగాటి ముక్కుతో తెల్లటి లాల్చీలో అతడు చెకుముకి రాయిలా ఉన్నాడు. శారీరక శక్తికి మించిన ఆవేశంతో అతడు తుపానులో కొబ్బరిచెట్టులా వూగిసలాడిపోతున్నాడు.

బల్లక్రింద, పైన సిగిరెట్ టిన్నులు, అగ్గిపెట్టెలు, తాంబూల సామాగ్రి, సోడా బుడ్డీలు, బ్రాందీ సీసాలు, స్టీలుగిన్నెల్లో అనుపాన వస్తువులు బిస్కట్ పొట్లాలు మొదలైనవన్నీ వాళ్ళ కందుబాటులోనే వున్నాయి.

బహుశా ఆ హాల్లోనే ఒక మూలగా పడుకుని నిద్రపోతున్నాడేమో చిట్టి బాబు పోలికువ మాత్రం నాకు కనిపించలేదు.

నే నక్కడకు వెళ్ళింది పడుకుని హాయిగా నిద్రపోవాలన్న సదుద్దేశంతోనే! కానీ అక్కడ నిద్రపడుతుందనుకోవడం వట్టి అడియాసేనని కొద్దిసేపట్లోనే తేలి పోయింది. పాత నాటకాల్లో త్రాగే సీను వచ్చేసరికి ప్రేక్షకుల్లో నిద్రపోతున్న వాళ్ళుకూడా లేచి కూర్చునేవాళ్లు. ఇక్కడ త్రాగే సీను దృశ్యనాటికగా కాకపోయినా శ్రవ్య నాటికలా నన్ను అలరిస్తోంది.

పోలికలు తగినట్టుగా వుండి, చెకుముకిరాయి ఏ పాటో పద్యమో లంకించు కుంటాడు. అందులో ఏదో గొప్ప స్వారస్యమున్నట్టుగా పరాంకుశంగారు బిగ్గరగా నవ్వేస్తున్నారు. మధ్య మధ్యలో సంభాషణలు. వాక్యానికీ, వాక్యానికీ మధ్య అన్వయ మెప్పుడో తెగిపోయింది. మాటపైన మాట స్వారీ చేస్తోంది. ఈ హంగామాకు

పతాకస్థాయిగా అప్పుడప్పుడూ వాగ్వాదాలు సైతం సాగుతున్నాయి బాబూ? ఇప్పుడిక్కడ ఏ క్షణాన ఏం జరిగినా జరుగవచ్చు. ఎరుగకపోయి ఇక్కడికి రావడమే బుద్ధిమాలిన పనైపోయింది.

క్రమక్రమంగా ఈ గలాటాకు నేను అలవాటు పడిపోయానేమో! ఏ సందు నుంచో కమ్మని కునుకొకటి వచ్చి నన్నావహించింది. ఆ కునుకులోంచి హటాత్తుగా మేలుకొన్నాను. ఎవరో దగ్గరగా గావుకేక పెట్టినట్లు తోచింది. గబగబా హాలు దగ్గిరికి పరుగుతీశాను. గావుకేక పెట్టినవాడు చెకుముకిరాయే అయివుండాలి. విసురుగ పోయి గోడను ఢీ కొన్నాడేమో అతడు వింటి దబ్బలా వంగిపోయి తూలిపోతూ ఈపలి కొస్తున్నాడు. "సన్నె నేయి చేసుకో బోతావట్రా మాదర్చోద్" అంటూ పరాంకుశంగారు బల్లసతడి వైపుకు తోశారు. ఖాళీ సీసా క్రిందపడి ముక్కలై పోయింది. చెకుముకిరాయి కీచు గొంతుకతో ఒక వికృతారావం చేసి, చేతికి దొరికిన సోడా బుడ్డి అందుకున్నాడు. "కాచుకోవోయ్ పరాంకుశం! నీబ్రతుకు బద్దలే! నీ పుచ్చు చట్నీ ఈ ప్రొద్దుటితో నువ్వు మర్గయా" అంటూ సోడా బుడ్డీని ఒక్క విసురుతో పైకెత్తాడు. మరు క్షణంలో అంతపని జరిగేదే! పరాంకుశం గారు తటాలున అపలలికి తప్పుకుని ఒక్క వుదుటున చెకుముకిరాయి గొంతుకను అంది పుచ్చుకున్నారు. కొంపు చేయులతోనూ పీక నొక్కేస్తున్నారు.

సరిగ్గా ఆ క్షణంలో రివటగాలిలా ఓ రబ్బరు బొమ్మ గ్లాలోనుంచి బయటికి పారిపోతున్నట్టు తోచింది. తిరిగి చూసేసరికి ఆ ఆకారం గేటు దగ్గర కనిపించింది. పోల్చుకున్నాను. ఒక్కపెట్టున "చిట్టిబాబూ!" అని పిలిచాను. చిట్టిబాబు వినిపించుకోవడం లేదు. ప్రవాహంలో కర్రముక్కలా అతను కొట్టుకు పోతున్నాడు. పిలుస్తూ రోడ్డుపైకి పరుగెత్తాను. అటూ ఇటూ కలయజూచాను. సందుగొందులన్నీ తిరిగాను. చిట్టిబాబు అయిపులేడు!

మరునాటి ఉదయం ఎనిమిది గంటలప్పుడు కళాపరిషత్తు కార్యదర్శి ఉమాపతి పోలీస్టేషనుకు వెళ్తూ నాకు నాలుగు రోడ్ల కూడలిలో ఎదురయ్యాడు.

"ఏం జరిగింది బాబూ" అంటూ కంగారుగా ప్రశ్నించాను.

"ఏం చెప్పమన్నారు శేఖరంగారూ! ఈ బాధ పగవాడికైనా వద్దు. గెస్టు హౌసును పోలీసు అధికారులు రణరంగంగా వాడుకున్నారు. వాళ్ళ చేతికి దొరికిన

ప్రతి వస్తువూ ఆయుధంగా చెల్లిపోయింది. ప్రాణహాని లేకపోవడమే మన అదృష్టం. తెల్లవారేసరికి పరాకుశంగారు మంచాని కడ్డంగా పడివున్నారు. ఇంకో మనిషి ఒంటి పైన బట్టనే మాట లేకుండా మంచంకోళ్ళ రెండింటికీ మధ్య నేల కంటుకు పోయి వున్నాడు ముఖంపైన నీళ్లుచల్లి అయ్యగారిని ఈ లోకంలోకి తెచ్చేసరికి కుంభకర్ణుణి నిద్ర లేపినంతపనయింది. ఆయనిప్పుడు నిక్షేపంగా లేచి కూర్చొని "మా అబ్బాయి ఎక్కడో వుండాలి చూడండి. అర్జంటుగా బయలుదేరాలి." అంటున్నారు ఏడి? ఎక్కడున్నాడు వాళ్ళబ్బాయి! భళ్లున తెల్లవారినప్పటినుంచీ కార్యకర్తలందరికీ ఇదే పని. చిట్టిబాబును వెదకడం! పోలీసు స్టేషనుకు వెళ్లి రిపోర్టు ఇచ్చివద్దామని నేనిలా వెళ్తున్నాను.

చిట్టిబాబుకోసం నేను తెల్లవారుజాము నాలుగ్గంటలనుంచీ వెదుకుతున్నాననీ ఉమాపతికి తెలియదు. నేనైనా అప్పుడా వివరాలేవీ ఏకరువు పెట్టకుండా మౌనంగానే ఉమాపతిని వెంబడించాను.

చింతాకంత ముఖాలతో మేము లోపలికి వెళ్ళగానే డ్యూటీలోవున్న పోలీసు "ఏమండీ! తప్పిపోయిన కుర్రాడికోసం వచ్చారా?" అన్నాడు.

"రక్షించావు బాబూ! నీ బిడ్డ పాపలు చల్లగా ఉండాలి. ఏదీ? మీకు దొరికిన కుర్రాడెక్కడున్నాడు? అన్నాడు ఉమాపతి.

"ఆ మాటెందుకులెండి. మిల్కుడిపో వెంకయ్య లేడూ! అతడు సైకిల్తో వెళ్తుండగా ఈ కుర్రాడెదురుగా పరిగెత్తుకు వస్తున్నాడట. జానెడంత లేని కుర్రాడు ఈ వేళప్పుడు ఎక్కడికి వెళుతున్నట్టని విస్తుపోయి వెంకయ్య వాడిని తీసుకొచ్చి నా కప్పగించి పోయాడు. అదేం కర్మోగానీ వాడు తండ్రిపేరు చెప్పడే! "మీ ఇల్లెక్కడో చెప్పరా నాన్నా వెళుదువుగానీ అంటే 'ఇల్లొద్దు ఇక్కడే వుంటా' నంటాడు. ఇదేమిటో చాలా విడ్డూరమైన కేసే! వెళ్లి చూడండి. ఎంత నిశ్చింతంగా నిద్రపోతున్నాడో!"

నిజమే!

స్టేషనులో నేరస్తులను తాత్కాలికంగా నిర్బంధంలో పెట్టడంకోసం రెండు సెల్స్ వున్నాయి. అందులో ఒకదానిలోకి దూరి కటాకటాల వెనుక కటిక నేల పైన పడుకుని గాఢ నిద్రాపరవశుడై వున్నాడు చిట్టిబాబు.

నా కళ్లలో గిర్రున నీళ్ళు తిరిగాయి. ఉమాపతికి కన్పించకుండా ముఖం అవతలికి తిప్పుకున్నాను.

పిడుగుపాటులాంటి ఆ సంఘటనపట్ల ఊహ నన్ను నిలువునా తొలి చేసింది.

మీసాలూ, గడ్డాలూ వచ్చి, తలనెరిసినా పండిన వయసులోనూ, విజ్ఞతలోనూ పెద్దలైనవాళ్లు యిప్పటికైనా సవ్యంగా గమనించి వ్యవహరించకపోతే భావితరాల పౌరులకందరికీ రేపటి ప్రపంచం యింతకన్నా ఎడారిలాగ నరకంగా కనిపించవచ్చు. పదివేల యేండ్ల మానవ నాగరికత అప్పుడు మానవుని పాలిటి వరం గాకుండా శాపంగా మాత్రమే నిరూపణ అవుతుంది.

— 'యువ' మాసపత్రిక, 1972.

# కార్టూన్

నువ్వు జీవితాన్ని సీరియస్‌గా తీసుకోకపోవచ్చు. కానీ జీవితం మాత్రం నీ ప్రతి చర్యను సీరియస్‌గానే తీసుకుంటుంది. అందుకు నిదర్శనం – ఇదిగో ఈ రామనాథోదంతం !

రామనాథం దృష్టిలో ప్రపంచ మనగా అనేక అమ్యూజ్‌మెంటు పార్కు. జీవిత మనగా అనేక క్రీడ. తోటి మానవులు వినోద సాధనాలు. రామనాథం నిఘంటువులో స్నేహితులన్న పదానికి నిర్వచనం— ఆడుకున్నంతసేపు ఆడుకుని విసుగు పుట్టగానే, లేదా బెడిసి కొట్టగానే విడిచి పెట్టవలసిన ఆట వస్తువులు. ఈ వైఖరివల్ల రామనాథానికి కుదిరినవన్నీ తాత్కాలికమైన ఆశ్రయాలు. ఏర్పడినవన్నీ తాత్కాలికమైన స్నేహాలు.

పైన పేర్కొన్న ఆనవాయితీకి విరుద్ధంగా నిండుగా ఒక్క సంవత్సరం పాటు రామనాథానికి స్నేహితుడుగా వుండ గలిగినవాడు, పేదు మిక్కిలి రూం మేటుగానే మెలిగినవాడు చలపతి ఒక్కడే! భగవంతుడు తనకేదో సుమారుపాటి తెలివి తేటల్ని మాత్రం ప్రసాదించాడనీ, జీవితం సాఫీగా సాగిపోవడానికి ఆ మాత్రం తెలివి తేటలే చాలుననీ భావించే అల్ప సంఖ్యాక మానవానీకంలో చలపతి ఒక్కడు. ఇతరులకు తాను సేగి తల పెట్టకపోతే, వారుగూడా తనకు అపకారం తలపెట్టరన్న ఉష్ట్రపక్షి మనస్తత్వం అతనిది! చలపతి హృదయం విశాలమైనదే! కానీ లోతు తక్కువ. పైగా స్వచ్ఛమైన నీరేమో, అందులో ఏ మాత్రం గుండు సూది లాంటి వస్తువు పడివున్నా అది బాహాటంగా లోకులకు కనిపించి పోతుండేది. ఆశలతో ఆవేశాలతో నిండిన ఆంతరంగిక జీవనం ఇలా బట్టబయలు వ్యవహారమై పోవడంవల్ల చలపతి మిత్రుల కులాసా కాలక్షేపాని కొక ముడి వస్తువుగా ఉపకరించేవాడు.

"ఒరే అబ్బీ, యిటీవల ఒక రోజున చలపతి ఏం చేశాడో తెలుసా..." అంటూ ప్రారంభించేవాడు, రామనాథం. "తన ఊహా సుందరి కొక ప్రణయలేఖ

వ్రాశాడు. ఆ లేఖ ఆద్యంతాలూ దివ్యంగా కుదిరిందని నాకు చూపెట్టాడు. పోస్టు చేసేయ మన్నాను. ఎలా చేయను బాబూ అంటూ దిగులు ముఖం పెట్టాడు. పది హేను పైసలు నీవి కావనుకుంటే సరి. పోస్టాఫీసులో కవరు దొరుకుతుంది అన్నాను. పైసలేం కర్మ. పదిహేను రూపాయలైనా పెట్టుకోగలను కాని, నా కావిడ చిరునామా తెలియదే" అన్నాడు.

"చిరునామా తెలిపిన వారికి బహుమానం — అంటూ ఒక ప్రకటన వేయించేయగూడదూ!" ఇంకొక మిత్రుడు సాగదీసేవాడు.

"అందుకైనా కనీసం పేరు తెలిసి వుండాలి గదా! ఆ పేరును గురించి గూడా చలపతి కొక నిర్దిష్టమైన అభిప్రాయ మున్నట్టు తోచదు. ఒకసారి సురేఖ అంటాడు. ఇంకొకసారి జలజ అంటాడు. మరొకసారి 'లీలా పద్మిని' అయితే బాగుంటుందంటాడు. అలాగే గిరిక, పూర్ణిమ, కిరణ్మయి మొదలుగాగల వెయ్యి పేర్లలో తన ప్రియురాలి నామధేయమేమిటో నికరంగా చెప్పలేడు!"

"అయ్యోపాపం! గొప్ప చిక్కే!" ఒక మిత్రుడి సానుభూతి.

"పోనీ ఎత్తు, లావు, పుట్టు మచ్చలు లాంటి ఆనవాళ్ళు తెలిపితే ఆ చూకీ తెలియ వచ్చుకదా!" ఇంకొక మిత్రుడి సలహా.

"పుట్టు మచ్చలకేం భాగ్యం; తన ప్రియురాలి ఆకారాన్ని గురించి మాత్రం చలపతికి కచ్చితమైన అభిప్రాయాలున్నాయి. ఆవిడ కళ్లు నీలోత్పలాలట. చెవులు శ్రీకారాలట. ముక్కు సంపెంగ పువ్వు. బాహువులు తామరతూళ్ళు. జడ జానువులదాకా ప్రేలాడుతుంటుంది. ఇంకా వృక్షవర్గంలో అరటిచెట్లు, వస్తువర్గంలో శంఖం, పక్షివర్గంలో చక్రవాకాలు మొదలైనవన్నీ తాను చేసుకునే ఆ ఆకారవర్ణన ప్రకారం ఓ బొమ్మ వేయిస్తే భగవంతుడా! చలపతిని నువ్వే రక్షించాలి—అది ఆడబొమ్మలా వుండదు: అపహాస్యం కోసం గీసిన కార్టూనులా వుంటుంది..."

"చలపతేమో బఫూను!

అతడి ప్రియురాలు కార్టూను!!"

విరగబడి నవ్వుతునేవారు మిత్రులందరూ!

వయసొచ్చిన ప్రతి వ్యక్తి తన బుద్ధి పరిపక్వతకు తగిన ఊహా లోకాన్ని తాను సృజించుకోడం పరిపాటి. అందులో నందన వనాలు ఏడాది పొడుగునా

చిగురించడం. పూచిన పువ్వులు వాడకుండా నింతరంగా సౌరభాలు వెదజల్లడం, గండు కోయిలలు మనోహర సుస్వరాలు వినిపించడం, మనసు ఆనందకరంగా వెన్నెలలు కాయడం, ఆ సుందర సీమలో మబ్బుల్లో తొలకరి మెరపు తీగలా ఎవడి ఊహాసుందరి వాడి అంతరంగంలో దోబూచు లాడడం — యివన్నీ లోక సామాన్యమైన విషయాలే! ఎటొచ్చీ బుద్ధిమంతు లందరూ తమ తమ ఊహా సుందరులను ఏడేడు పద్నాలుగు వాకిళ్ళ కవతల గర్భగుడిలాంటి ఆనానాలోపెట్టి తాళాలు బిగించుకుంటారు. అందుకు విరుద్ధంగా చలపతి ఆమెను తీసుకెళ్ళి నడి వీధిలో రచ్చపైన కూర్చో బెట్టాడు!

లోకంలో నూటికి తొంభై మందికి వారి గొడవలతోనే వారికి సరిపోతుంది. మిగిలిన పదిమందిలో తొమ్మిదిమంది అవసరం వస్తేగానీ యితరుల విషయాల్లో జోక్యం పెట్టుకోరు. పోగా మిగిలిన వాడొక్కడున్నాడే. అతనికి ఇతరుల వ్యవహారాలు భోంచేస్తూ కాలం గడపడమే పని! ఈ ఒక శాతం మనుషులనందరినీ ఒకచోట చేర్చి ప్రత్యేకంగా వారి కొక సంఘం ఏర్పాటు చేస్తే దానికి కార్యదర్శి కాదగినవాడు రామనాథం!

సింహాద్రిపురం హైస్కూల్లో కాలుమోపిన ప్రతి కొత్త టీచరు జాతకాన్ని క్షణాల్లో గుణించి తన జేబులో పెట్టుకోడానికి అలవాటుపడ్డ రామనాథం చలపతితో తనకు పరిచయం కలిగిన రెండు రోజులకే అతణ్ణి గురించి వివరాలను పూర్తిగా ఆకళించుకున్నాడు. కాస్త కలిగిన కుటుంబంలో పుట్టినవాడు చలపతి. పట్టింపులకు, మూతి బిగింపులకు, మొండి సాధింపులకు ఆస్కారంలేని వాతావరణంలో పెరిగాడు. నిండుగా పండిన జొన్న చేనిలో పడిసెలరాయి దెబ్బతినని పిచ్చుక గువ్వలా పెరిగాడు. స్వగ్రామాన్ని వదిలిపెట్టి పట్టణాల్లో వుండి చదువుకున్న రోజుల్లో అతడు చదివిన కథలు, నవలలు, చూచిన నాటకాలు, సినిమాలు అతడి కొక క్రొత్తలోకాన్ని నిర్మించి యిచ్చాయి. భావావేశం పొంగి పొర్లినప్పుడల్లా అతడు ఆకారాన్ని బట్టి కవిత్వ మనిపించే రచనలు చేస్తుంటాడు. ఆ కవితలో ఎక్కువ భాగానికి ప్రణయమే వస్తువు. అన్నింటికన్నా ముఖ్యమైన విషయం. అతడికొక ఊహా సుందరి వుంది. ఆవిడగా రెప్పుడో హఠాత్తుగా తన జీవన పథంలో ఎదురై, మందార దామంతో తన కంఠ సీమను అలంకరిస్తుందని ఈయనగారి నమ్మకం!

"ఇదిగోరా అబ్బీ, ఒకసారేం జరిగిందంటే... సింహాద్రిపురంలో పని

చేస్తుందగా నాకు చలపతి అంటూ ఒక రూంమేటు వుండేవాడు..." అంటూ ప్రారంభించి ఒక లెక్కల ప్రశ్నకు సమాధానం మెలుగా పై వివరాల్లోనుంచీ ఒక పరిణామాన్ని స్పష్టంచగలిగితే ఎంతో బాగుంటుంది. అలాంటి అవకాశం కోసమే వేచి ఉత్సాహపు రామనాథం!

* * *

సింహాద్రిపురం ఉన్నత పాఠశాల స్టాఫ్ రూములో మామూలు స్థాయికి మించిన అలజడి రేగిందంటే అందుకు బహుశా క్రింద పేర్కొన్నవి కారణాలై వుంటాయి.

ఒకటి: అది లేకుండా ఒక టీచరుకు ట్రాన్స్ఫరు ఆర్డరు వచ్చి వుండాలి.

రెండు: హెడ్మాస్టరుగారు సహోపాధ్యాయుల ఆత్మాభిమానానికి దెబ్బతగిలే టట్టుగా ఏదో ఒక సర్క్యులరు జారీ చేసుండి వుండాలి.

మూడు: ప్రభుత్వం కొత్త జీవో ద్వారా అయితేనేమి, టి. ఎ. బిల్లు లాంటిదేదైనా మంజూరవడం వల్ల కానీ ఒకానొక టీచరుకు అదనంగా కొంత డబ్బు ముట్టే సూచనలైనా కనిపిస్తూ వుండాలి.

కానీ ఆనాడు అలజడి సమూకస్థాయికి చేరుకోవడానికి పైన పేర్కొన్నవి కారణాలు గావు.

జరగనున్న పబ్లిక్ పరీక్షలకు సూపర్వైజర్లుగా ఆ స్కూలు టీచర్లలో నలుగుర్ని వేరువేరు సెంటర్లకు వేస్తూ ఆ రోజు టపాలో ఉత్తర్వులు వచ్చాయి.

ఆ నలుగుర్నీ ఒకటిలోనూ చలపతి ఒకడు!

చలపతిని డ్యూటీ వేసిన చోటు ఒక పెద్ద పట్టణం. అక్కడి విద్యార్థులు ప్రాచీన మనస్తత్వాలపైకెత్తిన విప్లవపు బావుటాలు. 'దేశ సౌభాగ్యాన్ని తలా కొంచెం పంచుకు తినడం నేర్చుకుంటున్నారు గదా! మరైతే మార్కుల విషయంలో మీరా న్యాయాన్ని ఎందుకు పాటించరు? ఒక విద్యార్థికి డెబ్బయిలు, ఎనభైలు ప్రసాదించి, ఇంకొక విద్యార్థికి అదే చేతితో బిచ్చం పెట్టినట్టుగా పదిమార్కులో, లేదా ఇరవై మార్కులో పడవేయడానికి మీ కెలా మనసొప్పుతుంది? ఈ దుర న్యాయాన్ని మేం సహించం! హక్కులు సమానంగా వర్తించేదాకా విశ్ర మించం!' అంటూ వాళ్లు నడుము బిగించి, విద్యావ్యవస్థతో పరీక్షయుద్ధం కొనసాగి స్తున్నారు. హక్కులందరికీ సమానంగా వర్తించడం మంచి మాటే! కానీ,

విధులమాట ఏమిటి? అంటూ వాళ్ళ నెదిరించి ప్రశ్నించావో, నీకు కీడు మూడిం దన్న మాటే! ఎందుకంటే అక్కడి విద్యార్థుల్లో కొందరు ఎమ్మెల్యేల ముద్దు బిడ్డలు. మరికొందరు జిల్లా అధికారుల సత్సంతానాలు. అధికారాన్ని గుప్పిట్లో పెట్టు కున్న అనధికార ప్రముఖులతో ఏదో విధంగా ఏరకాయ పీచు బాంధవ్యం కలిగి వున్న వారు కొందరు. వారిలో ఏ ఒక్క కుర్రాడు గట్టిగా పట్టు పట్టినా, ఉపాధ్యా యుడు సుడిగాలిలో ఎండుటాకు.

అందుకనే శ్రేయోభిలాషు లందరూ చలపతికి చక్కగా హితవు చెప్పిగానీ వదిలి పెట్టలేదు. "అబ్బాయ్ చలపతీ! నువ్వు నిన్నగాక మొన్న ఉద్యోగి వయ్యావు. పిల్లకాకికి వుండేలు దెబ్బ తెలియదు. పరీక్ష హాల్లో చిట్టీకాగితాలను పసి గట్టడం, జేబుల్లో చేయివేయడంలాంటి పాడు పనులు తలపెట్టొద్దు. కళ్ళుండీ చూడ కుండా, చెవులుండీ వినకుండా, గ్రుడ్డిగా, చెవిటిగా, అమోఘంగా నటించగల త్యాగ మొక్కటే ఈ రోజుల్లో ఉపాధ్యాయుడికి రక్షణ కవచం! భద్రం, భద్రం, ఖబ డ్దార్—" అని మరి మరీ హెచ్చరికలు చెప్పి స్నేహితులు చలపతిని బస్సె క్కించారు.

అందరిలోనూ చలపతి లౌకిక జ్ఞానంపట్ల సమ్మకం లేనివాడు రామనాథం ఒక్కడే: స్వప్రయోజకత్వాన్ని వెలిగించే పనులేవో చేసి ఈ బుద్ధిమంతుడు ముప్పుతెచ్చుకోక పోడని తన అంతర్వాణి తన కదే పనిగా చెబుతుండగా, పైకి మాత్రం ముసిముసి నవ్వులు నవ్వుతూ చలపతికి వీడ్కోలు చెప్పాడు రామనాథం.

బస్సు కదిలింది.

వారం రోజులు గడిచాయి.

చలపతి తిరిగి వచ్చాడు.

తిరిగి వచ్చిన చలపతిని నఖశిఖ పర్యంతమూ పరీక్షచేసి చూసేశాడు రామ నాథం! ఆశ్చర్యం, మహదాశ్చర్యం. అతడి కాళ్ళూ చేతులు పదిలంగానే వున్నాయి. తలపైన బొప్పెలు లేవు. కనీసం పలువరసలోనైనా ఖాళీ కనిపించడం లేదు! పైగా విచిత్ర మేమిటంటే, తనేదో రాజ్యాన్ని జయించినట్టు అతగాడి పెదవులపైన మంద హాస జ్యోత్స్నలు!

"ఏమిటోయ్ చలపతీ! ఏం జరిగింది బాబూ! వివరంగా చెప్పవూ?" ఏకాంతంలో మిత్రుణ్ణి ప్రశ్నించాడు రామనాథం.

"ఉందిలేవోయ్! కథ చాలా వుంది" అన్నాడు చలపతి.

"నాకా అనుమానమైతే నీ ముఖాన్ని చూడగానే కలిగింది! ఏమిటాకథ?" ఉత్కంఠను ఒలకబోశాడు రామనాథం.

"మరేంలేదు, ఓ అమ్మాయి, అమ్మాయేమిటి—సాక్షాత్తుగా నా ఊహా సుందరి. కళ్లు, చెవులు, ముక్కు, నడుము-అన్నీ కచ్చితంగా అచ్చుగుద్దినట్టు నేనూహించినదే! పేరేమిటో చెప్పనా, రాజీవ!"

రామనాథం తెల్లబోయాడు. వీడున్నవాడున్నట్టు వూరుకోక సాయం కాలాల్లో పట్టణం శివార్లలో ఎక్కడైనా పరిభ్రమించాడా ఏమిటి కర్మ!

చలపతి చెప్పుకు పోతున్నాడు—

"రూం నెంబరు పన్నెండుకు వేశారు నన్ను! మొదటిగంట కొట్టేశారు. రెండోగంట కూడా మ్రోగింది. ఐనా ఒక్క దస్కు మాత్రం ఇంకా ఖాళీగానే వుంది. అరగంట గడచిన తర్వాత ఓ అమ్మాయి ఒగర్చుకుంటూ పరతెంచి వచ్చింది. చీఫ్ సూపరింటెండెంటుగారు ఆమెను తీసుకొచ్చి నా కప్పగించారు. చూడగానే పోల్చుకున్నాను. 'అస్మదీయ మనస్సామ్రాజ్య పట్టమహిషీ! నువ్విక్కడున్నావా? అనుకున్నాను. మరేం భయపడవలసిన అవసరం లేదని బుజ్జగించి కొశ్చన్ పేపరులోని ప్రశ్నలన్నీ ఒకసారి చదివి చెప్పి, ఉన్న యిరవై ప్రశ్నల్లో పది ప్రశ్నలు కరెక్టుగా వ్రాసినా ప్యాసైపోవచ్చు నన్నాను. నేను ధైర్యం చెప్పిన మీదట ఆమె నింపాదిగా కలం చేతికి తీసుకుంది. మధ్యలో ఒకసారి నా ఫ్లాస్కు పంపించి ఆమె కోసం కాఫీ తెప్పించాను. వద్దు వద్దంటూనే గ్లాసుకోసం చేయి చాచింది. ఆ రోజు వెళ్తూ వెళ్తూ ఆమె ఎంత ఆప్యాయంగా థాంక్స్ చెప్పిందనుకున్నావు రామనాథం! అంతకంటే మాట్లాడడానికి అవకాశంలేదు. అయినా ఆమెనలాచూస్తూ వుండిపోవడంలోనే కోటి ఆనందాలు నిక్షిప్తమైలేవా! ఆ గదికి రెండు సార్లు మాత్రమే వేశారు నన్ను! రెండోసారి వెళ్ళినప్పుడు ఆమె నా వైపు అలా వోరగా చూచిన చూపు! ఆ ముఖ భంగిమ మరచిపోదామన్నా మరపు రాదు. అంతటితో నేను తృప్తిపడి వచ్చేశా ననుకోకు! ఆమె ఎవరో, ఏమిటో వాకబు చేసి తెలుసుకున్నాను. కృష్ణసుందిరం వీధితో శ్రీనివాసమూర్తి అంటూ ఓ డాక్టరు వున్నాడు. అతని కీమె పిన్నమ్మ కూతురు. తల్లిదండ్రుల్లో తల్లి మాత్రమే

వుంది. అన్నదమ్ముళ్లుగానీ, అక్కచెల్లెళ్లుగానీ లేరు. ఆ ప్రేలు విడిచిన అన్న గారి యింట్లో వుండి హైస్కూల్లో చదువుకుంది. పల్లెలో కొద్దిగా భూమీ, పుట్రా వున్నాయట! నీకు చెప్పానో లేదో జ్ఞాపకం లేదు. మళ్ళీ ఒకసారి స్మరిస్తే తప్పే ముందిలే! ఆమె పేరు రాజీవ!"

"ఓరి మూఢజీవా! ఇంతచేసి నీ కథ ఈపాటిదేనా!" అనుకున్నాడు రామనాథం. మునుపు ఇలాగే ఒక మూర్ఖుడికి దారంట వెళ్తుంటే ఓ లాడం దొరికిందట! ఇంక మూడు లాడాలు, ఒక గుర్రమూ దొరికితే పంచకళ్యాణి సవారీ తీయవచ్చు- అనుకున్నాడట! చలపతి ఆశాభావం అంతకన్నా మెరుగ్గాలేదు.

కానీ ఈ ఉబలాటాన్ని ఆధారంగా వుంచుకొని చలపతిని పీడించడానికి ఇదొక చక్కని అవకాశం మాత్రంగాక పోదు.

రామనాథం బుర్ర యంత్రంలా పనిచేయడం మొదలెట్టింది. ఆ రాత్రి గడిచి తెల్లవారేసరికి పథకం సిద్ధమైంది ఆ పథకంలో నుంచి నాలుగు కాలాల పాటు అదొక గమ్మత్తుగా చెప్పుకోదగిన విచిత్ర పరిణామం పుట్టుకొచ్చింది.

రామనాథం సవ్యసాచి. ఎందుకైనా పనికొస్తుందని ఎడమచేతితో కూడా దస్తూరీ పొంకంగా వ్రాయడానికి తరిఫీదు చేసి పెట్టుకున్న తన హస్తలాఘవాన్నంతా ఉపయోగించి అతడొక లేఖను తయారు చేశాడు.

"ప్రియమైన మేష్టరుగారూ!

"నమస్కారాలు. పరీక్షల గొడవల్లో మీతో మాట్లాడడానికే వీలు లేక పోయింది. పరీక్షలై పోయాక కనిపిస్తారేమో ననుకున్నాను. నా ఆశ అడియాసే అయింది. మీ మంచితనానికి నేనెంతో ఋణపడి వున్నాను. మీరే గనక లేకుంటే నేను నా పరీక్షను ధైర్యంగా ఎదుర్కొనేదాన్నిగాను. మళ్ళీ ఒకసారి మిమ్మల్ని కలుసుకోవాలని ఉంది. మీరు సింహాద్రిపురంలో ఉద్యోగం చేస్తున్నారని తెలిసింది. సింహాద్రిపురం ఇక్కడికి పదిహేను మైళ్లేనట! మీరు తలుచుకుంటే ఇదొక దూరం కాదు. బుధవారం సాయంకాలం అయిదు గంటలకు మీ కోసం మునిసిపల్ పార్కులో వేచివుంటాను. ఆశాభంగం కలిగించరని నమ్ముతున్నాను.

ఇట్లు
రాజీవ."

రామనాథానికి ముందుచూపు ఎక్కువ. తాను చేస్తున్న పని మూలంగా

తానెవ్వరికీ పట్టుబడి పోకూడదు. కానీ జరగవలసిన హంగామా మాత్రం పూర్తిగా జరగాలి. అందుకని అతడు బడికి రెండు రోజులు సెలవు పెట్టాడు. స్వగ్రామానికి వెళ్తున్నానని చెప్పాడు. నేరుగా పట్టణానికే వెళ్ళి సినిమాలు, తదితర వ్యాపకాలతో కొంత కాలక్షేపంచేసి తిరిగివస్తూ ఉత్తరాన్ని తపాలా పెట్టెలో పడవేసి వచ్చాడు.

చెరువు నీటిలోనికొక బండరాతిని త్రోసివేయడం జరిగింది. ఇక తమాషా చూస్తూ గట్టుపైన కూర్చోడమే తన పని. చలపతికి ఉత్తరం బట్వాడా అయిన క్షణంనుంచీ అతడి ముఖకవళికల్ని పరిశీలించడమే పనిగా పెట్టుకున్నాడు రామనాథం. చలపతి ఉత్తరాన్ని ఒకసారి చదివాడు. రెండుసార్లు చదివాడు. దూరంగా వెళ్ళి ఓ చెట్టుచాటున నిల్చుని పద్యాన్ని కంఠస్థం చేసుకునే విద్యార్థిలా ఆ ఉత్తరాన్ని అలాగే హృదయగతం చేసుకున్నాడు. అతడి బుగ్గలు బూరెల్లా పొంగిపోయాయి. కళ్లు మతాబాల్లా కాంతులు చిమ్మసాగాయి. నిల్చున్నచోట నిల్చోలేక, కూర్చున్నచోట కూర్చోలేక, ఎదురైనవారితో ఎలా మాట్లాడాలో తోచక మహదానందంలో అతడు తబ్బిబ్బు పడిపోతున్నాడు.

"ఏమిటోయ్ చలపతీ! ఆకాశానికి మూడే బారలన్నంత ఉత్సాహంగా వున్నావే! ఏమిటికథ?" ముఖావాన్ని నటిస్తూ అడిగాడు రామనాథం.

"అబ్బే. ఏముంది, ఏం లేదు" అంటూ తప్పించుకున్నాడు చలపతి.

చేయి తిరిగిన వేటగాడిలా గురి చూచి ఎక్కడ కొట్టాలో అక్కడే కొట్టాడు రామనాథం. అతడి అంచనా కించిన్మాత్రమైనా తప్పిపోయిందిగాదు. నాలుగో పీరియడు జరుగుతుండగానే చలపతి హెడ్మాస్టరుగారి గదిలో ప్రవేశించాడు. తన తాతగారు చావుబ్రతుకుల మధ్య తల్లడిల్లిపోతున్నట్టు వర్తమానం అందిందనీ బుకాయించాడు. సెలవు మంజూరయింది. రామనాథం గదికి వెళ్ళేసరికి చలపతి ముస్తాబు పూర్తి చేసుకుని ప్రయాణానికి సిద్ధంగా వున్నాడు.

"మీ తాతగారికి నువ్వొక్కడివే మనవడివా చలపతీ!" సానుభూతిని ప్రకటిస్తున్న వైన్యస్వరంతో అడిగాడు రామనాథం.

చలపతి కా పరామర్శ స్పష్టంగా వినిపించినట్టు లేదు. "అవునవును. ఒంటిగంటకే బస్సు. ఆలస్యంచేస్తే అది కాస్తా దాటిపోతుంది" అంటూ అతడు రోడ్డువైపు దౌడుతీశాడు.

"పోరా బాబూ పో!" అనుకున్నాడు రామనాథం. పోయిచూస్తేగానీ మున్సిపల్ పార్కులో చెట్లు కనిపించవు. అయ్యగారి వాలకం చూస్తే మూడుమూడున్నరకే పార్కులోకి చేరుకునే టట్టున్నాడు. గంట అయిదవుతుంది. ఆరవుతుంది. ఏడు దాటుతుంది. రాజీవ కనిపించదు. అయ్యగారికి నడ్డి నీలుగుతుంది. కళ్ళు నొప్పెడతాయి. ఆకలి కాదు. అన్నం సయించదు. సినిమాకి వెళ్ళాలనిపించదు. నిద్రపట్టదు. తెల్లవారేసరికి మూడు మాసాలు కాయిలాపడి లేచినంత నిస్సారంగా వుంటుంది. ఇంత చేశావా భగవంతుడా అనుకుంటూ శరీరాన్ని బస్సులోకి జేరవేసి తిరుగు దారి పట్టవలసి వస్తుంది...

తిరిగిరాగానే చలపతిని ఎలా పలకరించాలన్నది రామనాథం యొక్క ప్రస్తుత జిజ్ఞాస! "అయ్యో పాపం, నువ్వు వెళ్లేసరికి మీ తాతగారు పోయారా ఏమిటి చలపతీ!" అనడం సముచితంగా వుంటుంది.

"ఇంతకూ జబ్బేమిటో చెప్పావుగాదు" అనడం రెండో మెట్టు.

ఇలా మెట్టుపైన మెట్టు కట్టుకుంటున్నాడు రామనాథం. రాత్రి గడచి, తెల్లవారింది.

ఏడు ఏడున్నరకల్లా తిరిగిరావలసినవాడే చలపతి. గంట తొమ్మిది కావచ్చినా అజాపజా లేడు. పది గంటలకు బడి గూడా ప్రారంభమైంది. క్లాసులకు వెళుతున్నాడన్నమాటేగానీ రామనాథం మనసు పిల్లలపైన లగ్నమై వుండడం లేదు. చలపతి ఏమైనట్టు? ఇంకా పటణంలో ఏం చేస్తున్నట్టు?

ఒంటి గంటకు బడినుంచి అలాగే మెస్‌కు వెళ్ళి, భోజనంచేసి రూముకు చేరుకున్న రామనాథానికి వాలుకుర్చీలో మేనువాల్చి, కాళ్ళను కిటికీలోకి చాపి కూనిరాగం తీసుకుంటున్న చలపతి కనిపించాడు. గోడకు తగిలించిన అద్దంలోనుంచే మిత్రుని రాకను గమనించినట్టున్నాడు చలపతి. మరుక్షణంలో అతడు పెద్దపెట్టున నవ్వడం వినిపించింది. నవ్వి నవ్వి "నా కెక్కడి తాతగారోయ్ రామనాథం, అదంతా వట్టిమాట! వేరొక పనిబడి నేను టౌనుకు వెళ్ళొచ్చాను" అన్నాడు.

"అరరే! అదేమిటి చలపతీ!" సహజస్వరంతో ప్రశ్నించగలిగాడు రామనాథం.

"ఇప్పుడు గాదులే! తీరిగ్గా సాయంకాలం చెబుతాను" అన్నాడు చలపతి.

అపరాహ్ణంపూట ఒడి రెండు గంటలకు ప్రారంభమౌతుంది. అయిదు కొట్టక మునుపే పూర్తవుతుంది. ఆ మూడుగంటలసేపు రామనాథానికి ముళ్ళపైన కూర్చున్నట్టే వుంది. మనసులో మనసు లేదని చెప్పడం అతియోక్తిగాదు. బ్రేకులు చెడిపోయి బోల్తా కొట్టవలసిన బండి, అలాగే విమానంలా పైకెగిరి వెళ్ళిపోతుందా? ఇదేం విడ్డూరం!

చల్లటి సాయంకాలంవేళ, చెరువు కడుపున పచ్చని పట్టుపైన దొరికిన ఏకాంతాన్ని భంగపరుస్తూ ప్రారంభించాడు చలపతి :

"నిజంగా యేం జరిగి దంటే రామనాథం! రాజీవ నాకు జాబు వ్రాసింది."

"అలాగా! ఏమని వ్రాసింది చలపతీ! ఏదీ, చూపెట్టు చూద్దాం..."

"చూపెట్టడానికది నా దగ్గ రెక్కడుంది? రాజీవకే యిచ్చేశాను. మళ్ళీ అడిగి తీసుకోడానికి జ్ఞాపకం వుండొద్దూ! ఐనా ఒక జాబేం కర్మ! ఇకపైన మన పైకి ప్రణయ లేఖల పరంపరే ప్రారంభం కావచ్చు..."

"ఓరి నీ యిల్లు బంగారం గానూ! కాస్త విశదంగా చెప్పలేవా చలపతీ!..."

తన ఆనందంలో తానుండిపోవడంవల్ల చలపతి గమనించడం లేదంతే గానీ, రామనాథం ముఖంలో కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు.

చలపతి కొనసాగించాడు—

తానేమో అయిదుగంటలకే మునిసిపల్ పార్కు చేరుకున్నాడు. గంట ఆరయింది. ఆరున్నర కావచ్చింది. రాజీవ కనిపించలేదు. అదేపనిగా జాబు వ్రాసి తనను రమ్మన్న రాజీవ ఆ విషయాన్ని సుతరామూ మరచిపోగలదంటే ఎలా నమ్మడం? ఏమో, పరీక్షకే అరగంట ఆలస్యంగా రాలేదా? ఇప్పుడు గూడా అలాగే జాగు చేస్తున్నదేమో! ఎందుకైనా మంచిదని అలా కాళ్ళీడ్చుకుంటూ తాను కృష్ణమందిరంవైపు బయల్దేరాడు. ఆ వీధిలో నాలుగో యిల్లే డాక్టర్ శ్రీనివాసమూర్తిది. ముందరి వైపున డిస్పెన్సరీ, వెనుకభాగంలో కాపురం. అంతగా ఎవరైనా తర్కించి అడిగితే డాక్టరుగారికోసం వచ్చినట్టు చెప్పవచ్చు. ఆ సమయానకేదో ఒక జబ్బు స్ఫురించకపోదు. అలాంటి ఆలోచన కలగగానే తాను తటపటాయించకుండా లోపలికి అడుగుపెట్టాడు. వెళ్ళిన సమయానికి డాక్టరుగారు యింట్లో లేరు. రోగులు వేచివుండడం కోసం వేసివున్న బెంచిపైన కూర్చున్నాడు. తాను

కూర్చున్న నడవలోనుంచే యింటి వెనుక భాగానికి దారి వెళ్తుంది. లోపలికి వెళ్ళ డానికా తనకు చొరవ చాలడం లేదు. ఇప్పుడు గాకపోతే మానే, మరి కొంతసేపటి కైనా రాజీవ కనిపించవచ్చునన్న ఆశాభావం సన్నగిల్లడంలేదు అలాగే ఓ అర గంట గడిచింది. అంతలో ఓ మూడేళ్ళ పసిపాప కాళ్ళకు తొడిగిన గజ్జెలు ఘల్లు ఘల్లుమంటుండంగా అటువైపు రావడమేమిటి, "చిట్టి చిట్టీ, రోడ్డుపైకి వెళ్ళకు" అంటూ ఆ పసిపాప వెంట రాజీవ పరుగెత్తుకుంటూ రావడమేమిటి, ఆమె తన వైపు, తానామెవైపు చూడడమేమిటి అన్నీ ఒక్కసారిగా జరిగిపోయాయి.

"నమస్కారమండి మేష్టరుగారూ! చాలా దూరం వచ్చారే!" అంది రాజీవ. నిజం చెప్పొద్దూ, తనకు ఒళ్లు మండింది. తన కోపాన్ని తాను లోలోపలే అణుచుకున్నాడు.

"మిమ్మల్ని గురించి మా అమ్మతోనూ, అన్నగారితోనూ చెప్పాను. ఒక వేళ నేను పరీక్షలో ప్యాసయితే అదంతా మీ చలపే నన్నాను. అలాగైతే ఆయన నొకసారి మనయింటికి రమ్మనలేక పోయావా అంది మా అమ్మ. దేవుడు త్రోసు కొచ్చినట్టుగా మీరే వచ్చేశారు. అయినా ఒక మామూలు రోగిలాగా మీరిక్కడ కూర్చోడమేమిటి? అన్నగారితో చెప్పి మీకు స్పెషల్ ట్రీట్‌మెంట్ యివ్వమంటాను గానీ, యిలా లోపలికి వచ్చి కూర్చోండి మేష్టరుగారూ!"

రాజీవను ముక్కు పట్టుకుని పిండేయాలన్నంత వుక్రోషం వచ్చింది. తనకు! తగుదునమ్మా అంటూ ఈవిడ తనను రమ్మని ఉత్తరం వ్రాసింది. పార్కులో కనిపించకపోతే తానిల్లు వెదుక్కుంటూ రాకపోడని ఈ ఎత్తు వేసింది. తీరా వచ్చేశాక బహుశా భగవంతుడే తనను త్రోసుకుని వచ్చి వుంటాడనీ, లేదా డాక్టరుగారితో పనిబడి వచ్చివుంటాననీ భావిస్తున్నట్టుగా నటిస్తూ దాగుడుమూత లాడుతోంది.

గదిలోకి వెళ్ళి కూర్చున్న అయిదు నిమిషాలకు రాజీవ లోపలికి వచ్చింది. జగ్‌లోనుండి కాఫీని కప్పులోకి వంచుతూ "తీసుకోండి మేష్టారూ!" అంది.

"స్వాగత సత్కారాలు బాగానే వున్నాయిగానీ దీని సంగతేమిటి?" అంటూ తన జేబులో వున్న వుత్తరాన్ని తీసి బల్లపైకి విసిరాడు.

అప్పటికి తాను వ్రాసిన వుత్తరమే తనకు గుర్తు లేనట్లుగా తదేక దృష్టితో దానివైపు చూడసాగింది రాజీవ.

"బాగుందిలే పరస! ఆ జాబు ఎక్కడైనా దృష్టిదోషం తగిలేను!" అన్నాడు తాను.

"అలాగైతే పార్కులో నేను కనిపించక పోయేసరికి మీరిలా వచ్చేశారు. అంతేనా మేష్టారుగారూ!" ఆమె సూటిగా ప్రశ్నించింది.

"గెస్ చేసినా ఆన్సరు మాత్రం కరెక్టుగా చెప్పావు. నూటికి నూరు మార్కులు నీకు!"

ఇంతలో ఒక ముసలావిడ ద్వారందగ్గిర ప్రత్యక్షమైంది. "నేను చెప్పానే. ఆ మేష్టరుగారు ఈయనేనమ్మా!" అంటూ రాజీవ తల్లికి తనను పరిచయం చేసి పెట్టింది. ఆ ముసలావిడ తన వైపు ఎగా దిగా చూచింది. అయిదు నిమిషాల్లో తన పుట్టు పూర్వోత్తరాలంతా వాకబుచేసి తెలుసుకుంది. తన తల్లి పుట్టిల్లూ, వాళ్ళ మేనమామగారిల్లూ ఒకటేనని కనిపెట్టింది. "అయ్యో! మా సీతాలక్ష్మి కొడుకువా నాయనా! నేనింకా ఎవరో అనుకున్నాను. అమ్మాయ్! వేళ గానీవేళ కాఫీ ఏమిటి? కాళ్ళు కడుక్కోమని విస్తరి వేస్తే సరిపోలా?" అని పురమాయిస్తూ లోపలికి వెళ్ళింది.

ఆ యిద్దరి మాటకే గాని, డాక్టరు శ్రీనివాసమూర్తి మరింత కలుపుగోలు మనిషి. తన చదువూ, సంస్కారాలూ, ప్రవర్తన అతడికెంతగానో నచ్చాయి. మాటల సందర్భంలో రాజీవకు వివాహ ప్రయత్నాలు జరుగుతున్నాయని చెప్పాడు. తానుగూడా వస్తూ వస్తూ పోస్టాఫీసుకు వెళ్ళి వూరికొక వుత్తరం వ్రాసి వచ్చాడు. వారం పది రోజుల్లో అమ్మా, నాన్నా యింకా తన వైపు పెద్దలందరూ వచ్చి అమ్మాయిని చూచుకుంటారు మాటా పలుకూ కుదిరితే వెంటనే పెళ్ళికి ముహూర్తంగూడా పెట్టుకుంటారు."

అదీ కథ!

"చూచావా రామనాథం! తొలి చూపులోనే వలపు అంటే అది సినిమాల్లోనే కాని జీవితంలో జరగదనుకుంటాం! నా విషయంలో అది నిజమైంది. కాకపోతే పదిహేను రోజులప్పుడు రాజీవ కనిపించడమేమిటి, ఈ స్వల్ప వ్యవధిలోనే పరిణామాలు పెళ్ళిదాకా రావడమేమిటి?" అంటూ ఒక ఆశ్చర్యార్థకంతో ముగించాడు చలపతి.

రామనాథం అడగలేదు గాని, అడిగి వున్నట్టయితే ఆకాశానికి మూడు బార లేమిటి, రెండు బారలేనని అనేటట్టున్నాడు చలపతి.

* * *

సమాజంలో పెళ్ళిళ్లు జరగడం మామూలే! కానీ ఏ వ్యక్తి జీవితంలో ఆ వ్యక్తి ఒక మరపురాని సంఘటన. నవయౌవన ప్రారంభదశ దగ్గరినుంచే చిత్తంలో వివాహాన్ని గురించిన కోరికలు ఊరికలు తొడగడం సహజం. రామనాథానికి మూడేళ్ళనుంచి వివాహ ప్రయత్నాలయితే ఏకధాటిగా జరుగుతూనే వున్నాయి. అలాగని అతడేమంత హిరణ్యాక్ష వరాలు కోరుతున్నాడనకోరాదు. అమ్మాయి అందచందాలను గురించైనా రామనాథానికి పట్టింపులేదు. ఎటొచ్చీ తల్లిదండ్రుల కొకతే కూతురై వుండి అందువల్ల ఒకటి రెండు లకారాలు కలిసి వచ్చే సంబంధాల పైన అతడి మొగ్గు. లోకంలో అలాంటి సంబంధాలు బొత్తిగా లేకపోలేదుగానీ, వాళ్ళ కన్నివిధాలా రామనాథానికంటె మెరుగైన అబ్బాయిలే తారసిల్లేవారు.

లోలోపల ఎంత గుబురుగావున్నా "అబ్బే, పెళ్ళికిప్పుడేం తొందర?" అని రామనాథం చెప్పడం లేదా? చెబుతున్నాడు.

పులిమీద పుట్ర ఏమిటంటే అలాంటి రామనాథం తప్పని సరిగా చలపతి పెళ్ళికి వెళ్ళవలసివచ్చింది. దాన్ని విధివిలాసమన్నా అనవచ్చు. విధి వైపరీత్య మన్నా అనవచ్చు.

చలపతికి పెళ్ళి జరిగినా జరిగిందిగానీ, అది ఎవరూ అనుకోనంత ఘనంగా జరిగింది. పట్టణంలో వున్న కార్లన్నీ పెళ్ళివారింటి చుట్టూ మూగి పోయాయి. పట్ట రానంత జనస్తోమంతో పెళ్ళి జరుగుతున్నచోటు పుష్పక విమానంలా తయా రైంది. కదిరి మల్లె పూలతోనూ, కమలాపురం గులాబీలతోనూ గుబాళించి పోతున్న పెళ్ళి మంటపంలో వధూవరులకు వచ్చిన కానుకలే కనిస్తున్నాయిగానీ, వధూవరులు కనిపించడంలేదు

పెళ్ళి పీటపైన కూర్చున్న చలపతికి వివాహానికి హాజరైన మిత్రులనందరినీ ఒకసారి పలకరించడానికైనా వీల్లేకపోయింది. పీటలపైన్నుంచీ లేవడమే తడవుగా భోజనాలు ప్రారంభమయ్యాయి. రామనాథం భోజనం చేశాడా? తాంబూలం తీసు కున్నాడా? అని చలపతి వాకబయితే చేశాడుగానీ, చేసే వుంటాడు. తీసుకునే వుంటాడు. అంటూ రుజువులేని సమాధానాలే వినవచ్చాయి.

మళ్ళీ సింహాద్రిపురం హైస్కూల్లోనేగానీ, చలపతికి రామనాథం కనిపించలేదు.

చలపతి మిత్రుణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు. పెళ్ళికబుర్లతో హోరెత్తించేశాడు. చిట్టచివర "నేనిక నీ రూంలో నీతో కలిసి వుండడం గూడా కొద్దిరోజులేనోయ్ రామనాథం! మునసబు రామిరెడ్డిగారు అవుట్ హౌసు ఖాళీచేసి నాకిస్తామన్నారు" అన్నాడు.

వీలయినంత నిర్లిప్తంగానే ఆ కబుర్ల నన్నింటినీ విన్నాడు రామనాథం. వివాహంతో విద్యకు ఫుల్‌స్టాపేనంటారు. అలాగే ప్రణయానికి ముగింపు పరిణయము. చలపతి ప్రణయగాథకూడా ఇంతటితో ఆఖరేనన్న ఓదార్పు ఒక్కటే మిగిలింది రామనాథానికి!

* * *

క్రొత్త కాపురం ప్రారంభమైన క్రొత్తలో సింహాద్రిపురంలోని మిత్రులకు, శ్రేయోభిలాషులకు ఒక విందు ఏర్పాటు చేశాడు చలపతి. ప్రముఖ గెస్టు హోదాలో గాకపోయినా, ప్రత్యేక గెస్టు హోదాలో ఆ విందుకు హాజరయ్యాడు రామనాథం. "చెప్పాను గదూ! ఈయనే రామనాథం. నా రూం మేటు. మా ఇద్దరి మధ్య దాపరికాలు లేవు" అంటూ మిత్రుణ్ణి భార్యకు పరిచయంచేసి పెట్టాడు చలపతి. "అలాగా! నమస్కారమండీ!" అంది రాజీవ. అంటూ ఆమె తనవైపు చూచిన చూపులో రామనాథానికి ఎక్స్‌రే లక్షణాలు పొడసూపాయి. ఆ కారణంగా అంతటి చల్లటివేళ ముచ్చెమటలు పోయబోతున్నట్టుగూడా అనుమానం కలిగింది. సూత్రధారిగా వుండి తానొక నాటకం నడపదలచుకున్నాడు. రాజీవ తనకా అవకాశం దక్కనివ్వలేదు. చలపతి చూపెట్టిన జాబు తాను వ్రాసింది కాదన్న విషయం ఈ యిలాతలంపైన ఒక్క రాజీవకు మాత్రమే నిష్కర్షగా తెలుసు. తెలిసిన తర్వాత ఆ వ్యక్తికోసం అన్వేషణ సల్పకుండా వుండడం మానవ స్వభావాలకే విరుద్ధం!

అతిథులందరూ విందు పసందుగా వుందనుకున్నారు. కానీ రామనాథానికి మాత్రం ఆ విందు మందుకన్నా హితవుగా లేదు.

ఫల పుష్ప తాంబూలాలతో గూడిన కాగితపు బంగీలు స్వీకరించి అతిథులొక్కరొక్కరే వెలుపలికి వచ్చేశారు.

తలుపులు తీసి చీకటి గదిలో కాలుమోపాడు రామనాథం. ఎందుకోగానీ అతనికి లైటు వేయాలనే అనిపించలేదు. పై పెచ్చు జుత్తును చిందరగా వందరగా పీక్కుని,గోళ్ళతో ముఖాన్ని వికృతంగా బరుక్కోవాలనిపించింది. కాకపోతే తాను చేసిన చిన్న పొరబాటు తననిలా వెక్కిరిస్తుందా? తన ఎదుట కేవలం ఒక అర్భకుడుగామాత్రమే పరిగణింపదగిన చలపతికి రంభలాంటి పెళ్లామా? వ్రేలి వ్రేలికి ఉంగరాలా ?

మరనొక్క దీపం వెలిగించాడు రామనాథం. ఆ వెలుతురులో తన చేతి పై పొకసారి చూచుకున్నాడు. అబ్బే, ఏముంది, తన చేతిలో ఏమీ లేదనుకున్నాడు. లేకపోతే తానొక కార్టూన్ గీయదలచుకుంటే అదొక అందమైన త్రివర్ణ చిత్రంగా రూపొందుతుందా? చివరకు జీవితం తననే ఒక అప్పటమైన కార్టూనుగా మార్చి వేస్తుందా?

పడక పరచుకోదానికైనా ఓపికలేక, అలాగే కాసేపు నేలపైన వాలి పోయాడు రామనాథం. క్రిందికి వేసికొట్టడంలో ప్రిదిలిపోయిన కాగితపు బంగీలో నుంచి ఈవలికి జారిన చిన్న కాగితం ముక్క ఒకటి అతనికి నేలపైన కనిపించింది.

కంగారుగా ఆ కాగితాన్ని చేతిలోకి తీసుకున్నాడు రామనాథం. అందులో ముక్తసరిగా నాలుగైదు వాక్యాలు మాత్రమే వున్నాయి—

"నువ్వొకరికి మేలు చేయాలనుకుంటావు. అది కీడు కావచ్చు. నువ్వొకరికి కీడే చేయాలనుకుంటావు. అది మేలు కావచ్చు. అలాంటి సమయాల్లోనే జీవితం నిన్ను పరిహసించేది. నరుడా, వానరుడు కాకుము!"

* * *

అది జనరల్ ట్రాన్స్‌ఫర్లు జరుగుతున్న సమయం కాదు. కానీ ఉన్నట్లుండి రామనాథానికి ఎందుకు బదిలీ వచ్చిందో చలపతికి తెలిసిందిగాదు. వచ్చిందిపో, వెంటనే పెట్టె, పరుపూ సర్దుకుని అతడంత తొందరగా సింహాద్రి పురాన్ని వదిలి పెట్టి వెళ్ళడం గూడా చలపతికి కాస్త విడ్డూరంగానే కనిపించింది !

—'జ్యోతి' దీపావళి సంచిక – 1965

# చెక్కుటద్దం

క్రోటన్ మొక్కలగుండా, అంచులుగా నాటిన యిటుక రాళ్ళ నడుమ, తెల్లటి యిసుక పరచిన సన్నటి బాటపైన మెల్లగా నడచి వెళ్తోంది వాసంతి. పచ్చని పందిరిలా పరచుకున్న ఆ వేపచెట్ల క్రింద నడవడం ఒక మధురమైన అనుభవం. ప్రభాత వాయువులు చల్లగా వీస్తున్నాయి. సూర్యోదయమైంది గానీ ఎండ యింకా చిటారు కొమ్మలతోనూ, సౌధోపరిభాగాలతోనూ దోబూచులాడుతోంది. తోటలో రకరకాల పువ్వులు విప్పారిన రేకులతో నవ్వుల వికాసాలను వెదజల్లుతున్నాయి. కానీ అలాంటి సుప్రభాతంలో గూడా వాసంతికి ఏదో కొరత వున్నట్టు తోచడమే ఆశ్చర్యం. నిజానికా వున్న కొరతేదైతే వుందో అది ఆ పరిసరాల్లో లేదు. బాహ్య పరిస్థితిల్లో దేనిలోనూ లేదు. అదెక్కడ వుందో వాసంతికి తెలుసు. కానీ ఆ విషయాన్ని మాటిమాటికీ తలచుకొడమంటే వాసంతికి మనస్కరించదు.

తెల్లటి చలువ దుస్తులు వాసంతి సౌందర్యాన్ని శరీరంలో ఎంతవరకు దాచి పెట్టాలో అంతవరకే దాచిపెడుతున్నాయి. అంగసౌష్ఠవానికి కొదువలేని రూప విభవం ఆమెది. తన అందచందాలను నిలువుటద్దం ప్రస్తుతించని రోజు లేదు. స్నేహితురాండ్రు నిర్మల, కల్యాణి, మార్గరేటు సౌందర్యంతో ప్రసక్తి వచ్చినప్పు డల్లా తన స్వరూపాన్ని ఉపమాన వస్తువుగా వాడుకుంటారు. ఆ పొగడ్తలు ఒక పదేళ్ళకు మునుపు తన కెంతో గర్వాన్ని కలిగించేవి. కానీ గాలికే కరిగిపోయిన కర్పూరంలా ఆ గర్వం కాలగర్భంలో లుప్తమైపోయింది. తనకోసం వేచివుండీ, వుండీ మేనత్త కొడుకు వేరే పెళ్ళి చేసుకున్నాడు. ఒక హెల్త్ యిన్స్పెక్టరు తన పైన మనసు పెట్టుకుని మజ్నూలా తయారైపోవడంతో అతడి హెల్త్ కాస్తా పాడై పోయేదాకా వచ్చింది చేతులు కాలకమునుపే అతడు ఆకులు పట్టుకుని గంతకు తగిన బొంతలాంటి ఒక సంబంధాన్ని ఒప్పుకుని యిప్పుడాపిల్లతో లక్షణంగా సంసారం చేసుకపోతున్నాడు. అసలీ మగజాతి తీరే యింత! నువ్వంగీకరించక

పోతే నుయ్యో గొయ్యో, విషమో, తాడో అంటూ ప్రతినలు పలుకుతారు. తీరా అంగీకరించకపోతే – పోతే పోయింది లెమ్మని యింకొక సబ్ స్టిట్యూట్‌తో సరి పెట్టుకుంటారు. అవును పాపం! ఎంతకూ తాను తన సింహాసనంనుంచీ దిగక పోతే వాళ్ళుమాత్రం ఎంతకాలమని తన హృదయద్వారాల దగ్గర ప్రేమభిక్షకోసం పడిగాపులు పడతారు? అందరూ ఒక్కొక్కరుగా వెళ్ళిపోయారు. ఇప్పుడు తాను గొంతెత్తి పిలిపించుకోడానికెవ్వరూ లేని పరిస్థితి మాత్రమే మిగిలింది!

వంతెన క్రింది నదీ ప్రవాహంలా కాలం తనపాటుకు తాను వెళ్ళిపోతోంది.

అవును. జీవితం గూడా నదిలాంటిదే! ఆనకట్ట వేస్తే పొలాలు పండించు కోవచ్చు, తోటలు పెంచుకోవచ్చు. కనుచూపానినంత మేరకు సస్యశ్యామలంగా మార్చుకోవచ్చు. ఆనకట్ట వేయవు. ఏమౌతుంది? నీళ్ళన్నీ మున్నీటిపాలు. మియర్ వేస్ట్!

ఈ వూహ తానొక పెనుతుఫానులా తన మనశ్శాంతి నెక్కడ పాడు చేస్తుందోనన్న భయం ఒకటి క్రొత్తగా వాసంతిని పట్టుకుంది. కానీ మనసు చాలా చెడ్డది. నిషేధాజ్ఞలతో దానికి హద్దు లేర్పరచడం చాలా కష్టం. కొండల్ని గురించి తలుచుకో. కోనల్ని గురించి తలచుకో, తరులతా గుల్మాదుల్లో దేన్ని గురించైనా తలచుకో కానీ ఒక్క కోతిని గురించి మాత్రం తలచుకోవద్దు, అని నువ్వు నీ మనసుకు చెబుతావనుకో! ఊహూ, లాభం లేదు. నీ మనస్సెప్పుడూ కోతిపైనే వుంటుంది.

అలాంటి వాసంతి కానాటి వుదయం ఫిమేల్ వార్డు కల్లంత దూరంలో కాలువపైన కట్టిన పిట్టగోడ కానుకుని అంతకు మునుపెన్నడూ ఆసుపత్రి ముఖం చూడనివాడిలా ఆ పరిసరాలను పరకాయించి చూస్తూ నిల్చున్న ఒక యువకుడు కనిపించాడు.

మరీ అంత లేత్రాయమైతే వాసంతి పట్టించుకొని వుండేది కాదేమో! ముప్ఫైకి ముప్ఫై అయిదుకు మధ్య ఎక్కడో తారట్లాడుతోంది అతడి వయస్సు.

ఎత్తయినవాడు. పసిమినిగ్గులు వెదజల్లుతున్న దేహచ్ఛాయ. చెదరిపోయినా అందంగానే వున్న క్రాపింగు. నలిగి పోయినా నాజూకుగానే వున్న దుస్తులు. ఆ కళ్ళల్లో కాంతులున్నాయి. ఆ నిల్చున్న తీరులో హుందాతనం వుంది. అన్ని లక్షణాలూ బాగానే వున్నాయి. కానీ వాసంతికి నచ్చని దొక్కటే! చందమామలో మచ్చలా అంతటి అందగాడికి ఆ గడ్డమేమిటి ? అదిగూడా వారం పదిరోజుల ఏమరుపాటువలన ఏర్పడిన పసిగడ్డమైన వాసంతి పోనీ లెమ్మని సున్నించగలిగి వుండేది! అబ్బే, ఆ గడ్డాన్ని కెంతలేదన్నా రెండు మాసాల మోటు ప్రాయం వచ్చేసింది.

లోకంలో వాసంతికి నచ్చనివి చాలా వున్నాయి. ఆ జాబితాలో ముఖ్యమైనది గడ్డం. మగసిరికి లక్షణమైతే దాన్ని మాటిమాటికీ మగవాళ్ళు శుభ్రంగా తుడిచిపెట్టుకోడమెందుకో ఆమె కర్థగాదు. పూర్వం మన మహర్షులు గడ్డాలు పెంచుకునేవారంటే అందుకు అడవుల్లో సెలూనులు లేకపోవడమే కారణమని వాసంతి భావిస్తుంది. మరీ అంత ముమ్మరంగా గాకపోయినా, ఆ రోజుల్లో గూడా గడ్డాల సాగుబడి అక్కడక్కడా అరుదునైనా కనిపించక పోవడం లేదు. బహూశా వారం వారం, నెల నెలా సుంకాలు చెల్లించడానికి బద్ధకించడమే యిందుకు కారణమై వుంటుంది. ఈ విద్యలో ఎవరికివారే నిపుణులై పోవడానికి వీలుగా, షేవింగు సెట్లు చౌకగా లభ్యం కావడం ప్రారంభమైన తర్వాత స్వాములవార్ల చెంపలు గూడా సముద్రపు కెరటం పరామర్శించిపోయిన యిసుక వాలులా శుభ్రంగా వుండడం నేర్చుకున్నాయి. ఇట్టి పరిస్థితుల్లో ఒక యువకుడు బిరుసు గడ్డంతో సహజీవనం చేయగలగడమే విడ్డూరం !

వాసంతి లోపలికి వెళ్ళి స్టాఫ్ నోట్‌బుక్‌లో సంతకం పెట్టింది. ఛార్జీ అప్పగించి క్వార్టర్సుకు బయలుదేరుతున్న ముసలి నర్సు కమలమ్మ వెళ్తూ వెళ్తూ గడిచిన రాత్రి తొమ్మిది గంటలప్పుడు అడ్మిట్ అయిన కొత్త కేసును గురించి ప్రస్తావించింది. ఆమె ద్వారా తెలిసినవి తెలియగా మిగిలిన వివరాల కోసం రిజిష్టరు

తెరిచి చూచింది వాసంతి. పేరు సక్కుబాయి. వయసు ఇరవైఏడు, భర్తపేరు చంద్ర మోహన్. అతడు యల్ ఐ.సి.లో ఉద్యోగి. ఆమెగారికి నిర్దిష్టంగా ఒక జబ్బంటూ లేదు. ఆ 'కాలం'లో వ్రాయబడిన పేర్లన్నిటినీబట్టి చూస్తే ఈ కేసొక జబ్బుల గుడారంలా వుంది.

వాసంతి మూడో నంబరు బెడ్ దగ్గరికి వెళ్ళేసరికి, ఉదయం తనకు కని పించిన యువకుడు యినుప కమ్ముల గదిలో నుంచి పేషంటుతో మాట్లాడు తున్నాడు.

చంద్రమోహన్ అన్న వ్యక్తి యితడేనన్నమాట !

వాసంతి సక్కుబాయివైపు చూచింది. కాదు కాదు. సక్కుబాయిలో చక్క దనాలకోసం వెదికింది. సన్నగా, పొడుగ్గా, నలుపుపాలే ఎక్కువగా వున్న రంగుతో, కోల ముఖంతో, చూడగానే చూపరులను ఆకర్షించే విలక్షణాలేవీ లేకుండా చాలా సాదాగా వుంది సక్కుబాయి. పది దృక్కోణాలనుంచి ఆమెను చూస్తే, ఏదైనా ఒక కోణంలోనుంచి ఆమె కాస్త అందంగా కనిపిస్తే కనిపించ వచ్చు. ఏమైనా సక్కుబాయి అన్న పేరే వాసంతికి యింపితంగా లేదు. ఆ ఆకారమూ అందుకు తగ్గట్టే వుంది. కానీ యువకుడిదగ్గిరికి వచ్చేసరికి అతడి పేరు, ఆకారము గూడా బాగానే వున్నాయి. ఇక్కడ బాగుండనిది అతడి గడ్డమే! అయ్యో, ఇదేం మనిషమ్మా యితను! తన జీవితానికి సంబంధించినవన్నీ బాగానే వుండి తీరాలన్న పట్టింపు యితనికి లేదల్లేవుంది.

పది పదిహేను నిమిషాలు గడిచేసరికి మళ్ళీ ఒకసారి మూడో నంబరు బెడ్ వైపు చూడాలనిపించింది వాసంతికి! మరేం లేదు. పాపం, ఆ యువకుడింకా ఆ ఇనుప కమ్ముల దడిని పట్టుకుని వ్రేళ్ళాడుతున్నాడేమో! ఈ పేషంటుకు వరాం డాలో బెడ్ దొరికిన దొరికింది గానీ ఆ చంద్రమోహన్ గారికి నిలువుగాళ్ళ శిక్ష తప్పేటట్టు లేదు!

ఉదయం ఎనిమిది గంటలకు ప్రారంభమై, సాయంకాలం నాలుగింటికి

వాసంతికి డ్యూటీ పూర్తయిపోతుంది. డ్యూటీకి వచ్చినప్పటినుంచీ పదకొండు కొట్టే దాకా ఫీమేల్‌వార్డు పరిసరాల్లోనే తారట్లాడుతూ వుండిపోయిన ఆ యువకుడు ఆ తరువాత ఒక అరగంట సేపటివరకూ వాసంతికి కనిపించలేదు. "ఫరవాలేదు ఇతడు భార్యను చూడకుండా గూడా కొంతసేపుండగలడు" అనుకుంది వాసంతి. ఆ రిలీఫ్ గూడా ఎంతోకాలం నిలిచి వుండలేదు. అతను భార్యను వదిలిపెట్టి వెళ్ళడం గూడా భార్యకోసమే! ఆసుపత్రివారి ఆదరణపైన పెద్దగా నమ్మకం లేదేమో మరి, అప్పటికప్పుడే ఫ్రెష్‌గా తయారైన రొట్టెలను పార్సెలు కట్టించుకుని, నవ నవలాడుతున్న చీనీపళ్ళు బాగ్‌లో వేయించుకుని, ద్రాక్షపళ్ల పొట్లం చేత బట్టుకుని, ముఖంపైన క్రమ్ముతున్న చెమటనైనా తుడుచుకోకుండా అతడు తిరిగి వచ్చేశాడు. వచ్చినవాడు కాసేపు వేపచెట్టుక్రింద కూర్చుని సేదదీరవచ్చునుగదా! అతడిలో ఆ ధ్యాసే లేదు. ఈ స్థితిలో అతణ్ణి శీతావాతాతపాలేవీ బాధించేటట్టేలేవే! ఆహారం తీసుకున్న తర్వాత వెనువెంటనే వేడివేడిగా ఒక పానీయం సేవించక పోతే ఆ భార్యామణి కందిపోతుందేమో కరిగిపోతుందేమో నన్నట్టూ, అతడు ఫ్లాస్కు భుజానికి తగిలించుకొని మిడిమిడి ఎండలో మళ్ళీ నగరంలోకి దూసుక పోయాడు.

ప్రొద్దు పడమటికి వ్రాలాగానే ఎండ వరాండాలోకి వస్తుంది. అప్పట్లో తెరలు దించి పెట్టడం రివాజు. ఆ రోజు మధ్యాహ్నం అయ్యీ కాకమునుపే తెరలు దించేసింది వాసంతి. 'తెర తీయగరాదా' అంటూ నాదనామక్రియలోనో, నాటకు రంజిలోనో ఒకపాట పాడగానే తొలగిపోవడానికిదేం వేంకటేశ్వరుడిముందు వ్రేలాడుతున్న తెరగాదు. ఆసుపత్రి సిబ్బందిచేత, పైన చీలలకు బిగించబడి క్రింద బటన్‌లకు తగిలింపబడిన తెర. ఇకమీదట అయ్యగారేం చేస్తారో చూడాలి...

అమ్మగారి కన్నిసదుపాయాలూ అమర్చిన తర్వాత, ఎప్పుడో ఆలస్యంగా భోజనానికి వెళ్ళిన చంద్రమోహన్ రెండు గంటలకు తిరిగివచ్చాడు. ఆపాటి కెప్పుడో తెరక్రిందికి వ్రాలింది కానీ వెయ్యి ప్రతిబంధకా లేర్పడినాసరే, తన నెవ్వరూ ఆపలేరన్న ధోరణిలో వున్నాడతను. అది హాస్పటలు. అందులో ఫీమేల్ వార్డు. ఆడవాళ్ళు పడుకున్న మంచాల నడుమనుంచి వెళ్ళాలి. అందుకు ఆసుపత్రి

నిబంధన లనుమతించవు...ఇలాంటి చొప్పదంటు విషయాలను గురించి తలపెట్ట కుండా అతడు చరచరా లోపలికి వచ్చేశాడు. ముందుకు వెళ్ళిపోతున్నాడు. ఇప్పుడతని చేతిలో ఒక వారపత్రిక వుంది. 'ఈవారం పత్రికేనాండి?' అంటూ చేయి చాచింది వాసంతి. 'అవునండీ! నేను వారపత్రికలు చదవను. కానీ మా ఆవిద కీవంటే చెప్పరానంత పిచ్చి' అంటూ అతడొక క్షణమైనా ఆగకుండా లోప లికి సాగిపోయాడు.

వాసంతికి చెప్పరానంత కోపం వచ్చింది. వారపత్రికలు చదివే పిచ్చి వున్నది ఈయనగారి జనానా సుందరి కొక్కతెకే కాబోలు! మిగిలినవాళ్ళు ఈయనకు మనుషుల క్రిందనే లెక్క తగలగూడదా? ఐనా యితడేం మనిషి? ఒక అందం తెలియదు. ఒక చందం తెలియదు. సభ్యత, సంస్కారం గూడా యిత డిలో అంతంత మాత్రంగానే వున్నట్టున్నాయి. లేకుంటే వారపత్రిక ఇవ్వకుండా వెళ్ళిపోతాడా?

సాయంకాలం నాలుగ్గంటలకు తన డ్యూటీ పూర్తికాగానే వాసంతి క్వార్ట ర్సుకు వెళ్ళిపోయింది. దగ్గరివాడైన ఒక వ్యక్తి మూలంగా పెద్ద పరాభవం జరిగి నట్టు తాను కృంగిపోవడమెందుకో వాసంతికే తెలియదు.

ఆ యువకుడొకసారి కుతూహలంతో పరకాయించి చూచివుండినా చాలు, ఆమెకిలా అసంతృప్తి కలిగి వుండేది కాదు. అబ్బే, రాతిమనిషి. రాతియుగంనాటి మనిషి. ఒక అయిదు నిమిషాలు అతడితో మాట్లాడే అవకాశం లభిస్తేనా? "ఓయీ చిట్టి నాయనా! నువ్వు యల్. ఐ. సి. లో గొప్ప ఉద్యోగం చేస్తున్నావు సరే. నెలకైదారు వందల రూపాయలు సంపాదిస్తున్నావు. మంచిదే. అనేక విధాల నీది కొరతలేని జీవితంగా వుంది వుండవలసిందే. కానీ నీకీ భార్య ఏమిటి? ఇదెన్ని జన్మల గ్రహచారం నీకు? ఈవిడకు వచ్చిన జబ్బేమిటో డాక్టర్లే తేల్చలేక పోతు న్నారు. నికరంగా జబ్బేమిటో తెలిస్తేగదా, మందులిచ్చి బాగుచేయడం! అంత వరకూ ఎన్ని మందులు వాడినా అవి గురిపెట్టకుండా వదిలిపెట్టిన బాణాలేగదా! అయ్యో పాపం! ఈ కష్టం నీకు రావలిసిందిగాదు అయినా ఏం చేద్దాం ఎవరి

బుద్ధి వాళ్ళకు వచ్చి, ఎవరికి నచ్చిన జంటను వాళ్ళెన్నుకునేదాకా మన సమాజంలో తల్లిదండ్రులు పూరుకోవడంలేదు. ఆ తొందరపాటుకు ఫలితం యిది. జరిగి పోయిందానికి విచారించి లాభమేముంది? వద్దమ్మా వద్దు. బెంగపెట్టుకోడంవల్ల నీ ఆరోగ్యం కాస్తా పాడైపోవచ్చు. నీ స్ఫురద్రూపానికేసేగి రావచ్చు...

మగవాడి నిలా హడలగొట్టి, దిగులు పుట్టించి చివరకు తామే ఓదార్చా లన్న కోరిక సహజంగా ఆడవాళ్ళ కందరికీ వుంటుందేమో మనకు తెలియదు. కానీ యిలాంటి ప్రసంగాన్ని చంద్రమోహన్ ఎంతవరకూ హర్షించగలడన్నదే వాసంతికి సందేహం. హర్షించినా హర్షించకపోయినా తన అభిప్రాయాన్ని చూచాయగానైనా చెప్పి తీరవలసిందే!

మరునాటి ఉదయం చంద్రమోహన్ వాసంతిని పలకరించాడు. నిన్నటిరోజు మీరు పత్రిక కావాలన్నారు గదండీ! ఇదిగో తీసుకోండి. మా ఆవిడ నిన్నటి సాయంకాలానికే దీన్ని చదివేసింటట' అన్నాడు.

పరిచయం యింకా ప్రారంభదశలోనే వుండిపోయింది గానీ, లేకుంటే ఆ పత్రికను తన భుజబలం కొద్దీదూరంగా గిరవాటు పెట్టి వుండేది వాసంతి.

చూస్తుండగానే నాలుగు రోజులు దొర్లిపోయాయి. పరిచయంకూడా నాలుగు మెట్లుపైకెక్కింది. గతుకులులేని రోడ్డుపైన మోటారుకారు పరుగెత్తినట్టుగా చంద్ర మోహన్‌తో జంకుగొంకులు లేకుండా మాట్లాడంగూడా సుసాధ్యంగానే పరిణ మించింది.

"చూడండి చంద్రమోహన్‌గారూ! నాకు మిమ్మల్ని చూస్తే చాలా జాలిగా వుంది" అంది వాసంతి.

"ఎందుకూ? ఎందుకూ" అన్నాడు చంద్రమోహన్.

"లేకపోతే జబ్బుమనిషితో ఎంతకాలమని వేగగలరండీ మీరు! ఇదెవరో ముసలివాళ్ళు, నర్సులు, ఆయాలు చేయవలసిన పని. శక్తి వంచన లేకుండా మీ

అవస్థలేవో మీరు పడుతున్నారు. తీసుకొచ్చి ఆసుపత్రిలో అడ్మిట్ చేశారు. డాక్టర్లున్నారుగదా, మరేం ఫరవాలేదులెమ్మను కుంటున్నారు. కానీ విచారకరమైన విషయమేమిటంటే వైద్యశాస్త్రం సాధించే విజయాలకుగూడా హద్దంటూ ఒకటి వుండిపోయింది..."

ఇంకా ఆశ్చర్యంగానే వాసంతివైపు చూస్తున్నాడు చంద్రమోహన్ "అదేమిటండీ వాసంతిగారూ, అలా చెప్పేశారు! ఆంధ్రప్రదేశ్ అవతరణ ఇంక పది రోజుల్లో వుందనగా నాకు పెళ్ళయింది. పది పన్నెండేళ్ళయిందిగదూ! ఈ పన్నెండేళ్ళలో మా ఆవిడకు మచ్చుకొక్క సారైనా మెడికల్ ఎయిడ్ అవసరం కాలేదంటే నమ్మాలి మీరు! స్వభావ సిద్ధంగా ఆమెలో నిండైన ఆరోగ్యం తొణికిసలాడుతుండేది. ఇంకా నా సంగతి చెప్పండి! జలుబు, తలనొప్పి, కళ్ళు తిరుగడం — అలాంటి జబ్బులు నేను పిలవకపోయినా పలుకుతాయి. కానీ నేను మందులు తీసుకునిగాదు అవి నయంగావడం! మా ఆవిడ తన మాటలతోనే వాటిని మటుమాయం చేసివేసేది. "మీకేమండీ! బాగానే వున్నారే! ఏదీ లేవండీ, అలా పార్కుదాకా వెళ్ళొద్దాం" అంటే, ఇంక పార్కునుంచి గుడి, గుడినుంచీ సినిమా అలా అలా చక్కర్లుగొట్టి రాత్రి ఏ పదింటికో యిల్లుచేరుకునే వాళ్ళం, కాదంటే ఇదేం మాయదారి జబ్బోగానీ, ఇదొచ్చిరెండు మాసాలైంది. ఇదైనా పెద్ద జబ్బేమీగాదు! తిన్న తిండి బొత్తిగా జీర్ణంకాదంతే! ఆకలివేయదు. లేచి నిల్చోడానికైనా ఓపికుండదు. అంతటి నీరసమన్నమాట! ఐనా యిప్పుడేం చూచారు మీరు ? ఆసుపత్రిలో చేర్చాక ఎంతో నయంకదూ? మధ్యాహ్నమయ్యేసరికి అవురావురంటూ ఆకలిగావడం రెండు రోజులనుంచే! ఆకలి వేయడం ఆరోగ్యలక్షణం కదటండీ! ఈ రోజు మధ్యాహ్నం పట్టెడన్నం కూడా తీసుకుంది, డాక్టరుగారి సలహాపైన. అంతెందుకూ, మీరు చూస్తూనే వుండండి వాసంతిగారూ! పదిరోజుల్లో మా ఆవిడకు పరిపూర్ణంగా ఆరోగ్యము కుదరడమూ ఖాయమే! అప్పుడు మేము మీకందరికీ థాంక్స్ చెప్పి, గుళ్ళో నాలుగు కొబ్బరికాయలు కొట్టి చక్కా ఇంటికి వెళ్ళిపోవడమూ ఖాయమే!"

వాసంతి వింటూనే వుందిగానీ, విన్న మాటలన్ని ఆమె బుర్రకెక్కి వుంటాయా అన్నది సందేహమే !

చివరికామె ఎంతో ప్రయత్నం మీద తన మామూలు మూడ్స్‌లోకి రాగలిగింది.

“అలాగైతే మీ ఆవిడకి అనారోగ్యం దాపురించి రెండు మాసాలైందంటారా చంద్రమోహన్‌గారూ? అంటూ ప్రశ్నించిందామె, ఆలోచనా, పరాధీనగా చంద్రమోహన్ గడ్డం వైపు చూస్తూ.

“అవునండీ! పాపం, పూర్‌గర్ల్. మా సక్కుకు నా అన్న వాళ్లెవరైనా వుంటే నేనొక్కణ్ణే! అయిదేళ్ళ పిల్లగానే తండ్రి పోయాడట. ఇటీవల తల్లిగూడా పోయింది. నాకైనా తల్లిదండ్రులైతే వున్నారుగానీ వాళ్ళెక్కడో దూరప్రాంతాల్లో వున్నారు. మా అన్నయ్యకు ఢిల్లీలో వుద్యోగం. ఉద్యోగవశాత్తు నేనిలా రావలసి వచ్చింది. ఇక్కడ నాకైనా, మా సక్కేనండీ దిక్కు....”

ఈ ప్రసంగం జరిగిన తర్వాత వాసంతి చంద్రమోహన్‌తో మాట్లాడడం క్రమంగా తగ్గి పోయింది.

సక్కుబాయి ఆరోగ్యానికి సంబంధించి నంతవరకు నర్సు వూహించిన దానికన్నా, ఆవిడ భర్త వూహించిందే నిజమైంది. పదిహేను రోజులలో ఆమె ఆరోగ్యం చక్కబడింది. సెలవు తీసుకోవలసి వచ్చేసరికి వాసంతి డ్యూటీలో లేదు. తనకు మరీ మరీ థాంక్స్ చెప్పమన్నారట! మార్గరెట్ చెప్పింది.

* * *

రెండు మూడు వారాల తర్వాత ఒకనాటి సాయంకాలం బజారుగుండా వెళ్తోంది వాసంతి. బట్టల షాపులోనుంచీ వెలుపలికి వస్తున్న సక్కూబాయి ఆమెకు కనిపించింది. మునుపటిలా ఆమెనిప్పుడు చక్కనిచుక్క కాదనడానికి ధైర్యం చాలడం లేదు. కానీ ఆమెను వెన్నంటి మెట్లు దిగుతున్న ఆ యువకు

డెవరు? నాలుగైదు క్షణాలు పరిశీలనగా చూచిన తర్వాతగానీ అతడు చంద్రమోహ నేనని పోల్చుకోలేక పోయింది వాసంతి. కారణం లేకపోలేదు. ఇప్పుడతనికి గడ్డం లేదు. సక్కుబాయి తనముఖం చూచుకోడానికిప్పుడు నిలువుటద్దం అక్కర్లేదు. ఆ చెక్కుటద్దాలే చాలు!

—ఆంధ్రవారపత్రిక– 1966.

# శుక్రనీతి

మేడపైన గదిలో కిటికీ ప్రక్కన కూర్చుని చదువుకుంటున్నాను. చేతిలో ఉన్నది పాఠ్యపుస్తకమై, నేను విద్యార్థినై వుంటే ఎంత బాగుండేది! ఆ బంగారు కాలం గడచిపోయింది. నేను నిరుద్యోగిని. ఇప్పుడున్నంత తీరిక జీవితంలో మరెప్పుడూ నాకు దొరకదని చెప్పి బుద్ధిమంతులు కొందరు మురిపిస్తూ వుంటారు. ఆ మాట నిజమేగానీ ఒక విషయం గమనించాలి. బహుళ పంచమి జోత్స్న కూడా ఒకాయన్ను భయపెట్టిందట! అవునుమరి. చదువురాని, మొద్దబ్బాయిని బడిగంట భయపెట్టదా? షుగర్ కంప్లెయింటువున్న వ్యక్తిని జిలేబీల ప్లేటు భయపెట్టదా? అట్లాగే నిరుద్యోగిని పరీక్షకు గురిచేసేది తీరిక. చీకటింట్లో క్రమ్ముకున్న ముంతపొగలా అది నిరుద్యోగిని ఉక్కిరిబిక్కిరి చేసేస్తుంది ఊపిరి సలపనియ్యదు. ఇప్పటికిప్పుడు చూడండి. మధ్యాహ్నం నుంచీ ప్రయత్నించినా ఒక కథను తీరా మాథా చదవలేక పోతున్నాను. ఒక ముఖ్యమైన పనిమీద ఈ వూరొచ్చాను. ఆ పని నెరవేరాలంటే మా మామయ్య తోడ్పాటు అత్యవసరం. ఆయన వూళ్ళోలేడు. ముత్యాలపాడు వెళ్ళి మూడు రోజులైందట.సాయంకాలానికి తిరిగిరావాలని అత్తయ్య భరోసా యిస్తూ వుంది.

ముత్యాలపాడు ముగ్గురాళ్ళ గనుల్లో పనిచేసే కార్మికులకు యాజమాన్యంతో తగాదా వచ్చిందట. వాళ్ళ సదుపాయాలు హెచ్చించమన్నారు. యజమానులు వీలుకాదని హఠంపట్టి కొత్త కూలీలను తోలుకొస్తామని సవాలు చేసారు. కానీ ఆ పని చేతగాక కార్మికులపైన కక్ష తీర్చుకోవడం కోసం 'లాకౌట్' ప్రకటించారు. చేసేదిలేక కొందరు కార్మికనాయకులు నిరాహారదీక్షకు పూనుకున్నారు. ఈ సందర్భంలో కార్మికోద్యమానికి నాయకత్వం వహించడంకోసం మా నరసింహం మామయ్య రెక్కలు గట్టుకున్నట్టుగా వెళ్ళి, ముత్యాలపాడులో వాలిపోయాడట. అదీ సంగతి.

అసలు మా మామయ్య డ్యూటీయే అది! కార్మికులకు అన్యాయం జరిగినా, విద్యార్థులు హక్కులకోసం పోరాడినా, ఎన్జీవోలకు మద్దతు ఇవ్వాలన్నా– పీడితు

లందరికీ బాసటగా నిలిచేవ్యక్తి మా మామయ్య. మానవ నాగరికతకు గమ్యం సోషలిజమేనని ఆయన విశ్వాసం. ఆ గమ్యాన్ని చేరుకోడానికి వర్గపోరాటమే మార్గమని ఆయన కృత నిశ్చయం. ప్రజల్ని అందుకు ఉద్యుక్తులుగా చేయడమే ఆయన ధ్యేయం. ఎన్నుకున్న లక్ష్యాన్ని బట్టీ ఆయన పాలనా యంత్రాంగానికి తీరని తలనొప్పిగా వుండాలికదా! అలాంటిదేమీ కనిపించదు. మీదుమిక్కిలి హైదరాబాదులో ఆయన మాటకు బాగా చెల్లుబడి వుంది. పురాణయుగంలో విరోధం ద్వారా భక్తిని ప్రటించే సాంప్రదాయం ఒకటి ఉండేదట ! దానిపేరు 'వైరభక్తి' రావణునికి రాముడుపైన, కంసుడికి శ్రీకృష్ణునిపైన నెలకొన్నది ఈభక్తేనట! బహుశా మా మావయ్యకు, ప్రభుత్వానికీ మధ్య అలాంటి సంబంధమేదో వుండి వుండాలని నా వూహ !

సరే, మా మామయ్య స్వీయచరిత్ర నాకెందుకు! ఒకసారి ఆయన్ను హైదరాబాదు తీసుకెళ్తే నా రొట్టెవిరిగి తేనెలో పడుతుంది. అదీ ఆలస్యం చేయడానికి లేదు. అర్జంటుగా వెళ్ళాలి...

నేను గదిలోనే వున్నప్పటికి, నా చూపులన్నీ రోడ్డుపైనే వున్నాయి, మామయ్య రాకకోసం సల్పుతున్న ప్రతీక్షవల్ల కలిగిన చిరాకుతోపాటు ఆనాటి వాతావరణం గూడా చీదర చీదరగా వుంది. రకరకాల వేషాలు సంతరించుకుని నల్లటి మబ్బులు ఆకాశాన పరవళ్ళు త్రొక్కుతున్నాయి. ఈతాకుతో గుచ్చినట్టుగా ఈదురగాలులు విసవిసలాడిపోతున్నాయి. చాలనిదానికి కిటికీ చువ్వలనుంచీ కానవస్తున్న దృశ్యం ఒకటి వద్దన్నా గుండెల్ని పిండేస్తూ మతి పోగొడుతూంది. వూరి నుంచి కొంచెం వైదొలగి వుండేటట్టుగా మామయ్య కట్టించుకున్న మేడకొక వంద గజాల దూరంలో రోడ్డుదాపున ఒక చింతచెట్టువుంది పిచ్చిగుండ్లవాళ్లో, తిరుగుదాసరి వాళ్ళో, కోనాముష్టివాళ్లో-ఎవరో గానీ మొత్తంపైన దేశదిమ్మరులని మాత్రం చెప్పగలను-తట్టలు బుట్టలు,మూటలు,గోనెసంచులు ఎక్కడివక్కడ సర్దిపెట్టుకుని ఆ చెట్టు బోదెచుట్టూ ఆశ్రయం ఏర్పరచుకున్నారు. మగవాళ్ళు,ఆడవాళ్ళు అడుక్కొరావడం కోసం వూరిపైకి వెళ్ళారేమో,ముసలా ముతకా, పిల్లాజెల్లా మాత్రమే చెట్టుక్రింద కనిపిస్తున్నారు. మగపిల్లల్లో చాలామందికి గోచీలు కూడా లేవు. ఆడపిల్లలు చీలికలు నాలికలైన పేలికలనే మొలకు చుట్టుకున్నారు. కొందరు ముసలివాళ్ళు ఒకచోట గుంపుగాకూర్చుని కాకివెదురుతో పీకలు,తాటాకులతో గిలకలు తయారు చేస్తున్నారు. నోట పళ్ళులేని ఒక ముసలావిడ వక్కా- ఆకుకు బదులుగా చింతచెట్టు బెరడును

అదేం మర్యాద! ఊహూ, ససేమిరా వీల్లేదు" అంటూ ఆమె గిరిగీచేసింది. ఆ యింట్లో ఆమెది సుగ్రీవాజ్ఞ! రామకృష్ణ నాలుగైదు రోజులు వెంకటగిరిలో వుండి పోయాడు.

మళ్ళీ అక్కడ నుంచీ బయల్దేరినప్పుడు గూడా ఆ యింటి యిల్లాలిని సత్కరించడానికి మరచిపోలేదు. పార్వతమ్మకు చీరలకు కొదువ లేదు. ఐనా ఆమె ఈ చిన్ని కానుకను స్వీకరిస్తూ మురిసిపోయింది. జన్మతహా కాస్తా ఆవేశ స్వభావమేమో, ఆమె సుమిత్రను దగ్గరకు తీసుకొని "చిట్టి తల్లీ! రామకృష్ణ చాలా మంచివాడు. అంత మంచివాడు గనుకనే నీలాటి యిల్లాలు దొరికింది. మీరు పై సంవత్సరం వేసవి సెలవుల్లో తప్పకుండా రావాలి. అప్పటికి మీరు ఇద్దరగా వస్తే నేనొప్పుకోను. మనుమణ్ణి మరచిపోకండి .." అని దీవించింది.

పది పదిహేను రోజులు తర్వాత దంపతులు తిరుగు ప్రయాణం చేస్తు న్నారు రాత్రివేళ. మాట్లాడినంతసేపు మాట్లాడి ప్రయాణికులు నిద్రమత్తులో జోగుతున్నారు. వాళ్ళ మాటలు వాటితో కలిసి వినవచ్చిన రైలు చక్రాల చప్పుడు —ఈ శబ్ద సమ్మేళనాన్ని జోలపాటక్రింద స్వీకరించి సుమిత్ర కాసేపు కునుకు దీసింది. హఠాత్తుగా ఆమె మేలుకునేసరికి రైలు పంటపొలాలమధ్య పరుగెడుతోంది. రామకృష్ణ కిటికీలో నుంచి నిశా సౌందర్యాన్ని అవలోకిస్తున్నాడు.

"ఇంకా రెండు చీరలు మిగిలిపోయాయి గదండీ!" అంది సుమిత్ర సంభా షణకు ఉపక్రమిస్తూ.

"అవును సుమిత్రా! మానవుడికి మంచి వూహ కలిగితే మాత్రం చాలదు. ఆ వూహ సఫలం కావడానికి అవసరమైన అనుకూల పరిస్థితులు కూడా చేయి దాటి పోకుండా వుండాలి."

సుమిత్ర కర్థంకావడం లేదు.

"అవును సుమిత్రా మనం అయిదు చోట్లకు వెళ్ళాము. మిగిలిన రెండు చోట్లకూ వెళ్ళలేకపోయాము. శేషమ్మవ్వ బొంబాయిలో వుందట. అక్కడ ఆమె కుమారుడు వుద్యోగంలో వున్నాడు. అప్పటికి ఆవిడే కాస్తానయం. మా రాజేశ్వరి వదిన రాష్ట్రాన్ని, దేశాన్నేగాక లోకాన్నే విడిచిపెట్టిందని మొన్ననే తెలిసింది..."

ఒక క్షణం ఆగి మళ్ళీ ప్రారంభించాడు రామకృష్ణ. "సహనానికి పర్యాయ

పదమేమిటని నువ్వడుగుతావనుకో సుమిత్రా, నేను రాజేశ్వరి వదిన అని చెబుతాను. ఇంటి నిండా బిడ్డలు తన సిగరెట్లపద్దుకు, టిఫిను ఖర్చులకూ పోనూ మిగిలిన జీతాన్ని తెచ్చి భర్త ఆమె దోసిట్లో పారేసేవాడు. ఆ డబ్బును చేత బట్టుకొని రాజేశ్వరి వదిన ఎంత గుంభనంగా సాగించేది సంసారం! స్వయంగా తనే బజారుకు వెళ్ళి బియ్యం తెచ్చాకునేది. కట్టెలు తెచ్చుకునేది. బిడ్డలకు జబ్బుచేస్తే తనే హాస్పిటలుకు వెళ్ళేదిగూడా. ఆమె కష్టాలన్నిటినీ కళ్ళతోచూస్తూ గూడా నేను ప్రతి ఆదివారమూ ఆమెకు అతిథిగా దాపురించేవాణ్ణి. తను తినకుండా మిగిలించిన అన్నాన్ని నాకు పెట్టి ఆమె పస్తుండిన రోజులెన్నో నేను చెప్పలేను... తెల్లబోయి చూస్తున్నావేం సుమిత్రా! తెలియడం లేదూ, యిదంతా ఒక వారాలబ్బాయి స్వీయ చరిత్ర..."

"ఏమిటీ?" విస్మయంతో ప్రశ్నించింది సుమిత్ర.

"నిజం! చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోయారు.పంతులుగారి యింట్లోవుండి ఆయన చెప్పినపని చేస్తూ అయిదో తరగతి వరకూ చదువుకున్నాను. జీవకారుణ్య సంఘంలో ఉచిత భోజన సౌకర్యాలున్నాయని చెప్పి పట్టణానికి పంపారు పంతులు గారు. అక్కడికి వెళ్ళి వాకబు చేసేసరికి అలాంటి సంఘంలేదని తెలిసింది. హెడ్మాష్టరు గారిని చూచాను. 'కావలిస్తే ఫీజులేకుండా చూస్తాను వారాలు ఏర్పాటు చేసుకోమన్నా'రాయన. శ్రీ కంఠంగారు అప్పుడు హైస్కూల్లో లెక్కలమేష్టారు. ఆర్జన తక్కువైనా ఆయన ఉదారులు. ఇంటికి తీసుకెళ్ళారు. ఆయన భార్య వారంలో ఒక్కరోజు భోజనం పెట్టడానికి సమ్మతించింది. శ్రీకంఠం మేష్టరుగారే నన్ను పరంధామయ్యగారింటికి తీసుకెళ్ళారు. పరంధామయ్యగారక్కడ తాశీల్దారుగా వుండే వారు. ఇటు మేష్టరుగారు. అటు తాశీల్దారుగారు నాపట్ల శ్రద్ధ వహించడం వల్ల ఏడు రోజుల భోజనపుటేర్పాట్లు కుదిరాయి. ఓ రోజు సుబ్బరామయ్యగారిల్లు ఆయన మునిసిపాలిటీలో వుద్యోగి. మరో రోజు శేషాచలంగారిల్లు. ఆయన డిస్ట్రిక్టు కోర్టులో ట్రాన్సులేటరు, ఆరేళ్ళ హైస్కూలు చదువూ యిలా జరిగిపోయింది. డబ్బులేనివాడికి వున్నత విద్య అందని మ్రానిపండే! కానీ దిక్కులేనివాడికి 'బాబూ! నువ్వు తిన్నావా, లేదా? అనగలిగేపాటి ఆత్మీయత అంతకన్నా గగనకుసుమం. పెద్దమ్మ, పార్వతమ్మ, రాజేశ్వరి వదిన వీళ్ళందరూ ఆ లోటును కొంత వరకూ భర్తీ చేయగలిగారు. వాళ్ళు నాకు జీవితంపథంలో ఒకచోట తారసిల్లారు. నేనొక మనిషిగా తయారుకావడానికి తోడ్పడ్డారు. వాళ్ళ ఉపకృతికి

ప్రత్యుపకృతి చేయడం నాచేత సాధ్యంకాని పని అని నాకు తెలుసు. కానీ మన చేతిలోని పని గనుక కృతజ్ఞత కలిగి వుండవచ్చును గదా!'

* * * *

క్రొత్త కాపురం. ఓ రోజు మధ్యాహ్నం కాలేజీనుంచి యింటికి వచ్చాడు రామకృష్ణ.

"ఏమండీ! మీకు చెప్పకుండా నేనొక పనిచేశాను." అంది సుమిత్ర.

"మంచిపనే గదా! ఐతే సంతోషమే" అన్నాడు రామకృష్ణ.

"అదేంపని అని అడిగితే ముత్యాలు రాలిపోతాయటండీ?"

"అభ్యంతరం లేకపోతే చెప్పుమరి!"

"ఆ రోజు మా యింటికొచ్చిన కుర్రాడు, జ్ఞాపకముంది కదూ-వాడీరోజు వీధిలో వెళ్తూ కనిపించాడు..."

"..............."

"పిలిచి ఎక్కడ భోజనం చేస్తున్నావబ్బాయ్! అని అడిగాను. "ఇంకా ఎక్కడా కుదరలేదండి! వాళ్ళూ వీళ్ళూ సహాయం చేస్తామని చెబుతున్నారు" అన్నాడు.

"అందుకు నువ్వేమన్నావు?"

"ఆ ఏర్పాట్లేవో కుదిరేదాకా మన యింటికి రమ్మన్నాను."

రామకృష్ణ భార్యను సరసకు తీసుకుంటూ "నువ్వు జగన్నాథంగారి అమ్మాయివే సుమిత్రా! కానీ రామకృష్ణ భార్యవని గూడా ఋజువు చేసుకోగలిగావు" అన్నాడు.

# స్నేహ ముద్ర

ఎంతోకాలం నుంచి వేచి చూచిన ఆహ్వానం రానే వచ్చింది. విజయ సారథి కుమార్తెకు పెళ్ళి. వేదిక జయనగర్‌లో శ్రీ రాజరాజేశ్వరి కళ్యాణ మండపం. కలాశ పాళెం బస్‌స్టాండులో బస్సు దిగి, 8 బి నిగానీ, 8 ఇని గానీ పట్టుకుంటే కళ్యాణ మండపం ఎదుటనే దిగొచ్చునట. ఆహ్వాన పత్రిక క్రింది భాగంలో సూచన కాన వచ్చింది. వెళ్ళేరోజు, తిరిగి వచ్చేరోజు, మధ్యలో పెళ్ళిరోజు. వెరశి బడికి మూడు రోజులు సెలవు పెట్టాల్సి వుంటుంది. ఫరవాలేదు. విజయసారథి పనిపైన అవసర మైతే నెల రోజులైనా సెలవు పెట్టొచ్చు. అది కాస్తా లీవ్ ఆన్ లాస్ ఆఫ్ పే అయినా తటపటాయించను. పైగా ఇంకొకటి ఆ పెళ్ళికి ఉత్తరప్రదేశ్ నుంచీ రవి శంకర్ సిన్హా తప్పకుండా వస్తాడు.

రవిశంకర్ సిన్హా...ఎంత మంచి పేరో! నాకు వుంది ఒక పేరు. ఎందుకూ సుబ్బారావు అని! అస లొకప్పుడు సుబ్బారాయుడు అన్నదే మదీయ నామధేయం. చచ్చి సేయం గల విన్నపాలతో దాన్నెట్లాగో సుబ్బారావని మార్పించుకున్నాను. అయినా స్నేహితుల పేర్ల ముందు నా పేరు వెలవెల పోతూనే వుందని నాకు తెలుసు. ఏం చేయాలి? అంతా మన కర్మ.

రవిశంకర్ సిన్హా అంటే అప్పటికతడేదో పరాయి రాష్ట్రానికి, పరాయి భాషకు చెందినవాడని అనుకున్నారంటే మీరు పప్పులో కాలు వేసినట్టే. బర్మాలో పదిహేనేళ్ళకు పైగా నివసించి, రెండో ప్రపంచ యుద్ధ సమయంలో స్వదేశానికి తిరిగి వచ్చిన ముల్లంగి యతిరాజులు నాయుడుగారు రంగూనులో వుండగా పుట్టిన తన కుమారుడికి రవిశంకర్ సిన్హా అని పేరు పెట్టుకున్నాడు. "ఏమిటండీ నాయుడు గారూ! ఇదేమిటో తెలుగు పేరులా లేదే" అని ఎవరైనా సందేహం వెలి బుచ్చితే ఆయన పకపకా నవ్వి "మా రెండోవాడి పేరేందో తెలుసునా?" అని ఎదురు ప్రశ్న వేసేవాడు. ఆ రెండో అబ్బాయి పేరు బిపిన్‌చంద్ర అగర్వాల్. అబ్బాయిల తర్వాత నాయుడుగారికి ఇద్దరు అమ్మాయిలు గూడా వుండిపోయారు. పెద్దమ్మాయి దీప్తి. రెండోది తనూజ! నాయుడుగారు భలే గమ్మత్తయిన మనిషి.

అయితే పేర్లు పెట్టడంలో మగ, ఆడ పిల్లలకు మధ్య వలపక్షం పాటించే కుసంస్కారి మాత్రం కాదు. ఎప్పుడైనా ఆ ప్రసక్తి వస్తే "ఇంకా నయం! దీప్తి త్రివేది అనీ, తనూజా ముఖర్జీ అని పెట్టనందుకు సంతోషించండి." అనే వాడా యన.

హైస్కూల్లో చేరడం కోసం నేను చిత్తూరు వెళ్ళి మా దూరపు బంధువుల ఇంట్లో పేయింటింగ్ గెస్టుగా కుదురుకునే నాటికి యతిరాజులు నాయుడుగారు సుబేదారు వీధిలో ఓ పాశగాడి పాత కట్టడాన్ని కొనుక్కుని, రంగూను వాస్తు నగిషీలతో దాని రూపు మార్చి అందులో దర్జాగా జీవిస్తున్నాడు.

నేనేమో పల్లెటూరివాడినైపోయాను. అమాంతంగా టౌనులోకి వెళ్ళి పడినందు వల్ల నా పని చిన్న తోటలోనుంచి పెద్ద అడవిలోకి విసిరిపారవేసినట్టయింది. చురుగ్గా, నాజుగ్గా, ధీమాగా నాకు తెలియని విషయాలను గురించి మాట్లాడుకుంటూ నాకు తెలియని ఆటలు ఆడుకుంటూ ఆకాశానికి మూడే బారలన్నంత వుత్సాహంగా వుండే పట్నవాసపు కుర్రవాళ్ళ మధ్య నేను బేలముఖం పెట్టుకుని, బిక్కరించే వాడిననుకుంటాను. ప్రక్క ప్రక్కనే కూచున్నప్పటికీ డెస్కు మేట్లకు—నాకు మధ్య ఎంతో దూరమున్నట్టు తోచేది. వాళ్ళతో కలిసిపోయే చొరవ నాకు లేదు. నన్ను తమతో చేర్చుకోవాలన్న ధ్యాస వాళ్ళకు లేదు. దిగులు దిగులుగా రోజులు వెళ్ళబుచ్చేవాణ్ని. ఎందుకొచ్చిన చదువురా బాబూ, పల్లెకు పారిపోదామనిపించేది. నాన్నకొడతాడని భయం. ఒడ్డున పడిన చేపలా నేనిలా గిలగిలలాడిపోతుండగా ఒక విచిత్రం జరిగింది. దసరా సెలవుల తరువాత తిరిగి వెళ్లేసరికి క్వార్టర్లీ పరీక్షల పేపర్లు మా చేతి కొచ్చేశాయి. ఒకరిద్దరు టీచర్లు పేపర్ల కట్ట చేతిలో వుంచుకొని గదిలోకి ప్రవేశిస్తూ "ఈ క్లాసులో సుబ్బారావంటే ఎవరు?" అని ఆరా తీశారు. మరి కొందరు పేపర్లు ఇస్తూ ఇస్తూ నా పేపరు దగ్గరికి వచ్చేసరికి "సుబ్బారావంటే నువ్వేనా? ఏ ఊరు బాబూ నీది? మీ నాన్నగారేం చేస్తుంటారు?" అని పరామర్శిం చారు. అంతటితో మన దశ తిరిగిపోయింది. క్లాసుకు ఫస్టొచ్చిన కుర్రాడు తమ ప్రక్కనే కూర్చోడం నా డెస్కు మేట్లకు గొప్ప గర్వకారణమై పోయింది. ఇతరుల జట్టులో చేరకుండా వాళ్ళతో చేరితే చెడిపోతావని హెచ్చరిస్తూ వాళ్ళు హమేషా నన్ను కనిపెట్టుకుని వుండసాగారు. పుర ప్రముఖుల బిడ్డలతో సహవాసం గదా! నా మట్టుకు నేను కూడా వాళ్ళ స్నేహాన్ని అపురూపంగానే భావిస్తూ, వాళ్ళ కిష్టమై నట్టుగానే నా ప్రవర్తనని మలుచుకోసాగాను.

అన్నట్టు విజయసారథిని పరిచయం చెయ్యలేదు గదూ! సారథి అద్వకేటు రంగ రామానుజంగారి కుమారుడు. సుందరయ్యేరు వీధిలో వాళ్ళ స్వంత యిల్లు. నేను సుందరయ్యేరు వీధిని, సుబేదారు వీధిని కూడా దాటుకుని మరి కొంతదూరంలో వున్న గూళింగ్స్ పేటకు వెళ్ళవలసి వుండేది. ఇందాకా మా దూరపు బంధువు లన్నానే ఆ ఇంటి యజమాని మునిసిపాలిటీలో బిల్ కలెక్టరుగా పనిచేస్తూ చిన్న పెంకుటింట్లో అద్దె కుండేవాడు. ఉదయవేళల్లో నేనింత చద్దన్నం తిని, చక్కా సుబేదారు వీధి కొచ్చేసేవాణ్ని. గొలుసు నుంచి కుక్కను వదిలిపెట్టలేదన్న నమ్మకము కుదిరిన తరువాత మెల్లగా గేటు తీసుకుని వరండాలోకి వెళ్ళేవాణ్ణి. అక్కడ నేను తచ్చాడుతున్న విషయం పనిమనుషులెవరైనా తెలియజేస్తే చొక్కాకు గుండీలు వేసుకోకుండా, బూట్లకు నాడాలు బిగించకుండా పుస్తకాల సంచిని నేల పైన్నే ఈడ్చుకుంటూ సిన్హా తొందర తొందరగా తయారై వచ్చేసేవాడు. ఇద్దరమూ కలసి సుందరయ్యేరు వీధికి వెళ్ళేవాళ్ళం. కచేరీ గది ప్రక్కన మా పొలకువ పసికట్టగానే రంగరామానుజంగారు "అడేయ్ సారథీ! ఉంగో ఫ్రండ్స్ వందాచ్చు" అని లోపలికి కేక పెట్టేవాడు. ముగ్గురమూ అదొక రివాజుగా చేతులు కూర్చుకుని బడి కంపౌండులో అడుగు పెట్టేసరికి సైకిల్లో వచ్చి దిగే ఇంగ్లీషు మాస్టారుగారు మమ్మల్ని "త్రి మస్కిటీర్స్"గా సంభావించేవారు. 'త్రి మస్కిటర్స్' అంటే ఎవరికి తెలుస్తుంది? త్రిమూర్తులంటే అందరికీ తెలిసిన విషయం. రాను రాను పరిచయ వర్గాల్లో మాకు త్రిమూర్తులన్న పేరు రూఢి పడిపోయింది.

ఇక చెప్పేదేముంది! హైస్కూల్లో చదువుకున్న ఆరేళ్ళూ మా పాలిటికి ఆరు నిమిషాల్లా గడిచిపోయాయి. ఎప్పుడెప్పుడు ఆఖరు గంట మోగుతుందా అని వేచి వుండేవాళ్ళం. బడి నుంచి బయట పడగానే పుస్తకాలన్నీ విజయసారథి ఇంట్లో పారేసి, ఇచ్ఛ వచ్చిన వైపుకు షికార్లు లంకించుకునే వాళ్ళం. చిత్తూరు పట్టణం లోనూ, దాని పరిసరాల్లోనూ దర్శనీయ ప్రదేశాలేవీ లేదన్నది జనం అనుకునే మాట. కానీ, చూడదగిన ప్రదేశాలని కొన్నింటికి ముద్ర వేసేశాము. ఏటి కవతల అరగొండకు వెళ్ళే రోడ్డుపైన ధర్మరాజుల వారి గుడి, కట్టనుంచి కావైపున తిరుపతికి వెళ్ళే రోడ్డుపైన సప్త కన్నికల గుళ్ళు, ఊరి మధ్యలో కుమారస్వామి గుట్ట. పలమనేరు వెళ్ళే రహదారిపైన ఇరువారం బ్రిడ్జి. అన్నిటికన్నా ముఖ్యమైనవి గిరింపేట చెరువుకు-రైలుదారికి మధ్యగల రిజర్వు ఫారెస్టులో ముగ్గులో వేసిన గీతల్లా

అల్లిబిల్లిగా వ్యాపించిన రౌండ్ రోడ్స్ ధాతు కరువురోజుల్లో జిల్లా కలెక్టరుగా వుండిన ఒక ఇంగ్లీషు దొర పేద ప్రజల జీవనోపాధికోసం వాటిని వేయించాడట. శని, ఆదివారాల్లో మేము కొంచెం ముందుగా వెళ్ళి ఆ రౌండ్ రోడ్స్ అన్నీ సర్వే చేసేవాళ్ళం. ఒకచోట రోడ్డు నుంచి కొంత దూరంలో గుబురైన చెట్ల మధ్య "ఈజీ చెయిర్" అంటూ ఒకటుండేది. మరేం లేదు. అర్ధ చంద్రాకారంగా వెనక్కు వాలి ఆనుకోవడానికి వీలుగా వున్న ఓ గుండుకు ఆనికగా బెంచీలలాగా రెండు బండలు వేయించారు. ఎన్నెన్ని సెలవురోజులు, ఎన్నెన్ని సుదీర్ఘ సాయంకాలాలు మేమక్కడ కథలూ, కబుర్లూ చెప్పుకుంటూ కాలక్షేపం చేశామో లెక్కలేదు. కుటుంబ సభ్యులందరినీ ఎదుట కూచోబెట్టుకుని రంగరామానుజంగారు చెప్పిన షెర్లాక్ హోమ్స్ పరిశోధనలు, గలివర్, సింద్‌బాద్, క్రూసో సాహసయాత్రలు, షేక్స్పియరు నాటక కథలు మొదలైన వాటిని విజయసారధి మాకు వల్లించేవాడు. నేను నా పల్లెటూరి సంస్కృతి నుంచి పుక్కిట బట్టుకున్న కాశీమజిలీ కథలు, భట్టి విక్రమార్కుల కథలు రేచుక్క-పగటి చుక్కల కథలు చెప్పగలిగేవాణ్ని. "కథలు చెప్పడం నాచేతగాదురా బాబూ! కావలిస్తే ఏమైనా పుస్తకాలు తెచ్చిస్తాను" అనేవాడు సీన్హా. కొండదాసరి, వారేవా చర్చి గంట, పంతులమ్మ లాంటి కొవ్వలి నవలలు, నీవేనా క్యాలూరాయి, వాడే వీడు, చోర శిఖామణి లాంటి అపరాధ పరిశోధక నవలలు యతి రాజులు నాయుడుగారి పుస్తక సంచయం నుంచి సీన్హా ద్వారా నేను సంపాదించిచదివినవే!

ప్రయాణీకు లెంతకాలం కలిసి పయనించినా ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట విడిపోక తప్పదు. హైస్కూలు చదువుల చివర మా విషయంలోనూ అదే జరిగింది. యతిరాజులు నాయుడుగారు సీన్హాను మదరాసుకు పంపి బిజినెస్ మేనేజ్‌మెంట్ చదివించారు. రంగనామాంజంగారికి మట్టుకు తన కొడుకు ఇండియాకు ప్రైమ్ మినిష్టర్ కావడం కన్నా తనలాగ లీడింగ్ లాయరు గావడమే ఉత్తమోత్తమంగా తోచింది. విజయసారధి అర్హతలైతే సంపాదించాడు గానీ, తండ్రిలా ప్లీడర్ వృత్తిలో రాణించలేకపోయాడు. పది పన్నెండేళ్ళ పర్యంతం తండ్రిచాటు బిడ్డగానే [జూనియర్ లాయరుగా నన్నమాట!] మల్లగుల్లాలు పడి, ఆయన కాస్తా కళ్ళు మూసిన తరువాత బెంగుళూరు వెళ్ళిపోయి, అక్కడ తనకు పిల్లనిచ్చిన మామగారి ప్రాపకంలో ఏదో వ్యాపారం మొదలెట్టాడు. ఆ ప్రయత్నం కూడా కలిసి రాలేదు. ఆ తరువాత కొందరు భాగస్వాముల్ని కలుపుకుని ఒక

పాలిటెక్నిక్ కళాశాల నడుపుకోడానికి కర్ణాటక ప్రభుత్వం నుంచి అనుమతి పుట్టించుకున్నాడు. ఆ విద్యా సంస్థ సారథికొక కల్పవృక్షంలా వుపకరించింది. అయిదేళ్ళు తిరగకముందే జయనగర్‌లో ఇల్లు కట్టించుకున్నాడు. కారు కొన్నాడు. రోటరీ క్లబ్బులో మెంబరుగా చేరాడు చాలని దానికి కొన్నేళ్ళ క్రితం కార్పొరేషన్ ఎన్నికల్లో కౌన్సిలర్‌గా కూడా పోటీ చేశాడు. డిపాజిట్టు దక్కినట్టు లేదు. వుండ బట్టలేకనే నొక ఓదార్పు వుత్తరం రాస్తే 'గెలవడం గానీ, ఓడడం గానీ ముఖ్యం కాదు. ఎన్నికల్లో నిలబడడమే ముఖ్యం. ఇందువల్ల నేను పేరెన్నికగన్న సిటీ జనంలో ఒక్కణ్ణిగా లెక్క కొచ్చేశాను' అని రాశాడు.

రవిశంకర్ సిన్హా విషయంలో ఇలాంటి ఒడిదుడుకు లేవీ ఏర్పడినట్టు లేదు. సూటిగా దూసుకెళ్ళి లక్ష్యాన్ని అందుకున్న రాకెట్టులా అతడి వుద్యోగ యాత్ర సఫలమైపోయింది. పెద్ద ఫర్మ్‌లో చిన్న వుద్యోగిగా చేరి ఇరవై ఏళ్ళు గడిచేలోగా దానికి మేనేజరై పోయాడు. నాలుగు చక్రాల వాహనాల విడి భాగాలు తయారు చేసే ఆ ఫాక్టరీ ఢిల్లీకి డెబ్బై అయిదు కిలోమీటర్ల దూరంలో వుందట. అయితే, దానికి సంబంధించిన సర్వ వ్యవహారాలకు ఢిల్లీయే కార్యస్థానం. అందువల్ల నెలలో ఇరవై రోజులైనా సిన్హా దేశ రాజధానిలోనే వుంటాడట. ఆ విధంగా జాతీయ స్థాయిలో మంత్రులు, మాజీ మంత్రులు, ప్రభుత్వ కార్యదర్శులు, బడా బడా వణిక్ప్రముఖులు, ఇంకా అలాంటి వాళ్ళతోనే అతడికి దోస్తీ. 'ఇద్దరు సెక్రెటరీలు, మూడు కార్లు, నాలుగు ఫోన్లు– ఎలాగైనా మనవాడు అడిగి వచ్చినవాడు లేరా సుబ్బారావ్!' అంటాడు విజయసారథి, సిన్హాను గురించిన వివరాలన్నీ నాకు సారథి మూలంగానే తెలిసివచ్చాయి.

మిత్రులతో పోల్చుకోవడానికి వీల్లేదు గానీ, నా ఉద్యోగ జీవితంలో నేనూ ఎంతో కొంత ప్రగతిని సాధించినట్టే చెప్పుకోవచ్చు. సెకండరీ గ్రేడు టీచరుగా ఓ పల్లెటూరి బడికి పరిమితమైపోకుండా, ప్రయివేటుగా బి.ఏ.కు కట్టి, ఆపైన బి ఇడి. కూడా పూర్తి చేశాను. జిల్లా పరిషత్తు వాళ్ళు హైస్కూలు టీచరుగా ప్రమోషనిచ్చి నాలుగూళ్ళు తిప్పించి, ఇటీవల జిల్లా హెడ్ క్వార్టర్స్‌కే బదిలీ చేశారు. చదువుకున్న స్కూల్లోనే టీచరు గావడం నాకు అందల మెక్కినంత ఆనందం.

గడిచిన ముప్ఫై ఏళ్ళలో నేను విజయసారథినైతే నాలుగైదుసార్లు కలుసుకున్నాను. సిన్హాను కలుసుకోవడం మాత్రం కుదరలేదు. వాడు తప్పకుండా సారథి కుమార్తె పెళ్ళికి వస్తాడని నా ఊహ. అబ్బ, మళ్ళీ ఎంత కాలానికి మేం ముగ్గు

రమూ కలుసుకోడం! వివాహానికి ఆహ్వానం అందినప్పటి నుంచి నా మనసులో ఆనందం పరవళ్ళు తొక్కుతోందంటే అందులో ఆశ్చర్య మేముంది!

* * * *

బెంగుళూరు కూడా దేశంలోని మిగిలిన నగరాల లాంటిదే గావచ్చు. మురికి వాడలు, చీకటి గొందులు, ఈతిబాధలు, పేవ్‌మెంట్ల బ్రతుకులు అక్కడ కూడా వుండొచ్చు. కానీ, నగరం నడిబొడ్డున దిగి బస్సులలోను, ఆటోలలోను తిరిగి చూచిన వాళ్ళకది 'ఆకులు రాలని, పూలు వాడని వసంతారామం'లా కనిపిస్తుంది. నేను జయనగర్ చేరుకునేసరికి మలిసంజవేళ కావచ్చింది. విద్యుద్దీపాల కాంతులు చెట్ల నీడలతో దోబూచు లాడుతున్నాయి. హఠాత్తుగా వెళ్ళి ఆ వేళప్పుడు రాజేశ్వరీ కళ్యాణ మండపం ఎదుట నిల్చోడం ఒక మరపురాని అనుభవం. నిర్మాణ వైచిత్రిని బట్టి మాయామందిరాలను, అలం కరణను బట్టి గంధర్వుల విమానాలను, విస్తీర్ణాన్ని బట్టి పెద్ద సర్కస్ డేరాలను తలపిస్తున్న ఆ కళ్యాణ మందిరం పెళ్ళి జరిపిస్తున్న కన్యాదాత ప్రాభవాన్ని ఎలుగెత్తి చాటుతోంది. నేను వెళ్ళేటప్పటికి పెళ్ళి వేడుక అప్పుడప్పుడే ఊపందు కుంటూ ఉంది. వివిధ వేష భూషణాలతో, విలాస విభ్రమాలతో పైలోకాల నుంచీ దిగి వచ్చిన వారిలా అతిథి జనం నవ్వుల రతనాలు రువ్వుకుంటూ, మాటల మాణి క్యాలు వినిమయం చేసుకుంటున్నారు. లోపల వివాహ వేదిక పైన ప్రస్తుతం నృత్య ప్రదర్శన జరుగుతోంది. సాత్విక కళల మూలంగా రసాస్వాదన చేయగల ఓపిక ఉన్నవాళ్ళు కొందరు హాల్లో కూర్చున్నారు. మరొకవైపున రకరకాల వాహనాల పైన ఒక్కొక్కరుగా, జంటలు జంటలుగా, జట్లు జట్లుగా ఆహ్వానితులు వచ్చి దిగబడి పోతున్నారు. ఆ జన సంరంభంలో ఒక చోట మెరుపు మెరిసినట్టుగా విజయ సారథి కానవచ్చేసరికి నాకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. సంస్కార భంగమేమో నని కూడా తలచక 'హలో విజయసారథీ!' అని కేక పెట్టాను. సారథి తిరిగి చూచాడు.

"ఏంటోయ్ సుబ్బారావ్! ఎప్పుడొచ్చావ్? టిఫిన్ తీసుకున్నావా ? హాల్లోకి వెళ్ళి కూచోరాదూ? యామినీ కృష్ణమూర్తి శిష్యురాలులే! పట్టుబట్టి హైదరాబాదు నుంచి రప్పించాను. విదేశీ పర్యటన వాయిదా వేసుకుని మరీ వచ్చింది ... ఎవ్రీ దేవరాయరే! అభివాద, అభివాద..."

నన్ను పలకరించడం, నర్తకిని పరిచయం చెయ్యడం, కారులో దిగిన

ఖద్దరు టోపీ వ్యక్తికి స్వాగతం పలకడం – ఒక చిన్న ప్రసంగంలో ఇన్ని అంశాలు ఇమిడి ఉన్నాయని నేను గ్రహించడానికి కొంతసేపు పట్టింది. ఈలోగా అతిథి సత్తముణ్ణి ఆప్యాయంగా ఆలింగనం చేసుకున్నాక, గౌరవ పురస్సరంగా చేయి పట్టుకుని లోపలికి తీసుకెళిపోతున్నాడు విజయసారథి.

భారీ ఎత్తున శుభకార్యం నిర్వహిస్తున్న పెళ్ళి పెద్ద ఆ మాత్రం 'బిజీ'గా ఉండవలసిందే ఎవరికి చెల్లించవలసిన మర్యాద వారికి చెల్లించక తప్పదు. నేను నా కుతూహలం కొద్దీ విజయసారథిని తొందరపెట్టడం న్యాయం కాదు. ఎలాగైనా 'కాలక్షేపం జరగాలి కదా! ఓ అరగంటసేపు నృత్య ప్రదర్శనాన్ని చూస్తూ హాల్లో కూర్చున్నాను. ఆ తరువాత మేడపైకి వెళ్ళి రాత్రి తొలి జాము వేళప్పటి బెంగుళూరు దృశ్యాలను అనేక కోణాల్లో నుంచీ తిలకించాను. ఓ మూలగా కూచుని తీసుకెళ్ళిన పుస్తకం చదువుకోడానికి కూడా ప్రయత్నించాను. కానీ, మనసు మాత్రం దేనిపైన గానీ లగ్నం కావడం లేదు. వీలు చేసుకుని విజయసారథిని ఓ విషయం అడిగి ఉండవలసింది. ఆ మాట అనుకుంటూ ఉండగానే అతడికి మరేదో పని తగిలింది. ఈసారి కనిపించగానే అడగాలి...

ఎనిమిదింటికి తరువాత విందు ప్రారంభమైంది. అతిథి జనాన్ని వడ్డించిన విస్తర్లపైకి ఉరికిస్తూ, భోజనాగారం గేటు దగ్గర సారథి కనిపించాడు. ఎలాగైనా అది మాట్లాడడానికి వీల్లేని పరిస్థితి అతిథి జనం ఒక కెరటంలా వచ్చి నెట్టడం వల్ల లోపలికి కొట్టుకపోయాను భోజన పరాక్రమంలో పోటీలు పెట్టినట్టుగా డయినింగ్ హాల్లో అప్పటికే వీరావేశం చెలరేగుతూ వుంది. 'సాంబార్...పొరియల్..అవియల్ అప్పళం...' లాంటి మాటలు,గంగాళాల దబదబలు,గ్లాసుల గలగలలు,వడ్డించే వాళ్ళ పరుగులు– ఈ సంభరంలో బల్లల మధ్యనుంచీ వడివడిగా నడిచిపోతున్న విజయసారథిని ఇట్టే గమనించేశాను. "సారథీ! మాట, మాట!" అప్రయత్నంగా నానోటినుంచీ పిలుపు వెలువడింది.అనుకోని పిలుపు సారథికి అట్టే ఇంపితమైనట్టు లేదు. అయిష్టంగానే వెనుదిరిగాడు. పిలిచింది నేనని తెలియగానే చిరాకును కాస్తా తుడిచిపెట్టుకునే ప్రయత్నంలో పడి– "ఏమిటి, పిలిచావా?" అంటూ దగ్గరి కొచ్చాడు. "ఏంలేదు. స్నిగ్నాను గురించి తెలుసుకుందామని వచ్చాడా? వస్తాడా? చూచి చాలా కాలమైంది కదా. అందుకని ..." అప్పటికి నేనేదో సంజాయిషీ చెప్పుకున్నట్లుగా నా చెవులకే ధ్వనించింది. సారథి కూడా ఎంతో ఉదారంగా ఒక నేరస్తుణ్ణి క్షమించేసినట్టు వీలయినంత ప్రసన్నంగానే బదులు చెప్పాడు. "రాకపోతే ఊరుకుంటానా! వచ్చాడు సాయంకాలం ఫ్లైట్‌లో వచ్చాడట. ఏదో హోటల్లో దిగాడు, ఇందాక ఫోన్ చేశాడట కూడా. ఇప్పుడో, ఇంకాస్సేపటికో రావచ్చు. ఐయామ్ ఎక్స్‌పెక్టింగ్ హిమ్!"

దేనికోసమో నిరీక్షిస్తున్నట్టుగా నేను కూడా మేలుకుని కూర్చున్నాను. సిటీలో రెండో సినిమా కూడా వదిలిపెట్టి ఉండొచ్చు. అప్పుడిక నిగ్రహించుకో లేక ఆదమరిచి నిద్రపోయాను. మెలకువ వచ్చేసరికి మంగళ వాద్యాలు మ్రోగు తున్నాయి. గంట నాలుగున్నర అయిదూ ఇరవై అయిదుకే ముహూర్తం కాల కృత్యాలు తీర్చుకుని ఆదరాబాదరాగా హాల్లో అడుగు పెట్టాను. ముందువైపు కుర్చీలు నిండిపోయాయి. పది వరసలకు వెనుక ఓ కుర్చీ ఖాళీగా వుంటే వెళ్ళి అందులో కూర్చున్నాను.

వధూవరులు పీటలపైన వున్నారు. సన్నిహిత బంధువర్గం వాళ్ళ చుట్టూ మూగిపోయింది. పురోహితుడి మంత్రాలు మైకులో నుంచి వినిపిస్తున్నాయి. ఆ సందడిలో జాలర్లుగా వదిలి పెట్టిన పూలదండలకు వెనుక ఎవరితోనో మాట్లాడుతూ కనిపించాడు సారథి. ఎక్కడో చూచిన ముఖంలాగే వుంది. ఎక్కడ ? ఎప్పుడు ? అంగ విన్యాసాల్ని హావభావాల్ని అయిదు నిమిషాల దాకా గమనించిన తరువాత నా బుర్రలో ఒక మెరుపు మెరిసింది. 'చంపేశావురా మిత్రమా! ఎంతగా మారి పోయావురా నాయనా!' అనుకున్నాను. సన్నగా, పొందిగ్గా, బాల ప్రహ్లాదుడి వేషానికి సరిపోయేటట్టుండేవాడు నాకు తెలిసిన సిన్హా— ఇప్పుడందుకు విరుద్ధంగా వున్నాడు. ముఖం పెద్ద సైజు టొమాటో పండులా వుబ్బిపోయింది. కళ్ళు చిన్నవై పోయాయి. బట్టతల వచ్చేసింది. బుట్ట బొమ్మకు పాంటు, చొక్కా తొడిగినట్టున్న వాలకం 'యద్భావంతద్భవతి' అంటారు గదా! సిన్హా ఆకారం ఉత్తరాది పేరుకు అనుగుణ్యంగా మారిపోయినట్టుంది.

ఈలోగా, చాలా ముఖ్యమైన పని ఒకటి తగిలినట్టు విజయసారథి సిన్హాను వెంటబెట్టుకుని ప్రేక్షకుల్లో కూర్చున్న బంధు మిత్రులవైపు వచ్చేశాడు. వాళ్ళను చూడగానే కొందరు లేవడానికి ప్రయత్నించారు. కొందరు లేచి నిల్చున్నారు. "మీట్ మై ఫ్రండ్ మిస్టర్ సో అండ్ సో, జనరల్ మేనేజర్ డాష్ డాష్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్" ఓహో అట్లాగా! నమస్కారం ప్రతి నమస్కారం. "వీరెవరో తెలుసా సిన్హా?" ఆ ప్రముఖుల్ని గురించిన వివరాలు "గ్లాడ్ టు మీట్ యూ—సమా చరణలు ఇలా పరిచయ కార్యక్రమం సాగిపోతోంది. విజయసారథి సిన్హాను నా దగ్గరకు లాక్కొచ్చి వీణ్ణి చూచావటోయ్ సిన్హా! మన సుబ్బారావు. చిత్తూర్లో మన చిన్ననాటి జీవితం. హైస్కూలు చదువు, రౌండ్ రోడ్సు, ఈజీ చెయిర్. అదంతా మరిచిపోగలమా! వీడీ పెళ్ళికొచ్చింది. సగం నిన్ను చూడ్డానికే" అంటున్నా డనీ, సిన్హా ఆనందంతో విప్పారిపోయిన ముఖంతో "ఆహా! ఎన్నాళ్ళకెన్నాళ్ళ కోయ్ సుబ్బారావ్! ఎన్నిసార్లు తలుచుకుంటానో నిన్ను గురించి! కళ్ళలో మెదిలే

వాడివి" అంటూ పరవశించి పోతున్నాడనీ నేననుకున్నాను. లేదా అలాంటి సంఘటన ఏ క్షణాన్నయినా జరగబోతున్నదని ఆశించాను. అయితే ఆ మధుర సన్నివేశం ఊహగానే మిగిలిపోయింది. ఆ పగటి కలను చెదరగొడుతూ ముహూర్తమేళం నా తల దిమ్మ తిరిగేట్టుగా మ్రోగసాగింది. సూత్రధారణ ముగిసింది. వధూవరులపైన అక్షింతల వర్షం కురిసింది. జనం ఒక పెట్టున పైకి లేచారు. ఆ వ్యవధిలో నా మిత్రులు వెళ్ళిన జాడ తెలియకుండా ఎటో జారిపోయారు.

నేను కాలు గాలిన పిల్లిలా కళ్యాణ మందిరమంతా కలయ తిరిగాను. మేడపైకి వెళ్ళి మూల మూలా, గది గదీ వెదికాను. కొందర్ని అడిగి చూశాను. కార్లు, ఆటోలు కదిలిపోతున్న సవ్వడి వినిపించింది. బాల్కనీ కప్పువైపు పరతెంచాను. ఎట్లాగైతేనేం, నా అన్వేషణ ఫలించింది. డ్రయవరు డోరు తెరచి పట్టుకున్నాడు. సిన్హా కారులో కాలు మోపడానికి సిద్ధంగా వున్నాడు. సారథి వీడ్కోలిస్తున్నాడు.

నా గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. ఒక్క ఊపులో మెట్లన్నీ దిగి, మనుషుల్లో దారి చేసుకుంటూ బయటికి వచ్చి కారువైపు పరుగు తీశాను. తీరా కారు దగ్గరికి వెళ్ళేసరికి ఉచ్ఛ్వాస నిశ్వాసాల వురవడిలో మాట పెకలడం లేదు. విండోలో తల దూర్చి సిన్హా వైపు చేయి సాచాను.

"అరరే, పొరబాటయి పోయిందోయ్ సిన్హా! తెలియదూ, సుబ్బారావు! చిత్తూరు నుంచీ వచ్చాడు. చెబుదా మనుకుంటూనే మరచిపోయాను."—నొచ్చుకుంటూ అన్నాడు సారథి. "అట్లాగా! బాగున్నావా సుబ్బారావ్! నిన్ను కూడా చూచేశాను. చాలా సంతోషంగా వుంది. నీతో కొంతసేపు గడపాలని కూడా వుందనుకో! ఏం చెయ్యను చెప్పు. ఉదయం ఫ్లైట్‌లో మెడ్రాస్ వెళ్ళాలి. ఎప్పుడైనా ఢిల్లీ వస్తే..."

సిన్హా వాక్యం పూర్తి కాలేదు. ఢిల్లీదాకా వెళ్ళే పని నాకీ జీవితంలో తటస్థించదని ఆ కారు కూడా గ్రహించేసిందేమో. సిన్హా వాక్యం పూర్తిగాకముందే చిర చిరలాడుకుంటూ స్టార్టయిపోయింది.

గాలి తీసేసిన బెలూనులా నేను నీరసించిపోయాను. క్రిందటి రోజు సాయంకాలం పుష్పకవిమానంలా కనిపించిన ఆ కల్యాణ మందిరం పెనుభూతంలా కనిపించసాగింది. దాని బారినుంచి తప్పించుకోవడం కోసం ఈవలికి వస్తే బోసిపోయి వున్న రోడ్లు నిశ్శంకించిన నదుల్లా కనిపించాయి. కాంక్రీటు కట్టడాలు అండమాను జైలును తలపించాయి. అంతెందుకు? వసంతరామంలా తోచిన బెంగుళూరు

పట్టణం ఎడారిగా మారిపోయినట్టు తోచిందంటే ఏమనుకోవాలి? బహుశా ఈ మార్పుకు కారణం బాహ్య ప్రపంచంలో గాక నాలోనే వుండాలి. ఏమిటది? వున్న ఇంటిలో ఒక భాగం కూలిపోయినట్టుగా, నీడ నిచ్చిన చెట్టుకో ఓ కొమ్మ విరిగి క్రింద పడిపోయినట్టుగా, నిల్చున్న నేల తీవ్రంగా కంపించినట్టుగా దిగులూ, దైన్య భావమూ నన్ను వెంటాడసాగాయి. చేయడానికి నిర్దిష్టమైన పనేదీ లేకపోయినప్పుడు మానవుడు కొంచెం అర్థరహితంగా ప్రవర్తించక తప్పదేమో! నేను కనిపించిన ప్రతి వాల్ పోస్టర్ని ఆద్యంతమూ చదివేశాను. ఇళ్ళ ముంగిటి తోటల్లో పొదల్ని ఏ యే ఆకారం క్రింద కత్తిరించవచ్చునో తెలుసుకున్నాను. కార్నర్ షాపుల దగ్గర నిల్చుని కన్నడ పత్రికల ముఖచిత్రాలు కూడా అందంగా వుంటాయని గమనించాను. నగరవాసుల వుదయకాలపు వ్యాపకాలెలా వుంటాయో కొంతవరకు గ్రహించాను. కాలు దారితీసినట్లల్లా అలా ఎంత దూరం తిరిగానో తెలియదు. మధ్యాహ్నం పన్నెండింటికి కర్ణాటక రోడ్డు ట్రాన్స్‌పోర్టు వారి ఫాస్ట్ సర్వీసు బస్సొకటి తిరుపతికి బయలుదేరుతుందని ఎవరో చెప్పిన విషయం జ్ఞప్తికి వచ్చింది. టైమ్ చూచుకున్నాను. పది కావస్తోంది. అప్పటి కింకా నేను టిఫిను చేయలేదని గుర్తుకొచ్చింది. అప్పుడు నేను "బిజ్జలదేవ భవన సముదాయ" అన్న నీలిరంగు కట్టడాల ఎదుట నిలబడి వున్నాను. ఒకవైపున శుద్ధ సాత్వికాహార భోజనశాల. మరొకవైపు హైక్లాసు మిలిటరీ హోటలు. మధ్యలో రకరకాల షాపులు. నట్టనడుమ వెనుకవైపున వున్న సినిమా థియేటరుకు వెళ్ళేదారి. ఎట్టయెదుట పెద్ద పెద్ద గైరిసీడియా చెట్లు. ఆ చల్లటి పట్టులోకి వెళ్ళేసరికి ఒళ్లూ, మనసూ కూడా సొమ్మసిల్లిపోయాయి. టిఫిన్ చేయడమా' కాక మరో అరగంట సేపాగి ఏకంగా భోజనం చేసి బస్ స్టేషనుకు వెళ్ళడమా అన్న మీమాంస ఒకటి ఎదురైంది. ఒకటి రెండు నిమిషాలు తటపటాయించాక రెండో ప్రతిపాదన వైపే మొగ్గి, అక్కడున్న ఒక సిమెంటు బెంచీపైన కూలబడిపోయాను. బరువెక్కిన కనురెప్పలు క్రమక్రమంగా వాలిపోయాయి.

భుజంపైన చల్లటి స్పర్శ ఏదో సోకినట్టే వున్నట్టుండి వులికిపడ్డట్టుగా కళ్ళు తెరిచాను. కాకీ ట్రౌజరుపైన అలాంటిదే అరచేతుల చొక్కా తొడుక్కుని చేత లాఠీ లాంటి కర్ర పట్టుకున్న వ్యక్తి ఒకతను నా ఎదుట నిలబడి వున్నాడు.

"ఏమిటి బాబూ! యిక్కడ కూచోగూడదా?" అంటూ లేవబోయాను. లేవకుండా అదిమిపెడుతూ అతడు పకపకా నవ్వసాగాడు.

"భలేవాడివే సుబ్బన్నా! చూడగానే యిదేంధిరా నాయినా ఈయన

యిక్కడి కొచ్చేసినాడు అనుకుంటి. ఇంతకూ నువ్వేనా కాదా అని కాసేపు కణిపించి చూస్తి. దగ్గిరి కొచ్చి నికరంగా నువ్వేనని తేల్చుకున్నాక భుజంపైన చెయ్యేస్తి. మీ పక్కింటోణ్ణి. తెలియడంలా?"

"ఓరి నీ యిల్లు బంగారంగానూ! నువ్వట్రా సీనూ! ఎంత కాలమైందో నువ్వు ఊరు వదిలిపెట్టి జరుగుబాటు లేక దేశంపాలై పోయావని తెలిసి అయ్యో పాపం అనుకున్నా. ఇంతకూ నువ్వుండడం బెంగుళూర్లోనా? ఏం చేస్తున్నా విక్కడ?"

భవన సముదాయాన్ని చూపిస్తూ అన్నాడు సీను—"ఇక్కడ వాచ్‌మేన్‌ని నేనే! రెయ్యి డూటీ పదహైదు దినాలు. పగులు డూటీ పదహైదు దినాలు. అయిదు నూర్లిస్తారు. జీతం. మా యింట్లోది గూడా నాలుగిండ్లలో పని చేసి రెండు నూర్ల దాకా తెస్తుంది. పెద్ద కొడుకును మోటార్ వర్క్‌షాపులో పెట్టినా, రెండోవాణ్ణి ఇంటరులో చేర్పించినా, మూడోవాడు ఏడో తరగతి, ఇక్కడ టిఫిను కోసరమనీ, భోజనం కోసరమనీ టూరిస్టు బస్సులూ, కార్లూ వచ్చి నిలుస్తాయిలే. కనిపెట్టుకు నుంటాను గదా వాల్లూ ఏదో తోచింది యినా మిస్తారు. చెడి చెన్నపట్నం చేరే వాళ్ళంట ముందు ఇప్పుడు చెడిపోతే బెంగుళూరొస్తా వుండారు. ఎవుడికి దగిన బతుకు వాడికి దొరకతానే వుంది. ఆ మాటకేం గానీ, సుబ్బన్నా! నీ కొడుక్కీ కూతురికి పెండ్లిల్లు చేసేస్తివా?" ఎక్కడుండారు.

పేరు పేరునా మా వాళ్ళ యోగక్షేమాలన్నీ అడిగి తెలుసుకున్నాడు సీను.మా అబ్బాయి నా కన్నా పెద్ద టీచరైనాడంటే కాకేమవుతాడు!సదువు పుట్టిందే మీ యింట్లో గదా!" అన్నాడు. అల్లుడూ, కూతురూ కూడా వుద్యోగం చేస్తున్నా రంటే "అదే మంచిది. ఇకమీదట వచ్చే కాలాల్లో ఆడ, మగా యిద్దరూ సంపాదిం చాల్సిందే. అటువంటి యింట్లోనే లచ్మి కల" అన్నాడు.

సీను నాకంటే ఏడెనిమిది యేళ్ళు చిన్నవాడు. నాలాగే చింతపల్లె ఎలిమెంటరీ స్కూల్లో మా నాన్నగారి దగ్గర చదువుకున్నాడు. అయ్యవారంటే ఎంత భయమో అమ్మగారి దగ్గర అంత చనువు వాడికి. మా అమ్మను పెద్దమ్మా అని పిలిచేవాడు. ఆమె కాస్తా అనారోగ్యపు మనిషి. అందువల్ల మంచినీళ్ళ బావి దగ్గరినుంచి రెండు బిందెల నీళ్ళు వాడే తెచ్చి పెట్టేవాడు. ములగచెట్లో కాయలు కోయాలన్నా, బాదం చెట్లో ఆకులుకోయాలన్న పెరట్లో చెట్లకుపాదులుకట్టాలన్నా ఇలాంటి పనులన్నింటికీ

ఉపకరించేవాడు. మా అమ్మ ఎట్లాగైతే పెద్దమ్మ అయిపోయిందో, అట్లాగే నేను వాడికి సుబ్బన్ననైపోయాను. నన్నలా పిలిచేవాడు వాడొక్కడే. పది పదిహేనేళ్ళ తరువాత మళ్ళీ 'సుబ్బన్నా' అన్న పిలుపు వినవచ్చేసరికి నాకు చేజారిపోయిన పెన్నిధి ఏదో మళ్ళీ దొరికినట్టయింది.

దాదా పౌరగంటసేపు చిన్ననాటి కబుర్లన్నీ చెప్పుకున్నాక "పన్నెండు గంటల బస్సులో వెళ్ళాలనుకుంటున్నానురా సీనూ! భోజనం చేసొస్తాను. నేనిక్కడ కూచోడం అందుకే" అన్నాను. "మంచి పని జేస్తివిలే సుబ్బన్నా! ఓటల్ ఆరతిలో ఫస్టు క్లాసయిన భోజనం కానా కానా దూరం నుంచి వస్తా" వుంటారు జనం. నువ్వెళ్లి భోం చేసిరా" అంటూ నా చేతిలో నుంచి బ్రీఫ్‌కేస్ అందుకున్నాడు సీను.

ఆకలిగొని వున్నానేమో పదిహేను నిముషాల్లో భోజనం ముగించి, చేయి కడుక్కున్నాను. కౌంటరు దగ్గరకొచ్చి బిల్లుకోసం చూచేసరికి "వెళ్ళి రండప్పా! మీ బిల్లు చెల్లించడమైంది." అన్నాడు ప్రొప్రయిటరు. నాకు సీను పైన చాలా కోపం వచ్చింది.

చరచరా బయటికి వచ్చి —"ఏం పని చేశావురా సీనూ! నేను భోంచెయ్యడమున్నా నువ్వు బిల్లు చెల్లించడమూనా?" అంటూ కినుక ప్రదర్శించాను.

"అదేం మాట సుబ్బన్నా! చచ్చిపోయి సొర్గాన వుంది మీ అమ్మ. ఆ తల్లి పెట్టగా ఎన్ని పూటలు తిన్నానో! నువ్వేమైనా నేనిక్కడుండానని తెలిసి భోజనానికొస్తివా? "నీకొక తమ్ముడున్నాడ్రా యిక్కడ" అని ఆ తల్లే నిన్నిక్కడికి తోసుకొచ్చి వుంటుంది" అన్నాడు సీను. వాడి కండ్లు కన్నీటి కుండలు కావడం చూచాను.

బస్సు మెయిన్‌రోడ్లన్నీ దాటుకుని నగరం శివార్లలో వస్తుండగా ఆనాటి మధ్యాహ్నం నేననుకున్నాను—"నువ్వొకడివి గనుక కనిపించకపోయి వుంటే నేనీ ఊరినుంచీ ఏడుస్తూ వెళ్ళి వుండేవాణ్ణిరా సీనూ! నువ్వు కనిపించావు గనుక నవ్వుతూ వెళ్తున్నాను. బెంగుళూరు మహానగరంలో నా వునికి కొక విలువను ఏర్పరిచిన వాడివి నువ్వు."

'ఆంధ్రప్రభ' వారపత్రిక—199

# రంగయ్యా తమ్ముడు

ప్రొద్దుపోయి రెండు గడియలైంది. చీకటి పడుతూ వుంది. ఆకాశాన తెల్లగా దూదిపింజల్లాంటి మబ్బులు నడయాడుతున్నాయి. ఇప్పుడప్పుడే వానపడే సూచనలు లేవు.

మట్టిబాట మరమ్మత్తుకోసం, బాట కిరువైపులా త్రవ్విన గుంతల్లో నుంచీ బావురు కప్పలు సాగిస్తున్న పాటకచ్చేరీ వింటూ చింతచెట్టు మొదట కూర్చున్నాను.

వీధులంతా చిత్తడి చిత్తడిగా తయారై అనవసరంగా బయట పాదం మోపడానికి బుద్ధి పుట్టక ఎక్కడివారక్కడే ఒదుగుళ్ళు పోతుండడంవల్ల వూరంతా నిశ్శబ్దంగా వుంది. లేదంటే గాటిలో కసువు కనిపించక సగం తెంచుకున్న లేగదూడను వెంబడిస్తూ కుర్రాళ్ళు వేస్తున్న కేకలు మాత్రం వుండి వుండీ వినిపిస్తున్నాయి.

'ఇంకా నిద్ర లేవలేదా పంతులూ! ముసారా పట్టినట్టుంది మబ్బులో ప్రొద్దు తెలియడం లేదు. గంట ఏడుకు తక్కువ వుండదు. లెగవయ్యా లెగు' అన్న వెంకురెడ్డి మేలుకొలుపుతో నాకా రోజు తెల్లవారింది. సన్నగా వాన చినుకులు జారుతున్నాయి. ముసారా పట్టినట్టున్న మాట నిజమే! కానీ తెల్లవారి పూట వచ్చిన వానగానీ, బంధువుగానీ ఎంతోసేపు మకాం పెట్టడం జరగదన్న లోకోక్తి ఒకటి వుంది. ఐతే ఈ లోకానుభవానికి విరుద్దంగా మధ్యాహ్నం మూడు గంటలదాకా వాన తేపలు తేపలుగా వస్తూనే వుంది. సూర్యాస్తమయానికి కాస్త తెరపి ఇచ్చి వెలిసినట్టే తోచినా అర్ధరాత్రిలోగానే మళ్ళీ వర్షం ప్రారంభం కావచ్చు. అదిగో మల్లేశ్వరుడి గుట్టమీద అప్పుడే ఒక నల్లటి మేఘం నడయాడుతోంది.

బాటలో ఎవరో వస్తున్న కలకలం వినిపించి, కాస్త ముందరికి జరిగి కూర్చున్నాను.

మసక చీకటిని చీల్చుకుని గంభీరంగా అడుగులు వేసుకుంటూ వస్తున్న ఓ నడితరం మనిషి నాకు మున్ముందుగా కనిపించాడు. అతడితల సిద్దవటం దోసకాయంత పెద్దది. అతడు తలకు చుట్టుకున్న పాగా అంతకన్నా పెద్దది. భుజాని

కిరువైపులా పెద్ద జోలె వ్రేలాడుతోంది. మెడలో రుద్రాక్ష మాలికలు వ్రేలాడుతున్నాయి. కాళ్ళకు నాటురకం చెప్పులున్నాయి. అన్నింటికన్నా ఆ ఆకారంలో కొట్టవచ్చినట్టు కనిపించేవి అతడ గడ్డమూ, మీసాలు!

ఎరుపు రంగు చీర చెరగు గాలికి రెపరెపలాడుతుండగా, ముక్కుపైని ముక్కర చీకట్లో మెరిసిపోతుండగా, కాలివ్రేళ్ళ వెండి మెట్టెలు ఒకదానినొకటి తగిలి సన్నసన్నగా మ్రోగుతుండగా ఓ వైపున భర్త మోస్తున్న జోలెకంటే మరీ పెద్దదైన జోలెను, మరోవైపున చంటి బిడ్డను మోసుకుని అతడి అడుగుల్లో అడుగులు వేసుకుంటూ భార్య అతణ్ని వెంబడిస్తోంది.

ఆమెను చూస్తుంటే భర్తకు భార్యను సహచారిణి అనీ, సహధర్మిణి అనీ అనడం యిందుకే కాబోలనిపించింది.

ఆ భార్యాభర్తల వెంట పావడాపైన దావిణి వేసుకున్న ఓ బక్కపలచటి అమ్మాయి నాలుగేళ్ళ పసివాణ్ణి చేయి పట్టుకుని నడిపించుకుంటూ వస్తోంది.

చెట్టుకింద నేను కనిపించగానే అతడు బాటలో ఆగి "ఈ వూళ్ళో తల చాటు దొరుకుతుందా బాబూ?" అన్నాడు.

పైకప్పు మాత్రం పూర్తయి గోడలు సగానికి మాత్రమే లేచి వున్న పూరి కొట్టాన్ని చూపించి అక్కడికి వెళ్ళమన్నాను.

"అది పలుకూటమా బాబూ?" అతడు ప్రశ్నించాడు.

"పలుకూటమే! ఐనా ఫరవాలేదు. పగటివేళ మాత్రం పిల్లలు చదువుకుంటారు. అప్పుడు మీరు మీ గంతల్ని బొంతల్ని ఏ చెట్టు క్రిందికో, ఏ పందిరి కిందికో చేరవేయవచ్చు. చీకటి పడగానే మళ్ళీ బడిలోనే విడిది చేయవచ్చు" అన్నాను.

"అలాగే బాబయ్యా అలాగే" అంటూ అతడు ముందుకు కదిలాడు. విష్ణుదేవుడి వెంట లచ్చి, ఆమె వెనుక అవరోధవ్రాతం, వారి వెన్కా పక్షీంద్రుడు తరలినట్టుగా అతడి వెనక భార్య, భార్య వెనుక కూతురు, కూతురు వెంట కొడుకు వరుసగా కదిలారు.

మాటల ధోరణిని బట్టి చూస్తే అతడు బాగా వానలు వెలిసేదాకా మా వూళ్ళోనే మకాం పెట్టబోతున్నట్టు తోచింది. అవును పాపం! ఈ వానల్లో వంకల్లో,

పెళ్ళాం బిడ్డలను వెంటబెట్టుకుని వూళ్ళు తిరగడం యెలా సాధ్యమౌతుంది? ప్రతి సంవత్సరమూ వర్షాకాలం రాగానే యిలాంటి కుటుంబాలు ఒకటి రెండు మావూళ్ళో దిగడం మామూలే కానీ అప్పటిలాగా యికమీదట యిలాటివాళ్ళు తల చాటుకోసం వారి పంచ, వీరి పంచ చూసుకోవలసిన అవసరం లేదు. క్రొత్తగా శాంక్షనయిన స్కూలు పుణ్యమా అని మా ఊళ్ళో ఈ వూరి కొట్టమొకటి తయారవుతోంది. పట్టణంలో రైలు దిగగానే సరాసరి లాడ్జింగు సౌకర్యాలున్న హోటలుకు దారి తీసి నట్టుగా వీళ్ళు ఈ కొట్టంలో తమ కాలాన్ని గడుపుకుపోవచ్చు.

మల్లేశ్వరుడి గుట్టపైన ముసలుతున్న నల్లటి మేఘం క్షణక్షణానికీ దిక్కు విస్తరిల్లిపోతోంది. దిగ్విజయాన్ని సాధించనిదే వూరుకోనన్న జిగీషను ధ్వనిస్తూ అదొకసారి వురమను గూడా వురిమింది. ఇప్పుడిప్పుడే వాన రాదని అనుకున్నప్పుడు వాన రాకడ, ప్రాణం పోకడ ఎవరు చెప్పగలరన్న పెద్దల మాటను నేను మరచిపోయాను.

లేచి మెల్లగా యింటిదారి పట్టాను. త్రోవ ప్రక్కన కొట్టంలో వెలుగుతున్న దీపం కనిపించింది. గోడలపైన్నుంచి లోపలికి చూశాను. పెద్దా, చిన్నా – ఆడా మగా వ్యత్యాసం లేకుండా వూరు వూరంతా అక్కడే వుంది. చూరుక్రింద రాళ్ళు పేర్చి ఆ తల్లీ కూతుళ్ళు అప్పుడే వంట ప్రయత్నంలో వున్నారు. ఒడిలో కూచున్న చంటివాడు గడ్డాన్ని పరామర్శిస్తుండగా, తండ్రి పద్మాసనం చేసుకుని నిశ్చలంగా కూర్చున్నాడు. తీరా మారా సమాధానమివ్వడానికైనా ఎడము లేకుండా అక్కడ చేరిన వాళ్ళందరూ ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు.

"మీదేవూరు?"

"మీ వాళ్ళందరూ యిలాగే దేశాలు తిరుగుతారేమిటి?"

"మీరందరూ ఒకచోట కలిసేదెప్పుడు!"

బంధువులు ఎవరింటికొస్తే వాళ్ళకు మాత్రమే సంభ్రమం కలుగుతుంది. కాని వీళ్ళ రాకవల్ల ఏ కొందరికి మాత్రమే గాక, అందరికీ సంబరం కలిగినట్టుంది. ఐతే వీళ్ళు వూరికంతా బంధువులన్నమాట!

* * * *

మరునాటి వుదయం పొలంవైపు వెళ్ళి కాస్త పొద్దెక్కిన తర్వాత యింటికి తిరిగి వచ్చాను. వికసించిన వేయి రేకుల పువ్వులాంటి ముఖంతో మా ఆవిడ నాకెదురుగా వచ్చేసింది.

సంగతేమిటని నే నడగవలసిన అగత్యం గూడా లేకపోయింది. నును సిగ్గు దొంతరల్ని అటూ యిటూ తొలగదోసుకుంటూ ఆవిడే "నేను చేయి చూపించుకున్నానండీ" అంది.

"నీకూ పట్టిందన్న మాట పిచ్చి! పోనీ, చేయి చూపించుకోగా తేలిందేమిటి?" అన్నాను.

"మరి...మనకేమో...ఇక రెండు మాసాల్లో..." అంటూ ఆవిడ మాటి మాటికీ నా కళ్ళలోకి చూడసాగింది.

"చెప్పు మరి. ఇక రెండు మాసాల్లో మనకు శుక్రమహర్దశ ప్రారంభం కాబోతున్నదన్నదట! అంతేగదూ?" అంటూ నేనా వాక్యాన్ని పూర్తి చేశాను.

"అంతే కాదండీ! మరీ, మీకు కోపం ముక్కు మీదనే వుంటుందట! మాట పెళుసైనా మనసు మాత్రం నవనీతమేనట! ఇంకా యేమిటేమిటో చెప్పాడు...."

ఓరి పిడిల్లు బంగారంగానూ! మా ఆవిద చేతిలోనే నా స్వభావాన్ని గూడా పసిగట్టగలిగిన పిడి మేధాశక్తి మెచ్చుకోదగ్గదే ననుకుంటూ "ఇంతకూ ఆ జ్యోతిష్య శిఖామణి ఎవరో చెప్పావు కావు" అన్నాను.

ఇంకెవరండీ! రాత్రి మన వూళ్ళో కొచ్చిన బైరాగే! ఎంత బాగా చెబుతా డనుకున్నారు! యధాదృష్టిగా కళ్ళతో చూచినట్లే చెబుతుంటే! ఎక్కడి వాళ్ళక్కడ నోళ్ళు తెరిచేశారనుకోండి. అన్నట్టు మరొక విశేషముండోయ్! ఆ బైరాగి భార్య గద్దెగూడా చెబుతుందట! సాయంత్రం రమ్మన్నాను."

నే నొకసారి నిట్టూర్చి "హస్త సాముద్రికాలు, గద్దెలూ తెలిసిన వాళ్ళకు మంత్ర తంత్రాలు తెలియకుండా వుంటాయా జానకీ? ఎలాగూ నువ్వు నిద్రలో ఉలికిపడి కలవరిస్తుంటావు. ఎందుకైనా మంచిది, ఓ తాయెత్తు కట్టించుకో" అన్నాను.

"మీకంతా ఎగతాళండీ మరీనూ......" అంటూ తెచ్చిపెట్టుకున్న వుక్రోషంతో మా ఆవిడ రివ్వున లోపలికి వెళ్ళిపోయింది.

ఆమె అటు లోపలికి వెళ్ళిందో లేదో, వీధివైపునుంచి వెంకురెడ్డి ప్రవేశించాడు.

"అబ్బబ్బ. ఒక్కొక్క మాటే ఒక్క వరా చేయదటయ్యా పంతులూ! ఒక చిత్తేనా, ఒక సత్తేనా, ఒక ఎరుకేనా, వేదాంత సారమంతా ఆ బైరాగి నాలుక

చివర్నే వుంది గదయ్యా! ఆహాహా, మూలం తెలిసిన వాడిలా వున్నాడయ్యా మహానుభావుడు!"

నా కప్పుడనిపించింది—చిన్నపిల్లలకు ఓ ఆటబొమ్మ కనిపిస్తే వాళ్ళు దాని పట్ల ఎంతో ఆసక్తిని వ్యక్తం చేస్తారు. అది వాళ్ళకొక అపూర్వ శిల్పంలా సాక్షాత్కరిస్తుంది. వాళ్ళు దానికో గుడ్డపీలిక కట్టబెట్టి జడవేసి,పూలు బెట్టి సింగారిస్తారు. పెళ్ళికూతుర్ని చేస్తారు. ఇంతజేసీ నాలుగైదు రోజులు గడచి అది కాస్తా పాతబడగానే ఓ మూల విసరిపారేస్తారు. ఎంతగా పెరిగి పెద్దవాళ్ళయినా ఆ పెద్దవాళ్ళలోనూ ఈ పసిపిల్లల చిత్తప్రవృత్తి లేకపోలేదు. అందులోనూ నాగరితకకు దూరంగా పల్లెల్లో బ్రతికేవాళ్ళల్లో ఈ పసిపిల్లల మనస్తత్వం మోతాదు మీరినట్లు తోస్తుంది. మరీ బ్రతుకుతెరువుకు ఏవో మరికొన్ని చిట్కాలు నేర్చిన యిలాటి బైరాగి ఒకడువీళ్ళకు తటస్థిస్తే యిక చూడాలి తమాషా! వాణ్ణి గురించి లేనిపోని ఊహాపోహాలెన్నో అల్లుకుంటాయి. అతడు మట్టిపెళ్ళను బంగారంగా మార్చేయగలడంటారు. పరిగెడుతున్న పామును మంత్రముగ్ధంచేసి నిలబెట్టగలడంటారు- ఐతే ఈ గొడవగూడా తాత్కాలికం మాత్రమే! క్రమంగా కొద్ది రోజుల్లో ఈ కుతూహలం తగ్గిపోతుంది. ఆ క్రొత్తమనిషి ప్రాధాన్యం చప్పబడి చల్లారి పోతుంది.

కానీ ఆశ్చర్యమేమిటంటే నా అంచనాకు విరుద్ధంగా పది రోజుల్లో ఈ బైరాగి ప్రాధాన్యం యింతై అంతై వామనుడి విశ్వరూపంలా విజృంభించింది—అందుకు కారణం ఓ చిత్రమైన సంఘటన.

నచ్చినవాళ్ళకు పెట్టిపోయడంలోనూ, నచ్చనివాళ్ళని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించడంలోనూ పేరెన్నిగన్న కుటుంబాలు మా వూళ్లో నాలుగైదున్నాయి. వాటిలో రంగయ్యగారి కుటుంబం ఒకటి. రంగయ్యగారికి పది పదిహేనెకరాల దివ్యమైన మాగాణితోబాటు అంగబలమూ, అర్థబలమూ గూడా పుష్కలంగా వుంది. ఆయనకు ముచ్చటగా ముగ్గురు కొడుకులు. ముగ్గురూ తండ్రి సై అంటే భళానోయి భాయి తమ్ముడా అంటూ బాణాకర్రలు చేతబట్టి రంగంలో దూకడానికి సంసిద్ధులు. రంగయ్యగారు కొడుకుల కందరికీ పెళ్ళిళ్ళు చేసేశాడు. కోడళ్లు గూడా కాపురాని కొచ్చేశారు.

ఐతే ఈ కొడుకులకూ కోడళ్ళకూ ఈ కథతో అట్టే ప్రసక్తి లేదు. ఆ రంగయ్యగారూ, ఆయన భార్య, ఈ కొడుకులూ, కోడళ్ళూ ఎవరి సంగతైతే పట్టించుకోరో ఆ ముసలావిడ సంగతే యిప్పుడు మనకు కావలసింది!

ఆ ముసలావిడ గూడా ఎవరోగాదు-సాక్షాత్తు రంగయ్యగారి తల్లి! పేరు మంగమ్మ. వయసు డెబ్బయికి తక్కువుండదు. బొత్తిగా సత్యకాలపు మనిషి. కల్లా కపటాలకూ ఆమెకూ, ఉత్తర దక్షిణ ధ్రువాలకున్నంత దూరం!

ఈ మంగమ్మకేం బుద్ధి పుట్టిందోగానీ ఓ రోజు వుదయం ముని మనుమ రాల్ని దగ్గరికి పిలిచి "ఒసే సీతీ! వెళ్ళి నేను రమ్మంటున్నానని ఆ బైరాగిని కేకేసుకు రా" అంది.

"మూడుకాళ్ళ ముసలాళ్ళకు గూడా జోస్యాలు కావలసొస్తాయి" అని రుసరుసలాడుతూ ఆ పిల్ల వెళ్ళి బైరాగిని పిలుచుకొచ్చింది.

మంగమ్మకు దగ్గరగా కూర్చుని ఆ బైరాగి "నువ్వు చల్లగా నూరేళ్ళు బ్రతకాలి తల్లీ!" అంటూ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"ఎందుకూ నూరేళ్ల బ్రతకడం! పడుసోళ్ళ కాళ్ళదగ్గర చెత్తలా పడి వుండడానికా బాబూ; వద్దొద్దు. నా ఆ కెప్పుడో బయటపడుతుందో చూడు" అంది మంగమ్మ.

బైరాగి మంగమ్మ చేతినొక్కసారి చూచి తలపైకెత్తి "నీకు రామలక్ష్మణుల్లా యిద్దరు కొడుకులు తల్లీ!" అన్నాడు.

కళ్ళు పెద్దవై పోతుండగా అక్కడ గుమిగూడిన వాళ్ళందరూ 'చూశావా, చూశావా' అన్నట్లు చూపులతోనే ప్రశ్నించుకున్నారు.

బైరాగి మళ్ళీ ప్రారంభించాడు—

"అందులో పెద్దకొడుకు మాంధాతలా బ్రతుకుతున్నాడు. చిన్న కొడుకు మాత్రం నీకు గాకుండా పోయాడు..."

ఝంఝూమారుతంలా అడ్డు తగిలింది మంగమ్మ—

"అదే నాయనా, అదే బాబూ! మా మనసులోని విషయం చెప్పేశావురా బైరాగీ! వాడేమయ్యాడో చెప్పు. ఎక్కడున్నాడో చెప్పు."

"ఈ అయిదుదారు రోజులనుంచీ యితడీ వూళ్ళో వాళ్ళ సంగతులు వాకబు చేసి తెలుసుకున్నాడేమో!—" గుంపులోనుంచి ఎవరోగానీ బయటికి వినిపించీ వినిపించకుండా ఈ సందేహాన్ని ప్రకటించారు.

బైరాగి వులికిపడి, ఈసారి మరీ బిగ్గరగా "ఆ పారిపోయినతడికి ఓ పుట్టుమచ్చ వుంది" అన్నాడు.

మచ్చ లేకేం నాయనా! ఉండేదిరా బాబూ! చెప్పు చెప్పు" అంటూ మంగమ్మ బైరాగి దగ్గరగా జరిగి కూర్చుంది.

"మనిషన్న తర్వాత మచ్చలుండకపోతాయా!" గుంపులో నుంచీ మళ్ళీ ఒక సందేహం రామబాణంలా వచ్చింది.

రోషంతో వుక్కిరిబిక్కిరై పోయాడేమో, బైరాగి కళ్ళలో కెంపు జీర ప్రాకింది. అతడు తటాలున కప్పుకున్న పాత శాలువను అవతలకి తీసి "చూడండి బాగా చూడండి. సరిగ్గా యిలాటి మచ్చ! ఇలాగే రొమ్ముపైన అణా కాసంతా పుట్టుమచ్చ" అంటూ తన రొమ్ముపైని మచ్చను జనసమూహానికి ఆవిష్కరణ చేశాడు.

ఈ హఠాత్సంఘటన ముసలావిడపైన ఎలా పనిచేసిందో మనకు తెలియదు. సంవత్సరాల తరబడీ ఆమె ఎదలో నిలుపుకున్న శోక ప్రవంతులు కట్టలు తెంచుకున్నాయేమో! ఆ దుఃఖాతిరేకంలో మనసు కాస్తా చెదిరిందేమో! ఆమె బైరాగిని పొదివి పట్టుకుని "నా బాబే! నా తండ్రే! నీకోసం చూచి చూచీ నా కళ్ళు కాయలు గాశాయిగా బాబూ! ఇంతకాలానికి నాక్కనిపిస్తూన్నావట్రా నాయనా!" అంటూ ఏడుపు మొదలెట్టింది.

మంగమ్మ చిన్నకొడుకు కేశవులు యింటినుంచి వెళ్ళిపోయిన కథ ఈనాటిదిగాదు- అది ముప్ఫయియేళ్ళ క్రిందటి సంగతి. అప్పటికి కేశవులకు పదహారేళ్ళని చెప్పుకోగా వినడమేగానీ అతణ్ణి గురించి నా యీడు వారికేమీ తెలియదు. ఈ ముప్ఫైయి యేళ్ళలో ప్రపంచంలో లెక్కలేనన్ని పరిణామాలు సంఘటించాయి. ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం జరిగింది. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. ఆంధ్రులకు రాష్ట్రం లభ్యమైంది. ఐతేనేం! ఇవన్నీ మంగమ్మకు తెలియవు. దేశాలపాలైన చిన్నకొడుకు తనకి కనిపించడేమో నన్నదే ఆమె ఆవేదన.

ఇంతకాలంగా ఆమె మానసాకాశంలో మేఘంలా వ్యాపించి వుండిన ఆ ఆవేదన వున్నట్టుండి కన్నీటి జడివానగా మారిపోయింది.

అందుకు తగ్గట్టుగా మంగమ్మ పిన్నమ్మ కూతురు శేషమ్మ మరొకవైపు నుంచీ బైరాగిమీద వ్రాలిపోయి "ఎంతగా గడ్డాలు మీసాలు పెంచుకుంటేనేంరా కేశవులూ! కన్నతల్లికి గుర్తు తెలియకుండా పోతుందా?" అంటూ రాగాలు ప్రారంభించేసింది.

ఇంకేముంది! ఈ వార్త క్షణాల్లో యింటింటికీ ప్రాకింది. విన్నవారు విన్నట్లే వచ్చి అక్కడ మూగిపోయారు.

మిషను బావిదగ్గర అడుసు దున్నిస్తున్న రంగయ్యగారి కెవరు చెప్పారో గానీ, ఆయన సుడిగాలిలా వచ్చేశాడు.

ఆ పాటికి బైరాగి పెళ్ళాం బిడ్డలు గూడా అక్కడ హాజరయ్యారు.

"ఏమిటీ గొడవ! ఊరుకోం డూరుకోండి" అంటూ ముందుకు వచ్చిన రంగయ్యగారు బైరాగి వైపు తిరిగి, "ఇదేం అల్లాటప్పా వ్యవహారం గాదు! నిజం చెప్పు. నువ్వు మా కేశవులివేనా?" అని గర్జించాడు.

"ఇదేం ఎవ్వారమయ్యో! బావుందిలే బావుంది. ఇక్కడ మీ కేశవులెవ రయ్యో, మేం బైరాగులమైతేనూ" అంటూ బైరాగి పెళ్ళాం రంగయ్యగారికి అడ్డు తగిలింది.

ఏదో చెప్పదలచినట్టు బైరాగి పెదవి కదపబోయాడు.

"చాల్చాల్లేవయ్యో! మాటాడీ మాటాడీ కథ నిందాకా తెచ్చుకున్నది చాలు గావ్, నువ్వు లేచి నడు" అంటూ ఆవిడ మొగుడి రెక్కపట్టుకుని బరబరా లాక్కెళ్ళిపోయింది.

"ఈ పెళ్ళాం రాకాసిలా అడ్డుపడకపోయివుంటే బైరాగి తను కేశవుల్నేనని నిజం ఒప్పుకుని వుండేవాడు. కానీ దాని భయం దానిది. వీడెక్కడ తననూ, తన బిడ్డల్నీ విడనాడి అయినవాళ్ళలో కలిసి పోతాడోనని దాని బెంగ! అయ్యోపాపం ఈ కేశవులు పెళ్ళాం బిడ్డల మధ్య అడకత్తెరలో పోకలా నలిగిపోతున్నాడు."

—అంటూ ప్రేక్షకులు చెమరించిన కళ్ళను పై గుడ్డతో తుడుచుకున్నారు.

"నీకేంగతి పట్టిందిరా కేశవులూ! వెఱ్ఱి వెఱ్ఱి బైరాగి కూటిలో పడ్డావట్రా నాయనా!" అంటూ మంగమ్మ అదే పనిగా వాపోసాగింది. ఈ వింతను చూచి పోవడానికి పరిసర గ్రామాలనుంచి గూడా జనాలు తండోప తండాలుగా రాసాగారు!

నాలుగైదు రోజులిలా గడచిపోయాయి. ఆదిలో బైరాగి "నేను కేశవుల్ని కానయ్యా బాబో" అని నెత్తిన నోరు పెట్టుకుని మొత్తుకున్నాడు. కానీ అతడిగోడు వినిపించుకునే నాధుడు లేకపోయాడు.

ఇక యిలా లాభం లేదనుకొన్నాడేమో బైరాగి 'అవును-కాదు' అని చెప్పడం మానేసి మహాయోగిలా మౌన ముద్ర ధరించేశాడు.

నిజానికి వీళ్ళేమనుకున్నా అతనికి పోయేదేమీలేదు. పైగా వీళ్ళిలా అనుకోవడం తనకు లాభదాయకంగానే వుంది. బియ్యంగా, పప్పుదినుసులుగా, కాయకూరలుగా వివిధ సంబారాలు మంగమ్మ దగ్గరనుంచీ, యింకా ఆమెపైన అభిమానము వున్న బంధువర్గం దగ్గరనుంచీ ఏకంగా వచ్చి పడుతున్నాయి. పెట్టిన దినములలో.నానార్ధములు నట్టడవులకు నడచి రావడమంటే యిదే మరి! వీళ్ళు పెట్టినన్ని రోజులు పెట్టనీ! హాయిగా తిని త్రేన్చడానికి తనకేం యిబ్బందిలేదు.

ఐతే అతణ్ణి అలా ఎంతకాలమైనా తింటూ కూర్చోనిచ్చేదికాదు మా వూరి జనం! 'ఏమిట్రా యిది! కడకీ వ్యవహారంలో ఐసా పైసా తేలకపోయేనే!' అని వాళ్ళు పాపం, ఎంతగానో విచారించారు.

ఇంతలో ఒక బుద్ధిమంతుడు — అందరూ ప్రయత్నంచేసి చివరకు యిది మందదన్న నిర్ధారణకు వచ్చి దూరంగా పారవేసిన ఈ అగ్గిపుల్లను యిట్టే వెలిగించేశాడు.

అతడు బైరాగితో ఏదో లోకాభిరామాయణం ముచ్చటిస్తూ వుండి మధ్యలో కేవలం మాటవరుస కడిగినట్టుగా "ఐతే, నువ్వు మా వూళ్ళో యింకా పదిరోజుల పాటుంటావా బైరాగీ?" అని ప్రశ్నించాడు.

"పదిరోజులేమిటి బాబూ! ఊళ్ళు, తిరిగీ తిరిగి నా తల బట్టకట్టిపోయింది. పైగా ఈ ఊళ్లో ఆదరణగూడా చాలా బాగుంది. అంచేత ఈ జీవుడికి యిక్కడే వుండి పోదామని వుంది" అన్నాడు బైరాగి.

ఈ వార్త రంగయ్యగారి గుండెల్లో పిచ్చల పిడుగులా పడింది. ఆయన "మొదటికే మోసం వచ్చేటట్టుందిరా గోపాలం! ఇక చూస్తూ వూరుకుంటే జరగ దురా రామ్మూర్తి! ఈ పీడ నెలాగైనా వదిలించుకోవాలిరా వీరేశం!" అంటూ ముగ్గురు కొడుకులతోనూ మంత్రాంగం సాగించాడు.

నలుగురూ కూడబలుక్కుని నమ్మినబంటు నాగుమయ్యను రాయబార నిమిత్తము బైరాగి దగ్గరకు పంపారు.

"నీమీద రంగయ్యగారికి దయ కలిగింది. ఆయన నీకీ వందరూపాయలి స్తున్నారు. దీన్ని స్వీకరించి నువ్వు వీలైనంత త్వరగా ఈ ఊళ్లో నుంచి వుడా యించేయాలి"– ఇదీ నాగుమయ్య రాయబారంలోని సారాంశం.

ఎలా తెలిసిందో గానీ ఈ సంగతి కాస్తా అవతలి వాళ్ళకు తెలిసిపోయింది!

ఈ అవతలి వాళ్ళకు ఏకైక నాయకుడు రంగనాథం.

రంగయ్యగారికి గ్రామ నాయకత్వంలో ప్రతిస్పర్ధి, పంచాయతీబోర్డు ప్రెసిడెంటు ఎన్నికల్లో, ప్రత్యర్థి, అవసరమైతే దౌష్ట్యానికి గూడా తలపడగల ప్రతిద్వంద్వీ అయిన రంగనాథం నెరసిన బొద్దు మీసాల కొసల్ని మెలివేస్తూ బైరాగిని సముఖానికి రప్పించాడు.

"దండాలు బాబూ, దండాలు! తమరెందుకో ఈ బైరాగోణ్ని రమ్మన్నార టండి!" అని చేతి వ్రేళ్ళు నులుముకుంటూ బైరాగి రంగనాథం ఎదుట నిల్చు న్నాడు.

"ఒరేయ్ కేశవులూ! నువ్వు వాళ్ళ దగ్గర వీళ్ళ దగ్గరా మాట్టాడినట్టు నా దగ్గర మాటాడొద్దు. నే నావులిస్తే ప్రేవులు లెక్కించే వాణ్ణి. నువ్వు కేశవులవి. నాకు తెలుసు. మీ అమ్మకు తెలుసు. ఇంకా వూళ్ళో చాలా మందికి తెలుసు. ఆ

రంగయ్యగాడికి తెలియకపోతే తెలిసి వచ్చేట్టుచేసే భారం నాది. నేనన్యాయాన్ని చూచి సహించే వాణ్ణిగాను. ఆరు నూరయినా, నూరు ఆరయినా నువ్వీ వూరు వదల డానికి వీల్లేదు. నేను మనిషి ముఖం చూచేవాణ్ని. డబ్బు ముఖం చూచేవాణ్ని గాను, నీ అబ్బగంటులో నీ కెందుకు భాగం రాకపోతుందో చూస్తాను. అవసర మైతే హైకోర్టుదాకా వెళ్తాను" అన్నారు రంగనాథంగారు.

"బాబ్బాబూ!" అని గింజుకోబోయాడు బైరాగి.

"బాబూ లేదు, గీబూ లేదు! ఈ రోజునుంచీ ఈ కేసు సెటిలయ్యేదాకా నీకు ప్రతిరోజూ శేరు బియ్యం, ప్రతి వారమూ అయిదు రూపాయల రొఖ్ఖం. ఇంకేం మాటాడొద్దు, వెళ్ళు" అన్నారు రంగనాథంగారు.

ఈ సంగతి తెలియగానే యువతలి వైపు గుడారంలో తీవ్రమైన సంచలనం బయల్దేరింది. తమ హితవును పాటించి వూరువిడిచి వెళ్ళకపోతే సున్నంలోకి ఎముక లేకుండా విరగొట్టి, తన్ని తగలేసి, డొక్కచించి డోలు కట్టించగలమని బైరాగికి సరాసరి అరగంటకొక్క అల్టిమేటమ్ రాసాగింది.

ఇదేం బెడదరా దేవుడా అంటూ తలమీద చేతులుంచుకుని విషణ్ణ వదనంతో కూచున్నాడు బైరాగి. అతడి భార్యాబిడ్డలు గుండె నిబ్బరం గోల్పోయి ఏడవను గూడా ఏడ్చారు!

ఊళ్లోవాళ్ళ ఆహ్లాదానికి మాత్రం పట్టపగ్గాలు లేకపోయింది. చెట్టు క్రింద, రచ్చపైన, గుడి దగ్గర నలుగురూ అయిదుగురుగా ప్రోగై, వాళ్ళు రాగల పరిణా మాలను గురించి ఊహాగానం సలుపసాగారు.

ఒకటి—రంగయ్యగారు బైరాగి అనే కేశవులకు (?) పిత్రార్జితాన్ని పంచి పెడ్తాడా?

రెండు—అలా పంచి పెట్టకపోతే రంగనాథం రంగయ్యగారికి మూసీనది వొడ్డున వున్న హైకోర్టు భవనాల్ని చూపిస్తాడా?

మూడు—రంగయ్యగారి కుమారుల ప్రతాపాగ్ని బైరాగినీ, అతని సంసా రాన్ని భస్మీపటలం చేస్తుందా?

ఈ ప్రశ్న లన్నింటికీ సదుత్తరాలను మేము కాలమనే వెండితెరపైన్నే చూసుకోవలసి వచ్చింది!

* * *

నేను కొట్టినట్టే కొడ్తాను, నువ్వేడ్చినట్టే ఏడువు అన్నట్లుగా వానలు వర్ష ఋతువు పొడుగునా కురిసినా చెరువులు మాత్రం నిండాయి కావు. మా వూరి చెరువుకు నెలరోజులకు నీళ్ళొచ్చాయి. తూము జారీగా వదలిపెడ్తే ఈనెల రోజుల నీళ్ళనూ నోరున్న వాళ్లు వారం రోజులోనే వినియోగించుకునే ప్రమాదముంది. అందుచేత ఆయకట్టునుబట్టి జాము లేర్పాటు చేశారు. ఓ రోజు రాత్రి మూడో జామున పొట్టగర్రబోతున్న మా రాగిపైరుకు జాము వచ్చింది. లాంతరు పట్టుకుని అర్ధరాత్రప్పుడు చెరువు క్రిందికి వెళ్ళి, తీరా మడి పారేదాకా వుండమని పాలేరుకు చెప్పి నేను యింటికి తిరిగి వస్తున్నాను. ఊరి పొలిమేరదగ్గర అడ్డు దారిలో చీమ చిటుక్కుమంటే అదిరిపడుతూ దొంగల్లా మెల్లగా జారుకుంటున్న బైరాగి కుటుం బము నాకు హఠాత్తుగా ఎదురైంది.

"ఇదేమిటీ బైరాగీ!కథను సగంలో వదిలిపెట్టి నువ్విలా వెళ్ళిపోతున్నావు?" అంటూ విస్తుపోయాను.

"బాబ్బాబూ! తమకు పున్నెముంటుంది. చచ్చి మీ కడుపునబుట్తాను. ఊళ్లో గనుక పొరవిడిచారంటే వాళ్లొచ్చి మమ్మల్ని వెనక్కి లాక్కెళ్తారు" అన్నాడు బేజారెత్తిపోతూ బైరాగి.

"అబ్బే, నేనెందుకు చెబుతాను బైరాగీ! నువ్వు నిశ్చింతగా వెళ్ళిపో, కానీ త్వరగా వెళ్ళాలి" అన్నాను.

అన్నానేగానీ అంత చప్పగా అతనికి వీడ్కోలివ్వడానికి మనస్కరించింది గాదు. మళ్ళీ అతణ్ని పిలిచాను.

"ఏమిటి బాబూ?" అంటూ అతడు దగ్గరికొచ్చాడు.

"నువ్వు కేశవులివి అవునో,కాదో అన్న సందేహం మాత్రం అలాగే వుండి

వుండిపోయింది. ఈ ఒక్క విషయం మాత్రం చెప్పి పోవూ!" అని ప్రాధేయ పడ్డాను.

బైరాగి ఒకటి రెండు క్షణాలు ఆలోచించి "నేను నిజంగా కేశవులినే అయితే రంగయ్యగారు నా కాస్తిలో వాటా యివ్వగలరంటారా బాబూ?" అన్నాడు.

"సందేహమే" నన్నాను.

"పోనివ్వండి. ఆయన వాటా పంచిపెట్టారే అనుకోండి. ఆ రంగనాథం గారు నా కూతుర్ని తన కొడుక్కు కట్టబెట్టుకోగలరంటారా బాబూ?"

"అదీ సందేహమే" నన్నాను.

"ఐతే, యిదీ సందేహంగానే వుండపోనివ్వండి బాబూ! పోయిందేముంది"? అంటూ బైరాగి ముందుకు దారితీశాడు.

నే నావైపు చూస్తూ అలాగే విగ్రహంలా నిల్చుండిపోయాను.

— ఆంధ్ర వారపత్రిక, 1955

...o...

